శ్రీరస్తు

శ్రీమద్వేదాంతదేశిక విరచితమైన

# దయాశతకము

ఆంధ్ర టీకా తాత్పర్య సమేతము

రచయిత
వేదాంత దేశికర్

**టీకాతాత్పర్య రచయిత :**

**న్యాయ మీమాంసోభయ శిరోమణి తిరుపతి శ్రీవేంకటేశ్వర సంస్కృత కళాశాలా**

**న్యాయ మీమాంసాఽధ్యాపకులు ;**

శబ్దవంగీశవంశ్యులు, కోళియాలం శఠకోపాచార్యులు




1958

ప్రకాశకులు :

**తిరుమల-తిరుపతి దేవస్థానములు, తిరుపతి.**

# FOREWORD

I have perused with very great interest the annotated Telugu rendering with meaning and paraphrase of Dayasatakam of Sri Vedanta Desikar, by Sriman Kozhialam **Satagopachariar,** Lecturer, Sri Venkateswara Oriental College, Tirupati. Besides his being double shiromani in Tarka and Meemansa and specialised in Vedanta, Sriman Satagopachariar has the additional advantage of having had instruction in Vedanta under His Holiness Sri Kozhialam Swamigal. He was able to bring out not only the superficial meaning of the Dayasatakam which students of Vedanta may in general draw, but he has brought out the ' goodarthas ' or the inner meanings which he learnt under the feet of his Acharya in the traditional method. Sriman **Satagopachariar** has thus enabled the general public who can read Telugu to understand and appreciate the full force and the beneficent effect of the work.

Dayasatakam can easily be said to be the very essence of the writings of Sri Vedanta Desika. The doctrine of surrender has been emphasised and enlarged by Sri Vedanta Desikar as the surest means of attaining salvation, even superior to Bhakti as it is possible for every individual. In Dayasatakam he goes a further step of surrendering himself not to the will of God, but even to the hill in which Sri Venkateswara dwells. He starts with the description of the hill as the personification or solidification of the sweet sugar juice of ' daya ' mercy or compassion of the Lord.

The beauty of the *sataka* lies in this that the author elevates one of the qualities of the Lord to the position of His foremost consort. In describing the importance of Daya or mercy as a quality Sri Desika states that there may be thousand qualities which the Lord may possess as *gnana*, *Aisvarya* etc., but in the absence of ' *daya*,' all these good qualities would be of no avail. Strength and other qualities which the Lord possesses may be used or abused and it is only compassion or mercy which tempers the other qualities and converts them into useful attributes of the Lord. Therefore Sri Vedantadesikar rightly gives ' daya ' the position of the highest attribute of the Lord.

If ever man were to practice ‘ daya ’ in his daily relation with other beings, there would not be conflicts in this world. It is the quality of mercy that distinguishes a man from the beast. All wars arise out of conflicts in the mind and heart and so long as the seeds of conflict remain there, wars cannot be put an end to by mere reduction of armaments. The moment the seeds of conflicts are removed and when hatred gives place to love, discord yields to harmony and competition gives place to co-operation in all human relations, there will be eternal peace on the globe. Man has therefore to purify and transform himself from a beast into a higher being. That can be done only by developing the single virtue of having mercy or compassion.

A study of this work of Sri Vedanta Desikar can enable a man to get transformed to superior person in this world itself. Hitherto the importance of the sataka of Desikar has not been known to all but only to a few who belong to his *sampradaya*.

I am glad that the Tirumala-Tirupati Devasthanams published in their monthly bulletins the Tamil commentary of the Sataka previously by the same author and now the Telugu edition is published. I am happy to know that commentary in Kannada language by Sriman Narasimhachari of Tumkur was also published in the bulletins. Sri D. Ramaswami Iyengar, Advocate, is writing at present a series on Dayasataka in English also, so that this great work may reach larger sections of the people. May this work live long and may it grow in usefulness.

*Camp*:—TIRUPATI
2—11—1958.

M. ANANTHASAYANAM IYENGAR,
*Speaker, Lok Sabha,*
NEW DELHI.

# భూమిక

" యదీయచరితం సతాం సుచరితవ్యవస్థాపకం
యదీయవచనం పరం సకలసంశయోన్మూలనమ్।
యదీయకరుణా గతిస్సకలధర్మశూన్యాత్మనాం
స నశ్శరణమస్త్వసౌ సకలతన్త్ర నిర్వాహకః ॥ "

ఒక యుత్తమప్రబంధకర్తయొక్క గ్రంథమును ముద్రించి ప్రకటీకరించునప్పుడు వారి జీవితచరిత్రమును భూమికగా వ్రాయుట ప్రాచీనపద్ధతి. అందులకు ముఖ్యకారణమేమన; ఈ ప్రబంధమును విరచించిన వారెవరు ? వారే సంప్రదాయమునకు సంబంధించినవారు ? వారి ఏతదితరగ్రంథములెవ్వి? వారి జీవితచరిత్రమెట్టిది ? మొదలగు నానావిషయములనెఱింగి యా ప్రబంధమును చదివినయెడల దాని తత్త్వార్థము బాగుగా ప్రకాశించుటకును, రసానుభవమునకును చాలయునను కూలముగనుండుననుటయే. అట్లగుటంజేసి పరమాచార్యులగు శ్రీమన్నిగమాంత మహాదేశికుల వారియొక్క స్వానుభవపరీవాహరూపములగు పలు ప్రబంధములలో ఒక్కొక్క పదము సయితము వేందాంతనిర్ణీతములగు పలు విశేషార్థములను వెల్లడించుచున్నది. గాన ఆయవతారమూర్తియొక్క విభవచరిత్రము చక్కగ తెలియనియెడల తత్ప్రబంధములలో నర్థానుభవమును, రసానుభవమును సంపూర్ణముగ కలుగుటకు వీలుగాదు. కావున వారి జీవితచరిత్రాదులిచ్చుట సంగ్రహముగా వ్రాయబడుచున్నది.

## శ్రీ దేశికావతారము

" యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత !
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ "

అను గీతావాక్యోక్తరీతిగా ప్రపంచోజ్జీవనమునుద్దేశముగా గైకొని సర్వేశ్వరుడు ప్రథమతః మత్స్యకూర్మాది దశావతారములను ధరించెను. పిదప " పొయ్కై ఆళ్వార్ " మొదలగు పదిమంది యాళ్వార్లరూపమున విలక్షణమైన యొక యభినవదశావతారమును ధరించెను. ఈ అభినవదశావతారములలో భగవద్భక్తిపరీవాహరూపములైన ద్రవిడదివ్యప్రబంధములద్వారా ప్రాచీనమైన

విశిష్టాద్వైతసంప్రదాయమును ప్రపంచమునకు వెల్లడించెను. తదుపరి భగవద్రామానుజాచార్యులను రూపమున నవతరించి పలుప్రకారముల చెదరిపోయినవైదిక మతమును చక్కఁజేసి సంస్కృతమయములైన శ్రీభాష్యాదినవగ్రంథముల ద్వారా తత్సిద్ధాంతమునే స్థిరీకరించెను. నిజమైన తత్త్వహితపురుషార్థములను శ్రీభాష్యాది గ్రంథములలో చక్కఁగ నెఱుంగులాగుచేసిన మహోపకృత్యమే యేతదవతార సారము. ఈ భాష్యకారావతారమునందు కొన్ని కారణములవలన ద్రవిడ భాషా మయములగు గ్రంథములవతరింపలేదు.

అటు పిమ్మట నీ విశిష్టాద్వైత సంప్రదాయమునకు నానావాదివర్గములచే కలిగిన తొందరలను శమింపజేయుట కొఱకును; ఈ సంప్రదాయమునందీశ్వర కోటి ప్రవిష్టయైన మహాలక్ష్మియొక్క స్వరూపస్వభావములను నిరూపించుట కొఱకును; సంస్కృతమయమైన వేదవేదాంతస్మృతీతిహాస పురాణ శ్రీభాష్యాది గ్రంథములెట్లు పరమవైదికమతమైన విశిష్టాద్వైతసిద్ధాంత ప్రతిపాదన పరములో అట్లే ఆళ్వార్లు రచించిన ద్రవిడదివ్యప్రబంధములును నీ విశిష్టాద్వైత సంప్ర దాయమును చక్కఁగ ప్రతిపాదించుటవలన ద్రవిడవేదాంతమని చెప్పబడు నీ ప్రబంధములుగూడ సంస్కృతవేదాంతమని వ్యవహరింపబడు పూర్వోక్తవేదాంత గ్రంథములతో సమానయోగక్షేమములై యుభయవేదాంతములను వ్యవహార విషయములయి విశిష్టాద్వైత సంప్రదాయ ప్రవిష్టులకత్యంత మాదరణీయమగు కోటియందు నిలుచున్నవను నీ విషయమును బాగుగ స్థాపించుటకొఱకును; ఇట్లు పలుకార్యముల నీ సంప్రదాయమునందు ప్రబంధరచనమూలముగను, ఉప దేశమూలముగను అనుష్ఠానమూలముగను ప్రపంచమునకారచించుట కొఱకు మఱల మఱొకయవతారము తత్కాలపు ప్రపంచపరిస్థితినిబట్టి యత్యవసరమని యేర్పడినది. ఆ యవతారవిశేషమే మన నిగమాంత మహాదేశికులు.

ఇప్పటికి దాదాపు 689 సంవత్సరములకు పూర్వమొక "విభవ" వత్సర మున (1268 A. D.) "పురట్టాశి" నెలలో "శ్రవణ" నక్షత్రమున కాంచీ నగరమునకు సమీపముననుండు దీపప్రకాశ సన్నిధియొద్ద "తూప్పుల్" అని వ్యవహరింపబడు దివ్యక్షేత్రమునందు విశ్వామిత్ర గోత్రమునకు చెందిన "అనంత సూరి" యను విప్రోత్తమునకును, "తోతారంబ" యను నాతని ధర్మపత్నికిని

పుత్రరత్నముగా అవతరించిన మహాపురుషులు వీరు. "పురట్టాశి శ్రవణము" వేంకటాచలపతియగు శ్రీనివాసునియొక్క జన్మనక్షత్రమును, తద్బ్రహ్మోత్సవా వభృథదివసమును నగుచున్నది. ఆ దినమున నవతరించిన ఈ దివ్యశిశువునకు ఆ శ్రీనివాసుని తిరునామమైన "వేంకటనాథుడ" ను నామమును పెద్దలు నిర్ణ యించిరి. వారిభావమా శ్రీనివాసావతారమే ఈ శిశువనుటయే. ఇయ్యది మాత్రమే గాక ఆ వేంకటేశుని ఘంటయొక్కయు, పూర్వోక్త శ్రీభాష్యకారులయొక్కయు నవతారమే వీరని గూడ వారి జీవితకాలమునందే లోకస్థులు పలుకారణములను బట్టి వ్యవహరించుచుండిరని యాచార్యులే తమ సంకల్పసూర్యోదయమను నాటకములో "ఉత్ప్రేక్ష్యతే బుధజనైరుపపత్తిభూమ్నా ఘంటా హరేస్సమజనిష్ట యదాత్మనేతి" అను నాదిగాగల వాక్యములచే స్పష్టీకరించియున్నారు. వీరి పితామహులు "పుండరీకాక్ష సోమయాజులు." వీరి తల్లిగారు శ్రీ భాష్యకారుల యొక్క ముఖ్యశిష్యులగు "కిడాంబిఆచ్చాన్" అను నుత్తమ పురుషులయొక్క వంశములో నుద్భవించినవారు. ఆ వంశమునందుద్భవించిన "కిడాంబి అప్పు ళ్ళార్" (వాదిహంసాంబుద ఆత్రేయ రామానుజాచార్యులు) అని ప్రసిద్ధిజెందిన స్వాములవారు వీరికి మాతులరు. వారి యొద్దనే సకల వేదవేదాంగ వేదాంతాది సర్వశాస్త్రముల నిరువదియేండ్లకు లోపుగనే అభ్యసించిరి. ఇయ్యదియు "వింశ త్యబ్దే విశ్రుత నానావిధ విద్యః" అని పూర్వోక్తనాటకమునందే యభిహితమై యున్నది.

## ప్రాచార్యుల యనుగ్రహమునొందుట

మన ఆచార్యులకైదవ వత్సరము జరుగుచున్నపుడు వీరి మాతులరగు ఆత్రేయ రామానుజాచార్యులు, స్వాచార్యులగు వాత్స్యవరదాచార్యుల (నడాదూర్ అమ్మాళ్) యొద్ద వేదాంత పఠనముకొఱకు వెడలునపుడు తమ భాగినేయుడగు మన ఆచార్యులను గూడ ఆ గోష్ఠికి పిలుచుకొని పోయిరి.

వారచటి కరిగినపుడు వాత్స్యవరదాచార్యులవారి వేదాంత కాలక్షేపగోష్ఠి కంచిలోని వరదరాజస్వామి గుడియందలి హస్తిగిరియను కొండపై జరుగు చుండినది. దాని చిహ్నమిప్పుడు గూడ అచ్చట కాననగును. ఆత్రేయ రామాను జాచార్యులు సభాగినేయులై ప్రవేశించినపుడు వారు (వాత్స్యవరదాచార్యులు)

ఈ బాలుడెవరని యడిగిరి. తన భాగినేయుడని వారు సమాధానమొసంగగా ప్రత్రుసక్తానుప్రసక్తముగ కొంతసేపు వేదాంతోపన్యాసమును నిలిపి కుశలప్రశ్నాది సంభాషణముచేయుచుండిరి. తదవసానమున మఱల యుపన్యాసము ప్రారంభించు నపుడు పూర్వము వదలిన సందర్భమెవ్వరికిని జ్ఞప్తికిరాక పోయినది. అత్తఱి మైదేండ్ల బాలుడైన మన ఆచార్యులు తానాగోష్ఠిలో ప్రవేశించునపుడు జరుగు చుండిన విషయవాక్యసందర్భ "మిది" యని విస్పష్టముగ వెల్లడించిరి. ఈ యద్భుతబుద్ధి శక్తిని చూచిన పరమాచార్యులగు వాత్స్యవరదాచార్యులు "ఈ బాలుడు మనసంప్రదాయములో మహాచార్య పదవికి రాగలడని తలంచి :—

"ప్రతిష్ఠాపితవేదాంతః ప్రతిక్షిప్తబహిర్మతః ।
భూయాస్త్రైవిద్యమాన్యస్త్వం భూరికల్యాణభాజనమ్ ॥

(వేదాంతములకు సమీచనమగు నర్థమును ప్రపంచములో స్థాపించి దుర్వాదులమతమును సమూలగ నశింపజేసి త్రైవిద్యమాన్యుడవై నీవు అపరిమిత మంగళాస్పదుడవు కమ్ము!) అని శ్లోకమునుజెప్పి యనుగ్రహించి తమ శిష్యులగు రామానుజాచార్యులను సంబోధించి "మీరితనికి సర్వశాస్త్రముల నుపదేశించి మన సిద్ధాంతప్రవర్తకులలో గొప్పదగు నాచార్య పదవి నితడు పొందులాగు చేయవలయును. నేను వార్ధకముచే నశక్తుడనైతిని గాన నేనే సాక్షాత్తుగ నుపదేశించుటకు సాధ్యముగా దని నియమించిరి. ఆ మహనీయులయొక్క అట్టి యాశీర్వాద బలమువలననే మన ఆచార్యులు 20 వత్సరములలోనే సర్వవిద్యలును తమ మాతులరగు రామానుజాచార్యులనుండి గ్రహించి సర్వవిద్యాష్ఠాధినదేవతగా మెలగిరి.

## విద్యాభ్యాసము

తగు సమయంబున విద్యాభ్యాసమును ప్రారంభించి స్వమాతులరగు రామనుజాచార్యులనుండి ద్రావిడ సంస్కృతో భయభాషలలోనుండు సమస్త శాస్త్రగ్రంథములను, సకలకళలను నతిత్వరలో మన ఆచార్యులధిగమించిరి. సర్వగ్రంథములకన్నను భగవద్రామానుజమునులయొక్క శ్రీభాష్యాది శ్రీసూక్తుల యందాచార్యుల కత్యంతవ్యామోహము. "యతిప్రవరభారతీరసభరేణ నీతం వయః" అనియు, "నిర్విష్టం యతిసార్వభౌమవచసామావృత్తిభిర్యౌవనమ్"

అనియు నేతదాదిగాగల నిజవాక్యములచే సామాన్యజనులవలె నాభాసవిషయముల యందు రసానుభవమునందక శ్రీభాష్యకారుల శ్రీసూక్త్యనుభవమునందే తమ యౌవనమును గడిపిరని స్పష్టమయ్యెడిని.

## శ్రీమదహీంద్రపురమునకు వేంచేయుట

తమ యాచార్యులుపదేశించిన గరుడమంత్రము నావృత్తిచేసి సిద్ధినొందుటకు తగినస్థలమగు "అహీంద్రపురము" (తిరువయిందిరపురమ్ – (South Arcot District)నకు వేంచేసి యచట గరుడనదీ తీరమునందుండెడి యౌషధాద్రియందు సనియమముగ నా మంత్రమును జపించి శ్రీమద్వైనతేయ సాక్షాత్కారము నందిరి. పిదప ఆవైనతేయుండు పదేశించిన హయగ్రీవమంత్రమునుగూడ నచటనే ఆవృత్తిచేసిరి. తత్ఫలముగ హయగ్రీవుడు ప్రసన్నుడై యాచార్యులను విశేషానుగ్రహముతో కటాక్షించెను. ఈ విషయమునందు కృతజ్ఞతావిష్కరణ రూపముగా "గరుడపంచాశత్", "హయగ్రీవ స్తోత్రము" అను స్తోత్రగ్రంథములను నయితము రచించిరి. ఆదివ్యదేశమున వేంచేసియుండు దాససత్యదేవనాథుల విషయముగా సంస్కృతప్రాకృత ద్రావిడభాషలయందు వేదాంతార్థగర్భితములగు స్తోత్రగ్రంథముల నారచించిరి. ఈ ప్రకరణమునందు దాదాపు పదునైదు వత్సరముల వరకచట వేంచేసియుండినట్లు తెలియవచ్చుచున్నది.

## గార్హస్థ్యము

తగిన వయస్సులో స్వసమాన కులోద్భవయైన "తిరుమంగై" అను కన్యకను ధర్మపత్నిగా స్వీకరించి గృహస్థాశ్రమ ధర్మములను చాలయు చక్కగ ననుష్ఠించుచు వచ్చిరి. చక్కగ నాచరించినయెడల సన్యాసాశ్రమమునకంటెను గృహస్థాశ్రమము గొప్పదను శాస్త్రార్థమును స్వానుష్ఠానముఖమున నిరూపించిరి.

## వేదాంతాదిప్రవచనములు

స్వగ్రామ సమీపముననుండు కాంచీక్షేత్రమునందును, తత్పరిసరముననుండెడి యనేక దివ్యక్షేత్రములయందును వేంచేసియుండు నానాభగవన్మూర్తులను సేవించి తత్తన్మూర్తివిషయముగా రమణీయములగు పలుస్తోత్రములను రచించియున్నారు. తమ నాశ్రయించిన బహుశిష్యబృందములకు పలుమారు

వేదాంత గ్రంథములను ప్రవచించుచు స్వగ్రామములో పాంచకాలిక ప్రక్రియలచే భగవంతునారాధించుచు వేంచేసియుండిరి. "తత్త్వటీకా" అను శ్రీభాష్య వ్యాఖ్యానమునుచేయు సందర్భములో నిరువదియెనిమిదవ సారి శ్రీభాష్యమును ప్రవచనముచేయు చుండినట్లును, "సంకల్ప సూర్యోదయము" అను నాటకము నారచించునపుడు ముప్పదిసార్లు శ్రీభాష్యప్రవచనము పూర్తియయినట్లును "ప్రవచనవిధావష్టావింశే జయధ్వజపట్టికా" అనియు, "త్రింశద్వారంశ్రావితశారీరకభాష్యః" అనియు నాయా గ్రంథములలోనుండు ఆచార్యుల వాక్యములచే స్పష్టమగుచున్నది.

అద్భుత కృత్యములు

జ్ఞానానుష్ఠానవైరాగ్య గృహస్థధర్మాదులచే నద్వితీయులుగ పేరెన్నికగన్న మన యాచార్యులయొక్క కీర్తి దిగంతములకు ప్రాకినది. ఆచార్యులయొక్క సర్వకళాప్రవీణతయందు సూయనందిన కొందరు తమతమ కళాపాండిత్యము నాచార్యులయొద్ద చూపించి భంగపడిరి. ఒకానొక సమయమున నొక మంత్రవాది యాచార్యులను వాదమునకు పిలిచెను. అతనితో వాదముచేయుటకు స్వామి సమ్మతించలేదు. వెంటనే అతడొక గుంటలోనుండు జలమునంతటి నింద్రావ ప్రారంభించెను. ఆతని మంత్రబలముచే నతడు ద్రావిననీళ్ళు ఆచార్యులయుదర మునందు ప్రవేశించి యది యుబ్బనారంభించెను. ఈ సూక్ష్మమునెఱింగిన యాచార్యులు తమ మంత్రశక్తిచే సమీపముననుండు నొక స్తంభమును గోటితోగీకి తద్ద్వారా మంత్రవాదిద్రాగుచున్న నీటిని పారిపోవునట్లు గావించిరి. తన్మంత్రశక్తినెఱింగిన మంత్రవాదియు నాచార్యులయొద్ద అపరాధక్షమణమును చేసికొని వెళ్లెను. ఇట్టి యద్భుతకృత్యములు జరిగినట్లు గురుపరంపరాప్రభావగ్రంథము నుండి తెలియుచున్నది.

ఒక శిల్పియొక్క ప్రార్థనపై నాచార్యులు తన చేతులారకట్టిన యొక బావి యిప్పుడుగూడ శ్రీమదహీంద్రపురములో "దేశికన్ తిరుమాళిహై" అను చోటులో కాననగును. తత్పరిపాలకులు దానినిప్పటికి గూడ చాలయు గౌరవముతో కాపాడుచు వచ్చుచున్నారు.

ఆచార్యులు తమ శరీరయాత్రను కేవలముంఛవృత్తితో గడుపుచు పరమ విరక్తులై వేంచేసియుండిరి. అప్పుడు స్వామి ప్రభావజ్ఞులును, విజయనగరరాజు

నకు ప్రథానమంత్రియునగు మాధవాచార్యులనబడు శ్రీవిద్యారణ్యస్వామివారు మన యాచార్యులకు తమ యాస్థానములో ప్రధాన విద్వత్పదవిని నిప్పింపవలయునని తలంచి యా రాజుద్వారా సమస్తమర్యాదలతోను నాహ్వానమును పంపిరి. పరమ విరక్తులగు మన యాచార్యులు రాజసేవయను పారతంత్ర్యమును మనసాసయి తము స్మరింపజాలక వైరాగ్యపంచకమనునైదు శ్లోకముల నాయాహ్వానమునకు సమాధానముగా వ్రాసిపంపిరి. దానిలో నశ్వరమైన యీ ప్రాకృతధనములో తన కీషణ్మాత్రముగూడ ఆశలేదనియు, నిరపాయమైన ధనంజయస్యందన భూషణ మైన ధనము నాకు గలదనియు, ఖ్యాతిలాభపూజలలో తనకెంతమాత్రము నాశ లేదనియు తనకు జరుగుచుండెడి యుంఛవృత్తిచేతనే తనదేహయాత్ర చాలయు నానందముగా జరుగుచున్నదనియు తెలిపియున్నారు. ఇట్టి విరక్తాచార్యులయొద్ద నొక పరప్రేరితుడైన బ్రహ్మచారి స్వవివాహార్థమై ధనమును యాచించెను. అప్పుడాచార్యులు " కనకధారాస్తవ " మను శ్రీస్తుతినిచేయుచు,

" యోగారంభత్వరితమనసో యుష్మదైకాన్త్యయుక్తం
ధర్మం ప్రాప్తుం ప్రథమమిహ యే ధారయంతే ధనాయామ్ ।
తేషాం భూమేర్ధనపతిగృహాదంబరాదంబుధేర్వా
ధారా నిర్యాంత్యధికమధికం వాంఛితానాం వసూనామ్॥

అనుశ్లోకమును రచించినప్పుడు ఆకసమునుండి కనకవర్షము పడినది. ఆ బ్రహ్మ చారి స్వవస్త్రములో దానిని మూటగట్టుకొని తీసుకొనివెళ్ళెను. స్వయముంఛ వృత్తిచేయుచుండు నాచార్యులు పరార్థమైయపేక్షితాధికముగ కనకవర్షమును గూడ వర్షించుటకు శక్తికలిగియుండిరని యీ చరిత్రముచే తెలియుచున్నది.

## ప్రతివాదులను జయించుట

కాంచియందును, శ్రీరంగమునందును రెండు మూడు సమయములలో మాయావాదులు దేవాలయములో సంస్కృతేతరభాషలోనుండు ద్రవిడప్రబంధ ములననుసంధించుట కూడదనియు, అది యపభ్రంశభాషయనియు తదను సంధా నౌచిత్యమును స్థాపించునంతవరకు దేవాలయపూజను జరుపనీయమనియును మహాకోలాహలము చేసిరి. ఆసమయములో బహువిద్వాంసుల ప్రార్థననునుసరించి

యీ రెండు నగరములలోను మన యాచార్యులే ఆ వాదాహవమునందు ప్రవేశించి బహుదినములు మాయావాదులతో వాదించి మాయావాదమును ఖండించి విశిష్టాద్వైతసిద్ధాంతసంప్రదాయములను స్థాపించి యథాపూర్వముగ దేవాలయపూజను జరిపించిరి. ఆవాదసమయములో జరిగిన వాదసారాంశమునే "శతదూషణీ" యను బహుప్రౌఢమైన వేదాంతవాదగ్రంథముగా పిదప ఆచార్యులు నిర్మించిరి. ఇట్టి వాదములనేక పర్యాయములు జరిగినట్లు తెలియుచున్నది.

## బిరుదుల ప్రాప్తి

ఇట్లు వైదికసిద్ధాంతమును గ్రంథముఖముగను, అనుష్ఠానముఖముగను, ప్రవచనముఖముగను పలురీతుల స్థాపించుచున్న మన యాచార్యులకు శ్రీరంగనాథుడును, తత్పత్నియగు రంగనాయికయు "వేదాంతాచార్యులు" అనియు, "సర్వతంత్రస్వతంత్రులు" అనియు బిరుదుల (అర్చకముఖేన) నొసంగిరి. అద్భుతమైన కవిధీచిత్రముతో కూడి సహస్రపద్యాత్మకమైన "పాదుకాసహస్ర" మను రంగనాథ పాదుకావిషయమైన స్తోత్రరత్నము నొక ముహూర్తకాలములో చేసిన మన ఆచార్యులశాస్త్రకవితా సామర్థ్యమును గాంచిన శ్రీరంగక్షేత్రస్థులగు విద్వాంసుల యభిప్రాయము ననుసరించి ఆ రంగనాథుడే పెద్దసదస్సునందు "కవితార్కికసింహ" యనియు, "సమస్యాసహస్రీ" అనియు బిరుదుల నొసంగెను. ఇది యంతయు నాచార్యులయొక్క గ్రంథములలోనే అచటచట కనదగును.

## బహుప్రబంధ నిర్మాణము

శ్రీరంగనాథుడిచ్చిన "వేదాంతాచార్యులు" అను బిరుదము నన్వర్థీకరించుటకై "అధికరణసారావళి" యను నైదువందల స్రగ్ధరలతో కూడిన శ్రీభాష్యసారార్థమైన యుత్తమగ్రంథమును, తత్తాత్పర్య వివరణరూపమైన "అధికరణదర్పణ" మను గ్రంథమునారచించిరి. ఈ విషయము నా గ్రంథారంభపద్యములో "........తేనదేవేన దత్తాం వేదాంతాచార్యసంజ్ఞామవహిత బహువిత్సార్థ మన్వర్థయామి" అను వాక్యముతో స్పష్టపరచియున్నారు. ఇట్లే తదితర శాస్త్రకారుల సిద్ధాంతముల నాలోడించి యూహాపోహ్వాప పురస్సరముగా విశిష్టాద్వైతసిద్ధాంతమును బహుయుక్తిప్రమాణాదులచే 'తత్త్వముక్తాకలాపము' అను గ్రంథములో స్థాపించిరి. ఇదియును ఐదువందల స్రగ్ధరాశ్లోకములు గలది. దీనికి "సర్వార్థసిద్ధి" యను వ్యాఖ్యానమును గూడ స్వయముగనే రచించిరి.

ఈ లాగున "న్యాయసిద్ధాంజనము," "శతదూషణీ" మొదలగు స్వతంత్రగ్రంథములను, "తత్త్వటీకా," "గీతా భాష్య తాత్పర్యచంద్రికా," "రహస్యరక్షా," "గీతార్థ సంగ్రహరక్షా" మొదలగు వ్యాఖ్యానగ్రంథములను; సంప్రదాయార్థ స్థిరీకరణ పరములైన "సచ్చరిత్రరక్షా," "నిక్షేపరక్షా," "పాంచరాత్రరక్షా" మొదలగు గ్రంథములను; దక్షిణభారతదేశములో పలు భగవన్మూర్తుల విషయములైన "దయాశతకము" మొదలగు పలు స్తోత్రగ్రంథములను; శ్రీ భాష్యకారుల విషయమైన "యతిరాజసప్తతి", ఆ లాగుననే శుద్ధ ద్రవిడభాషలో "అమృతాస్వాదినీ" మొదలగు నిరువదినాల్గు పద్యమయములైన ద్రవిడప్రబంధములను, సంస్కృతద్రావిడోభయ భాషామయమైన మణిప్రవాళ భాషలో దాదాపు ముప్పదిరెండు గ్రంథములను, మఱియు మీమాంసాది సామాన్య శాస్త్రకారులపద్ధతిని పరిష్కరించి, వేదాంతావిరుద్ధముగా "సేశ్వరమీమాంసా" అను జైమినిసూత్ర వ్యాఖ్యానమును, "మీమాంసా పాదుకా" అను స్వతంత్ర మీమాంసాగ్రంథమును, గౌతమప్రణీత—న్యాయసూత్రార్థ పరిష్కారకమైన "న్యాయపరిశుద్ధి"యనుగ్రంథమును, "యాదవాభ్యుదయము," "హంససందేశము," "సుభాషితనీవీ," "సంకల్ప సూర్యోదయము" "పాదుకాసహస్రం" మొదలగు కావ్యనాటక గ్రంథములను; ఇట్లు బహుపద్ధతులలో బహుగ్రంథములను ఒక మనుష్యునిచే స్వజీవితకాలములో చేయబడుటకు వీలుగాని విధమున విస్మయనీయ ప్రక్రియలో భగవదవతారభూతులైన మన ఆచార్యులు రచించియున్నారు.

## పుత్రోత్పత్తి

మన యాచార్యులు శ్రీరంగములో వేంచేసియుండునపుడు వారికి పుత్రసంతానము "నళ" సంవత్సరపు "ఆవణి" నెలలో "రోహిణీ" నక్షత్రమునందు కల్గెను. (A. D. 1316 ఆగస్టు 11-వ తేదీ.) అప్పుడు ఆచార్యులకు 48 వత్సరములు, ఆ పుత్రునకు "వరదాచార్యులు" అని నామకరణముంగావించిరి.

## ప్రకీర్ణము

ఒకానొకప్పుడు అక్షోభ్యమునికిని, విద్యారణ్యమునికిని సంభవించిన ద్వైతాద్వైత వాదములో ఆచార్యులు మాధ్యస్థ్యము వహించి "అసినా తత్త్వమసినా పరజీవప్రభేదినా। విద్యారణ్యమహారణ్యమక్షోభ్యమునిరచ్ఛినత్" అని తీర్పుగావించిరను నైతిహ్యము గలదు.

19. దేహళీశస్తుతిః
20. న్యాసతిలకమ్
21. రఘువీరగద్యమ్
22. షోడశాయుధస్తోత్రమ్
23. సుదర్శనాష్టకమ్
24. గరుడదండకః
25. గరుడపంచాశత్
26. యతిరాజసప్తతిః
27. న్యాసవింశతిః
28. తద్వ్యాఖ్యా
29. వైరాగ్యపంచకమ్

కావ్య నాటకములు

30. సుభాషితనీవీ
31. యాదవాభ్యుదయః
32. హంససందేశః
33. పాదుకాసహస్రమ్
34. సంకల్పసూర్యోదయనాటకమ్

వేదాంత గ్రంథములు

35. ద్రవిడోపనిషత్తాత్పర్యరత్నావళిః
36. ద్రవిడోపనిషత్సారః
37. మీమాంసాపాదుకా
38. సేశ్వరమీమాంసా
39. శతదూషణీ
40. అధికరణసారావళిః
41. శ్రీ భాష్యవ్యాఖ్యా — తత్త్వటీకా
42. న్యాయపరిశుద్ధిః
43. న్యాయసిద్ధాంజనమ్
44. తత్త్వముక్తాకలాపః
45. (తద్వ్యాఖ్యా) సర్వార్థసిద్ధిః
46. గీతాభాష్యతాత్పర్యచంద్రికా
47. ఈశావాస్యోపనిషద్భాష్యమ్
48. గీతార్థసంగ్రహరక్షా
49. శ్రీ పాంచరాత్రరక్షా
50. సచ్చరిత్రరక్షా
51. నిక్షేపరక్షా
52. చతుఃశ్లోకీభాష్యమ్ } రహస్యరక్షా
53. స్తోత్రభాష్యమ్ } రహస్యరక్షా
54. గద్యత్రయభాష్యమ్ } రహస్యరక్షా
55. అధికరణదర్పణః (లుప్తః)

అనుష్ఠాన గ్రంథములు

56. భగవదారాధనవిధిః
57. యజ్ఞోపవీతప్రతిష్ఠావిధిః

రహస్య గ్రంథములు

58. సంప్రదాయపరిశుద్ధిః
59. తత్త్వపదవీ
60. రహస్యపదవీ
61. తత్త్వనవనీతమ్
62. రహస్యనవనీతమ్
63. తత్త్వమాతృకా
64. రహస్యమాతృకా
65. తత్త్వసందేశః
66. రహస్యసందేశః
67. రహస్యసందేశవివరణమ్
68. తత్త్వరత్నావళిః
69. తత్త్వరత్నావళీ ప్రతిపాద్య సంగ్రహః
70. రహస్యరత్నావళిః
71. రహస్యరత్నావళీ హృదయమ్
72. తత్త్వత్రయ చుళకమ్
73. రహస్యత్రయ చుళకమ్
74. అభయప్రదానసారః

75. రహస్యశిఖామణిః
76. అంజలివైభవమ్
77. ప్రధానశతకమ్
78. ఉపకారసంగ్రహః
79. సారసంగ్రహః
80. మునివాహనభోగః
81. మధురకవిహృదయమ్ (లుప్తమ్)
82. పరమపదసోపానమ్
83. పరమతభంగః
84. హస్తిగిరిమాహాత్మ్యమ్
85. శ్రీమద్రహస్యత్రయసారః
86. సారసారః
87. విరోధపరిహారః

ద్రావిడ ప్రబంధములు

88. అమృతరంజనీ
89. అధికారసంగ్రహః
90. అమృతాస్వాదినీ
91. పరమపదసోపానమ్
92. పరమతభంగః
93. హస్తిగిరిమాహాత్మ్యమ్
94. అడైక్కలప్పత్తు
95. అర్థపంచకమ్
96. శ్రీ వైష్ణవదినచర్యా
97. తిరుచ్చిన్నమాలై
98. పన్నిరునామమ్
99. తిరుమంత్రచ్చురుక్కు
100. ద్వయచ్చురుక్కు
101. చరమశ్లోకచ్చురుక్కు
102. గీతార్థసంగ్రహః
103. ముమ్మణిక్కోవై
104. నవమణిమాలా
105. పందు
106. కళల్
107. అమ్మానై
108. ఊశల్
109. ఏశల్
(105–109: లుప్తాః)
110. ప్రబంధసారః
111. ఆహారనియమః
112. నిగమపరిమళః (లుప్తః)

ఆచార్యులు స్వనిర్మితములగు నీ యన్ని గ్రంథములయందును భగవద్రామానుజ సిద్ధాంతమని ప్రసిద్ధిచెందిన యతిప్రాచీనమును, వైదికమార్గావలంబియు, నమ్మాళ్వార్ ప్రభృత్యాచార్య శ్రేష్ఠులచే ప్రచారపథమునకు గొనిరాబడిన విశిష్టాద్వైతసిద్ధాంత సంప్రదాయమునే పలు ప్రక్రియలలో ఈషత్తును పరస్పరవిరోధము లేనట్లు అద్భుతముగా ప్రతిపాదించియున్నారు. కావ్యనాటకాదులయందు నైతమీ నియమమునకు ప్రచ్యుతి లేదు.

## విశిష్టాద్వైత సిద్ధాంతసారము

ఇట నాథముని మొదలగు పరమాచార్యులచే ప్రవర్తితమైన విశిష్టాద్వైత సిద్ధాంతసారము సంగ్రహముగా తెలియపరుపబడుచున్నది.

ముముక్షువులకు అవశ్యజ్ఞాతవ్యములు తత్త్వము, హితము, పురుషార్థము ననబడు నీ మూడు విషయములే.

## తత్త్వము

వీనిలో తత్త్వము ; (1) చేతనము, (2) అచేతనము, (3) ఈశ్వరుడు నని త్రివిధము.

## చేతనము

జ్ఞానవంతుడగు జీవాత్మ చేతనుడనబడును. ఇతనికి జ్ఞానమొక గుణముగానుండును. దీనికి ధర్మభూతజ్ఞానమని పేరు. ధర్మియగు జీవాత్మయు జ్ఞానమయుడే. కావున నాయాత్మ ధర్మిభూతజ్ఞాన మనబడును. ఈ జీవాత్మ తనకు తానే ఎప్పుడును ప్రకాశించుచుండును. తనను "నేను" అని యెఱుంగునపుడు ధర్మభూతజ్ఞానసహాయమవసరములేదు. ఆత్మేతర సమస్త వస్తుపరిజ్ఞానము ధర్మభూతజ్ఞానము చేతనే కలుగును. స్వస్వరూపమును ధర్మభూతజ్ఞానముచేతకూడ నెఱుంగనగును. జీవుడు, అణువుగాను, ఆనందస్వరూపుడుగాను నుండును. అతడు శరీరేంద్రియాదులకంటె భిన్నుడు. ఉత్పత్తి వినాశరహితుడు. భగవంతునికి సర్వదా శేషుడు. ఇట్టి జీవాత్మలసంఖ్యేయములు. వీరు (1) బద్ధులు, (2) ముక్తులు, (3) నిత్యులనని త్రివిధముల నుందురు. అనాది కర్మబంధముచే నీ సంసారములో పరిభ్రమించుచుండువారు బద్ధులు. ఈ కర్మభూమిలో సదాచార్య సంబంధముద్వారా భక్తిప్రపత్తులలో నన్యతరమైన మోక్షోపాయము ననుష్ఠించి మోక్షము నందినవారు ముక్తులు. భగవంతునివలె ఎప్పుడును కర్మసంబంధమనునదిలేక మోక్షలోకమున నా భగవంతునికే కైంకర్యములు చేయుచు నాతని ననుభవించుచుండు ననంతగరుడ విష్వక్సేనాదులు నిత్యులు.

## అచేతనము

జ్ఞానశూన్యమైన వస్తువచేతనమనబడును. ఈ అచేతనముచే నేర్పడు ఫలము నీశ్వరసంకల్పాధీనముగా చేతనుడనుభవించును. ఈ యచేతనము సైతము (1) త్రిగుణము, (2) కాలము, (3) శుద్ధసత్త్వమునని త్రివిధముగ నుండును.

## త్రిగుణము

దీనినే మూలప్రకృతి యందురు. ఇది సత్త్వము, రజస్సు, తమస్సు నను మూడుగుణములు గలిగినది గనుక త్రిగుణమనబడుచున్నది. ఈ ప్రకృతి సతతపరిణామవతిగా నుండును. ఈ మూడు గుణములును సమముగా నుండు నప్పుడు మహాప్రళయమేర్పడును. ఆ గుణములు హెచ్చు తక్కువలలో నున్నపుడు ఈ ప్రకృతి పలు తత్త్వములుగా పరిణమించును. ఈ ప్రకృతియే "మహాన్" అను తత్త్వముగా మారును. ఆ మహత్తత్త్వమునుండి "అహంకార" మను తత్త్వము కల్గుచున్నది. ఆ యహంకారము సాత్త్విక – రాజస – తామసభేదేన త్రివిధమగును. వానిలో సాత్త్వికాహంకారమునుండి ఏకాదశేంద్రియములు (పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, మనస్సు.) సంభవించుచున్నవి. తామసాహంకారము తన్మాత్రలద్వారా పంచభూతములను కలుగజేయుచున్నది. తత్క్రమమిది :– తామసాహంకారమునుండి క్రమేణ శబ్దతన్మాత్ర:– ఆకాశము, స్పర్శతన్మాత్ర:– వాయువు, రూపతన్మాత్ర:– తేజస్సు, రసతన్మాత్ర :– జలము, గంధతన్మాత్ర :– పృథివి. "తన్మాత్ర" అనఁగా, పూర్వరూపము పూర్తిగ నశింపకుండ, ఉత్తరరూపము పూర్తిగ కలుగకుండు మధ్యమావస్థ. ఈ యవస్థనుండు తత్త్వమునకు "తన్మాత్ర" అని పేరు. రాజసాహంకారము మిగిలిన రెండు అహంకారములును తమకార్యములు చేయునపుడు సహాయముగా నుండును. ప్రాపంచికములగు నచేతనపదార్థము లన్నియు (శరీరాదులు) ఈ పంచభూతమయములే.

## కాలము

ఇది విభువుగా నుండును. జడమైన వస్తువు. దీనిలో సత్త్వాదిగుణములు లేవు. భూతభవిష్యద్వర్తమానాదివ్యవహారముల కిదియే కారణము. నిమిషము, గడియమొదలు యుగాంతాది విభాగములన్నియు నీ కాలమునకు సంబంధించినవియే. ఈ కర్మలోకములోనుండు పరిణామములన్నియు (భగవత్సంకల్పాధీనముగ) నీకాలముచే నేర్పడునవియే. ఈకాలకృతపరిణామము వైకుంఠలోకమున లేదు. అచట నది కేవల భగవత్సంకల్పముచే నేర్పడును.

## శుద్ధసత్త్వము

రజస్తమః సంబంధములేకుండ కేవల సత్త్వగుణమునకుమాత్ర మాధార మైన యొక విలక్షణమగు ద్రవ్యమిది. ఇది శ్రీవైకుంఠలోకములో నుండుచు, ఇది కొన్నిసమయములలో నీ ప్రాకృతలోకములోగూడ భగవద్విగ్రహాదులరూపముగ నవతరించుచు. వైకుంఠములోనుండు నందరి శరీరములును, మండప గోపుర ప్రాకారాది సకలవస్తువులును ఈ శుద్ధసత్త్వద్రవ్యమయములే.

ధర్మభూత జ్ఞానమనునది గూడ నొక యచేతనద్రవ్యముగా లెక్కింపబడ వలసియుండినను చేతనమనుటలో విశేషణముగా చైతన్యమను ధర్మభూతజ్ఞాన ముండుటచే పృథగ్గణనము చేయలేదు.

## ఈశ్వరుఁడు

శ్రీమన్నారాయణుడే సర్వేశ్వరుడు. ఇతడు ఎప్పుడును, ఎట్టి మారు బాటు లేనివాడు. జ్ఞానానందస్వరూపి. త్రివిధపరిచ్ఛేదరహితుడు. అనగా:— ఈదేశములోనే యుండును, ఈకాలమందే యుండును, ఈవస్తుస్వరూపముగనే యుండుటను నియమము లేక సర్వదేశములలోను, సర్వకాలములయందును, సర్వవస్తువులుగానుండును. ఈపరమాత్మయందెట్టి దోషమును లేదు. చేతనాచేతన మగు ప్రపంచమంతయు నితనికి శరీరముగా నుండును. ఇతడు ముముక్షువులకు ఉపాయముగాను, ఫలముగాను నుండును. సర్వప్రపంచమునకును సృష్టి-స్థితి-సంహారకర్త, సర్వోత్కృష్టుడు, సర్వాధారుడు, సర్వనియామకుడు, సర్వస్వామియు నగును. స్వాశ్రితులయొక్క సర్వకర్మములను నశింపజేయువాడు, సర్వవేదప్రతిపాద్యుడు, సర్వాంతర్యామి, సర్వశబ్దవాచ్యుడు, సర్వకర్మసమారాధ్యుడు, సర్వఫలప్రదుడు నగుచున్నాడు. బ్రహ్మరుద్రాదిసర్వులును వీని కింకరులే. ఇతడు స్వస్వరూపముచేతను, విగ్రహముచేతను, గుణములచేతను, స్వేతర సమస్తవస్తువుల కంటె నుత్కృష్టుడు. స్వభావముగనే సకలకల్యాణగుణాకరుడు. అవాప్తసమస్తకాముడు. మహాలక్ష్మి యితనితో సర్వదా సహభావమును భజించియున్నది. ఈతని విగ్రహము పరవ్యూహవిభవాంతర్యామ్యర్చాభేదేన పంచవిధముగా నుండును. దీనియందర్చయే వేంకటాచలములో వేంచేసియుండు శ్రీనివాసమూర్తి మొదలు తత్తద్దివ్యదేశములలోనుండు భగవద్విగ్రహములును, భక్తులవాంఛానుసారముగా పరిగ్రహింపబడు తత్తద్విగ్రహములును. (సాళగ్రామశిలయు దీనిలోనిదే).

మహాలక్ష్మియు నీ యీశ్వరతత్త్వములో చేరినదే. ఆమెయు నీ మహా విష్ణువువోలె సర్వవ్యాపినియై మన కుపాయముగాను, ఫలముగాను నిలుచున్నది. ఈ మహాలక్ష్మికి పురుషకారకృత్యమధికము. పురుషకారమనగా ఫలము నొసంగు వానిని సమీపించుటకు ఫలేప్సువగు పురుషునిచే నుపాయముగా వరింపబడిన మఱొక చేతనుడు.

## హితము

ఇచ్చట హితమనగా మోక్షమునకు సాధనముగా ననుష్ఠించు నుపాయము. అది భక్తి ప్రపత్తి భేదేన ద్వివిధముగానుండును. ఇందు భక్తియోగము నానావిధ ముగ నుండును. దీనిని మోక్షమునందువరకనుష్ఠించుచునే యుండవలెను. దీనికి కర్మయోగము, జ్ఞానయోగము, ఆత్మావలోకనములన్నియు నంగములు. ఇయ్యది చిరకాలసాధ్యము. ఏతదంగముల ననుష్ఠించుట చాలయు కఠినము. ఈ కాల ములో భక్తియోగము ననుష్ఠించు నధికారి లేడనియే చెప్పవచ్చును. దీనినే అష్టాంగయోగమందురు.

## ప్రపత్తి

భక్తియోగములో నశక్తులుగానుండువారు ప్రపత్తిని మోక్షోపాయముగా పరిగ్రహింతురు. ఈ ప్రపత్తినే భరన్యాసము, శరణాగతి, భరసమర్పణమని నా నా నామములతో చెప్పుదురు. (ఈ భక్తి ప్రపత్తులు రెండును మోక్షమునే గాక త్రివర్గమనబడు ధర్మార్థకామములను గూడనియ్యగలవు). ఈ ప్రపత్తి షడంగయోగమనబడును. అనగా (1) అనుకూల్యసంకల్పము. (2) ప్రాతి కూల్య వర్జనము, (3) మహావిశ్వాసము, (4) గోప్తృత్వ వరణము, (5) కార్పణ్యము నను నైదంగములతో గూడిన (6) ఆత్మసమర్పణము (అంగి) దీని నొకఫలము నుద్దేశించి యొకసారియే యనుష్ఠించవలయును. ఒకేఫల మునకై బహుపర్యాయములనుష్ఠించుట కూడదు. దీనికి జాత్యాది నియమ ములు లేవు. అన్ని ప్రాణులు ననుష్ఠింపవచ్చును. మోక్షార్థముగా ప్రపత్తిచేసిన వాని మహిమ చాలయు నుత్కృష్టము. ఈ ప్రపత్తియొక్క స్వరూపాదులు మన దయాశతక వ్యాఖ్యానములో నచటచట బాగుగ నిరూపింపబడియున్నవి. ఈ ప్రపన్నునికి మరణ సమయములో దేశకాలాది నియమములు లేవు. వీని నిర్యాణసమయమునందు హార్దుడగు నీశ్వరుడు వీనిని సుషుమ్నా నాడిద్వారా

అర్చిరాది మార్గములో వైకుంఠలోకమునకు తీసికొనిపోవుచున్నాడు. ఇట్టి ప్రపత్తిమార్గమును పరిష్కరించి ప్రకటీకరించుట ఆచార్య కృత్యములలో ప్రధానమగు నొకటి.

## పురుషార్థము

మోక్షమే పరమపురుషార్థము. మోక్షమనగా పరమపదమనబడు వైకుంఠలోకమునకేగి యచట పరిపూర్ణ బ్రహ్మానుభవమునందుట. ఆ బ్రహ్మానుభవ పరీవాహరూపముగా భగవత్కైంకర్యమును పలువిధములుగా నాచరించుటయు దానిలో చేరిపోవును. ఆ మోక్షలోకమును చెందినపిదప నప్రాకృతమగు భగవచ్ఛరీర సమానమైన శరీరమును, గుణాష్టకములును సంభవించును. సర్వగుణ విగ్రహ విభూతి విశిష్టుడైన శ్రీమన్నారాయణానుభవమును, తత్కైంకర్యమును పరిపూర్ణ బ్రహ్మానుభవమనబడు పరమ పురుషార్థము.

## దయాశతకావతరణము

మన ఆచార్యులవతరించిన సమయమునందు క్రింద చెప్పబడిన మోక్షోపాయమగు ప్రపత్తిమార్గములో పలువురికి పలువిధములైన సందేహములును, భ్రమములునుండినవి గనుక వానిని పోగొట్టి నిస్సంశయ విపర్యయముగ నాత్మోజ్జీవనమునకు నీ కాలము వారికి ప్రధానముగా ననుష్ఠేయమగు నీ ప్రపత్తిమార్గమును స్థాపింపవలసిన నిర్బంధమేర్పడెను. ఆచార్యుల యవతారకృత్యములలో నిది చాలయు ప్రధానముగా వారిచే స్వీకరింపబడియెను. సంప్రదాయగ్రంథములలో పూర్తిగను — సంస్కృతమయ వేదాంతగ్రంథములో ప్రసక్తమైన చోట్లను — ఈ ప్రపత్తిమార్గమును ప్రమాణయుక్త్యాదులచే చాలదృఢముగా స్థాపించిరి.

స్తోత్రగ్రంథములన్నింటిలోను ప్రాయశః ఈ విషయముండును. "దయాశతక" మను ప్రకృతప్రబంధము ఈ ప్రపత్తిని నిరూపించుటకే యవతరించినదని చెప్పనగును.. స్తోత్రారంభములో నుండు "ప్రపద్యే" అను ప్రథమ పదమే దీనిని సూచించుచున్నది. మోక్షార్థమైన ప్రపత్తి యనగా ; — భగవంతునియొద్ద " కర్మ — జ్ఞాన — భక్తి యోగాదుల ననుష్ఠించుటకు నాకు శక్తి సామర్థ్యాదులును, క్షమయు లేదు. నీవు తప్ప నాకు వేఱుగతిలేదు. ఇక నీ కనుకూలుడుగా నుండెదను. (అనగా శాస్త్రవశ్యుడుగానుందును) ప్రతికూలుడను గాను. నారక్షణములో

నిన్నే వరించితిని" అని విన్నవించి వాని నాశ్రయించినచో నిశ్చయముగ కాపాడు నను మహావిశ్వాసముతోకూడ వాని చరణారవిందములలో అస్మదాత్మ — భర — ఫలసమర్పణము చేయుటయే. ఇచ్చట భరసమర్పణమనగా ; — నాకు కర్మజ్ఞాన భక్త్యాదులు చేయుటకు శక్తిలేదు కనుక ఆ భక్తియోగస్థానములో పరమదయతో నీవే నిలిచి ఆ భక్తియోగమున కేర్పడియుండు మోక్షఫలమును నా కనుగ్రహింపు మని వేడుకొనుటయే.

ఇట్లు వేడుకొనినయెడల నా పరమపురుషుడు పరమదయాళువుగనుక ఆ దయచే ఆ భక్తి యోగస్థానములో స్వయముగ నిలిచి పీడు వైచిన భ మును స్వీకరించి స్వయమే మోక్షోపాయమగుచున్నాడు. దీనిచేతనే వానిని "సిద్ధో పాయుడ" ని చెప్పుదురు. ఇట్టి ప్రపత్తిలో భగవద్దయచేతనే ప్రధానపురుషార్థము కలుగును గావున దీయకే యిందు ప్రాధాన్యమీయవలసియున్నది. కావుననే ఆ భగవద్దయనే చేతన సమాధిలో నిలిపి శరణాగతికుద్దేశ్యురాలినిగా చేసి "దయా శతక" మను స్తోత్రము నారబించి ఆ స్తోత్రములో ప్రపత్తి నాచార్యులు చక్కగ నిరూపించిరి.

## ప్రధాన ప్రతిపాద్యార్థము

పరహితప్రావణ్యమే భగవద్దయయొక్క స్వరూపము. ప్రపంచములో నుండు సర్వచిదచిత్తులయొక్క స్వరూపస్థితిప్రవృత్తులన్నియు భగవత్సంకల్పము చేతనే సంభవించుచున్నవి. భగవత్సంకల్పాధీనమైన సర్వవిషయములయందును దయాసంబంధము పూర్ణముగా నున్నదను నీ సిద్ధాంత మీస్తోత్రములో ప్రధాన ముగా ప్రతిపాద్యమగుచున్నది. "పరదుఃఖ దుఃఖిత్వం దయా" అనియు, "పరదుఃఖ నిరాచికీర్షా దయా," అనియు పలు గ్రంథములలో పూర్వాచార్యులచే దయాస్వరూపము నిర్వచింపబడియున్నది. సర్వచిదచిత్తులయొక్కయు స్వరూప స్థితిప్రవృత్తులు భగవద్దయచే నేర్పడుచున్నవని సిద్ధాంతీకరించినయెడల జీవరాశిలో చేరినట్టి యనాఘ్రాతదుఃఖులైన నిత్యసూరులయొక్క స్వరూపస్థితి ప్రవృత్తులను దయాధీనములని తేలును. దయాస్వరూపము పరదుఃఖ దుఃఖిత్వ రూపమనియో, పరదుఃఖ నిరాచికీర్షయనియో చెప్పినయెడల పూర్వోక్త నిత్యులకు నేమాత్రము దుఃఖసంబంధము లేనందున వారి విషయములో భగవద్దయకు సంబంధము లేక పోవును. అట్లైనచో పూర్వోక్తసిద్ధాంతమునకు విరోధమేర్పడును. కనుక

'పరహిత ప్రావణ్యమే' దయాస్వరూపమని యంతతోఁగత్వా నిష్కర్షము చేయవలయునని యాచార్యుల యభిప్రాయము. ఈ విషయమును,

"పరహితమనుకంపే! భావయన్త్యాంభవత్యాం" (ద / 36.)

ఇత్యాదిస్థలములయందు స్పష్టీకరించియున్నారు. సర్వచేతనాచేతనముల స్వరూపస్థితిప్రవృత్తులు దయాధీనములను విషయమును,

"త్రివిధ చిదచిత్సత్తాస్థేమ ప్రవృత్తినియామికా
వృషగిరివిభోరిచ్ఛా సా త్వం పరైరపరాహతా" (ద/71)

అను శ్లోకములో స్థాపించియున్నారు.

ఈ స్తోత్రములో ప్రథమ దశకమునందు ఆచార్యపరంపరను, ఆళ్వార్లను, భగవన్మహిషులను, శ్రీనివాసుని నమస్కరించి స్తోత్రప్రారంభప్రతిజ్ఞ చేయుచున్నారు. ఆళ్వారులు, ఆచార్యులు భగవద్దయారూపులగుటచేతను, భగవన్మహిషులును, భగవంతుడును దయాకార్య ప్రధాన నిర్వాహకులగుట బట్టియు వారిని స్తుతించుట దయాస్తోత్రసంగతమే. ఇది యస్మద్వ్యాఖ్యానమునందు బాగుగ నిరూపింపబడియున్నది.

ద్వితీయ దశకమునందు భగవద్గుణము లన్నింటిలోను దయయుత్కృష్టమనియు, భగవంతుడు దయాపరవశుడనియు పరబ్రహ్మమగు భగవంతునకు నుపనిషత్తులలో చెప్పబడిన జగజ్జన్మస్థితిప్రళయకారణత్వము భగవద్దయకే సమన్వయపడునవియు, కావున నాదయయే స్తోతవ్యయనియు నిరూపించిరి,

తృతీయదశకమున దయచే భగవంతునకు చేయబడు నుపకారములు వర్ణింపబడుచున్నవి.

తురీయ దశకములో దయాజితుడగు నపరాధచక్రవర్తిని భగవత్సమీపమునకు గొంపోయి యచట భగవత్సభలో ఈ యపరాధచక్రవర్తి మోచనార్థమై దయాదేవియును నావమూక సమీచీనయుక్తి ప్రమాణపురః సరముగా వాదించు ప్రక్రియ యద్భుతముగ నిరూపింపబడుచున్నది.

పంచమదశకమునందు కులశేఖరాళ్వార్ మొదలగు మహనీయుల సూక్తుల ననుసరించి వేంకటగిరియందు జంగమముగానైనను, స్థావరముగానైనను జన్మ ప్రార్థింపబడినది.

షష్ఠదశకములో భగవద్దయయందు సాక్షాత్తుగ ప్రపత్తి ననుష్ఠించి యా ప్రపత్త్యంగములనుగూడ నిరూపించిరి.

ప్రపన్నునకు కావలసిన నిర్భయత్వదార్ఢ్యముకొరకు దయయొక్క నిరంకుశ నిరతిశయప్రభావము సప్తమదశకమున వర్ణింపబడుచున్నది.

అష్టమదశకమందు దయాస్వరూపము, జీవవశీకరణములోని యుపకార పరంపర మొదలగునవి వర్ణింపబడుచున్నవి.

నవమదశకమునందు దయాఘనుడగు భగవంతుని అర్చావతారములు, మత్స్య కూర్మాది దశావతారములు ననుసంధింపబడుచున్నవి.

దశమదశకమునందు, "నేను నిన్ను తిరస్కరించినను, అడ్డగించినను, కళింగశకునివలె సాహసికుడుగానుండినను నన్ను బంధించి తీసికొనిపోయి ముక్తానుభూతిని నాకిచ్చుటనే యిప్పింపవలయు" నని స్వాభీష్టఫలమును దయాదేవియందు ప్రార్థించుచున్నారు.

నైచ్యానుసంధానము, భగవదర్పణము (సాత్త్వికత్యాగము), ఫలశ్రుతి మొదలగు విషయములు ఉపరితనాష్టశ్లోకిలో ప్రతిపాద్యములు.

ఏవంచ మొదటి యేబది శ్లోకములలో దయాప్రభావమును ప్రకటీకరించి, అట్టి యుత్తమ ప్రభావయగు దయాదేవియందు షష్ఠదశకములో "తిరువాయ్మొళి" లో నమ్మాళ్వార్లు షష్ఠశతకములో మన శ్రీనివాసునియందు ప్రపత్తి ననుష్ఠించినట్లు స్వయముగ ప్రపత్తిననుష్ఠించి తదుత్తర దశకత్రయములో ప్రపన్ను నుత్తరకాలములో ననుసంధేయములగు దయాకార్యములను విశదీకరించి యన్తిమదశకములో స్వాభీష్ట ప్రార్థనముచేసి స్తోత్రమును పూర్తిగావించుచున్నారు.

ఇందులోని పదిదశములలోను వరుసగా (1) అనుష్టుప్, (2) ఆర్యా, (3) ఔపచ్ఛందసికము (మాలభారిణీ), (4) మాలినీ, (5) మందాక్రాన్తా,

(6) నర్దటకమ్ (కురరీరుతమ్), (7) శిఖరిణీ, (8) హారిణీ, (9) పృథ్వీ, (10) వసంతతిలకా (సింహోన్నతా, ఉద్ధర్షిణీ) అను వృత్తములవలంబింపబడి యున్నవి. 101 మొదలు 104 వరకు వసంతతిలకయు, 105—6 లలో మాలినియు, 107—8 లలో శార్దూల విక్రీడితమును ఉపయోగింపబడియున్నవి.

ఇందు 5, 6, 7, 8, 9 దశకములలో నొక్కొక్కపాదమునకు 17 అక్షరములుగల భిన్నభిన్న వృత్తములు పరిగ్రహింపబడుట యొకచిత్రము. అనుదినమును, త్రిసంధ్యలలోను, జపింపవలసిన గాయత్రీ మహామంత్రముయొక్క ఆవృత్తిసంఖ్య యీ స్తోత్రమునందలి శ్లోకసంఖ్యతో సమానమగుటచే తదావృత్తి ఫలముగూడ ఈ స్తోత్రపాఠకునకు నేర్పడునని యాచార్య వివక్షితము గావచ్చును. మఱియు నష్టోత్తరశత దివ్యస్థానములలో నుండు భగవన్మూర్తులయొక్క దర్శనముచే నేర్పడు ఫలముగూడ నీ స్తుతి పాఠకునకు కల్గునని చెప్పవచ్చును. భగవంతునకు సంగ్రహార్చనయు నయిత మష్టోత్తరశతనామములచేతనే చేయుచున్నారు. ఈ స్తోత్రములోనుండు ఒక్కొక్క శ్లోకమునుండి యొక్కొక్క నామము నుద్ధరించి "దయాఽష్టోత్తరశతనామావళి" ని కల్పించి దయాదేవికి నర్చన చేయవచ్చుననియు ప్రతిశ్లోకములోను దయను సంబోధించి స్తుతించిన ఆచార్యుల యాశయము గావచ్చును. ఇదిగాక ఆచార్యులు అనేక దివ్యదేశములలో, అనేక భగవన్మూర్తులను సేవించి నానా స్తోత్రముల నాచరించి యున్నారు. ఐనను అట్టి స్తోత్రములలో లేని యొక్క నూతన ప్రక్రియ దయాశతకమునందు గానవచ్చుచున్నది. అదేమన — ఆ స్తోత్రములలో వలె భగవంతుని నేరుగా సంబోధింపక భగవద్గుణమగు దయను సంబోధించి దానినే స్తుతించి యున్నారు. ఇచట నంతరాశయమేమనగా — విగ్రహము, విభూతి, గుణము — ఇవిలేని కేవల భగవత్స్వరూపము శశవిషాణతుల్యమే. కావున ఆ విగ్రహ — విభూతి — గుణ విశిష్టుడైన భగవంతుడే యుపాస్యుడు. వానిచేతనే భగవంతున కుత్కర్షమనిగూడ చెప్పవచ్చును. వానిలోగూడ గుణము చాలయు ప్రధానము. ఈ విషయమును దహరాది బ్రహ్మవిద్యలలో ఉపనిషత్తులు స్పష్టీకరించియున్నవి. ఆ గుణములలోగూడ "దయ" యనే భగవద్గుణమే చాలయు ప్రధానతమము. ఆ గుణమునకే మిగిలిన గుణములన్నియు భగవానునితో సహ కింకర భావము నవలంబించుచున్నవను నీ యుపనిషత్తుల హృద్గతమైన రహస్యార్థమును స్పష్టీ

కరించుటయే ఆచార్యోద్దేశము. ఈ దయలేనిచో భగవంతుడు భగవత్శబ్దవాచ్యుడు కాజాలడు. మనకుద్దేశ్యుడును గానేరడు. కాన వేదాది సర్వవైదికగ్రంథ బృందములను అంతతో గత్వా భగవద్దయాప్రభావప్రతిపాదకములే యను పరమ సిద్ధాంతము నీ స్తోత్రద్వారా ఆచార్యులు ప్రపంచమునకు ప్రకటీకరించి యున్నారు.

ఇట్టి మహోన్నతప్రభావశాలినియగు దయాదేవియొక్క సామ్రాజ్యమును "కలౌ వేంకటనాయకః" అని చెప్పబడునట్లు మన వేంకటాచలపతియగు శ్రీనివాసునియందే ఈ కలికాలములో చూచుచున్నాము. లక్షలకొలది జనులు ప్రాణములకంటె గొప్పదగు ధనమును గణింపక కానుకగా సమర్పించి తమ తమ యభీష్టములను ప్రత్యక్షముగా భగవంతునితో మాటలాడి పొందుచున్నారుగదా! అట్లు సంపాదింపబడిన ధనములచే వేలకొలది జీవరాసులను మాతాపితృవద్వర్తించి సాక్షాత్తుగ కాపాడుట యనియు నిచటనే చూచుచున్నాముగదా! కావుననే ఆచార్యులు ప్రత్యక్షముగా ఈ దేవతయందే దయాదేవి యెల్లరకు కనబడుచున్నది గాన ఈ మూర్తిలోనే ఆ దయాదేవిని స్తుతించిరి.

## ఉ ప సం హా ర ము

ఇట్లీప్రబంధముయొక్క పరిపూర్ణరసానుభవ మేర్పడుట కొఱకు వక్తృవైలక్షణ్య — విషయవైలక్షణ్య — ప్రబంధవైలక్షణ్యాది సర్వవైలక్షణ్యములను సంగ్రహముగ నిరూపించితిమి. దీనినిబట్టి ప్రకృతాచార్యులయొక్క సంప్రదాయమును, మనోభావమును, పరోపకారచింతయును బాగుగ గ్రహించి గ్రంథగౌరము నెఱింగి సంగ్రహరుచుల మగు మేము చెప్పని విషయములనుగూడ స్వయముగ నవహితులై గ్రహింతురుగాక!

## కృ త జ్ఞ తా వే ద న ము

దయాశతక వ్యాఖ్యానమను నీ కైంకర్యమును మితజ్ఞుడనగు నాకు శ్రీనివాసు నంతర్యామిగా నిలిపి తద్ద్వారా ఆరచింపజేసిన శ్రీ భగవద్దయాదేవి యందును, తదధీనుడగు శ్రీనివాసమూర్తి యందును, నా ప్రణతి సహస్రపూర్వంమైన కృతజ్ఞతను సమర్పించుచున్నాను. ఇచట నేవేని గుణములు కనబడినయెడల నవియన్నియు మదాచార్య పాదుల యనుగ్రహముచే నేర్పడిన

వవియు, దోషములన్నియు స్వకీయములనియు నీతత్త్వమును వాచకులెఱుంగ వలయును. ఈ వ్యాఖ్యాన రచనాప్రవృత్తికి ముఖ్యకారణము శ్రీనివాసుని విషయములో ఏ కొద్దియైన వాచిక కైంకర్య ముండవలెనను నభిసంధియు, ప్రకృత ప్రబంధాచార్యులైన దేశికులవారి చరణారవిందములో నుండు నిరవధిక భక్తియును నగును గాని పాండిత్యప్రకర్ష ప్రకటనేచ్ఛగాదను నీ విషయమును గూడ పాఠకులు గ్రహింప ప్రార్థితులు. అంతమున ముఖ్యమైన యొక విషయమును తెలిపి విరమించెదము. తిరుపతి శ్రీ వేంకటేశ్వర సంస్కృతకళాశాలలో ప్రకృతము సాహిత్యశాస్త్రాదుల నుత్తమ కక్ష్యలో అధికరించుచున్నట్టియు, ఆంధ్రాది భాషలలో నయితము కవిత్వరచనాపర్యంతమైన సామర్థ్యముగలవాడును, వినయాదిగుణసంపన్నుడును నగు నస్మత్ప్రియశిష్యుడైన నముద్రాల, లక్ష్మణయ్య ఈ దయాస్తోత్రవ్యాఖ్యానరచనలో ఆమూలాదాగ్రము మాతో కూడ నుండి ముద్రణార్హమగు ప్రతినివ్రాసి తోడ్పడినందులకు, ఈ దయాస్తోత్ర ప్రతిపాద్యుడగు పరమపురుషుడతనికి నాయురారోగ్యైశ్వర్యాది సంపత్తులను, విశిష్య అత్యధికమైన పాండిత్యమును, తత్ఫలమైన ఆత్మగుణములను ప్రసాదింపవలయునని శ్రీనివాస చరణారవిందములలో ప్రార్థించుచున్నాము, మేమును హృదయపూర్వకముగా నాశీర్వదించుచున్నాము.

ఇట్లు,

విద్వజ్జనవశంవదః

తిరుపతి,
22—2—58.

కో. శఠకోపాచార్యః,

న్యాయమీమాంసాధ్యాపకః, శ్రీ వేంకటేశ్వర సంస్కృతకళాశాల.

శ్రీరస్తు

శ్రీమద్వేంకటనాథాయ నమః

# దయాశతకము

## శ్రీ వేదాన్త దేశిక విరచితము

(ఆంధ్ర టీకా తాత్పర్య సహితము)

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ ।
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥



శ్లో॥ ప్రపద్యే తం గిరిం ప్రాయః శ్రీనివాసానుకంపయా ।
ఇక్షుసారస్రవన్త్యేవ యన్మూర్త్యా శర్కరాయితమ్ ॥ 1

అర్థ :— ఇక్షుసార స్రవన్త్యేవ = చెఱకురసమయమైన నదివలెనున్న, శ్రీనివాసానుకంపయా=శ్రీనివాసునియొక్క దయచేత, ప్రాయః=తఱచుగా, యన్మూర్త్యా= ఏ వేంకటాద్రియొక్క ఆకారముచే, శర్కరాయితం = చక్కెఱగా ఆచరింపబడెనో (గులకరాళ్లుగా ఆచరింపబడెనో), తం = ఆ, గిరిం = వేంకటగిరిని, ప్రపద్యే = నమస్కరించుచున్నాను.

అవతా :— ఆళ్వారులనియు, ఆచార్యులనియు ప్రసిద్ధిచెందిన వైష్ణవ సాంప్రదాయకులయం దగ్రగణ్యులును, ద్రావిడ సంస్కృతభాషలయందు నిరుపమ పాండిత్యవంతులును, వేదాంతాది శాస్త్రములయందిరు భాషలలోను శతాధికగ్రంథ కర్తలును, దక్షిణదేశములోని పలుపుణ్యక్షేత్రముల కరిగి యచటనుండు భగవన్మూర్తులను సేవించి తదానంద ప్రవాహరూపముగా పలు స్తోత్రముల నారచించి తద్ద్వారా వెనుకటివారలమైన మనబోటివారు తెలిసికొని యనుష్ఠింపవగిన బహువిషయముల నుపదేశించినవారును, "వేదాంతాచార్య" "కవితార్కిక సింహ" మొదలగు ననేక బిరుదులను బొందినవారునగు "శ్రీ వేదాంతదేశిక" లను నాచార్యులు తిరుమలకు వేంచేసి శ్రీనివాసుని సందర్శించి స్తోత్రము చేయునప్పుడు, ఇతరక్షేత్రములయందు సంభవించని యొక క్రొత్త ప్రక్రియ నవలంబించి స్తుతించిరి.

అదెట్లన నితర క్షేత్రములయందు, ఏ భగవానునినైనను, ఏ దేవినైనను, ఏ యాచార్యులనైనను స్తోత్రించునపుడు, వారలనే సంబోధించి వారిగుణములను

స్తుతించిరి. ఇచట నన్నునో, అట్లుగాక భగవంతునకుండు నసంఖ్యేయములగు గుణములలో అతి ప్రధానమైనటువంటి "దయ" యనెడి గుణమునే సంబోధించి, ఆ గుణమునే సచేతనముగా (భగవద్దివ్యమహిషిగా) భావించి శతాధిక శ్లోకములచే స్తుతించిరి.

ఇట్లు భగవానుని పేర్కొనక, అతని యందలి ప్రధానగుణమును పేర్కొని స్తుతించుట "దహరా"ది బ్రహ్మ విద్యలయందలి యుపనిషత్తులలో చెప్పబడిన మార్గము ననుసరించి యేర్పడినది.

ఈ శతకమునందు భగవంతుని యసంఖ్యేయ గుణములలో దయాగుణమునే ప్రధానముగా స్వీకరించుటకు ముఖ్యకారణములను గ్రంథకర్తయే పైన సవిశదముగ నిరూపించియున్నారు. ఏ దయాగుణము లేనిచో భగవంతునియందలి యితర గుణములు గుణములు గాకపోవుటయేగాక దోషములుగాను పరిణమింపగలవో, ఆ దయాగుణమునకు ప్రాధాన్యము నొసంగుట యెంతయు సమంజసమే గదా ? కావున భగవంతున కత్యంతము ప్రియురాలైన దయాదేవిని స్తుతించినచో, ఆమెకు కింకరులగు నితరగుణములును, సాక్షాద్భగవానుడును మనకు వశ్యులు గాగలరనుట వేఱుగ చెప్ప నవసరములేదు.

మరియు నితరక్షేత్రములయందును భగవద్దయకు ప్రాధాన్యమియ్యక మన శ్రీనివాసునియందే ప్రత్యేకముగ ప్రాధాన్యము నొసంగుటకు కారణమెల్లరకును విదితమే. ఏలన "కలౌ వేంకటనాయకః" అని పురాణము లుద్ఘోషించినట్లు ఈ కలియుగమునందు మనవంటి లక్షలాది కర్మబద్ధులతో నేరుగా మాట్లాడి వారివారి కున్న యనేకవిధార్తులను వారి ప్రార్థనల ననుసరించి యప్పుడే పోగొట్టి వారిచే సమర్పింపబడిన విశేషద్రవ్యములచే ననేక జీవులను తల్లిదండ్రులవలె కాపాడుట యనునది ఏ దయాదేవియొక్క సామ్రాజ్యచిహ్నమో, అట్టి దయాదేవియొక్క ఆధిపత్యమును యింత యున్నతస్థితిలో ఈ యఖండ బ్రహాండమునందు ఈ వేంకటాద్రియందు తప్ప మఱియొక ప్రదేశమునందు దర్శింపవీలగునా ? ఈ యర్థమును ఆచార్యులు "బద్ధాదరః" ( బద్ధేషు ఆదరః యస్య సః ) అను నొకపదముచే సూచించియున్నారు.

ఇట్లు దయాదేవిని సంబోధించి నిర్మింపబడియున్న ఈ శతకమునందు ప్రతియొక పద్యమును బహు విశేషార్థములను వేదాంత రహస్యార్థములను గూఢముగా

ప్రతిపాదించుచున్నవని గొప్ప గొప్ప విద్వాంసులు చెప్పుచున్నారు. ఇట్టి విశేషార్థములేగాక సాధారణ శ్లోకార్థములుగూడ వివిధ వేదాంతార్థముల నున్నత ప్రక్రియయందు బోధించుచున్నవి.

మరియు "ప్రపత్తి" యను శరణాగతి శాస్త్రార్థమును నిరూపించుటయే ఈ శతకమునకు ప్రధానోద్దేశ్యమని చెప్పవచ్చును. శాస్త్రోక్తమైన యుపాయము ననుష్ఠించుటకు సామర్థ్యము లేనందువలన తన కభీష్టమైన ఫలమును పొందజాలక పోవు నపుడు, తత్ఫలప్రదుని పాదముల నాశ్రయించి "ఓ స్వామీ! నా కా యుపాయము ననుష్ఠించుటకు శక్తి సామర్థ్యములు లేవు. కావున అకించనుడను, అనన్యగతికు డను నగు నాయందు దయయుంచి మీ రా యుపాయ స్థానమునందు నిలిచి తత్ఫల మును నాకు దయచేయవలయు" నని ప్రార్థించుటయే ప్రపత్తి యనబడును. ఇట్టి ప్రపత్తి, గుణాధికుఁడైన యుత్తమ పురుషునియొద్ద ననుష్ఠించినయెడల నిశ్చయ ముగా ఫలప్రాప్తిని చేకూర్చుననుటలో విభీషణ - ద్రౌపది మొదలగు మహాభక్తుల శరణాగతియే యుదాహరణముగా నగును. కావున ప్రపత్తి ఫలించుటలో ముఖ్య స్థానము దయాగుణమునకే యున్నదికదా?

సామాన్య మనుష్యాదులదయకే యింతటి విశేషమున్నప్పుడు, సర్వప్రపంచ నిర్మాతయు, రక్షకుడునగు పరమాత్మయొక్క దయ కెంతటి విశేషమున్నదో పాఠకు లూహించుకొనెదరుగాక! ఆ భగవద్దయచేత ప్రపంచమున కేర్పడు బహువిధము లైన యుపకారములనే ఈ స్తోత్రమునందు ఆచార్యులు చక్కగ ప్రతిపాదించి యున్నారు. వేయేల? లోకమునందు భగవత్సంకల్పములేక నొకచిన్నపనియు జరుగనేరదు. భగవత్సంకల్పమువలన జరుగు పనులన్నియు దయాకార్యములే యనెడి సిద్ధాంతమును నిరూపించుచు ప్రపన్నులయందీ దయాదేవిచేయు నత్యంతాధి కోపకారములను నిరూపించుటయే ఇచ్చట ప్రధానకృత్యము.

ఈ శతకమునందు భిన్నభిన్నవృత్తములలో భిన్నభిన్నార్థ ప్రతిపాదకములైన దశకములును, ఫలశ్రుతిరూపమున నన్తమున నెనిమిది (8) శ్లోకములును రచింపఁ బడియున్నవి. ఆ యా యర్థముల నా యా ప్రకరణములలో నిరూపించెదము.

ప్రథమముగా వైదికవృత్తమైన "అనుష్టుప్" ఛందస్సుచే యేర్పడిన ప్రథమ దశకమందు ఇష్టదేవతావందనమును, గురుపరంపరా నమస్కారమును చేయుచున్నారు.

తా॥ ఈ ప్రథమ శ్లోకమునందు ప్రపత్తి ప్రాధాన్యద్యోతకమైన "ప్రపద్యే" అను పదమును ప్రయోగించుచు వేంకటపర్వతమును నమస్కరించుచున్నారు. చెఱకురసమయమైన నది ప్రవహించి ఘనీభావము నొందినచో (గడ్డ గట్టిపోయినచో) శర్కరగా (చక్కెరగా) పరిణమించునట్లు, శ్రీనివాసునియొక్క అనగా లక్ష్మీ విశిష్టుడైన నారాయణునియొక్క (చెఱకురసపు నదివలెనున్న) దయా ప్రవాహమే ఏ వేంకటాచలరూపముగా ఘనీభావ దశనుబొంది శర్కరామయముగా (గులకరాళ్ల రూపముగా) నున్నదో, అట్టి వేంకటగిరిని నమస్కరించెదను.

దయాదేవియే ఈ పర్వతరూపములో నుండుటచే నీ పర్వతమును సందర్శించినవారెల్లరును సాక్షాద్భగవద్దయాదేవిని సందర్శించిన వారగుదురు. కనుక దీనిని దయాస్వరూపముగనే భావించి యాచార్యులు నమస్కరించిరి. అందుచే దయాశతకమునందు పర్వతవందన మసంగతమని భావించరాదు. భగవద్దయకు పావనత్వము, ఆశ్రితక్షేమ ప్రదత్వము మొదలగు గుణములేవేవి కలవో, ఆ గుణము లన్నియు నీ పర్వతమునకుగూడ కలవనియే యూహించవలెను.

శ్లో॥ విగాహే తీర్థబహుళాం శీతలాం గురుసంతతిమ్ ।
శ్రీనివాసదయాంభోధిపరీవాహపరంపరామ్ ॥ 2

అర్థ :— తీర్థబహుళాం = తీర్థకరులైన ఆచార్యులచే నిండినట్టియు (రేవులచే నిండినట్టియు), శీతలాం = శమదమాద్యాత్మగుణసంపన్నమైనట్టియు (చల్లనైనట్టియు), గురుసంతతిం = గురుపరంపరయనెడు (ఎక్కువ ప్రవాహము గల్గినట్టియు), శ్రీనివాసదయాంభోధి పరీవాహ పరంపరాం = శ్రీనివాసునియొక్క దయ యనెడు మహాహ్రదము (మడుగు) నుండి ప్రవహించు ధారాపరంపరను, విగాహే = అవగాహించుచున్నాను (మునుగుచున్నాను).

అవతా॥ దయాస్వరూపమైన వేంకటాద్రిని నమస్కరించి సర్వఫలప్రదమగు గురుపరంపరావందనము నాచరించుచున్నారు.

తా॥ శఠకోపముని నాథముని, యామునముని మొదలగు పావనతమ పరమాచార్యులచే నిండినట్టియు, శమదమదయాది గుణపూర్తి గల్గినట్టి యాచార్యపరంపర యనెడి శ్రీనివాసునియొక్క దయయనే జలాశయమునుండి ప్రవహించు గొప్ప కాలువయందు స్నానము చేయుచున్నాను.

అనగా అట్టి గురుపరంపరను త్రికరణములచే నమస్కరించుచున్నానని భావము. ప్రపంచమునందు సన్మార్గము తెలియక సర్వజనులు బాధపడు సమయమున సర్వేశ్వరుడగు శ్రీనివాసుడు మిక్కిలి దయచే పై జెప్పబడిన ఆచార్యపరంపర నవతరింపజేసి తద్ద్వారా వైదిక సత్సంప్రదాయమును (ప్రపత్తిమార్గము మొదలైనవి) ప్రవర్తింపజేసి, సర్వులకు తరణోపాయమును గలిగించెను. కావున నీ యాచార్య పరంపర శ్రీనివాసునియొక్క దయాప్రవాహ పరంపరయే యని యాచార్యుల యభిప్రాయము.

ఇంతియగాక తాపార్తుడు గొప్ప ప్రవాహమునందు స్నానముచేసి తాపశాంతి పొంద దలచినచో రేవులద్వారా దిగిన మాత్రముననే యెట్లభీష్టము నందగలడో, అట్లే సంసారతాపార్తుడు శ్రీనివాస దయాప్రవాహము నందవగాహించి శ్రేయస్సును పొందదలచినచో పై జెప్పిన యాచార్యులనెడి రేవుల మార్గముననే దిగవలయును. అనగా వారిచే ప్రదర్శింపబడిన మార్గము ననుసరించినప్పుడే శ్రీనివాసుని దయను పొందగలడు. ఈశ్వరు డెంత దయావంతుడైనను సరియైన త్రోవలో పోవువానికే తద్దయ లభించగలదని భావము. ఆచార్యులయొక్క ఆత్మగుణ పూర్తిని "శీతలాం" అను పదముచేత తెలియపరచిరి.

ఈ దశకమునందు దయను సంబోధించక దయాకార్యమైన ఆచార్యాదివ్యక్తులను నమస్కరించుటచే కార్యముఖముగా దయాదేవియే స్తుతింపబడినందున నీ దశమునకు స్తోత్రాసాంగత్యము శంకింపరాదు.

శ్లో॥ కృతినః కమలావాసకారుణ్యైకాన్తినో భజే ।
ధత్తే యత్సూక్తిరూపేణ త్రివేదీ సర్వయోగ్యతామ్ ॥ 3

అర్థః:— కమలావాసకారుణ్యైకాన్తినః=ఒకే యొక శ్రీనివాసదయనే శరణముగా గలిగినటువంటి, కృతినః = సమర్థులను (సుకృతులను) అనగా ఆళ్వారులను, భజే = సేవించుచున్నాను, త్రివేదీ = మూడు వేదములును, యత్సూక్తిరూపేణ = ఏ యాళ్వార్లయొక్క దివ్యసూక్తి రూపముచేత (దివ్యప్రబంధరూపముచే), సర్వయోగ్యతాం = అందఱు నధికరించుయోగ్యతను, ధత్తే = ధరించుచున్నదో.

అవతా॥ గురుపరంపరావందనానంతరము ఆ యాచార్యుల వలెనే వైష్ణవ సంప్రదాయములో అతిపూజ్యులైన ఆళ్వార్ల నీ శ్లోకములో నమస్కరించుచున్నారు.

తా॥ ఋగ్యజుస్సామరూపమైన వేదము సంస్కృతభాషలో నుండునపుడు కొంతమందికి మాత్రమే జాత్యాదినియమము ననుసరించి యధికారము నిచ్చుచున్నది. ఆ వేదములలోనుండు రహస్యార్థములనే ద్రావిడ దివ్యప్రబంధద్వారా ఆళ్వార్లు ప్రకటీకరించిరి. కనుక వేదమే ఈ ద్రావిడప్రబంధరూపముగా నవతరించినదని సంప్రదాయము. ఈ ద్రావిడప్రబంధము ఎట్టి జాత్యాదినియమమును లేక సర్వాధికారము గలది. ఈ మహోపకారము ఆళ్వార్లచే నేర్పడినది. మరియు నీ యాళ్వార్లు పరమపురుషుని దయనే శరణముగా నవలంబించినవారు. అనగా ప్రపత్తిమార్గము ననుష్ఠించినవారు ఈ ప్రపత్తిలో దయకునుండు ప్రాధాన్యమును ముందే యుపపాదించితిమి. అట్టి ప్రపత్తిని తా మనుష్ఠించుటయేగాక ప్రాపంచిక ప్రజలకు గూడ నీయర్థమును ప్రబంధముతో వెల్లడించిరి.

ఈ విధమున దయాదేవియొక్క ప్రాధాన్యమును ఉపదేశానుష్ఠానములచే ప్రపంచమునకు తెలియజేసి యుపకరించిరి గాన నీ దయాస్తోత్రములో వారిని నమస్కరించుట యెంతయు సమంజసముగానున్నది.

శ్లో॥ పరాశరముఖాన్ వన్దే భగీరథనయే స్థితాన్ ।
కమలాకాన్తకారుణ్యగఙ్గాప్లావితమద్విధాన్ ॥ 4

అర్థ :— కమలాకాన్తకారుణ్యగఙ్గాప్లావితమద్విధాన్ = రమారమణుడైన శ్రీనివాసునియొక్క దయ యనెడు గంగచే తడుపబడిన నాబోటివారిని గలిగినట్టియు, (అత ఏవ = కనుకనే), భగీరథ నయే = భగీరథ న్యాయమునందు, స్థితాన్ = ఉన్నట్టి, పరాశరముఖాన్ = పరాశరుడు మొదలగు మహర్షులను, వన్దే = నమస్కరించుచున్నాను.

అవతా॥ బహువిధములుగా అంతరంగులైన ఆళ్వారులను నమస్కరించి వేదోపబృంహణ రూపమైన విష్ణుపురాణ, భారత, భాగవత, రామాయణాది ఇతిహాస పురాణనిర్మాతలగు పరాశర, పారాశర్య, శుక, వాల్మీకి మొదలగు మహర్షిప్రవరులను (యోగులను) నమస్కరించుచున్నారు,

తా॥ భగీరథుడు తన ప్రయత్నముచే స్వర్గస్థమైన గంగను భూలోకమునకు రాజేసి తత్ప్రవాహముచే కపిలకోపాగ్నిదగ్ధులైన సగరపుత్రులను తడిపి వారికి సద్గతిని గలుగజేసెను. అట్లే పరశరాది పరమర్షులును గొప్ప యోగమహిమచే విష్ణుపురాణ, రామాయణాది గ్రంథముల నారచించి తద్ద్వారా భగవదాజ్ఞాతిలంఘనము (భగవద్భాగ

వతాపచారాదులు) అనే క్రూరాగ్నిచే దగ్ధులై భగవదనుగ్రహమునకు దూరస్థులైన నాబోటివారిని లక్ష్మీకాంతుడైన పరమపురుషునియొక్క దయ యనెడు దివ్యగంగా ప్రవాహముచే తడిపి (భగవద్దయకు పాత్రులను జేసి) సద్గతి కర్హులను జేసిరి.

రామాయణాది దివ్యగ్రంథ పఠనముచే వేలకొలది జనులు భగవద్దయకు పాత్రులై తమ తమ అభీష్టములను నెరవేర్చుకొనుచున్నారనుట సర్వ ప్రత్యక్ష విదితమే. కావున అట్టి దయాదేవీకటాక్ష ప్రసారమును ప్రపంచమునకు కలుగ జేసిన పురాణరత్ననిర్మాతలైన మహర్షులయొక్క నమస్కారము ఈ దయాస్తోత్ర ములో నెంతయు సమంజసమే.

శ్లో॥ అశేషవిఘ్నశమనమనీకేశ్వరమాశ్రయే ।
శ్రీమతః కరుణామ్భోధౌ శిక్షాస్రోత ఇవోత్థితమ్ ॥ 5

అర్థ :— శ్రీమతః = శ్రియఃపతియైన శ్రీనివాసునియొక్క, కరుణామ్భోధౌ = దయ యనెడి గొప్ప జలాశయమునందు, ఉత్థితం = ఉదయించినట్టి, శిక్షాస్రోత ఇవ(స్థితం) = శిక్షాప్రవాహమువలెనున్నట్టియు, అశేష విఘ్నశమనం=సమస్త విఘ్న ములను నాశనము జేయగలిగినట్టి, అనీకేశ్వరం = భగవత్సేనాపతియగు విష్వక్సే నుని, ఆశ్రయే = ఆశ్రయించుచున్నాను.

అవతా॥ గ్రంథము ద్వారా ఉపకరించిన ఆళ్వారులను, మహర్షులను నమ స్కరించి తదనంతరము ఉపదేశకపరంపరలో ఆళ్వారులకుగూడా ఆచార్యులై నట్టియు, దివ్యదంపతులకు, అనంతరము ఆచార్యపీఠము నలంకరించుచున్న భగ వత్సేనాపతియగు విష్వక్సేనుని నమస్కరించుచున్నారు.

తా॥ పెద్ద చెఱువునందు పరిపూర్ణముగ నిండియున్న నీరు ఒక కాలువద్వారా ప్రవహించి క్షేత్రములయందలి సస్యములను సంరక్షించును. అట్లే శ్రీనివాసుని యొక్క అపారకృప యనెడి పెద్ద జలాశయమునందు పుట్టిన ఒక శిక్షాస్రోతస్సే (కల్పితమైన కాలువయే) విష్వక్సేనుడు. ఆ కాల్వరూపముగా ప్రవహించిన దయ యను జలము శరణాగతు లను సస్యములను సంరక్షించుచున్నది. అనగా విష్వ క్సేనునియొద్ద సకలోపదేశములను బొందిన నమ్మాళ్వార్లు ప్రపత్తి శాస్త్రమును ప్రకాశ పరచి శరణాగతులను వృద్ధిపరచిరని భావము. ఇట్టి శరణాగతులపై భగవద్దయ ప్రవహించుటకు ప్రథమకారణుడు విష్వక్సేనుడగుటవలన అతనిని శిక్షాశ్రోతస్సని నిరూపణము చేయుటయైనది. ఆ విష్వక్సేనుడు అశేష విఘ్నశమనుడు. అనగా

వారు వారు కోరినఫలములకు సంభావితమైన సమస్త విఘ్నములను నాశనముజేసి ఆ ఫలప్రాప్తిని గలుగజేయువాడు. మరియు భగవత్సేనాపతి. సకలలోకనిర్వహణ భారమును విష్వక్సేనునియందే భగవంతుడు ఉంచియున్నాడని సంప్రదాయము. అట్టి విష్వక్సేనుడు భగవద్దంపతులకు తరువాత ఆచార్యుడుగా నున్నవాడై స్ఖలన మేర్పడినపుడు స్ఖలితులను శిక్షించి సరియగు త్రోవయందు నడిపించుచున్నాడు. ఇదియే సదాచార్యలక్షణము. ఈ శిక్ష మిక్కిలి దయాకార్యము. ఈ యభిప్రాయము చేతనూ నితనిని శిక్షాస్రోతస్సుగా ఆచార్యులు నిరూపించిరి. అట్టి విష్వక్సేనుని దయాస్తోత్రమనే ఈ శ్రేయస్కరమైన గొప్ప కార్యమునందు సంభావితమైన సర్వ విఘ్నశమనార్థము ఆశ్రయించుటయైనది. శ్రీనివాసునియొక్క దయ యనెడు మడుగు నుండియే బయలుదేరినది గనుక విష్వక్సేనుడను శిక్షా స్రోతస్సుగూడ దయారూపమే గావున ఇతని వందనము దయావందనమునందే పర్యవసించుచున్నది.

శ్లో॥ సమస్తజననీం వన్దే చైతన్యస్తన్యదాయినీమ్ ।
శ్రేయసీం శ్రీనివాసస్య కరుణామివ రూపిణీమ్ ॥ 6

అర్థ — చైతన్యస్తన్యదాయినీం=జ్ఞానమనెడు స్తన్యము నిచ్చుచున్నట్టియు, శ్రీనివాసస్య = శ్రీనివాసునికి, శ్రేయసీం = శ్రేయస్కారిణి యైనట్టియు, రూపిణీం = మూర్తీభవించిన, శ్రీనివాసస్య కరుణామివ స్థితాం = శ్రీనివాసునియొక్క దయవలె నున్నట్టి, సమస్తజననీం = జగన్మాతయగు మహాలక్ష్మిని, వన్దే = నమస్కరించు చున్నాను.

అవతా॥ విష్వక్సేనుని నమస్కరించిన పిమ్మట ఆ విష్వక్సేనునకుగూడ ఆచార్యురాలును, జగన్మాతయునగు శ్రీ మహాలక్ష్మిని నమస్కరించుచున్నారు.

తా॥ ఒకతల్లి తనబిడ్డకు పరమహితమగు స్తన్యము నిచ్చి యేప్రకారముగా ఆ బిడ్డను పుష్టియుక్తముగా చేయునో అట్లే సమస్త ప్రజలకును తల్లియైన శ్రీమహాలక్ష్మియు చైతన్య (అర్థపంచకము మొదలగు సారతమ విషయకజ్ఞానము) మనెడు స్తన్యమునొసంగి ఆత్మలకు నిత్యమైనటువంటి పుష్టిని గలుగజేయుచున్నది. అనగా జీవాత్మలు మహాలక్ష్మిదయచేత అర్థపంచకజ్ఞానము కలిగి మోక్షోపాయము ననుష్ఠించి మోక్షమును పొందుచున్నవని తాత్పర్యము. ఇదే ఆత్మకు గల్గుచున్న నిత్యమగు పుష్టి. మరియు ఈ మహాలక్ష్మి అందఱికిని శ్రేయస్కారిణియేగాక సాక్షాత్పరమ పురుషునకుగూడ శ్రేయస్కారిణియట. శ్రీనివాసుడు తనపేరులోగూడ ఆమె

యొక్క వియోగమును సహించక ఆమెను చేర్చుకొనియున్నాడు. సర్వకాలములయందును ఆమె సాన్నిధ్యము వలననే సర్వులును నిశ్చయముగ శ్రీనివాసుని ఆశ్రయించి క్షేమమును పొందుచున్నారు. నిగ్రహమను నదెట్టిదో దెలియదు గనుక తల్లి "అజ్ఞాత నిగ్రహా" యని ప్రసిద్ధిజెందినది. మరియు శ్రీనివాసునియొక్క సర్వదయయును ఈ మహాలక్ష్మీ రూపముతో (తల్లి రూపముతో) ఆవిర్భవించియున్నదట. తల్లికున్న దయకంటె నెక్కువదయను వేరొకచోట చూడజాలము గదా? అట్టి జగన్మాతను నమస్కరించుచున్నారు.

పరమపురుషుడైన నారాయణునియొద్దనుండి సర్వవేదాంతార్థములను స్వయం శిష్యురాలుగానుండి గ్రహించి తాను విష్వక్సేనున కుపదేశించి ఆపరంపరాద్వారా వైష్ణవసాంప్రదాయకులకందరికిని పరమపురుషుని తర్వాత ఆచార్యపదవి నలంకరించి శ్రీమహాలక్ష్మి లోకమునకు పరమోపకారము చేయుట పరమదయచేతనే గల్గుచున్నది గావున ఆమెను దయారూపముగానే భావించి యీ స్తోత్రమునందు నమస్కరించుట యుక్తము.

శ్లో॥ వందే వృషగిరీశస్య మహిషీం విశ్వధారిణీమ్ ।
తత్కృపాప్రతిఘాతానాం క్షమయా వారణం యయా ॥

అర్థ :— యయా = ఏ క్షమాదేవిచే (భూమిదేవిచే), తత్కృపాప్రతిఘాతానాం=ఆ శ్రీనివాసునియొక్క దయావిఘ్నములకు, వారణం=నివారణము, భవతి= కల్గుచున్నదో, వృషగిరీశస్య = శ్రీనివాసునియొక్క, మహిషీం = దేవియగు, (తాం = ఆ) విశ్వధారిణీం = భూదేవిని, వన్దే = నమస్కరించుచున్నాను.

అవతా॥ గడచిన శ్లోకమునందు మహాలక్ష్మిని నమస్కరించినారు. ఈ శ్లోకమునందు ఆ లక్ష్మీదేవికి చేదోడు వాదోడుగనుండి చేతనోజ్జీవన విషయములో నుపకరించుచున్నట్టియు, శ్రీనివాసునికి లక్ష్మీదేవివలె పత్నిగాను నున్న భూదేవిని నమస్కరించుచున్నారు. కుడిప్రక్కనున్న శ్రీదేవివలె యెడమప్రక్కనున్న భూదేవి, పై శ్లోకములో నమస్కరింపబోవుచున్న నీళాదేవికంటె సన్నిహితవతి గనుక నామెకంటె ముందే భూదేవిని నమస్కరించుచున్నారు.

తా॥ "క్షమ" యను పదము ఓర్పుగుణమును, భూదేవినిని జెప్పుచున్నది. సర్వచరాచరములను ధరించుచున్న భూమికధిదేవతయైన భూదేవి క్షమాగుణముగానే భావింపబడుచున్నది. భగవానుని దయ, స్వభావముగానే సమస్త చేతనులయం

మును ప్రవహించుటకు సిద్ధముగానున్నది. అట్టి ప్రవాహమును చేతనులుజేయు నపరాధములడ్డగించుచున్నవి. ఇదియే దయాప్రవాహమునకు విఘ్నము. ఇట్టి విఘ్నమును ఈ క్షమయే పోగొట్టుచున్నది. అపరాధములను సహించుకొన్న యెడల వానికేప్పుడు ఘప్పలము లేదని భావము. దయాదేవియొక్క ఒకభాగమే క్షమయని చెప్పవచ్చును. కావున నీ స్తోత్రమునందు క్షమావందనము తప్పక చేయతగినదే.

క్రింద జెప్పబడిన శ్రీ దేవియు, పై జెప్పబడనున్న నీళాదేవియు, ఇచట జెప్పబడిన భూదేవియు, చేతనోజ్జీవనవిషయమునందు పరమదయతోచేసెడి యుపకారములెట్లనగా; నీళాదేవి చేతనుల దోషములను భగవంతుని నేత్రములకు కనుపడకుండునట్లు చేయుచున్నది. వానికి తప్పి యొకవేళ కొన్నిదోషములు కనుబడునపుడు క్షమాదేవి యా దోషముల నోర్చుకొనులాగు చేయుచున్నది. దోషముల నోర్చుకొన్నప్పటికిని చేతనులయందు ఔదాసీన్యభావము భగవంతునికి గలుగవచ్చును. ఆ సమయమున శ్రీదేవి (మహాలక్ష్మి) ఆ యౌదాసీన్య భావమును బోగొట్టి స్వజనాభిమానమును గలుగజేసి దయాప్రవాహము పాఱునట్లేర్పాటు గావించుచున్నది. కావున నీ దయాప్రవాహము పాఱుటకు పై ముగ్గురు పత్నులును కారణభూతులే. ఈ భావముచేతనే వీరినిచ్చట నమస్కరించుటయైనది.

శ్లో॥ నిశామయతు మాం నీళా యద్భోగపటలై ర్ధ్రువమ్ ।
భావితం శ్రీనివాసస్య భక్తదోషేష్వదర్శనమ్ ॥ 8

అర్థ:— యద్భోగపటలైః = ఏ నీళాదేవియొక్క భోగసమూహములచే, (భోగములనెడు నేత్రదోషములచే) శ్రీనివాసస్య = శ్రీనివాసునికి, భక్తదోషేషు = భక్తులయొక్క దోషములయందు, అదర్శనం = చూపులేకుండుట, ధ్రువం = నిశ్చయముగా, భావితం = కలుగజేయబడినదో, సా నీళా = ఆ నీళాదేవి, మాం = నన్ను, నిశామయతు — కటాక్షించుగాక!!!

అవతా॥ భూమిదేవిని నమస్కరించిన పిమ్మట ఆ భూమిదేవివలెనే భగవద్దివ్యమహిషిగాను, చేతనసంరక్షణబద్ధశ్రద్ధురాలుగను ఆ భూమిదేవికి ఎడమప్రక్కయుండు నీళాదేవియొక్క కటాక్షపాతమును ప్రార్థించుచున్నారు.

తా॥ భూదేవివలె నీళాదేవియు నిత్యసూరిచేతనరూపిణియగు భగవన్మహిషి. ఆ నీళాదేవి విశేషభోగములను తన నాయకుడగు శ్రీనివాసునికి కలుగజేయుచున్నది. అట్టి తరుణీభోగములచే పటలమనే యొకవిధమగు నేత్రరోగము శ్రీనివాసునికి సంభ

వించినదేమోననియు. దానివలన చేతనులు జేయు అపరాధములు కనబడవో యనియు. కవి యుత్ప్రేక్షించుచున్నారు. ఏలనన స్వతఃసర్వజ్ఞుడగు పరమపురుషునికి గూడ ఆశ్రితులు జేయు సహస్రాధికాపరాధములున్ను కనుపించుటలేదట. అనగా శ్రీదేవి భూదేవివలె యీమెయు చేతనులు చేయు నపరాధములను పరమపురుషుడు క్షమించు లాగు తన విభ్రమ విలాసాదిభోగములచే నీశ్వరుని వశీకరించి ప్రజలయందు పరమ దయను జూపించుచున్నదని భావము. అట్టి దయాపతియైన నీళాదేవీకటాక్షము తనకీ స్తోత్రరచనాసందర్భమున నత్యావశ్యకమని తలంచి. ఆ కటాక్షము నిచట ప్రార్థించిరి.

శ్లో॥ కమప్యనవధిం వందే కరుణావరుణాలయమ్ ।
వృషశైలతటస్థానాం స్వయంవ్యక్తిముపాగతమ్ ॥ 9

అర్థ :— అనవధిం = ఏ విధమైన పరిచ్ఛేదము (కొలత) లేనట్టియు, వృషశైలతటస్థానాం = వేంకటాద్రి యొక్క చరియ ప్రదేశములయందు నివసించువారికి, స్వయంవ్యక్తిం = స్వయంవ్యక్తిని, ఉపాగతం = పొందినట్టియు, కమపి = సర్వలోక విలక్షణముగానున్న యొక, కరుణావరుణాలయం = దయాసముద్రమును, వందే = నమస్కరించుచున్నాను.

అవతా॥ ఆచార్యపరంపరలో శ్రీ దేవివరకు నమస్కరించి ఆ ప్రసంగములో తత్తుల్యముగా జగన్మాతలగు భూదేవి, నీళాదేవులను నమస్కరించి గురుపరంపరలో ప్రథమాచార్యుడును, ప్రకృతస్తోత్ర విషయమగు దయకు ఆశ్రయభూతుడును నగు వేంకటాద్రీశుని నమస్కరించుచున్నారు,

తా॥ శ్రీనివాసుని యొక దయాసముద్రముగా రూపించుచున్నారు. అట్టి దయాసముద్రుడగు శ్రీనివాసునికి దేశకాలవస్తువులచే పరిచ్ఛేదము (కొలత) లేదు. అనగా యొక దేశమునందే, ఒక కాలమునందే. ఒక వస్తువునందే యున్నాడనుట లేదు. సర్వదేశములలోను. సర్వకాలములలోను సమస్త వస్తువులలోను నున్నాడని భావము. కావుననే ప్రసిద్ధ సముద్రమునకంటె నీ దయాసముద్రము విలక్షణమైనది. మరియు వృషగిరి తటప్రదేశమునందు నివసించువారికి యితర ప్రార్థనాపేక్షలేకుండనే స్వయముగనే ప్రత్యక్షమగుచున్నాడు. అనగా చేతనులయందు పరమదయచే వారికి స్వయముగనే దర్శనము నొసంగుచున్నాడని భావము. ఆగమశాస్త్రప్రసిద్ధమైన స్వయంవ్యక్తమనే ప్రధానక్షేత్రములయందీ వేంకటాచలము ప్రథమగణ్యమనియు

భావము. ఈ శ్రీనివాసమూర్తి సైద్ధార్షమానుషాదిప్రతిష్ఠా నిరపేక్షమై స్వయమావిర్భూతమని పరమతాత్పర్యము. ఇతనియందుండు దయయనే గుణమునే చేతన సమాధిలో. ఈ శతకమునందు స్తోత్రము చేయబోవుచున్నారు. అట్టి అపారదయకు ఆశ్రయుడైన ఈ దయాసముద్రమనే శ్రీనివాసుని ఇచ్చట నమస్కరించుట యత్యన్తావశ్యకము.

శ్లో॥ అకించననిధిం సూతిమపవర్గత్రివర్గయోః ।
అంజనాద్రీశ్వరదయామభిష్టౌమి నిరంజనామ్ ॥ 10

అర్థ :— అకించననిధిం = అకించనులకు నిధిగానున్నట్టియు, అపవర్గత్రివర్గయోః = మోక్షమునకున్ను ధర్మార్థకామములకున్ను, సూతిం = ఉత్పత్తికారణముగాను, నిరంజనాం = దోషములేకయు నున్న, అంజనాద్రీశ్వరదయాం = వేంకటాధీశునియొక్క దయను, అభిష్టౌమి = స్తోత్రము చేయుచున్నాను.

అవతా॥ ఆళ్వార్లను, ఋషులను, ఆచార్యపరంపరను నమస్కరించి ప్రకృత ప్రబంధమునకు ప్రధానప్రతిపాద్యయగు దయాదేవిని నమస్కరించి గ్రంథప్రతిజ్ఞను చేయుచున్నారు.

తా॥ శ్రేయస్సాధనమగు యేలాటియుపాయములేక కేవలమీశ్వరుని పాదారవిందములనే నమ్ముకొనియున్నవారు అకించనులగుదురు. అట్టి వారికి ఈ దయాదేవి నిధిగానున్నది. నిధివలె పరమభోగ్యమని భావము. మరియు నపవర్గమనే మోక్షముగాని, త్రివర్గమనబడు ధర్మార్థకామములుగాని (చతుర్విధ పురుషార్థములును) ఈ దయాదేవి యనుగ్రహముచేతనే పొందబడుచున్నవి. అట్టి దయాదేవి పక్షపాతాదులగు నేలాటి దోషములు లేకయున్నది. అంజనపర్వతమనే వేంకటపర్వతమునకు అధీశ్వరుడగు శ్రీనివాసునియొక్క అట్టిదయను ఈ శతకమునందు స్తోత్రము చేయుచున్నానని ప్రబంధార్థప్రతిజ్ఞ నిచ్చట ఆరచించియున్నారు.

అంజనపర్వతమున కధిపతి యగువానియొక్క పత్నికి కొంచముగూడ అంజనము లేదని శబ్దచిత్ర మిచ్చట రస్యము. (అంజనము = కాటుక)

ఇచ్చటనుండి సాక్షాద్దయయే ప్రస్తావించబడుచున్నది గనుక స్తోత్ర సాంగత్యము చెప్పనవసరము లేదు.

ఇచ్చట దయకు “ అకించననిధిం ” అనుటచే ఫలరూపత్వమును, “ సూతిమపవర్గ త్రివర్గయోః ” అనుటచే ఫలసాధనత్వమును, “ అంజనాద్రీశ్వరదయాం ”

అనుటచే స్వరూపమున్ను, "నిరంజనాం" అనుటచే అబాధ్యత్వమును తోచుటచే పూర్వోత్తరద్వికరూపమైన శారీరకచతురధ్యాయీ ప్రతిపాద్యార్థముల జగత్కారణు డగు పరమపురుషు నాశ్రయించిన యీ దయాదేవికిని సమంజసము లగుచున్నవని తాత్పర్యముండునని పెద్దల యభిప్రాయము.

(ప్రథమ దశకము సంపూర్ణము)

శ్రీమద్వేదాంతగురవే నమః

---

## ద్వితీయ దశకము

శ్లో॥ అనుచరశక్త్యాదిగుణామగ్రేసరబోధ విరచితాలోకామ్ ।
స్వాధీనవృషగిరీశాం స్వయంప్రభూతాం ప్రమాణయామి దయామ్ ॥

అర్థ:— అనుచరశక్త్యాదిగుణాం = తనను వెంబడించి వచ్చుచున్నటువంటి భగవత్కల్యాణ గుణములగు శక్తి మొదలగువానిని గలిగినట్టియు, అగ్రేసరబోధ విరచితాలోకాం = ముందుబోవుచున్న జ్ఞానమనే గుణముచే చేయబడిన ప్రకాశమును గల్గినట్టియు (ఆలోక శబ్దమనెడి యుపచారోక్తిని గల్గినట్టియు), స్వాధీన వృషగిరీశాం = తన యధీనము గావించుకొనబడిన వేంకటేశుని గల్గినట్టియు. స్వయంప్రభూతాం = (కనుకనే) తానే సర్వేశ్వరిగానున్నట్టి, దయాం = దయాదేవిని, ప్రమాణయామి = ప్రమాణీకరించుచున్నాను, (శరణముగా నిశ్చయించుచున్నాను).

అవతా॥ గ్రంథారంభమునకుముం దవశ్య మనుష్ఠించవగిన గురుదేవతా వందన గ్రంథప్రతిజ్ఞాది విషయములను గత దశకమునందనుష్ఠించి సాక్షాద్దయా స్తోత్రము నిచటనుండి ప్రారంభించుచున్నారు,

ఈ దశకమునందు అసంఖ్యేయములగు భగవద్గుణములలో దయాగుణమున కుండు ప్రాధాన్యమును ప్రతిపాదించుచు నీ దయయే జగత్సృష్టి సంహార పాలనా దులయందు ప్రధాన కారణ మగుచున్నదని నిరూపించుచున్నారు.

క్రింది శ్లోకమునందు "అంజనాద్రీశ్వరదయాం" అని సామాన్యముగా నుద్దేశింపబడిన దయ నీ శ్లోకమునందు "స్వాధీనపతికా" అని విశేషాకారములో రూపించుచున్నారు.

తా॥ అత్యున్నతమైన యైశ్వర్యస్థితిలోనుండు నొక స్వాధీన పతికయగు (తన భోగాదులచే నాయకుని తన యధీనము గావించుకొన్న నాయిక) రాజమహిషి

తానొక కార్యము నుద్దేశించి బయలుదేరునప్పుడు ఆమెయొక్క యైశ్వర్యస్థితికి తగి నట్లు ముందొక పరిచారిక కరదీపికను ధరించి " ఇత ఇతః ఆలోకయతు దేవి " అనెడి యుపచారోక్తి పూర్వకముగా త్రోవచూపించుచుండ, తన యాజ్ఞను శిరసా వహించి తత్క్షణమే నెరవేర్చు సామర్థ్యముగల్గిన మరికొందరు పరిచారికలు వెంబ డించిరాగా, తాను మధ్యలో అతిగంభీరముగా పోయి తన కభిప్రేతమైన కార్యము నా పరిచారికలద్వారా మెట్లు నెరవేర్చుకొనునో, అట్లే యీ శ్రీనివాసదయ యనే సార్వభౌమమహిషియు తన పనిని నెరవేర్చుచున్నదని యొక చిత్రమును కవి యిచట ప్రదర్శింపజేయుచున్నారు.

పలువిధములైన యపరాధములచే నిండిన యొకజీవుని ఈశ్వరుడు రక్షించు తరుణమునందు మొదట ఆ జీవునియొక్క దైన్యస్థితిని అనన్య గతికత్వమును దెలిసికొనుటయు, తదనన్తర మా రక్ష్యజీవునియందు దయోద్రేక మేర్పడుటయు, తదుపరి తన శక్త్యాదులచే యా జీవుని రక్షించడమున్ను జరుగుచున్నది. ఇచట ముందును వెనుకయు నున్న జ్ఞాన శక్త్యాదులకంటె మధ్యనుండు దయయే ప్రధాన మను విషయము వేరుగా చెప్ప నవసరములేదు. దయ ప్రవహింపవలసిన స్థలమునే నా జ్ఞానము చూపించుచున్నది. దయ కభిప్రేతమైన కార్యములనే శక్త్యాదులు నిర్వ హించుచున్నవి. కావుననే యీ దయను భగవత్కల్యాణ గుణములన్నింటిలోను ప్రధానముగా పట్టమహిషీ స్థానములో " స్వాధీనపతిక " రూపములో వర్ణించడ మైనది. ఇట్లితరగుణములు దయకు స్వాధీనములో, అట్లే భగవంతుడును దయా దేవికి స్వాధీనుడే. దయాపరవశుడయ్యే ప్రపంచములలోని సర్వకార్యములను సర్వేశ్వరుడు నిర్వహించుచున్నాడు. అందుచే యీ దయాదేవి యందరికిని ప్రభు వగుచున్నది. అట్టి దయాదేవిని నేను ప్రమాణీకరించుచున్నానని (శరణముగా నిశ్చ యించుచున్నానని) తాత్పర్యము.

ఈ శ్లోకమునందు " ప్రమాణయామి " అను పదము నవగాహించి చూచి నచో శాస్త్రీయమైన మరొక భావము గోచరించుచున్నది. ఈ స్తోత్రమునందు అచ టచట పలుశ్లోకముల కీలాటి విశేష తాత్పర్యములున్నవి. అవి కేవల శాస్త్రజ్ఞులకే రుచించును. కనుక నట్టి యర్థములను విశేషముగా వ్రాయ దలచలేదు. ప్రదర్శ నార్థమై యీ శ్లోకమునకు వ్రాయుచున్నాము.

ప్రత్యక్షానుమాన ప్రమాణములచే తెలిసికొనుటకు వీలుగాని యలౌకిక పదార్థ ములను (ఈశ్వరాదులను) వేదమను శబ్దప్రమాణము తెలియపరచుచున్నది. గనుక

యితర ప్రమాణములకంటె నా వేదప్రమాణమే గొప్పది. ఈ విషయమును, శబ్దప్రమాణమునకుండు మరికొన్ని యాకారములను యీ శ్లోకముచే తెలియపఱచు చున్నారు.

అనుచరశక్త్యాదిగుణాం :— శక్తి లక్షణా మొదలగు వృత్తులు శబ్దశ్రవణానన్తరము శ్రోతకేర్పబడుచున్నవి. కనుక శబ్దము శక్తి లక్షణాదివృత్తులను తన వెనుక కల్గియున్నది.

అగ్రేసరబోధవిరచితాలోకామ్ :— "అర్థం బుద్ధ్వా శబ్దరచనా" అనెడు రీతిలో శబ్దోచ్చారణకు ముందు అర్థబోధమావశ్యకము గనుక శబ్దము తనకుముందు అర్థజ్ఞానముచే గల్గు ప్రకాశమును గల్గియున్నది.

స్వాధీనవృషగిరీశాం :— ఇది వేదమనే శబ్ద ప్రమాణమునకు మాత్రము సంబంధించిన విషయము. ఒక వేదముచేతనే యీశ్వరు నెరుంగగలము. దీనినే "శాస్త్రయోనిత్వాత్" అని బ్రహ్మసూత్రమునందు శ్రీ వ్యాసుడు సిద్ధాంతీకరించెను. కావున శ్రుతి, పతిని తనకు స్వాధీనపరచుకొన్నదని భావము.

స్వయంప్రభూతాం :— కావుననే అన్ని ప్రమాణములకంటె వేదమనే శబ్ద ప్రమాణమే చాల ప్రధానము (ప్రమాణప్రభువు). అట్టి శ్రుతిని ప్రమాణీకరించు చున్నానని తాత్పర్యము.

శ్లో॥ అపి నిఖిలలోకసుచరితముష్టింధయదురితమూర్ఛనాజుష్టమ్ ।
సంజీవయతు దయే మామంజనగిరినాథరంజనీ భవతీ ॥ 12

అర్థ :— హేదయే = ఓ దయాదేవి ! అంజనగిరినాథరంజనీ = అంజన పర్వతమున కధిపతియైన శ్రీనివాసుని (తన గుణచేష్టితాదులచే) రంజింపజేయు, భవతీ = నీవు, నిఖిలలోకసుచరితముష్టింధయదురితమూర్ఛనాజుష్టమపి = సమస్తజనులయొక్క పుణ్యములను ఒకే యొక ముష్టిచే పానముచేసెడి సామర్థ్యముగల పాపములచే సంభవించు మూర్ఛావస్థను పొందినవాడనై నప్పటికిని, మాం = నన్ను, సంజీవయతు = ఉజ్జీవింపజేయుదువు గాక !

అవతా॥ క్రింద శ్లోకమునందు సర్వోత్కృష్టయగు దయాదేవిని శరణము బొందిరి. ఈ శ్లోకమునందు అట్టి దయాదేవియొద్ద తన యభీష్టమును ప్రార్థించుచు తన పాపములయొక్క ప్రాబల్యమును, అట్లే దయాదేవి యొద్దనున్న పాప విధ్వంసన శక్తినికూడ తెలియపరచుచున్నారు.

తా॥ అంజనపర్వత మనబడు వేంకటగిరి కధిపతియైన శ్రీనివాసుని, తన గుణ చేష్టితాదులచే సంతోషింపజేయు నో దయాదేవీ! నీవు, సర్వప్రపంచములోనుండు పెద్దలచే చిరకాలమునుండి చేయబడినట్టియు, చేయబడుచున్నట్టియు, చేయబడ నున్నట్టియు సమస్త పుణ్యముల నొక్కపిడికిటచే నణచి, ఆ పుణ్యములయొక్క వీర్యములను కొంచెమును తలనెత్తనీయక అడ్డగించి తన వీర్యమునే విశేషముగా ప్రసరింపజేసి సర్వప్రాణులను హింసించునట్టి బలముగలిగినట్టియు, ఎంతోగొప్ప వయినట్టియు, ఎన్నియో పర్యాయములు నాచే చేయబడియు నున్న పాపములచే మూర్ఛితుడనైన నన్ను ఉజ్జీవింపజేయుమని ప్రార్థించుచున్నారు.

ఇచ్చట "మూర్ఛనాజుష్టం" "సంజీవయతు" మొదలగు పదములచే, మూర్ఛనుపోగొట్టు సంజీవని యను నోషధివలె నీ దయాదేవి యున్నదని సూచిత మైనది. ఆ యోషధి గిరినాథునియందు (పర్వతశ్రేష్ఠమునందు) ప్రకాశించుచుండును. మూర్ఛయనెడు వ్యాధిచే పీడింపబడి శవతుల్యుడై కృత్యాకృత్య పరిజ్ఞానము కొద్దియు లేనివానిని యుజ్జీవింపజేసి సర్వకార్యములలోను వానికి యుత్తమజ్ఞానమును ఆ యోషధియెట్లు ప్రసాదించునో, అట్లే యీ దయాదేవియు, తీవ్రతమములగు పాప ములచే పీడితుడై, అవశ్యజ్ఞాతవ్యములయిన తత్త్వహితపురుషార్థములయొక్క జ్ఞానము పూర్తిముగాలేక, తాను జీవించియు మృతునితో సమానుడుగాను, విషయ భోగ మాత్రలోలుడుగానుండి మరల మరల పాపములనే చేయుచున్నవానినిగూడ ఉజ్జీవింపజేయుచున్నదని భావము.

ఇట్టి పాపములను తొలగించుటకు ప్రాయశ్చిత్తములుండినను, ఆ ప్రాయ శ్చిత్తములను నిర్దుష్టములగా ననుష్ఠించుటకు మనజీవితకాలము చాలదు. అట్టిశక్తి సామర్థ్యములును మనకులేవు. కావున ఆ పాపములను ఈ దయాదేవి మూలము గానే పోగొట్టుకొనవలయును. అనగా దయాపరవశుడైన పరమపురుషుడు "క్షమిం చితిని, ఇక నా పాపములకు ఫలముల నియ్యను" అని సంకల్పించులాగు చేయుట యేయని భావము. ఇట్టి పాపములచే నేర్పడిన మూర్ఛనుబోగొట్టి తత్త్వ హిత పురుషార్థములయందు మంచి పరిజ్ఞానమును గలుగజేసి సంరక్షింపదగిన సామర్థ్యము దయాదేవికే గలదని నిశ్చయించి, ఆమె నిచ్చట నీ రీతిగ ప్రార్థించుటయైనది.

ఇచ్చట పాపమునకిచ్చియున్న విశేషణమును పర్యాలోచించినచో ఆ పాప స్వభావము చక్కగా బోధపడును. "ఏకః పాపాని కురుతే ఫలం భుంక్తే మహా జనః" అని పురాణము. అట్లనగా - ఒకడు దుస్సహమైన పాపముల నాచరించినచో

సనేకులు పాపఫలము ననుభవింతురు. ఒకడు ఘోరపాపమును జేసినచో నా పాప ఫలమును, వాడును, వానితో కూడినవారును, వానియూరిలో, వానిదేశములో నుండువారందరుగూడా అనుభవింతురు. ఇట్టి పాపము ఎదుట క్రిందిచెప్పిన సమస్త పుణ్యములుగూడ నేమియు చేయజాలవని భావము.

లోకక్షేమమునకై యవతరించిన యీ పరమాచార్యులు తన పాపము లిలాగున్నవని చెప్పుట మనబోటివారిని చక్కజేసి సన్మార్గములో ప్రవేశపెట్టుటకే (మన పాపములను దలంచి హృదయము ద్రవించగా పరమపురుషుని శరణముబొంది వాని దయకు మనము పాత్రులమగుటకే) అని తలంచవలయును.

ఈ శ్లోకములో పూర్వార్ధమునందు " మూర్ఛనాదుష్టమ్ " అనియు, ఉత్తరార్ధములో " సంజీవయతి " అనియు పాఠాన్తరములుగలవు. ఈ పాఠములలోగూడ విశేషముగా అర్థభేదములేదు.

శ్లో॥ భగవతి దయే భవత్యా (త్యాం) వృషగిరినాథే సమాప్లుతే తుంగే।
అప్రతిఘమజ్జనానాం హస్తాలంబో మదాగసాం మృగ్యః॥ 13

అర్థ :— భగవతి దయే = పూజ్యురాలగు ఓ దయాదేవీ ! తుంగే = అందరికంటె నున్నతుండైన, వృషగిరినాథే = వేంకటగిరినాథుడగు శ్రీనివాసుడు, భవత్యాం = నీ ప్రవాహమునందు, సమాప్లుతే = పూర్తిగా మునిగిపోవుచుండగా, అప్రతిఘమజ్జనానాం = అడ్డములేక మునిగిపోవు చున్నటువంటి, మదాగసాం = నాయొక్క పాపములకు, హస్తాలంబః = కరావలంబము, మృగ్యః = దుర్లభము.

అవతా॥ క్రింది శ్లోకమునందు అతి ఘోరములగు తన పాపములను తలంచి మిక్కిలి కంపితులయిరి. ఈ శ్లోకమునందు ఆ పాపములంతక్రూరములైనను శ్రీనివాసుని యాశ్రయించి యుండుటచేత, అయ్యవి దయాప్రవాహమునందు శ్రీనివాసునితోపాటు మునిగిపోవునప్పుడు వానికి హస్తావలంబము నిచ్చువారు లేనందున వాని సామర్థ్యము కించిత్తుగూడ ఫలించదని ఆచార్యులు తను నొకవిధముగా సమాశ్వాస పరచుకొనుచున్నారు.

తా॥ ఒకడొక పెద్ద ప్రవాహమునుండి తనను సంరక్షించుకొన గోరినచో నొక నున్నతమైన ప్రదేశమునెక్కును. ఆ ప్రవాహమతని కాశ్రయమైయున్న ప్రదేశము నేమియు చేయజాలక పోయినచో నతడు సంరక్షించబడునని వేరుగాచెప్ప నవసరములేదు. అట్లుగాక నా ప్రవాహము మితిమీరి ప్రవహించి యతని కాశ్రయ

మైయున్న ఆ యున్నతమగు ప్రదేశమునుగూడ పొరలించి కొట్టుకొనిపోవునట్లు చేసినచో, నిక నతని గతినిగూర్చి యేమిచెప్పవలయును ? అలాగే దయాప్రవాహము మితిమీరి పొరలునప్పుడు లోకములోని యన్నివస్తువులకంటె నున్నతుడైన శ్రీని వాసుడే ఆ ప్రవాహమునందు మునిగిపోవుచుండగా, అతని నాశ్రయించియున్న మన పాపముగూడ మునిగిపోవు ననుటలో సందియ మిసుమంతయు లేదుగదా ! ఆ పాప ములకు హస్తావలంబము లేనందున తామియ్యవలచిన దుష్ఫలముల నియ్యజాలకయె నశించిపోవునని కవిహృదయము.

మనముచేయు పాపములు శ్రీనివాసుని యాశ్రయించియుండు టెట్లనగా :— ఇతర మతములలో వలెగాక మన మతమునందు పుణ్యపాపములయొక్క స్వరూప మును శాస్త్రములద్వారా మనపెద్దలు ఎక్కువగ చక్కగ నిరూపించియున్నారు. ఈశ్వరునియొక్క ప్రీతి కోపములే పుణ్య పాపము లనబడుచున్నవి. శాస్త్రనిషిద్ధ ములైన పనులను మనముచేయునప్పుడు మనపై భగవానునకు కోపము గల్గుచున్నది. వెంటనే భగవంతుడు "ఈ నిషిద్ధకార్యము నాచరించిన వీనిని, దీనికి దగిన పరి హారము గావించుకొననియెడల తప్పక దండించగలను" అని సంకల్పించుకొనును. భగవంతునియొక్క యీ కోపమే ఆ నిషిద్ధకార్యము నాచరించినవానియొక్క పాప మనబడును. ఇట్టి కోపమును గలుగజేయు నిషిద్ధకార్యములనుగూడ పాపములని వ్యవహరించుచున్నాము. ఇట్లే సత్కార్యాచరణచే భగవంతునికి గల్గుచున్న ప్రీతియే పుణ్యమని చెప్పబడుచున్నది. పై జెప్పబడిన పాపములకు శాస్త్రోక్తములైన పరిహార ములలో, భగవంతుని చరణముల నాశ్రయించి "తెలియక తప్పుచేసితిని. పరమ కారుణికుడగు నీవు నన్ను క్షమించవలయును" అని చెప్పి వానిని శరణాగతి పొందుటయే యుత్తమ పరిహారము. అట్లు మనము చేయునప్పుడు భగవంతుని యొక్క దయయనెడు గుణము తలయెత్తి మహాప్రవాహముగా పొంగి భగవంతునే మునిగించుచున్నది. అట్లనగా తనకధీనుని గావించుకొనునని భావము. అప్పుడు మనము ముందుచేసిన నిషిద్ధాచరణలచే భగవంతుని హృదయములో గల్గిన కోప మనెడు పాపములు తాము ముందు మనకియ్యదలచిన దుష్ఫలములనిచ్చుటకు శక్తి లేనివై (దయచే కోపము అణగిపోయినయెడల) నశించిపోవుచున్నవి. ఈ వేదాంత రహస్యార్థమునే ఆచార్యులిచ్చట ఈ ప్రకారముగా చిత్రించిరి.

లోకమునందుగూడ భృత్యుడు తప్పుచేసినచో యజమానుడు కోపముచే వానిని దండింపదలచును. కాని యేకారణముచే నైనను మరల వానియందు దయ

గల్గినచో ముందు తాను దలంచిన దండమునియ్యక పోవుటయేగాక పైగా వానికి కొన్ని సౌకర్యములనుగూడ గల్పించుట అనుభవసిద్ధమేగదా! ఇదియంతయు నా యజమానుని దయాధీనమే. భగవంతునియందు గూడ ఈ న్యాయమే.

శ్లో॥ కృపణజనకల్పలతికాం కృతాపరాధస్య నిష్క్రియామాద్యామ్ ।
వృషగిరినాథదయే! త్వాం విదన్తి సంసారతారిణీం విబుధాః ॥ 14

అర్థ:— హే వృషగిరినాథదయే = ఓ వృషపర్వతమను వేంకటగిరి కధిపతి యగు శ్రీనివాసునియొక్క దయాదేవీ! విబుధాః = శాస్త్రమెఱింగిన పెద్దలు, కృపణజన కల్పలతికాం = దీనజనులపాలిటి కల్పలతగాను, కృతాపరాధస్య = చేయబడినట్టి యపరాధమునకు. ఆద్యాంనిష్క్రియాం = ముఖ్యమైన ప్రాయశ్చిత్తముగానున్న, త్వాం = నిన్ను, సంసారతారిణీం = సంసారసాగరమును దాటింపజేయుదానినిగా, విదన్తి = నిశ్చయించుచున్నారు.

అవతా॥ క్రింది శ్లోకమునందు శ్రీనివాసునియొక్క దయాప్రవాహముతో హస్తావలంబ మిచ్చువారులేక మన పాపములు మునిగిపోవుచున్నవనియు, అందుచే ఆ పాపములు తమ ప్రాబల్యమును చూపించుటకు శక్తిలేక పోవుచున్నవనియు ప్రతిపాదించిరి. ఈ శ్లోకములో, ఆ దయాప్రవాహమునందు పాపములు మునుగుట యనగానేమి? అట్లు మునుగుటచే గలుగు ప్రధానఫలమేమి? ఈలాటి ప్రశ్నలకు శాస్త్రరీతిగా సమాధానముల నొసగుచున్నారు.

తా॥ పాపములు దయాప్రవాహములో మునిగిపోయి తమ శక్తులను పోగొట్టుకొనుటెట్లన, ఒక ప్రాయశ్చిత్త కర్మను చేసినచో నదెట్లు మనము ముందుచేసిన పాపముయొక్క కీడుచేయు శక్తిని నాశము చేయుచున్నదో, అట్లే యీ భగవద్దయయు మనబోటి దీనజనులు చేసెడి యపరాధములయొక్క కీడుచేయు శక్తిని నాశన మొనరించుచున్నది. తెలిసియో, తెలియకయో మనచే చేయబడుచున్న పలువిధములగు నపరాధములయొక్క శక్తిని అణచిపెట్టుటకు ప్రాయశ్చిత్తములనే పలుకర్మములు శాస్త్రములో విధింపబడియున్నవి. అట్టి ప్రాయశ్చిత్తములకు నిష్క్రియలని పేరు (చేసిన పాపములయొక్క శక్తిని పోగొట్టుక్రియలు) ఇట్టి నిష్క్రియల నాచరించినచో ముందు మనమొనర్చిన యపరాధములచే నేర్పడిన భగవానునియొక్క కోప మణిగిపోవుచున్నది. ఇట్టి ప్రాయశ్చిత్తములు చేయుటకు జ్ఞానము, శక్తి, ద్రవ్యము మొదలగు సామగ్రి కావలయును. ఇవి లేనివాడు అపరాధము చేసినచో, ప్రాయశ్చిత్తము చేయుటకు వీలుకానందున వానికిన్ని సదుపాయముల గలుగజేయదలంచిన

శాస్త్రములు, భగవత్సన్నిధిలో ' నేనపరాధములుచేసియైనాడను. వానికి శాస్త్రోక్త ములగు ప్రాయశ్చిత్తముల ననుష్ఠించుటకు శక్త్యాదులు నాకు లేవు. అందుచే నా యపరాధములను క్షమించి ఆ ప్రాయశ్చిత్తము చేసినచో నెట్లు నీ కోపమును, నిగ్రహ సంకల్పమును అణగిపోవునో, అట్లే నీ దయచే నన్నుగూడ ప్రాయశ్చిత్తము ననుష్ఠించినవానివలె భావించి నాయందున్న కోపమును, నిగ్రహ సంకల్పమును అణిగించుకొనవలయును ' అనురీతిగా శరణాగతి చేసినయెడల భగవంతునికున్న కోపమణిగి, దయ యుద్రేకించి ఈ కృపణుడను జ్ఞానశక్తి హీనుని విషయములోగూడ కల్పలతవలె కోరినఫలముల నిచ్చుచున్నది అని ప్రతిపాదించుచున్నవి.

కావుననే కృపణుని విషయములో ప్రాయశ్చిత్తము చేయుపనిని ఈ దయాదేవియే చేయుచున్నది గనుక దీనినిగూడ నొక నిష్క్రియ (ప్రాయశ్చిత్తము) గా చెప్పుట కడ్డులేదు. క్రియారూపములైన ప్రాయశ్చిత్తములకంటె భగవంతునియొక్క జ్ఞానరూపమైన యీ దయకు నిష్క్రియాత్వము చాలయు సమంజసమనే యభిప్రాయముగల్గియే " ఆద్యాం, నిష్క్రియాం " (ముఖ్యమైన నిష్క్రియగా) అని వ్యవహరించిరి.

ప్రాయశ్చిత్తము చేయువాడుగూడ భగవద్దయ నెదురు చూడవలసినవాఁడే. కృపణునికన్నచో, సాధనము, సాధ్యము రెండును దయయే యగుచున్నది యను రసవత్తరమైన శాస్త్రార్థమిచట వెల్లడింపబడుచున్నది.

ఇట్లు ఆ ఘోర పాపములను ధ్వంసముచేసెడి సామర్థ్యముగల్గిన ఈ దయాదేవినిగురించి, బహుదుఃఖమయమైన యీ సంసారమునకు కారణములైన సర్వ పాపములకును ప్రాయశ్చిత్తములుగా విధింపబడిన కర్మయోగ, జ్ఞానయోగ, భక్తియోగాదుల నాచరించుటకు జ్ఞానశక్త్యాదులు లేనివాడు ముందుజెప్పినట్లు శరణాగతి ననుష్ఠించినచో ఈ దయాదేవి ఆ భక్తియోగము మొదలగు ప్రాయశ్చిత్తములు చేయుపనినిజేసి సంసార కారణములైన కర్మములను తొలగించి, సంసారసాగరమును దాటించి, మోక్షమనెడి యుత్తమపురుషార్థము నొసంగుచున్నది యని శ్రీ భగవద్రామానుజులు మొదలగు నుత్తమవిద్వాంసులు నిర్ణయించుచున్నారని పిండితతాత్పర్యము.

శ్లో॥ వృషగిరిగృహమేధిగుణాః బోధబలైశ్వర్యవీర్యశక్తిముఖాః ।
దోషా భవేయురేతే యది నామ దయే ! త్వయా వినాభూతాః ॥ 15

అర్థ :— హే దయే = ఓ దయాదేవి ! బోధబలైశ్వర్యవీర్యశక్తిముఖాః = జ్ఞానము, బలము, ఐశ్వర్యము, వీర్యము, శక్తి మొదలగు, ఏతే = ఈ, వృషగిరి గృహమేధిగుణాః = వేంకటపర్వతమునందు గృహస్థుడగు శ్రీనివాసునియొక్క గుణములు, త్వయా = నీ చేత, వినాభూతాః = విడిచిపెట్టబడినవిగా (నీ సంబంధము లేనివిగా), యదినాస్యుః = ఐనచో, దోషాః = దోషములుగా, భవేయుః = కాగలవు (పరిణమించగలవు).

అవతా॥ భగవంతునియందు జ్ఞానము మొదలగు ననేకగుణములుండగా దయాగుణమునే స్తోత్రముచేయుటకు కారణమేమి ? అను ప్రశ్నకు సరియైన సమాధాన మీ శ్లోకమునందొసంగ బడుచున్నది. మరియు క్రింది శ్లోకమునందు దయాదేవి జీవులుచేయు నపరాధములకు ప్రాయశ్చిత్తముగానుండి వారికిచేయు మహోపకారము వర్ణించబడినది. ఈ శ్లోకమునందు సాక్షాద్భగవంతునకే దయాదేవిచేత నొనరింపబడుచున్న యుపకారము వర్ణింపబడుచున్నది.

తా॥ "భగవాన్" అనుపదమునకు "జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్యతేజాంస్యశేషతః। భగవచ్ఛబ్దవాచ్యాని వినా హేయైర్గుణాదిభిః॥" అను ప్రమాణము ననుసరించి, ఈ జ్ఞానము మొదలగు గుణములను గలిగినవాడు అని యర్థము. మనకు మంచిని గలుగజేయువాటిని గుణములనియు, చెడుగలుగ జేయువాటిని దోషములవియు తలంచుచున్నాము. క్రింద చెప్పబడిన జ్ఞానము మొదలగు గుణములు మనబోటి యపరాధిజీవులయందు మంచిని గలుగజేసెనేని యవి గుణములగుట కడ్డులేదు. అటుగాక చెడునే గలుగజేసినచో గుణములు గాకపోవుటయేగాక దోషములుగా గూడ పరిణమించును. అట్టితరి జ్ఞానము మొదలైనవానిని గుణములని వ్యవహరించుటకు వీలులేనందున "ఈ గుణములను గలిగినవాడే భగవంతుడు" అని ప్రమాణములు చెప్పినట్లు సర్వేశ్వరుని "భగవాన్" అని చెప్పదగదు. జ్ఞానము మొదలైనవి సర్వేశ్వరునియందున్నప్పటికిని అవి గుణములుగా నుండినప్పుడే ఈశ్వరునికి "భగవాన్" అని పేరు స్థిరపడును. అవిదోషములుగా మారినపుడు ఆ పేరు వానికి తగదు. ఇదియే ముందుజెప్పబడిన ప్రమాణమునకు తాత్పర్యము. అందుచే నిచట దయాదేవి యేమిచేయుచున్నదనగా ఆ జ్ఞానము మొదలయినవానితో తాను కలిసి మెలిసి తన సంబంధముచే వానిని దోషములుగా పరిణమించనీక గుణములుగాజేసి (మనబోటి జీవులకు హితకారులనుగాజేసి) భగవంతునికి "భగవాన్" అను పేరును స్థిరపరచుచున్నది. ఇచట నిదియే ముఖ్యముగా నుండు తాత్పర్యము.

దయాదేవి సంబంధముచే పూర్వోక్తజ్ఞానాదులు గుణములగుటయు, ఆమె సంబంధములేనిచో నవి దోషములగుటయు నెట్లనగా :— ఇచట భగవంతునికి జ్ఞానమనునది సర్వకాలములయందును సర్వవస్తువులనును, సర్వప్రకారములచేతను ప్రత్యక్షముగా నెఱుంగుట.

బలమనునది :— సర్వకాలముల యందును సర్వపదార్థములనును కించిత్తు గూడ శ్రమలేకుండ ధరించుట.

ఐశ్వర్యమనునది :— సర్వలోకములయందుండు చేతనా చేతనములను వస్తువులను నియమించుట.

వీర్యమనునది :— ( ఈశ్వరుడు ) తానే సర్వవస్తువులుగా పరిణమించియును, అన్నివస్తువులను ధరించియును, అన్నివస్తువులను అంతర్యామిగానుండి నియమించియును వానిలోనున్న, వానిచే కలుగుచున్న యేవిధమైన వికారములు లేకయుండుట. (జడత్వపరిణామిత్వాజ్ఞత్వదుఃఖిత్వాదిరాహిత్యం).

శక్తియనునది :— ఎవరిచేతనైనను చేయ సాధ్యముగాని పనిని తాను దలచినచో చేసి ముగించుట.

తేజస్సనునది :— తనసుదప్పు మిగిలినవారిని జయించుట.

ఈ గుణములు దయాసంబంధములేనపుడు అపరాధులైన మనయొక్క వేలకొలది యపరాధములను ఈశ్వరునకు చక్కగ బోధించి యెవరిచేతను నివారించుటను వీలులేనట్టుగా తీవ్రదండమును మనకు ఈశ్వరుడు తలంచిన తత్క్షణము నందే గలుగజేసి పెద్దగోతిలో పడద్రోయును. అప్పుడు మనకు పూర్ణముగా చెడుగునే గలుగజేయుటచే నివి దోషములుగా మారిపోవును.

అట్లుగాక ఈ గుణములతో దయాదేవికి సంబంధమేర్పడెనేని, ఒక్కొక్క గుణముతోను ఆ దయాదేవి చేరి వానిని చెడుగుచేయనీక జీవసంరక్షణ కార్యములోనే పూనిచి వానిమూలముగా మనకు పరమహితమును గలుగజేసి వానికి గుణములు అను ఆ పేరును సార్థకపరచి తద్ద్వారా ఈశ్వరునికి గూడ "భగవాన్" అను పేరును స్థిరపఱచుచున్నది. క్రింద జెప్పినట్లు ఈ గుణములయొక్క స్వరూపమును పరామర్శించినచో దయాదేవి సంబంధము లేనప్పుడవి చేటుచేయుట కుపయోగపడునవియు, ఆమె సంబంధమున్నచో మంచినే గలుగజేయుననియు నెల్లరకును స్పష్టముగ నేర్పడును.

ఇట్లు దయాదేవి సంబంధము ఈ గుణములకేర్పడుటకు మూలకారణము మహాలక్ష్మియొక్క నిత్యసంబంధమే అని దెలియపరచుటకొరకై "వృషగిరి గృహమేధి" అను పదముచే శ్రీనివాసుని మహాలక్ష్మీసంబంధముగల గృహస్థుడుగా నిర్దేశించుటయైనది.

ఇందుచే యేదయాగుణ సంబంధమువలన మిగిలిన గుణములన్నియు దోషములుగా పరిణమించకుండ గుణములుగానే యుండునో అట్టి దయయే అన్ని గుణములలోను ముఖ్యమైనది గనుక దానినే చేతన సమాధిలో స్తోత్రముచేయుట కాచార్యులు పూనుకొనిరని యూహింపవలయును.

శ్లో॥ ఆసృష్టిసంతతానామపరాధానాం నిరోధినీం జగతః ।
పద్మాసహాయకరుణే ! ప్రతిసంచరకేళిమాచరసి ॥ 16

అర్థ :— హే పద్మాసహాయకరుణే ! = ఓ శ్రీనివాసదయాదేవీ ! (త్వం = నీవు), ఆసృష్టి = సృష్టికాలము మొదలు, సంతతానాం = వృద్ధిచెందిన, జగతః = ప్రపంచముయొక్క, అపరాధానాం = అపరాధములను ( శాస్త్రోల్లంఘనములను ), నిరోధినీం = అడ్డగించ దగు, ప్రతిసంచరకేళిం = మహా ప్రళయమను లీలను, ఆచరసి = అనుష్ఠించుచున్నావు.

అవతా॥ భగవంతునియొక్క జ్ఞానము మొదలుగాగలిగిన గుణములను తన కనుకూలము గావించుకొని దయాదేవి యాచరించు సామ్రాజ్య ప్రభావము ఇంతవరకు వివరించబడినది. ఇటుపై భగవంతునిచే చేయబడుచున్నవిగా వేదములయందు ప్రతిపాదింపబడిన సృష్టి సంహారము మొదలైన వ్యాపారములుగూడ భగవంతుని దయచేతనే యేర్పడుచున్నవని నిరూపించదలంచిన ఆచార్యులు, ఉపనిషత్తులవలంబించిన మార్గము ననుసరించి మొదట ప్రళయమనెడు ప్రపంచనాశమును దయాదేవియొక్క కృత్యమే యని యీ శ్లోకమునందు విశదీకరించుచున్నారు.

తా॥ బాలురు తమ దుశ్చేష్టలచే సహించరాని యుపద్రవములను గలుగజేసి, తద్ద్వారా తమ శరీరములను క్లేశపరచుకొని తమ తల్లి మొదలగు వారికిని మనఃక్లేశమును గలుగజేయునప్పుడు, ఆ తల్లి ఆ బిడ్డలను కొంతకాలము నిద్రింపజేసినయెడల ముందుజేసిన దుశ్చేష్టలనుమరచి శ్రమపరిహారమును బొందుదురను తలంపుచే, వారిపైగల దయచేతనే యెటుల వారిని నిద్రింపజేయునో, అటులనే ఈశ్వరుడొసంగిన శరీరేంద్రియములను బొందిన యీజీవాత్మలు సృష్టికాలము మొదలు ఏకధారగా

చేయు నపరాధములచే తమ్ము సంసారమనెడు మహాగర్తములలో బడవేసికొని, తద్ద్వారా సర్వేశ్వరునికిగూడ మనఃక్లేశమును గలుగజేయునప్పుడు ఆ సర్వేశ్వరుడు "ఈ జీవులు కొంతకాలమైనను ఇట్టి యపరాధములను జేయకయు, తద్ద్వారా సంసార దుఃఖము ననుభవింపకయు ఉందురుగాక" అని తలంచి వీరియందు పరమ దయ చేతనే ప్రళయమును గలుగజేయుచున్నాడు.

ఆ ప్రళయకాలమునందు కరణకళేబరములనబడు శరీరేంద్రియములు లేకపోవుటచే నపరాధముల జేయుటకును, తద్ద్వారా సంసారదుఃఖముల ననుభవించుటకును వీలులేక యీ జీవులు నిద్రదశను (అచేతన సమానదశను) పొందుచున్నారు. ఇంతయు "కొంతకాలమైనను దుఃఖరహితులగుదురు గాక" యనెడు దయామూలమగు నీశ్వరేచ్ఛచే గలుగుచున్నదిగనుక, ఆచార్యులిచట "ప్రతిసంచరకేళి" యను ప్రళయమును దయాకార్యముగా నిరూపించి పై జెప్పబడిన శాస్త్రార్థములను ప్రకటీకరించిరి.

ఇంతియకాక యీ శ్లోకమునం దాచార్యులు తమ సర్వతంత్రస్వాతంత్ర్యమునకు దగినట్లు భరతనాట్యశాస్త్రములోనున్న కొన్ని సూక్ష్మాంశములను పొందుపరచి వర్ణించియున్నారని కొందరు మేధావులుజెప్ప వినియున్నాము. అది యెట్లన:— "సృష్టి, సంతతానాం, ప్రతిసంచరికేళి" అను నీ పదములు క్రమేణ (1) నర్తకి రంగమునందు నృత్యముజేయుటకు ప్రారంభించు సమయమునునూ, (2) ప్రక్కవాద్యములనునూ, (3) రంగమునందు నర్తకి వెనుకకు వెనుకకేపోయి నృత్యమును ముగించుకొనుటనును చెప్పుచున్నవని భరతశాస్త్రమునందు ప్రసిద్ధమట. కావున యీ పదములనుబట్టి యీ శ్లోకమునకు మఱియొక యర్థమును వర్ణించుచున్నారు.

మిగుల నేర్పరియగు నొక నర్తకి నాట్యమాడ నారంభించిన సమయమునుండి, ప్రక్కవాద్యములు చేయు పొరబాటులను సహింపజాలక, ఆ వాద్యముల యపరాధముల నడ్డగింపదలచి సభ్యులకు వైరస్య మేర్పడక యుండునట్లు వాద్యకారులయందలి దయచేత మెల్లగ వెనుకకు వెనుకకే నడచి తన నర్తనము నెట్లు ముగించుకొనునో, (దీనినే ప్రతిసంచరకేళియందురు) అట్లే యీ దయాదేవియొక్క ప్రళయలీలలు ప్రవర్తిల్లుచున్నవి. ఈ యర్థమునందుగూడ నీ శ్లోకములోనుండు యావత్పదములును సమన్వయమగుట వ్యుత్పన్నులకు వేరుగా ప్రతిపాదించ నవసరములేదు.

శ్లో॥ అచిదవిశిష్టాన్ ప్రళయే జంతూనవలోక్య జాతనిర్వేదా ।
కరణకళేబరయోగం వితరసి వృషశైలనాథకరుణే! త్వమ్ ॥ 17

అర్థ :— వృషశైలనాథకరుణే = వృషపర్వతనాథుడగు శ్రీనివాసునియొక్క దయాదేవీ!, త్వం = నీవు, ప్రళయే = ప్రళయకాలమునందు, అచిదవిశిష్టాన్ = జ్ఞాన శూన్యములగు నచేతనములతో సదృశములైన, జంతూన్ = చేతను లనెడు **జీవులను,** అవలోక్య = చూచి, జాతనిర్వేదా = అనుతాపము గలిగినదానివై, కరణ కళేబరయోగం = ఇంద్రియములు, శరీరము వీనియొక్క సంబంధమును, వితరసి = ఇచ్చుచున్నావు.

అవతా॥ క్రింది శ్లోకమునందు ప్రళయమనెడు సర్వనాశముగూడ దయాకృత్యమేయని నిరూపించిరి. ఈ శ్లోకమునందు ప్రళయానంతరము సంభవించు సృష్టియు దయాకార్యమేయని ప్రతిపాదింపుచున్నారు.

తా॥ ప్రళయకాలమునందు జీవులు, స్వర్ణకారుని వద్దనుండు మైనపుఉండయందు బంగారపు కణములవలె ప్రకృతియనెడు అచేతనపు వస్తువునందు తగులుకొని, శరీరేంద్రియములు లేమిచే జ్ఞాన క్రియాదులులేక యున్నారు. ఇట్లు బహుకాలము గడచుచున్నది. అప్పుడాదయాదేవి యందు జీవులనుజూచి భగవానునికి మరల దయ గల్గుచున్నది. "అయ్యో! ఈ జీవులుగూడ మంచితెలివిబొంది సత్కర్మముల ననుష్ఠించి సద్గతినిబొంది యుత్తమలోకములో నిత్యసూరి గోష్ఠితోగూడ బ్రహ్మానందమును బొందతగినవారేగదా! అన్యాయముగా నింతకాలము తమ దుశ్చేష్టలచే ఆ యానందమును బొందకయే యున్నారే. ఈ ప్రళయమునందు విశేషించి శరీరేంద్రియాదులు లేనందున, జ్ఞానమునుబొంది తద్ద్వారా సత్కర్మల ననుష్ఠింపుటకు వీలులేకయున్నారే. వీరికి మరల శరీరేంద్రియాదులను, మంచి యుపకరణములనను ఇచ్చినందున ఒకవేళ సద్గతి నందగలరేమోగదా" యని యోచించి, భగవానుడు వీరికి పరమదయచే శరీరేంద్రియాదుల నొసంగుచున్నాడు. ఇదియే సృష్టియనబడుచున్నది. మేలుకొనియుండు బాలుని యుపద్రవములు సహించక వానిని నిద్రింపజేసినను, ఆ బిడ్డ చాలకాలము భుజించక యాకలితోనే నిద్రించుచునప్పుడు ఆ తల్లి, వాడు లేచినచో మరల యుపద్రవములు గలుగజేయునేమో యను తలంపుగలిగియున్నను మాతృప్రేమచే ప్రేరితయై చాలకాలము ఆకలితో నిద్రించుచున్నాడేయని పరితాపముతో బలవంతముగా వానిని లేవదీసి వానినెట్లు భుజింపజేయునో, అట్లే దయాదేవియు మనవిషయములో ప్రవర్తించుచున్నదను శాస్త్రార్థమీ ప్రకరణమునకు పిండితార్థము.

శ్లో॥ అనుగుణదశార్పితేన శ్రీధరకరుణే సమాహితస్నేహా ।
శమయసి తమః ప్రజానాం శాస్త్రమయేన స్థిరప్రదీపేన ॥ 18

అర్థ :— శ్రీధరకరుణే ! = ఓ శ్రీనివాసదయాదేవీ !, త్వం = నీవు, సమాహితస్నేహా = (ప్రజలయందు) ఉంచబడిన ప్రీతి గలిగినదానివై, (ప్రమిదయందు పోయబడిన నూనెగలగినదానివై), అనుగుణదశార్పితేన = యుక్తమగు వయసునందు, లేక సత్త్వగుణము తలయెత్తి శ్రద్ధగలిగిన సమయమునం దివ్వబడిన, (మంచి వత్తియందు ముట్టించబడిన), శాస్త్రమయేన = శాస్త్రరూపమైన, స్థిరప్రదీపేన = నాశరహితదీపముచే, ప్రజానాం = జనులయొక్క, తమః = అజ్ఞానమును (చీకటిని), శమయసి = పోగొట్టుచున్నావు.

అవతా॥ పై రెండు శ్లోకములచే, సృష్టిపాలన సంహారములనెడు ఈశ్వరుని కృత్యత్రయమునందు ప్రళయము సృష్టి యనే రెండు కృత్యములు దయాదేవిచే యేర్పడినవే యని వర్ణించిరి. ఇచట మధ్యలోని పాలనముగూడ దయాకృత్యమే యని నిరూపించుచున్నారు.

తా॥ ఒకనిని కాపాడుట యన నేమనగా, వానికి మంచి జ్ఞానమును గలుగ జేయుటయే. దీనినే పెద్దలు.

" న దేవా దండమాదాయ రక్షన్తి పశుపాలవత్ ।
యం హి రక్షితుమిచ్ఛన్తి బుద్ధ్యా సంయోజయన్తి తమ్ ॥ "

అని చెప్పిరి. దేవతలు ఒకనిని కాపాడదలచినచో పశుపాలకులు పశువులను కఱ్ఱతో కాపాడునట్లుగాక, ఆ మనుష్యునికి మంచి తెలివిని గలుగజేయుచున్నారని భావము. ఏవంచ ప్రకృత శ్లోకమునందు, క్రిందచెప్పినట్లు శరీరేంద్రియములను బొందిన జీవులు వాటిచే మంచి జ్ఞానక్రియలను పొందుదురని తలంచిన భగవంతుడు, వీరికి ఇది మంచిది ఇది చెడ్డదియని తెలియపఱచుటకు శాస్త్రమనెడు స్థిరమైన, సత్త్వ కాశవంతమయిన కరదీపమును మిక్కిలి ప్రీతితో ఆచార్యమూలముగా నొసంగి వీరు అజ్ఞానమునందు మునిగి నాశము జెందకుండునట్లు కాపాడుచున్నాడను శాస్త్రార్థము నిరూపింపబడుచున్నది. ఆ శాస్త్రమనెడు దీపమును తగిన సమయములో, అనగా సత్త్వగుణము తలయెత్తిన సమయములో ఆచార్యులిచ్చుచున్నారు.

ఒక తల్లి తనబిడ్డ చీకటిలో త్రోవదెలియక కష్టపడుచున్నపుడు ఒక ప్రమిదిలో నూనెను బోసి మంచి వత్తివేసి గాలి కారిపోవకయుండు లాగున వొక దీపమును

ముట్టించి వానికిచ్చి నడువ వగిన, వగని త్రోవలనెల్ల చూపింమనో, అట్లే దయా మాతయు జీవాత్మయను ప్రమిదలో భగవదనుగ్రహ మనెడు నూనెను బోసి యుక్తి రాల మనెడు వత్తిలో శాస్త్రమనెడు దీపమును ముట్టించి యజ్ఞానమను నంధకార మును పోగొట్టి సన్మార్గమునందు ప్రవర్తింపజేయుచున్నదను నీ యర్థమును శ్లేష పదములను ప్రయోగించి ఆచార్యులిచట చిత్రించియున్నారు. విశేషణ పదముల కుండు నర్థద్వయము ప్రతిపదార్థములో చూపబడినది. ఇచ్చట శాస్త్రమనే పదము, సృష్ట్యారంభకాలము నందు చతుర్ముఖ బ్రహ్మకు సర్వేశ్వరు డుపదేశించిన వేద మును, అటుపిమ్మట వాల్మీకి, పరాశరాది మహర్షులు ఆళ్వార్లును గావించిన వేదోప బృంహణమైన రామాయణ - విష్ణుపురాణ - ద్రావిడ ప్రబంధములు మొదలగు సకల వైదిక మతగ్రంథములను కూడ జెప్పును.

శ్లో॥ రూఢా వృషాచలపతేః పాదే ముఖకాన్తి పత్రలచ్ఛాయా ।
కరుణే సుఖయసి వినతాన్ కటాక్షవిటపైః కరాపచేయఫలైః ॥ 19

అర్థ:— హే కరుణే = ఓ దయాదేవీ ! వృషాచలపతేః = శ్రీనివాసునియొక్క (పెద్ద పర్వతముయొక్క), పాదే = పాదములయందు (చరియ ప్రదేశమునందు), రూఢా = పుట్టినటువంటియు, ముఖకాన్తి పత్రలచ్ఛాయా = శ్రీనివాసునియొక్క ముఖ మండలశోభ యనే దట్టమైన ఆకులచే నేర్పడిన నీడను గలిగినటువంటి, (త్వం = నీవు), వినతాన్ = ( ఆ శ్రీనివాసునియొక్క పాదములను ) ఆశ్రయించినవారిని, కరాపచేయఫలైః = చేతులతో కోయదగిన పురుషార్థము లనెడి పండ్లను కలిగిన, కటాక్షవిటపైః = శ్రీనివాసునియొక్క కటాక్షములనే కొమ్మలచే, సుఖయసి = సుఖ మును బొంద జేయుచున్నావు.

అవతా॥ క్రింది శ్లోకమునందు దయాదేవి శాస్త్రమనే దీపముచే ప్రజలకు మంచి జ్ఞానమును కలుగజేయు ప్రకారము వర్ణింపబడినది. ఈ శ్లోకమునందు ఆ శాస్త్ర ములచే కలిగిన జ్ఞానముచే భగవంతుని యాశ్రయించినవారు తాముకోరిన పురుషార్థ ములనే ఫలములను పొందుటకును ఈ దయాదేవి యనుగ్రహముచేతనే యని ప్రతి పాదించుచున్నారు.

ఈ 19-వ శ్లోకమునందు ధర్మార్థకామ మోక్షములనే చతుర్విధ పురుషార్థముల యందు త్రివర్గమను చెప్పబడు మూడు పురుషార్థములును యీ దయాదేవిచే లభించు చున్నవని ప్రతిపాదించి, పై 20-వ శ్లోకముచే అపవర్గమనే నాలుగవ పురుషార్థ ముగూడ ఆ దయాదేవిచేతనే లభించుచున్నదని నిరూపించి ఈ రెండవ దశకమును

పూర్తి చేయుచున్నారు. పై శ్లోకమునందు మోక్షమును ప్రత్యేకముగా చెప్పుటవలన యీ శ్లోకమునందు తదితరమైన మూడు పురుషార్థములను చెప్పుచున్నారని అంగీకరించుట యుక్తము.

తా॥ ఒక ఇంద్రనీలమణిమయమైన పెద్ద పర్వతముయొక్క చరియప్రదేశమునందు పుట్టియు, దట్టముగాను మనోహరముగాను నున్న ఆకులచే యేర్పడిన విస్తారమైన నీడను కలిగియు నున్న ఒక కల్పవృక్షము, ఆ చరియప్రదేశమును పొంది ఆ నీడయందు పరుండినవారు, పరుండియుండు సమయమునందే తమ చేతులచేతనే కోసుకొనదగిన పలు పండ్లను కలిగిన కొమ్మలచే (కొమ్మలు వంగి పరుండియున్న వారి చేతులలో పండ్లు స్వయముగానే వచ్చి నిలిచి కోసుకొనుట కనుకూలముగా) వారిని (పండ్లను యిచ్చి) యెట్లు సంతోషింపజేయునో అట్లే యీ దయాదేవియొక్క స్థితియు అని కవి యిచ్చట చిత్రించుచున్నారు.

దయాదేవియు, ఆ శ్రీనివాసునియొక్క పాదముల నాశ్రయించిన వారిని, ఇంద్రనీలపర్వతమువలె నున్న అతనియొక్క పాదములనే చరియ ప్రదేశమునం దుద్భవించి, అతని ముఖవిలాసమనే ఆకులను కలిగి దానిచే విస్తారమైన నీడను యిచ్చునదై తమ చేతులచేతనే కోసుకొనదగిన (అతిసులభముగా పొందతగిన) ధర్మార్థ కామము లనే పలుపండ్లను అర్పింపదగిన అతనియొక్క కటాక్షములనే కొమ్మల చేత సంతోషింపజేయుచున్నది.

సర్వేశ్వరునిదయకు ప్రథమోత్పత్తిస్థానము అతని పాదారవిందమే. ఏలాటి యపరాధియయినను యతని పాదముల నాశ్రయించినయెడల తత్క్షణమే యతడు వీడు చేసిన యింత యపరాధములను మరచిపోవుచున్నాడు. దయ యుప్పవిల్లుచున్నది. దయ ఊటలూరిన వెంటనే దానికి సూచకముగా అతని ముఖమండలమునందు ఒక విలక్షణమైన శోభ (ప్రసన్నత) కలుగును. తదనంతరము అతని కటాక్ష మేర్పడి అపేక్షితఫలముల నిచ్చును. ఈ శాస్త్రార్థము నిచ్చట తెలిసికొనవలయును. మొదట చెట్లు పుట్టుటయు, మరల చిగురులు కలుగుటయు, తర్వాత పెద్దకొమ్మలున్ను, వాటిలో పండ్లున్ను కలుగుటయు, దానిచే ప్రజలు సుఖపడుటయు సర్వవిదితమే గదా ! అట్లే యిచ్చటయు క్రమమేర్పడియున్నది.

లోకమునందున్న చెట్లలో నుండు పండ్లను ఉన్నత పురుషులు తమ చేతుల నెత్తి కోయవలయును. ఈ దయావృక్షముయొక్క కొమ్మలనే భగవత్కటాక్షమందు పండిన పురుషార్థమనే పండ్లను వంగినవారే పొందుదురు. ఇది గాక ఆ కటాక్షము

లను కొమ్మలు వంగియున్న యీ పురుషుని చేతులలో పండ్లను కోసుకొనుట కను కూలముగా స్వయముగానే వచ్చి నిలుచును. ఇట్లు విలక్షణస్వభావముగలది యీ వృక్షము అనే యర్థమిచ్చుట సహృదయాహ్లాదకరముగా విలసిల్లుచున్నది.

శ్లో॥ నయనే వృషాచలేన్దోః తారామైత్రీం దధానయా కరుణే।
దృష్టస్త్వయైవ జనిమానపవర్గమకృష్టపచ్యమనుభవతి॥ 20

అర్థ:— హే కరుణే = ఓ దయాదేవీ!, వృషాచలేందోః = వృషపర్వతము నందు చంద్రునివలెఁ ప్రకాశించుచున్న శ్రీనివాసునియొక్క, నయనే = నేత్రముల యందు. తారామైత్రీం = తారామైత్రిని. దధానయా = వహించుచున్న. త్వయా = నీ చేత, దృష్టః = కటాక్షింపబడిన, జనిమానేవ = జంతుసామాన్యమే. అకృష్ట పచ్యం = దున్నకనే పండగల, అపవర్గం = మోక్షమను ఫలమును, అనుభవతి = అనుభవించుచున్నది.

అవతా॥ క్రింద శ్లోకమునందు త్రివర్గమనెడు ధర్మార్థకామములు దయచేతనే గల్గుచున్నవని నిరూపించి, అపవర్గమనెడు మోక్షముకూడ ఆ దయచేతనే గల్గుచున్న దని యీ శ్లోకమునందు దెలుపుచున్నారు.

తా॥ దయాదేవి శ్రీనివాసునియొక్క నేత్రములయందు తారామైత్రిని పొంది యున్నది, తారామైత్రియనగా ప్రథమదర్శనమునుండియే గలుగు అవ్యాజమైన స్నేహము. నేత్రములలోనుండు కనిగ్రుడ్లతోటి స్నేహమనియు నిచట చెప్ప వచ్చును. శ్రీనివాసుని కటాక్షమేర్పడునప్పుడు, ఆ నేత్రములందలి కనిగ్రుడ్లతో కలిసియున్న దయాసంబంధమువలన దయాలింగిత కటాక్షమే ప్రవహించునుగాని, కోపాది తదన్యగుణములతో గూడిన కటాక్షము ప్రసరించదు. ఇట్టి దయాలింగిత కటాక్షము ఏ జీవునికి తన జననకాలమునం దేర్పడుచున్నదో, వాడు మోక్షమునందు విశేషమగు నాస్థగలిగి తద్ద్వారా సదాచార్య సంబంధము మొదలైన సోపానములం దెక్కి మోక్షమును బొందుచున్నాడు. ఆ మోక్షముగూడ వీని విషయమునందు అకృష్ట పచ్యముగా (దున్నుట మొదలగు పరిశ్రమలు లేకయే ఫలమును మాత్రము బొందుట) యేర్పడుచున్నది.

లోకమునందు ఫలము ననుభవించువారెల్లరు స్వయముగనే కృషిజేయవలయు నను నిర్బంధములేదు. ఒకడు చేసిన కృషియొక్క ఫలమును మరొకడు పలు కారణములచే ననుభవించుచున్నాడుగదా. అటులనే ఇచ్చటయు ప్రపన్నుడు తాను కృషి నాచరించక పోయినను (భక్తియోగాద్యుపాయానుష్ఠానము లేకపోయినను) వీని

కారకు భగవంతుకు తానే యీ కృషిని చేసి (పరమదయచే భక్తియోగాద్యుపాయ స్థానమునందు నిలిచి) వీని కా ఫలమును లభింప జేయుచున్నాడు. ఆహా ! యెంతటి యాశ్చర్యకరమైనదా దయాప్రభావము ! అను శాస్త్రార్థమిచ్చట వివక్షితమైయున్నది.

ఇట్లు ప్రపన్నుని విషయములో మాత్రము ఈ శ్లోకమును యోజన చేయ వలయునను నిర్బంధములేదు. భక్తుడు, ప్రపన్నుడు వీరిద్దరి విషయములలోను యోజన చేయవచ్చును. భక్తుడు తాను జేసెడి భక్తియోగ మనేకృషి, మోక్షమనెడు మహాఫలమును బట్టిచూచినపుడు కృషిగానే యెంచుట కర్హమైనది గాకున్నది. లేక భక్తుడుగూడ యొకవిధమున (అంగ ప్రపత్తివిషయములో) ప్రపన్నుడే గనుక ముందుజెప్పినట్లు ఉపాయాన్తరస్థానములో భగవంతుడు నిలువవలసియున్నది. అందుచే యిద్దరును అకృష్టపచ్యమగు ఫలము ననుభవించుచున్నారనుట యుక్తమే.

" జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః । సాత్త్వికస్స తు విజ్ఞేయః స వై మోక్షార్థచింతకః " అను ప్రమాణవచన మిచ్చట యాచార్యులవారి హృదయములో నున్నది.

" ఇందోః తారామైత్రీం " అను పదవిన్యాసమువలన చంద్రునికి తన ప్రియురాండ్రగు తారలయందు (నక్షత్రములయందు) ప్రేమయుండుట యుక్తమే యనెడి యొక యర్థము తోచును. " అకృష్టపచ్యం " అను పదమునకు అకారవాచ్యుడగు పరమపురుషునిచే కృషిచేయబడి ఫలించిన ఫలమనునర్థమగుటచే పై దశకారంభమున జెప్పబోవుచున్న అర్థము — (శ్రీనివాసుడొకరైతు) సూచితమగుచున్నది.

(రెండవదశకము సమాప్తము)

శ్రీ మతే నిగమాంతమహాదేశికాయ నమః

---

## మూడవ దశకము

శ్లో॥ సమయోపనతైస్తవ ప్రవాహైరనుకంపే ! కృతసంప్లవా ధరిత్రీ ।
శరణాగతసస్యమాలినీయం వృషశైలేశకృషీవలం ధినోతి ॥ 21

అర్థ :— హే అనుకంపే = ఓ దయాదేవీ !, తవ = నీ యొక్క, సమయోపనతైః = తగిన సమయమునందు పారుచున్న, ప్రవాహైః = ప్రవాహములచే. కృతసంప్లవా = తడుప బడినట్టియు, (అతఏవ = గనుకనే) శరణాగతసస్యమాలినీ =

శరణాగతులను సస్యపరంపరను గలిగిన, ఇయం = ఈ. ధరిత్రీ = భూమి, వృష శైలేశకృషీవలం = వృషపర్వతమునకు యజమానుడైన శ్రీనివాసుడను రైతును, ధినోతి = సంతోషింపజేయుచున్నది.

అవతా॥ క్రింది దశకమునందు, పరబ్రహ్మమునకు లక్షణముగా చెప్పబడిన సృష్టి పాలన సంహారములు దయా దేవి చేత నే కలుగుచున్నవని బహుకారణ ములచే నిరూపించి తద్ద్వారా దయకు ఉన్న మహోన్నత ప్రభావము వర్ణింపబడినది. ఈ దశకమునందు అట్టి దయచే జీవులకును, పరమాత్మకును సంభవించుచున్న కొన్ని యుపకారములు వర్ణింపబడుచున్నవి.

క్రింది శ్లోకమునందు స్వయంకృషిచేయకనే ఫలమునుమాత్రము దయాదేవి కటాక్షముచే జీవు డనుభవించుచున్నాడని చెప్పు ప్రకరణమునందు కృషిచేయువాడు అకారవాచ్యుడగు పరమపురుషుడేయని తెలియపరచి శ్రీనివాసుడను పరమపురుషుని యొక రైతుగా రూపించిరి. ఈ శ్లోకమునందు, ఆ రైతు ఏమిపైరు చేయుచున్నాడు? నీటిసౌకర్యమెట్లు గల్గుచున్నది? ఇట్లు పైరుచేయుటచే ఎట్లు ఏ ఫలమును బొందు చున్నాడు? అను నాదిగాగల విషయములను దయాస్తోత్రముఖతః విశదీకరించు చున్నారు. ఈ విశదీకరణముచే జీవునికి, పరమపురుషునకును దయచే నేర్పడు ఉపకారము నిరూపితమగుచున్నది. ఇట్లే ఈ స్తోత్రమునందు ఒక్కొక్క దశకము నందును ప్రాయశః కడపటి శ్లోకములో సంగ్రహముగా చెప్పినవిషయమునే ఉత్తర దశక ప్రారంభములో విశదీకరించుట ఆచార్యులు స్వీకరించిన మార్గమని రసికు లూహింపవలయును.

తా॥ వేలకొలది యెకరములను సాగుచేయు రైతునకు, తగు సమయమునందు మంచి జలప్రవాహ ముప్పొంగుటచే పైరు, చాలయు పుష్టిగా పెరిగి వెన్నులబరువుకు వంగిపోయినప్పుడు, ఆ భూమి ఎట్లు అమితమగు సంతసమును గలుగజేయునో, అట్లే శరణాగతులను సస్యమును ఈ ప్రాకృత ప్రపంచమునందు పైరు చేయగోరిన వేంకటగిరి శిఖరముననుండు శ్రీనివాసుడను రైతునకు, జీవుల సుకృతములు పరి పాకమునొందు సమయమందు దయాప్రవాహముప్పొంగి ప్రవహించగా తలవంగిన బహుశరణాగతులను గల్గిన ఈ భూమి యమందానందమును గలిగించుచున్నది. ఇది ఇచ్చట కవిచిత్రము.

భక్తి మొదలగు యోగములు సులభముగ మోక్షము నియ్యజాలవు కావున జనులెక్కువగ నాయోగములలో ప్రవర్తించుటలేదు. ఈ విషయమునెఱింగిన భగ

వంతుడు సులభముగ మోక్షము నియ్యగల శరణాగతిమార్గమును (ప్రపత్తిని) ఉప దేశించి, తద్ద్వారా సర్వజనులను శరణాగతులనుజేసి సద్గతి నొసంగదలంచెను. ఈ ప్రపత్తిమార్గము నవలంబించినవారికి తమ కర్మములను నిశ్శేషముగ దొలగించుటకు భగవద్దయ తప్ప వేఱొకయుపాయము లేదు. అందుచేతనే ఆదయ తగు సమయమునందేర్పడి వీరికి క్రమక్రమముగ కడుమేలును గలుగజేసి కడపట సర్వ కర్మక్షయము నొనరించి మోక్షమునొసంగుచున్నది. దీనిచే ఈశ్వరుడు తన యభిప్రాయము నెరవేరుటచే సంతసించుచున్నాడు. ఇది ఇచ్చట శాస్త్రార్థము.

"సమయోపనతైః" అను పదమునందు సమయపదమునకు సిద్ధాంతమనియు నర్థము గలదు. అందుచే "యతిపతియామునప్రభృతయః ప్రథయన్తి" అని పై జెప్పబోవు రీతిలో భగవద్దయ నీ ప్రపంచమునకు దీసికొనివచ్చి దానిచే ననేక ప్రజలు మేలు బొందునట్లు జేసినది మన రామానుజసిద్ధాంతమే అను నర్థముగూడ గోచరించును. భగవద్రామానుజులు మొదలైన యాచార్యులవతరించిన వెంటనే ఈ ప్రపంచమున ప్రపన్నులెక్కువయిరి" అని శ్రీ దేశికులవారే "నిక్షేపరక్ష" యను స్వీయగ్రంథమునందు ప్రసాదించియున్నారు.

వేలకొలది యెకరములను సాగుచేసినరైతు అవి పండియున్నపుడు నలు ప్రక్కల చక్కగచూడగోరెనేని మిట్టప్రదేశమునెక్కి నిలుచునట్లు, శ్రీనివాసుడును తిరుమలనెక్కి నిలిచియున్నాడని "వృషశైలేశకృషీవలం" అను పదముచే స్ఫురించును.

మఱియు రైతుయొక్క ప్రియనాయిక మాలలచేత తన్ను విశేషముగ నలంకరించుకొని తన ప్రియనాయకుని ఎట్లు సంతోషపరచునో, అటులనే భూదేవియు శరణాగతసస్య మాలలచే తన్ను విశేషముగ నలంకరించుకొని తన ప్రియుడగు పరమపురుషుడను రైతును సంతసింపజేయుచున్నదని యుత్తరార్ధముచే ధ్వనించుచున్నది.

శ్లో॥ కలశోదధిసంపదో భవత్యాః కరుణే! సన్మతిమంథసంస్కృతాయాః।
అమృతాంశమవైమి దివ్యదేహం మృతసంజీవనమంజనాచలేందోః॥ 22

అర్థ:— హే కరుణే! = ఓ దయాదేవి!, అంజనాచలేందోః = అంజన పర్వతమనెడు తిరుమలయందు చంద్రుడుగా ప్రకాశించుచున్న శ్రీనివాసునియొక్క, మృతసంజీవనం = మరణించినవారిని సంజీవింపజేయు, దివ్యదేహం = దివ్యమంగళ

విగ్రహమును (శరీరమును), కలశోదధి సంపదః = క్షీరసాగరముయొక్క సంపత్తిని గలిగినట్టియు, సన్మతిమంథసంస్కృతాయాః = భగవంతుని సంకల్పమను కవ్వముచే చిలకబడియున్న, భవత్యాః = నీ యొక్క. అమృతాంశం = అమృతాంశముగా, అవైమి = ఎఱుంగుచున్నాను.

అవతా॥ క్రింది శ్లోకమునందు శరణాగతగోష్ఠిని జూచి శ్రీనివాసుడు చాలయు సంతోషించుచున్నాడని చెప్పిరి. ఈ శ్లోకమునందు ఆ శరణాగతులు ప్రపత్తిచేయుటకు ప్రధానావలంబమైన అర్చామూర్తియు దయాసారాంశమే యని నిరూపించి దీనిచే ఈశ్వరునికి శరీరలాభమును, జీవుల కవలంబమును నిరూపించుచున్నారు.

తా॥ దేవాసురులు క్షీరసముద్రమును మందరమను కవ్వముచే చిలికినప్పుడు చంద్రుడు మొదలగు పలుపదార్థము లుద్భవించిన పిమ్మట వారికి ప్రధానోద్దేశ్యమైన యమృతముద్భవించినది. అట్లే పాలసముద్రమునకు సమమైన దయను సన్మతిచే, అనగా భగవానుని సంకల్పముచే చిలికినప్పుడు ప్రాపంచికములైన బహుపదార్థము లుత్పత్తినందిన పిమ్మట, పాలయొక్క సారమైన వెన్నవలె దయాసారాంశముగాను అమృతరూపముగాను ఆవిర్భవించినది శ్రీనివాసునియొక్క (అర్చామూర్తి) దివ్య మంగళవిగ్రహము. (భగవంతుని దివ్యాత్మస్వరూపము గూడ దీనికి వెనుకటిదే) అని కవిహృదయము. ప్రసిద్ధామృతమువలె నీ దివ్యమంగళవిగ్రహము గూడ మృత సంజీవనమే. సంసారాగ్నిదగ్ధులగు జీవులు ఈ అమృతరూపమైన దివ్యమంగళ విగ్రహముయొక్క దర్శనమాత్రముచే (పానముచేయగనే) పునరుజ్జీవనమును పొందగలరు.

ఒక అర్చామూర్తివద్దనే పెద్దలు శరణాగతిననుష్ఠించెదురు. ఆ మూర్తిలేనిచో వారి కవలంబము లేకపోవును. దీని నాలోచించిన భగవంతుడు పరమదయచే అతి సుందరమైన అర్చావిగ్రహమును తన సంకల్పముచే పరిగ్రహించి ప్రపత్తి చేయం దలచినవారి కనుకూలమగువట్లు సర్వసులభుడై ఈ తిరుమలయందు నిల్చియున్నాడని ఇచ్చట శాస్త్రార్థము.

మాధుర్యము, గాంభీర్యము, కలశనందని తనము, అమృతమును గలుగ జేయుట మొదలగు నీయాకారములచే పాలసముద్రముతో సమమైనది దయా సముద్రము. "సన్మతిమంథ" అను పదమునకు సచ్ఛబ్దార్థమైన భగవంతుని

యొక్క మతిపదార్థమైన సంకల్పమను కవ్వముచేనని యర్థము క్రింద చెప్పబడినది. ఇదిగాక వేరువిధముగా వర్ణించుటయుఁ గద్దు. సత్పదముచే శుకాదిమహర్షులును, ఆళ్వార్ మొదలైన బ్రహ్మవిత్తులును చెప్పబడుచున్నారు. వారియొక్క మతియనగా ప్రార్థన. అట్టి పెద్దలయొక్క ప్రార్థనల ననుసరించి ఇట్టి అర్చాసమాధిని తాను పొందుచున్నాడని పురాణసంప్రదాయాది సిద్ధము. అథవా సన్మతియనుటచే కవి శన యొక్క బుద్ధినే "సర్వం సహ నిశితధియా" అని తానే చెప్పినట్లు వివక్షించు చున్నారు. నా యొక్క తీక్ష్ణమైనబుద్ధిచే చిలికి చూచినప్పుడు దయాక్షీరసముద్రము నుండి సారాంశముగా నుద్భవించినది భగవానుని అర్చాదివ్యమంగళవిగ్రహమే యనియు నిచట నర్థము చెప్పనగును.

"అంజనాచలేందోః" కాటుకపర్వతమునందు చంద్రోదయము చాలయు పరభాగావహము. పాలసంద్రమునుండి యుద్భవించిన చంద్రాది పదార్థములలో అమృతమే ముఖ్యతమమైనట్లు దయోదధినుండి యుద్భవించిన పదార్థములలోకెల్ల శ్రీనివాసుని దివ్యమంగళవిగ్రహమే ముఖ్యతమమైనదని ఈ శ్లోకములలోని ప్రధాన భావము.

శ్లో॥ జలధేరివ శీతతా దయే ! త్వం వృషశైలాధిపతేః స్వభావభూతా ।
ప్రళయారభటీనటీం తదీక్షాం ప్రసభం గ్రాహయసి ప్రసత్తిలాస్యమ్ ॥ 23

అర్థ:— హే దయే !, = ఓ దయాదేవీ ! జలధేః = సముద్రమునకు, శీతతేవ = శైత్యమువలె, వృషశైలాధిపతేః = వేంకటాద్రీశునికి, స్వభావభూతా = స్వభావభూతయగు, త్వం = నీవు, తదీక్షాం = ఆ శ్రీనివాసునియొక్క సంకల్పమగు, ప్రళయారభటీనటీం = ప్రళయమను నుద్దండతాండవమాడు నర్తకిని, ప్రసభం = బలత్కారముతో, ప్రసత్తిలాస్యం = సుకుమారనర్తనమును (సృష్టిని), గ్రాహయసి = స్వీకరింపజేయుచున్నావు.

అవతా॥ క్రింది శ్లోకమునందు శ్రీనివాసునికి దివ్యమంగళవిగ్రహముగూడ దయాదేవిచే నేర్పడుచున్నదని నిరూపించుటచే నతడు సర్వవిధముల దయాధీనుడని తేలుచున్నది. అట్లైనచో నతడు సర్వప్రపంచమును నాశముఁజేయు ప్రళయకాలమందును, సృష్టికాలమున హిరణ్యాది సంహారసమయములోను ఉగ్రకోపమునకు లోబడుట తగునా ? అను సందేహమునకీ శ్లోకమునందును, పై శ్లోకములోను సమాధాన మొసంగబడుచున్నది.

జలమునకు చల్లదనము స్వభావసిద్ధమైన గుణము. సముద్రములో నీ గుణము చక్కగ కానందగును. జలమును కాగబెట్టినప్పుడు దానిలో కొన్నినిమిషములు తాత్కాలికమగు నౌష్ణ్యము నిలిచినను, వెంటనే అయ్యది తన స్వభావసిద్ధమగు చల్లదనము నొందుచున్నది. ఇట్లే దయయే శ్రీనివాసునియొక్క స్వాభావికగుణము. ఏవియో కొన్ని కారణములచే కోపము తాత్కాలికముగ కొంతకాల మేర్పడి నప్పటి కిని వెంటనే ఆ కోపమును ఈ స్వభావగుణమైన దయ అణగించి తానే పైకివచ్చి నిలుచును. దీనినే కవి యిచట మిక్కిలి సుందరముగ చిత్రించుచున్నారు.

తా॥ ఒకనర్తకి తనశరీరమును క్లేశపరచుకొని, ప్రేక్షకులును భయపడు లాగున నుద్దండతాండవమాడునపుడు, ఆమెకు యజమానురా లామెను నిర్బంధ ముతో నణచిపెట్టి ప్రేక్షకులకు వైరస్యము గలుగకుండునట్లును, నాట్యము నాపి వేయకుండను మెల్లగ నా ఉగ్రనాట్యమునే సుకుమారనర్తనముగా మార్చి నర్తకికి క్లేశములేకుండ, ప్రేక్షకులును తృప్తినందున ట్లేవిధమున నేర్పాటుగావించునో, అట్లే దయాదేవి, భగవంతుని సంకల్పమనే నర్తకి సర్వప్రపంచనాశనమనెడి యుద్దండతాండవము నాచరించునపుడు బలాత్కారముగ ఆ సంకల్పనర్తకిని ఆ తాండవమునుండి మరలించి (భగవానుడు నిర్దయుడనియెంచి ప్రాపంచికు లతనిని వదలిపోకుండ) సృష్టియను సుకుమారలాస్యమును గావింపజేయుచున్నది.

భగవంతుడు, జీవులు చేసెడి యనంతాపరాధములచే విసుగుజెంది జగత్తును సంహరించినప్పటికిని తాత్కాలికమైన ఆ కోపమణగిన పిమ్మటనే స్వభావసిద్ధమైన దయచే మరల నా జీవులకు శరీరేంద్రియాదిసమస్తోపకరణముల నియ్యగల సృష్టిని ప్రారంభించుచున్నాడను శాస్త్రార్థమిచ్చట యెఱుంగదగినది.

దీనిచే ఈశ్వరునికి కోపిష్ఠుడు, నిర్దయుడను నపవాద మేర్పడక పోవుటయు, జీవులకు సృష్టికాలములో శరీరేంద్రియాద్యుపకరణలాభమున్ను ప్రయోజనమని తెలియదగియున్నది. " ఆసృష్టి " యనే క్రింది దశకములోని శ్లోకమునందు ప్రళయ మును దయాకార్యముగా పఠించిరి. ఇచట ప్రళయమునందు దయాదేవికిగల వైముఖ్యము సూచింపబడినది. ఇదెట్లు సంగత మగుననగా, పారమార్థికముగ పరికించినపుడు ప్రళయముకూడ పరమదయాకార్యమే. అది యచట నిరూపింప బడినది. అట్లుగాక లోకదృష్టిలో సర్వలోకనాశనరూపమైన ప్రళయమును కోప కార్యముగా తలంచినను దయాదేవి యుపయోగించు ప్రక్రియ ఇచట నిరూపింపబడి యున్నదని తెలియనగును.

శ్లో॥ ప్రణతప్రతికూలమూలఘాతీ ప్రతిఘః కోఽపి వృషాచలేశ్వరస్య।
కలమే యవసాపచాయనీత్యా కరుణే! కింకరతాం తవోపయాతి ॥ 24

అర్థ :— హే కరుణే ! = ఓ దయాదేవీ !, ప్రణతప్రతికూలమూలఘాతీ — ఆశ్రితులయొక్క విరోధులను సమూలముగ నున్మూలించుచున్న, కోఽపి = విలక్షణ మైన, వృషాచలేశ్వరస్య = శ్రీనివాసునియొక్క, ప్రతిఘః = కోపము, కలమే = వరి పైరునందు, యవసాపచాయనీత్యా = కలుపుదీయున్యాయముగా, తవ = నీకు, కింక రతాం = కింకరభావమును, ఉపయాతి = పొందుచున్నది.

అవతా॥ క్రింది శ్లోకమునందు ప్రళయకాలమున గలుగు భగవానుని కోపమును దయాదేవి యణచెడుప్రకారము వర్ణింపబడినది. ఈ శ్లోకమునందు సృష్టికాలముననే కొన్ని సమయములలో (హిరణ్య రావణాద్యాశ్రితవిరోధి సంహారసమయమందు) సంభవించుచున్న భగవంతుని కోపము దయాదేవికి కింకరభావమును పొందుచున్న దని వర్ణింపబడుచున్నది.

తా॥ ఈ శ్లోకమున పొందుపరచబడియున్న చిత్ర మతిరమణీయముగ నున్నది. ఇతఃపూర్వమే ఈ దశకారంభమునందు శ్రీనివాసుని యొక రైతుగా నిరూపించి యున్నారు. దాని ననుసరించి ఇచటకూడ నొక దృష్టాన్తమొసంగబడుచున్నది.

ఒక రైతు తాను పెట్టిన పైరును చక్కగ కలుపు మొదలగువాటి యుపద్ర వము లేకుండునట్లును, ఫలభరితముగాను చేయదలచెనేని, మొదట పనివారిని బెట్టి కలుపును సమూలముగ తీసివైచి ఆ పైరు నెట్లు పరిరక్షించునో, అట్లే శ్రీనివాసుఁ డను రైతుయొక్క పైర్లుగానున్న ఆశ్రితులను సంరక్షింపదలచిన శ్రీనివాసుని మహిషియగు దయాదేవి ఆ యాశ్రితులకు విరోధులైన హిరణ్యరావణాదు లను కలు పును తన పనివాడైన శ్రీనివాసుని కోపముద్వారా సమూలముగ పెరికివైచి వారికి భద్రత గలుగజేయుచున్నది.

పైరు ఒకటియైనచో, దాని కలుపు అనేకముగ నుండును. అట్లు భగవదా శ్రితుడొక్కడైనచో తద్విరోధివర్గ మనన్తముగా నుండును. పైరుపెట్టి కడపటి వరకు కాపాడుటయందెంత శ్రమము గలదో, దానిలో సహస్రాంశముగూడ కలుపు

దీయుటయందు లేదు. నఖములతోనో, లేక చిన్ని పరికరములతోనో దానిని తీసి వేయ వీలగును. అట్లే భాగవతవిరోధులను దొలగించుట భగవంతుని కనాయాస సాధ్యము. ఇవ్విధంబున సాగుబడియందున్న పలువిధములగు గుణములు ప్రకృత విషయమునందును యోజింపదగియున్నవి.

భగవంతుడు సాధువులను తనదయచే సంరక్షించుచున్నాడు. అనగా తా నవ తరించి, వారితో కలసిమెలసి, వారిసుఖదుఃఖములలో తోడ్పడి, వారి వర్ణాశ్రమ ధర్మములను చక్కగ జరిపించి, వారిని సంతోషింపజేసి తానును సంతోషించు చున్నాడు. ఈలాటి సంరక్షణము తద్విరోధివర్గనాశన మేర్పడ నంతవరకు చక్కగ నెలకొనదు. అందుననే ఆశ్రితుల యందలి దయచేత తద్విరోధివర్గమునందు కోపము గల్గి వారిని ధ్వంసముచేయు సందర్భ మేర్పడుచున్నది. " పరిత్రాణాయ సాధూనాం " అను గీతాశ్లోకములో చెప్పినట్లు ఆశ్రితసంరక్షణమే భగవంతునికి ప్రధానోద్దేశ్యము. దానికి నాన్తరీయకముగా ఏర్పడునది విరోధినాశనమను శాస్త్రార్థముగూడ పూర్వోక్త దృష్టాన్తముచే స్పష్టముగా నెఱుంగదగియున్నది.

దీనిచే భగవంతునికి సాధువులతో సంగమమును, ఆశ్రితులకు స్వవిరోధి నాశనమును లాభమని తెలిసికొనవలయును.

శ్లో॥ అబహిష్కృతనిగ్రహా౯ విదన్తః
కమలాకాన్తగుణా౯ స్వతంత్రతాదీ౯ ।
అవికల్పమనుగ్రహం దుహానాం
భవతీమేవ దయే ! భజన్తి సన్తః ॥ 25

అర్థ :— హే దయే ! = ఓ దయాదేవీ ! స్వతంత్రతాదీ౯ = స్వాతంత్ర్యము మొదలగు, కమలాకాన్తగుణా౯=శ్రీనివాసగుణములను, అబహిష్కృతనిగ్రహా౯= బహిష్కరింపనట్టి నిగ్రహ (దండించుట) మను గుణమును గలిగినటువంటివాటినిగా, విదన్తః = ఎఱుంగుచున్న, సన్తః = పెద్దలు, అవికల్పం = వికల్పమున కవకాశము లేకుండ (అనవరత మొకరీతినే), అనుగ్రహం = అనుగ్రహమునే, దుహానాం = పిండుచున్న, ( కలుగజేయుచున్న ), భవతీమేవ = నిన్నే, భజన్తి = సేవించు చున్నారు.

అవతా॥ ఇతఃపూర్వము శ్రీనివాసు డన్నివిధముల దయాపరతంత్రుడని నిరూపించినప్పుడు అతనికి కొన్ని సమయములలో కోపమేర్పడుట తగునా? అను ప్రశ్నకు క్రింద రెండు శ్లోకములలో సమాధానము నొసంగిరి. ఈ శ్లోకములో "ఇట్లు నేను దయకు పరత్వము చెప్పుట స్వకపోలకల్పితము కాదు. పెద్దల యనుష్ఠానము దీనికి దగుప్రమాణమే యగుచున్న" దని నిరూపించుచున్నారు.

తా॥ ఒకడు మనకు పొసగనివాడని దెలిసికొంటిమేని వానిని మనము బహిష్కరించుచున్నాము. అనగా వానితో నెట్టి వ్యవహారములను పెట్టుకోము. అట్లే శ్రీనివాసునియందున్న నిగ్రహమును, అనగా అపరాధులను దండించుట యను గుణమును దయాదేవి పూర్ణముగా బహిష్కరించుచున్నది. శ్రీనివాసునియొక్క ఐశ్వర్యమునకు చేరిన స్వాతంత్ర్యము, జ్ఞానము మొదలగు గుణములు నిగ్రహానుగ్రహోభయ సాధారణములుగనుక నిగ్రహమును పూర్తిగ బహిష్కరింపక దానిని గూడ కొన్ని సమయములయందు స్వీకరించుచున్నవి. మనబోటి యపరాధులకు నిగ్రహమో, దానిని కొన్నివేళల నాచరించు స్వాతంత్ర్యాదిగుణములో కానివి. కావుననే వత్సమునందు పరమవాత్సల్యముచే స్తన్యమును స్రవింపజేయు ధేనువువలె, ఎప్పుడును నిగ్రహమున కవకాశమియ్యక అనుగ్రహమునే స్రవింపజేయు దయాదేవినే వివేకవంతులగు పెద్దలు శరణముగా పొందుచున్నారు.

అజ్ఞాత నిగ్రహయని ప్రశంసింపబడిన మహిషి గావున దయాదేవి దండించుట యను నిగ్రహమును కించిత్తును సహించదు. ఈశ్వరునియొక్క ఇతరగుణములట్టివికావు. అపరాధులను దండించుటకు గూడ నవి కొన్నివేళల దోడ్పడుచున్నవి. అందుననే, ఆ గుణముల నవలంబించినయెడల అపరాధులమగు మనము దండన లేక తప్పించుకొందు మను నిశ్చయము లేదు. దయ నవలంబించినచో ఆమె నిగ్రహమున కెపుడు నవకాశ మియ్యదు గావున మనము సుఖముగ దండననుండి దప్పించుకొనగలమని రహస్యము నెఱింగిన పెద్దలు ఆ దయాదేవినే శరణము పొందుచున్నారనుట ఇచట శాస్త్రార్థము.

ఇచట దయను శరణము పొందుటచే దండనలేక తప్పించుకొనుట జీవులకు లాభము. ఈ దయాసంబంధమువలన ఆశ్రితులచే నిగ్రహమువలె బహిష్కరింపబడక స్వీకరింపబడుట ఈశ్వరునికి గల్గు లాభమని యూహింపనగును.

శ్లో॥ కమలానిలయ స్త్వయా దయాళుః కరుణే! నిష్కరుణా నిరూపణే త్వమ్।
అత ఏవ హి తావకాశ్రితానాం దురితానాం భవతి త్వదేవ భీతిః ॥ 26

అర్థ :— హే కరుణే = ఓ దయాదేవీ!, కమలానిలయః = శ్రీనివాసుడు, త్వయా=నీ చేత (నీ సంబంధముచేత) దయాళుః = దయగలిగిన వాడుగా, (భవతి = అగుచున్నాడు), నిరూపణే = చక్కగ నాలోచించిన యెడల, త్వమ్ = నీవు, నిష్కరుణా = దయలేని దానివిగా (తోచుచున్నావు), అత ఏవ హి = కావుననేగదా! తావకాశ్రితానాం = నిన్నుచేరినవారి నాశ్రయించినట్టి, దురితానాం = పాపములకు, త్వదేవ = నీ నుండియే, భీతిః = భయము, భవతి = కలుగుచున్నది.

అవతా॥ క్రింది శ్లోకమునందు దయాదేవి ఆశ్రితనిగ్రహమును బహిష్కరించుచున్నదనియు, కనుకనే పెద్దలా దయాదేవిని శరణము నొందుచున్నారనియు చెప్పబడిన విషయము నీ శ్లోకమునందు తగువైన కారణోపన్యాసముచే విశదీకరించు చున్నారు.

తా॥ ఓ దయాదేవీ! శ్రీనివాసుడు దయాళువను పేరు పొందుట నీ సంబంధ మతనికి గల్గుటచేతనే. ఇట్లుండగా, నిపుణ నిరూపణము చేసినప్పుడు నీ యొద్ద కించిత్తుగూడ దయ లేదని తెలుచున్నది. నీ దగ్గఱ దయాసంబంధము లేకుండియు నీ సంబంధముచే పరులను దయాళువులను జేయుచుంటివి. ఇది యొక వేడుకగా నున్నది. లోకమునం దొకనిని ఎప్పుడు నిర్దయుడందుము? వానియొద్ద కేగుటకు భయపడి జనులందరు కంపితులగు చున్నప్పుడుగదా! అట్లే ఈ దయాదేవినిజూచి దయాశ్రితులగువారి నాశ్రయించిన పాపములు "మమ్ము దయాదేవి మ్రింగివేయు" నని మిక్కిలి భయముచే వణకుచున్నవి. ఏవంభవాటి విషయములో నీవు నిర్దయు రాలివగుచున్నావు. శ్రీనివాసునియొద్దకూడ ఆ పాపములకంతటి భీతి లేదు. వాని నాశ్రయించి వాని హృదయమునందయ్యవి ధైర్యముతో కూర్చొనియున్నవి. కావు ననే సాధువులు తమ పాపముల నంతరింపజేయుటకు ఆ శ్రీనివాసునిగూడ వదలి, వాటికి భయప్రదవగు నిన్నే శరణమునొందుచున్నారు" అని యిట్లు దయాదేవిని దయారహిత యని నిందించువ్యాజముచే తదితర భగవద్గుణములకు లేని యుత్కర్ష మీ దయకే గలదని నిరూపించి ఆచార్యు లిచ్చట ఈ చిత్రముచేత స్తుతించుచున్నారు.

"భగవతి దయే !" అను పదమూడవ శ్లోకమునందుచెప్పిన చందమున పాపమనునది అపరాధులయందు భగవంతునికి గలుగు కోపమను నొక జ్ఞాన విశేషమే. ఆ జ్ఞానము భగవాను నాశ్రయించి యుండునుగాన ఆ పాపముల కతనియొద్ద భయము లేదు. దయ ఊటబారినయెడల ఆ కోపమను జ్ఞానవిశేషము మరుగుపడిపోవును గాన ఆ పాపమను కోపమునకు దయకడ భయమని వ్యవహరించుటయైనది. అపరాధులమగు మనము భగవంతుని దయ యూటలూరు నట్లు శరణము పొందినయెడల ఆ యపరాధము లియ్యవగిన దండనలు మనలను పొందకుండ దయాదేవి యడ్డంకిని గలుగ చేయుచున్నది. దయకు తన్నాశ్రయించిన అపరాధులను, వారి నాశ్రయించియున్న అపరాధములను (పాపములను) ఒక్కపరియే రక్షించుట యనునది సాధ్యము గాదు. తన్నాశ్రయించిన పాపులను రక్షించగోరినచో వారి పాపములను తుదముట్టించవలయును. అనగా తత్పాపముచే గలుగు ఫలములను వారి కందనీయరాదు. ఆ పాపములనే రక్షించవలచినచో ఆశ్రితుల చేతులను వదలి పాపములచే గలుగు ఫలములను (దండములను) వారి కందించవలయును. ఇవి రెండును ఒకే సమయమున చేయ వీలుగాదు. గనుక దయాదేవి తన స్వరూపమునకు దగినట్లు తనకు ఆశ్రితాశ్రితులకంటె సాక్షాత్తుగ తన్నాశ్రయించు వారంతరంగులు గావున అపరాధులైన మనబోటి సాక్షాదాశ్రితులను కాపాడి ఆశ్రితాశ్రితములైన పాపములను బహిష్కరించుట యుక్తము. పై శాస్త్రార్థమును, దర్కన్యాయాదులును ఇచట విక్షితములు.

ఇచట ఈశ్వరునికి దయాళువను నామము సార్థకంబగుటయు, జీవులకు నిర్భయముగ దయాదేవియొద్ద నణగి యుండగలుగుటయు లాభములని భావించవగును.

శ్లో॥ అతిలంఘితశాసనేష్వభీక్ష్ణం వృషశైలాధిపతిర్విజృంభితోష్మా ।
పునరేవ దయే ! క్షమానిదానైః భవతీమాద్రియతే భవత్యధీనైః ॥ 27

అర్థ :— హే దయే ! = ఓ దయాదేవి !, అభీక్ష్ణం = ఎల్లప్పుడును, అతిలంఘిత శాసనేషు = భగవదాజ్ఞను మీరినవారియందు, విజృంభితోష్మా = వృద్ధిచెందిన కోపముగలు. వృషశైలాధిపతిః = శ్రీనివాసుడు, పునః = మరల; భవత్యధీనైః =

నీ కధీనమైన, (నీచే నేర్పడవగిన) క్షమానిదానైః = ఓర్పుయొక్క కారణములచే, భవతీమేవ = నిన్నే, ఆద్రియతే = ఆదరించుచున్నాడు.

అవతా॥ 23 24-వ శ్లోకములలో భగవంతునికి, ప్రళయకాలమందును, సృష్టి కాలమందలి కొన్ని సమయములయందును, కోపము గలిగినతఱి దయాదేవి యుప యోగపడు ప్రక్రియను నిరూపించి తద్ద్వారా సర్వకాల సర్వావస్థలయందును ఈశ్వరు నికి దయాపరవశత్వము గలదను విషయమును పై రెండు (25, 26) శ్లోకములో నిరూపించిరి. ఆ రెండు సమయములయందేగాక సృష్టికాలమున నెల్లప్పుడును మన బోటి యపరాధులు కృత్యములను వదలియు, అకృత్యముల నాచరించియు ఈశ్వరాజ్ఞా రూపములగు శ్రుతి స్మృతుల నుల్లంఘించినప్పుడు పరమేశ్వరునికి సమధికమగు సంతాపముగలిగి కోపమేర్పడుచునేయున్నది. అప్పుడు గూడ దయాదేవి యుప యోగపడు ప్రక్రియను నిరూపించుచు ఈ శ్లోకములో ఈశ్వరునియొక్క సార్వకాలిక దయాపారవశ్యమును స్థాపించుచున్నారు.

తా॥ "వేదము, దాని ననుసరించిన శ్రుతిస్మృతులే నాయాజ్ఞ. వీటినుల్లం ఘించువాడు నాకు ద్రోహి" అని భగవదుక్తి. అట్టి భగవంతుని యాజ్ఞను మీరి మాటిమాటికి అతని కధికమైన కోపమును చేతనులు కలుగజేయుచున్నారు. అట్టి తఱి ఆ కోపాగ్నిచే భగవంతునికి విశేషసంతాప మేర్పడుచున్నది. వెంటనే ఆ తాపము నంతరింపజేసికొనవగు నావశ్యకతయు నేర్పడుచున్నది. దానికి రెండు మార్గములుగలవు. మొదటిది తన జ్ఞానబలాదుల సాహాయ్యముచే అపరాధులను దండించివేయుట, అపుడు కోపమణగిపోవును. రెండవది దయనాచరించి ఓర్పును చేపట్టుట. అప్పుడుకూడ కోపాగ్ని శమించిపోవును. వీటిలో రెండవమార్గమునే భగవాను డవలంబించుచున్నాడు. ఇచట ఓర్పునకు కారణమైన దయను భగవాను డాదరించుటయన నేమనగా; 'చేతనులకు తమకు తెలియకుండగనే కొన్నిసమయ ములందు యాదృచ్ఛికసుకృతము మొదలగు పుణ్యములు గలుగుటయు, తదనంత రము సోపానక్రమున సదాచార్య సంబంధముద్వారా ప్రపత్తి మొదలగు ప్రాయశ్చిత్త సంబంధమేర్పడుటయు భగవద్దయచేతనే. ఇట్లు దయచే నేర్పడిన ప్రపత్త్యాద్యు పాయములను చేతను లనుష్ఠించునపుడు భగవంతుని కోపము శమించి అపరాధులను దండించక నతడు ఓర్పు జూపుచున్నాడు' అనుటయే. ఏవంచ భగవంతునికి కోప మేర్పడియున్నపుఁడు దయాదేవి జీవులకు యాదృచ్ఛిక సుకృతము మొదలగు ప్రథమ సోపానముద్వారా భగవంతునియొద్ద ప్రపత్తిచేయుపరకునున్న పరిస్థితులను క్రమ

క్రమముగ గలుగజేసి వారియందు భగవంతుని కేర్పడిన కోపము నుపశమింపజేసి దండనమును తొలగించి వారికి ఉత్తమపురుషార్థము లభించునట్లు చేయుచున్నదను శాస్త్రార్థమిచట నేర్పడుచున్నది.

భగవంతునికి మనస్సంతాప ముపశమించుటయు, జీవులకు తమయందు దయా పక్షపాతమేర్పడుటయు నిచట ఫలములని తెలియుకొనవలయును.

శ్లో॥ కరుణే దురితేషు మామకేషు ప్రతికారాన్తరదుర్జయేషు ఖిన్నః ।
కవచాయితయా త్వయైవ శార్ఙ్గీ విజయస్థానముపాశ్రితో వృషాద్రిమ్॥

అర్థ :— హే కరుణే ! = ఓ దయాదేవి !, మామకేషు = నాదైన ; దురితేషు = పాపములు, ప్రతికారాంతర దుర్జయేషు సత్సు = ఉపాయాంతరములచే జయించుటకు వీలుకానప్పుడు, ఖిన్నః = మనోవేదనగలవాడైన, శార్ఙ్గీ = శార్ఙ్గమను ధనుస్సును ధరించిన శ్రీనివాసుడు, కవచాయితయా = కవచముగానున్న ; త్వయైవ = నీతోడనే, వృషాద్రిం = ఈ తిరుమలను, ఉపాశ్రితః = ఆశ్రయించియున్నాడు.

అవతా॥ క్రింది శ్లోకమునందు జీవులు ఆచరిందు పాపములచే భగవంతునికి మనోవ్యథ కలుచున్నదని చెప్పిన విషయమును, ఈ శ్లోకమునందు ఆచార్యులు తనను దృష్టాంతముగచేసి నిరూపించుచున్నారు. అందరి పాపములకంటె తన పాపములు మిక్కిలి ఎక్కువగాను ప్రబలముగాను నున్నందున వీటిని జయించు విషయములో ఈశ్వరుడు మిక్కిలి విచారముచెంది కడకొక మార్గము కనిపెట్టి యున్నాడని చెప్పుచున్నారు.

తా॥ తన పాపమును గుఱించి "అపి నిఖిలలోక" అను 12-వ శ్లోకము నందు చెప్పియున్నారు. అపరాధియందు మొదట ప్రభువునకు కోపముకలుగును. ఇట్టి అపరాధముచేసినవాడు పుత్రునివంటి ఆప్తుడైనచో వానికి అపరాధఫలమైన దండనము తప్పించు విషయములోను, ఇకపై నిట్టి యపరాధము సంభవింపక నుండుటకును, ఉపాయము కనిపెట్టుటయందు ఆ కోపమే చింతగా మారును. ఆరీతిలో — "అనుభవితుం" అను 34-వ శ్లోకమునందు తాను చెప్పబోవునట్లు తన పాపములు యేవిధముగను నశించనివి కనుక "వాటిని యెట్లు జయించగలము — అనగా వాటిచే సంభవించు దండనమునుండి యెట్లు కాపాడగలము" అను విషయ

ములో మిక్కిలి విచారముకలిగిన శ్రీనివాసుడు శార్ఙ్గమను ధనుస్సును ధరించి, తాను (కవి) చేయు పాపములు తీక్ష్ణాగ్రములైన బాణములవలె హృదయవేదన కలిగించునవి కాకుండుటకు దయయను దృఢమైన కవచమును ధరించి, వారు వారు కోరిన విషయములో జయము నివ్వగల క్షేత్రప్రభావముతో గూడిన వృషగిరియను తిరుమలను చేరి తన పాపములను జయించుట (మన్నించుట) కొఱకు వేచియున్నాడని యిచ్చట కవియుత్ప్రేక్ష.

వాస్తవములో శ్రీనివాసుడు అందరి పాపముల బోగొట్టి సద్గతి నొసంగుటకై చాలకాలమునకు ముందే ఈ తిరుమలను చేరియున్నప్పటికిన్ని, ఇతరులయొక్క పాపములను జయించుటకు యింత ప్రయత్నము అవసరములేదు. తన పాపములే మిక్కిలి ప్రబలములు కనుక వీటిని జయించుటకే పరమపురుషుడు యింత ప్రయత్నముతో నిచ్చట వేంచేసియున్నాడు అని ఆచార్యుల అభిప్రాయము.

ఒక రాజు తన శత్రువులను జయించుటకు వీలులేని సందర్భమునందు తన శరీరమును రక్షించగల ఒకవిధమైన కవచమును, ధనుస్సును ధరించి ఒక పర్వత గుహలో నివసించుచు ఆ శత్రువును జయించుటకు తగు సమయము నెట్లు నిరీక్షించు చుండునో, అట్లే శ్రీనివాసుని స్థితియు నని కవిచిత్రము.

పరమపురుషుడు పరమదయచే అర్చాసమాధిని బొంది పర్వతశిఖరమునం దుంచిన దీపమువలె ఈ తిరుమలయందు ప్రకాశించుచున్నాడు. ఇతని యుద్దేశము యేమనగా — ఇట్టి పుణ్యక్షేత్రములందు తాను సన్నిహితుడై యున్నయెడల అపరాధు లైన జీవులు ఒకప్పుడైనను యిచ్చటికి వచ్చి ఈ క్షేత్రప్రభావముచే తనయందు భక్తి యేర్పడి తనను ఆపాదచూడము ఒకమారైనను సేవించినయెడల వారి సర్వపాప ములు తొలగి సద్గతి నొందగలరు. కాన యిట్టి యవతారములకు దయయే మూల కారణము. అట్లు ఆ యపరాధిజీవుడు తనను సేవించునప్పుడు తాను చేసిన పాప ములను గుఱించి హృదయము ద్రవించి క్షమించగోరును. ఇకపై నిట్టి పాపముల నాచరింపడు. ఇట్టి పరిస్థితి యేర్పడిన యెడల ఇదియే జీవుల పాపములను ఈశ్వరుడు దయాకవచమునందుండి జయించుట యనునది. ఈ భావముతోనే సర్వేశ్వరు డిచ్చట వేంచేసియున్నాడని శాస్త్రార్థము.

"త్వయైవ విజయస్థానం" అను సమభివ్యవహారమువలన ఈ తిరుమల విజయస్థానమగుటయు (విశేష ప్రభావశాలి యగుటయు) దయాదేవిచేతనే కలుగు

చున్నది అని పెద్దలు చేసిన వ్యాఖ్యానము ఇచ్చట రస్యము. అట్లే "వృషాద్రిం" అను పదము కూడ గమనించదగినది.

ఈశ్వరునికి జీవుల పాపములను జయించుటయు, జీవులకు పాపములు తొలగుటయు యిచ్చట ఫలమని యూహింపవలెను.

శ్లో॥ మయితిష్ఠతి దుష్కృతాంప్రధానే మితదోషానితరాన్ విచిన్వతీత్వమ్।
అపరాధగణై రపూర్ణకుక్షిః కమలాకాన్తదయే! కథం భవిత్రీ ॥ 29

అర్థ:— హే కమలాకాన్తదయే = ఓ శ్రీనివాసుని దయాదేవీ! దుష్కృతాం = పాపులలో; ప్రధానే = అగ్రగణ్యుడగు; మయి = నేను; తిష్ఠతి సతి = ఉండగా; మితదోషాన్ = స్వల్పదోషముగల; ఇతరాన్ = వేరుజీవులను; విచిన్వతీ = వెదకుచున్న; త్వం = నీవు; అపరాధగణైః = పాపవర్గములచే; అపూర్ణకుక్షిః = కడుపు నిండనిదై; కథం = ఎట్లు! భవిత్రీ = జీవింపగలవు.

అవతా॥ క్రింది శ్లోకమునందు చెప్పినరీతిగ తన పాపము లసంఖ్యేయములు— ఎన్నోవిధములైనవి. అట్టి పాపములుగల తన్నే మొదట రక్షించవలెను, లేనిచో హే దయాదేవీ! నీ స్వరూపమునకే హాని కలుగును. అని దయతో మాటలాడు ప్రక్రియచే, తాను మహాపాపియనియు, తనను అవశ్యము కాపాడవలసిన బాధ్యత దయకున్న దనియు, ఆచార్యు లీ శ్లోకమున ప్రతిపాదించుచున్నారు.

తా॥ "హే దయాదేవీ! నీయొక్క పెద్దకడుపు నిండునట్లు వివిధములై, పెద్ద పరిమితిగల, రుచికరములైన ఆహారములవలె నుండు వివిధమైన పలు పాపములను పలుమారుచేసి అపరాధులలో నగ్రగణ్యుడని పేరుపొందిన నేను నీ యెదుట ఆ పాపము లనే ప్రభూతాహారములను ధరించి నిలచియుండగా, నీ కడుపును ఈషత్తైనను నింపింపజాలని కొద్దిపాపములేగల వేరు మనుష్యులను నీవు వెదకికొని పోయిన యెడల, వారి కొద్ది పాపములే నీ కాహారముగా లభించును గాన కడుపునిండక నీవు యెట్లు ఆత్మధారణము చేయగలవు? పూర్ణాహారము కదా జీవనహేతువు! కాన నన్ను కాపాడనియెడల నీవే కడుపునిండక జీవింపలేక కష్టపడుదువు! ఏపంచ ఈ స్థితిలో నీవే దయనీయదశ (నా దయను యెదురుచూచు దశ) ను పొందియున్నావు." అని ఈలాంటి క్రొత్త ప్రక్రియతో దయాదేవీ మహిమను యిచ్చట ఆచార్యులు విశదీకరించుచున్నారు.

దయాదేవియొక్క పూర్ణస్వరూపము ఉత్కృష్టమైన రీతిలో ఎప్పుడు ప్రకాశించుననగా — ఏ ఉపాయముచేతను కడతేరుటకు వీలులేక పెద్ద పెద్ద పాపముల నాచరించి అధోగతిగా మునిగిపోవు పరిస్థితిలో నుండువానిని రక్షించునప్పుడే కదా! అటుగాక స్వల్పాపరాధమే గలవానిని రక్షించునప్పుడు దయాదేవికి అట్టి గొప్పప్రభావ మేర్పడదు గాన అట్టి మహాపాపిని (దయకు ఉత్తమమైన పాత్రమును) వెదకునప్పుడు తనకే ప్రథమస్థానము లభించవలెనని కవిహృదయము.

ఎంత పెద్ద పాపములైనను వాటిని ఒక చిన్న వ్యాజముచేత శ్రీనివాసుడు తన దయచే క్షమించును. పెద్దపాపము లాచరించితిమే యిక మనకు గతిలేదు అని భయపడి వానివద్దకు పోకుండ తొలగవద్దు అని శాస్త్రార్థమును నిరూపించుటకై దయాదేవి ఈరీతిగా నిచ్చట స్తుతింపబడినది. ఇట్లుగాక, దయాదేవికి ఆహారముగా అనేక పాపములను అడుగడుగుకు మన మాచరించి, ఆమెకు సమర్పించి, ఆమె యనుగ్రహమునకు పాత్రము గావలెను అను తాత్పర్యము నిచ్చట స్వీకరించినయెడల సర్వశాస్త్రములతోను విరోధము ఏర్పడును.

ఈశ్వరునికి దయనీయమైన ఉత్తమపాత్రలాభమున్ను, జీవునికి భయము లేకుండుటయు ఇచ్చట ఫలమని యూహించవలెను.

శ్లో॥ అహమస్మ్యపరాధచక్రవర్తీ కరుణే! త్వం చ గుణేషు సార్వభౌమీ ।
విదుషీ స్థితిమీదృశీం స్వయం మాం వృషశైలేశ్వరపాదసాత్కురు త్వమ్ ॥

అర్థ :— హే కరుణే = ఓ దయాదేవీ! అహం = నేను, అపరాధ(ధి) చక్రవర్తీ = అపరాధములకెల్ల (అపరాధులకెల్ల) చక్రవర్తిగా, అస్మి = ఉన్నాను. త్వం చ = నీవును, గుణేషు = సమస్తగుణములయందును, సార్వభౌమీ = పట్టపురాణివిగా నున్నావు, ఈదృశీం = ఇటువంటి, స్థితిం = మన యిర్వురిపరిస్థితిని, విదుషీ = ఎఱుంగుచున్న, త్వం = నీవు, మాం = నన్ను, స్వయం = స్వయముగనే, వృషశైలేశ్వరపాదసాత్కురు = తిరుమల కధీశుడైన శ్రీనివాసుని పాదారవిందములయొక్క సేవకునిగా నొనరింపుము.

అవతా॥ క్రింది రెండుశ్లోకములలో చెప్పిన చొప్పున మహాపాపియైన తనకు దయాదేవి యొసంగదగిన ఫలము నీ శ్లోకమునందు ప్రార్థించి ఈ దశకమును ముగించుచున్నారు.

తా॥ ఓ దయాదేవీ! నే నపరాధములకెల్ల చక్రవర్తిని. నీవును భగవద్గుణములకెల్ల సార్వభౌమివి. నా పరిపాలనకు లోబడిన పాపము లెట్లు లెక్కకు మిక్కుటములో, అట్లే నీ యాధిపత్యమునకు లోబడిన భగవద్గుణములును అసంఖ్యేయములుగా నున్నవి. స్వతంత్రముగా ఇద్దరు చక్రవర్తు లొక్కదేశమున కుండుట ఎల్లప్పుడును హానికారిగ నుండును. కావున మన ఇర్వురియొక్క బలాబలములను స్వయముగ నెఱింగిన నీవు నీ సార్వభౌమత్వమునకు దగినట్లు నన్ను జయించి, అనగా నా పాపములకు తత్ఫలముల నొసంగక క్షమించి నీ భర్తయగు వేంకటాద్రీశ్వరుని పాదారవిందమునందు నన్నుఁ జేర్చవలయును. ఇదియే నేను కోరు ఫలము.

అతిసమర్థయగు నొక సార్వభౌముపత్ని తన భర్తకు విరోధియైన రాజును జయించి వానిని తన భర్తయొక్క పాదారవిందములకడ జీవగ్రాహముగా ఎట్లు చేర్చునో, అట్లే దయాదేవియు నిచట జేయుటకై ప్రార్థింపబడుచున్నది.

సార్వభౌమి బలహీనుడగు నొక చిన్న రాజును జయించినచో విశేషమగు మహిమ కలుగనేరదు. తనతో సమానుడైన బలశాలియగు నొక పెద్ద చక్రవర్తి నోడించినచో విశేషమగు ప్రఖ్యాతి గలుగును. కావుననే ఆచార్యులిచ్చట తనను చక్రవర్తిగా నిరూపించుకొనిరి. అపరాధచక్రవర్తియను పదమునకు రెండు మూడు తెఱంగుల నర్థముఁ జెప్పుదురు. (i) అపరాధమను చక్రమును త్రిప్పువాడు (అపరాధచక్రం వర్తయతి), (ii) అపరాధసమూహము మధ్య వర్తిలువాడు. (అపరాధ చక్రే = సమూహే, వర్తతే) (iii) అపరాధముల కధిపతి.

దయాసార్వభౌమియు తాను ముందు ప్రవేశించి పిదప తనకు పరికరములుగా నున్న భగవద్గుణములను ప్రేరేపించి ఈ యపరాధిని జయించుచున్నది. అనగా తత్పాపఫలములగు దండములనుండి వీనిని రక్షించుచున్నది. జయింపబడిన వానిని స్వస్థలమునకు దీసికొనిపోవునట్లు వీనిని గూడ దయాదేవి తనకు స్వస్థలమైన తిరుమలకు తీసికొనిపోవుచున్నది.

“వృషశైలేశ్వరపాదసాత్కురు” అను పదముచే పై దశకమునందు ప్రార్థింపబడనున్న వేంకటాద్రి సానుప్రదేశ నివాసమును ఇచ్చట సూచించుటయైనది. ఇప్పుడు “వృషశైలేశ్వర” అను పదముచే పర్వతేశ్వరమగు తిరుమలయు. “పాద” పదముచే సానుప్రదేశమును వివక్షితములు. ఇట్టి జయమునే “కరుణే దురితేషు.... విజయస్థానం” అను 28-వ శ్లోకమునందు ప్రస్తావించిరి.

ఇచట నీశ్వరునికి ప్రతిపక్షియగు అపరాధిజయమును, జీవునికి ఈశ్వర పాదారవింద ప్రాప్తియు ఫలములని యెన్నదగును.

తృతీయదశకము సమాప్తము.

శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః.

---

## చ తు ర్థ ద శ క ము

శ్లో॥ అశిథిలకరణేఽస్మిన్నక్షతశ్వాసవృత్తౌ
వపుషి గమనయోగ్యే వాసమాసాదయేయమ్ ।
వృషగిరికటకేషు వ్యంజయత్సు ప్రతీతైః
మధుమథనదయే ! త్వాం వారిధారావిశేషైః ॥ 31

అర్థ :— హే మధుమథనదయే = మధువనెడు రాక్షసుని మథించినట్టి ఓ శ్రీనివాసుని దయాదేవీ ! అస్మిన్ = ఈ, వపుషి = శరీరము, అశిథిలకరణే = పట్టు వీడని యింద్రియములు గలదిగను, అక్షతశ్వాసవృత్తౌ = ఎడతెగని నిట్టూర్పులం గలదిగను, (అత ఏవ = కనుకనే,) గమనయోగ్యే సతి = సంచారక్షమముగనున్న సమయమునందే, ప్రతీతైః = ప్రసిద్ధముగా నెఱుంగబడిన, వారిధారా విశేషైః = తీర్థధారలచే, త్వాం = నిన్ను – (నీ స్వభావమును), వ్యంజయత్సు = జ్ఞాపకపరచు చున్న, వృషగిరికటకేషు = తిరుమల చఱియలలో, వాసం = నివాసమును, అసాద యేయం = పొందెదను.

అవతా॥ క్రింది దశకములయందు శ్రీనివాసుని గుణములలో దయయే అత్యుత్కృష్టగుణ మగుటచేతను, ఆ దయాదేవికి సర్వేశ్వరు డెప్పుడును పరతంత్రుడై యుండుటచేతను అతిపాపియైన తన్ను ఆ దయాదేవి జయించి, వేంకటాధీశ్వరుని పాదారవింద పరిసరమున జేర్చవలెనని ప్రార్థంచిరి. అట్లు ప్రార్థించుచు గత దశకాన్తిమ శ్లోకమునందు వేంకటాద్రి సానుప్రదేశమునందు తనకు వాసమపేక్షిత మని యును సూచించిరి. ఈ దశకమునందు — ఈ శరీరవియోగానంతరము భగవత్పాదారవిందములకడ కైంకర్యముజేయుట తన కెట్లభిమతమో, అట్లే ఈ దేహముండువరకుకూడ అతిప్రభావోపేతమై యుత్తమ దివ్యదేశమైన తిరుమల చరియల

యందు నివాసమును తన కభిమతముగావున దానినిగూడ దయాదేవియే యనుగ్ర హింపవలయునని ప్రార్థించి, ఆ తిరుమల సమీపప్రదేశముల యందలి మాహాత్మ్యము నెఱుకపరచి క్రింది దశకమునందు చెప్పిన చొప్పున దయాదేవి తన్ను జయించి తెచ్చిన పిమ్మట పాపములనుండి కాపాడుటకై భగవానునియొక్క న్యాయస్థలము నందు స్వయముగ న్యాయవాదముచేయు రీతిని ఒక విలక్షణ వైచిత్రితో వర్ణించు చున్నారు. ఈ ప్రథమ శ్లోకమునందు వేంకటాద్రియందలి వాసమును కోరుచున్నారు.

తా॥ వేంకటాద్రియందు వివిధములైన పవిత్రములగు సెలయేళ్లు ప్రవహించు చున్నవి. వాటి ప్రభావము పురాణములయందు విశేషముగ ప్రతిపాదింపబడి యున్నది. ఆ పుణ్యతీర్థ ప్రవాహినులు తమ్ము సేవింపువారికి తమయందున్న మాధుర్యశైత్యపాపతాపహరత్వాదిగుణములచే తమకు సమమైన భగవద్దయా ప్రవాహమును జ్ఞాపకపరచుచున్నవి. భగవానుని దయయే ఈ పుణ్యతీర్థప్రవాహ రూపము ప్రవహించుచున్నదా ! యని తోచుచున్నది. అట్టి జలరామణీయకము స్థలరామణీయకమునుం గల యత్యుత్తమ క్షేత్రమైన తిరుమలచఱియలయందు ఈ శరీరమునకు ఇంద్రియముల మూలముగాను, ప్రాణవాయువు మూలముగాను నెట్టి శైథిల్యమును సంభవించకపూర్వమే దృఢముగా నుండునపుడే నేను వసించెద ననియు, శరీరేంద్రియములకు శైథిల్యమేర్పడిన పిమ్మట ఇట్టి చఱియప్రదేశములం బొందుటయు, అట్లు పొందినమీద నిత్యకర్మముల ననుష్ఠించుటయు సాధ్యముగాదు కనుక సమీచీనస్థితియం దున్నపుడే అట్టివాసమును పొందెదననియు ప్రార్థించు చున్నారు.

"తిరువాయిమొழி" లో (కిళరొళి) లో నమ్మాళ్వార్లు ఆశించినదియే ఇచ్చట ఆచార్యుని హృదయములో పరివర్తించుచున్నదని భావించవలయును.

శ్లో॥ అవిదిత నిజయోగక్షేమ మాత్మానభిజ్ఞం
గుణలవరహితం మాం గోప్తుకామా దయే ! త్వమ్ ।
పరవతి చతురైస్తే విభ్రమైః శ్రీనివాసే
బహుమతిమనపాయాం విందసి శ్రీధరణ్యోః ॥ 32

అర్థ:— హే దయే = ఓ దయాదేవీ ! అవిదిత నిజయోగక్షేమం = ఎఱుంగ బడని తన యోగక్షేమములు గలవాడును, ఆత్మానభిజ్ఞం = స్వీయస్వరూపము నెఱుం గనివాడును, గుణలవరహితం = గుణలేశముగూడ లేనివాడును నగు, మాం =

నన్ను, గోప్తుకామా = రక్షింపఁదలచిన, త్వం = నీవు, శ్రీనివాసే = శ్రీనివాసుడు, చతురైః = సమర్థములైన, తే = నీయొక్క, విభ్రమైః = విలాసములచే, పరవతి సతి = (నీకు) పరవశుండగుచుండగా. శ్రీధరణ్యోః = శ్రీదేవి భూదేవులయొక్క, అనపాయాం=స్థిరమైన, బహుమతిం=బహుమానమును, విందసి=పొందుచున్నావు.

అవతా॥ క్రింది శ్లోకమునందు వేంకటాద్రి ప్రాప్తి నపేక్షించిరి. అచట చేరిన తరువాత తనకై దయాదేవి న్యాయవాదము చేయు ప్రక్రియను పై శ్లోకములో ప్రస్తావించనున్నారు. ఏవిధమగు గుణలేశము కూడ లేని తనను కాపాడుటకై దయాదేవి అట్లు ప్రయత్నించు సమయమున నేర్పడు ఒక పరిస్థితిని ఈ శ్లోకములో వివరించుచున్నారు.

తా॥ ఇదివరకు పొందని యొక వస్తువును క్రొత్తగా పొందుటకు యోగ మనియు, పొందిన వస్తువును తగురీతిలో రక్షించి యుపయోగించుకొనుట క్షేమ మనియు శాస్త్రకారులు నిరూపించియున్నారు.

పాపములను దొలగించుకొని మోక్షము పొంద నాశపడువానికి సదాచార్య సమాశ్రయణమూలముగా లభించెడు తత్త్వహిత పురుషార్థవివేకమును యోగము గను, లబ్ధమైన వివేకమునుబట్టి తన కనురూపమైన హితము ననుష్ఠించి పురుషార్థము నొందుటకు క్షేమముగను పెద్దలు బోధించియున్నారు.

అట్టి యోగక్షేమములు నా కేవియో నే నెఱుంగను. దాని నెఱుంగుట కాత్మ స్వరూపజ్ఞానము ముఖ్యకారణము. స్వీయస్వరూప మిట్టిదని తత్త్వముగ తెలిసిన పిమ్మటనే దానికి సంబంధించిన యోగక్షేమముల నెఱుంగదగును. అట్టి యాత్మ జ్ఞానము నాకు లేదు. ఈ యాత్మజ్ఞానమును బొందవలయునన్నచో సత్త్వగుణో ద్రేకము గలిగి దాన సంభవించు ఆత్మగుణములు గలిగియుండవలయును. అట్టి గుణములలో నొక లేశముగూడ నాయొద్దలేదు. ఓ దయాదేవీ! ఇటువంటి నన్ను కాపాడుటకై నీవు ప్రయత్నించి నీ మధురాపవిలాసాదులచేత నీ నాయకుండైన శ్రీనివాసుని స్వాధీనపరచుకొనుచున్నపుడు నీ సపత్నులైన శ్రీదేవీ భూదేవులు నీ సామర్థ్యమును, ఆశ్రిత సంరక్షణ దీక్షితత్వమును, భర్తయైన శ్రీనివాసుని వశీక రించుకొను ప్రక్రియను కన్నులార గాంచి నీయందు స్థిరమును, విలక్షణమును నైన బహుమానమును ప్రదర్శించుచున్నారని దయాదేవి నిచట స్తుతించుచున్నారు.

స్త్రీలు తమ సవతులయొద్దనుండి స్థిరమగు బహుమతినందుట యనునది చాలయు నరుదు.

ఈశ్వరుడు, అతని సతులు మొదలైన సమస్తపరివారమును చేతనసంరక్షణ దీక్షలో బద్ధశ్రద్ధులు. తదర్థమే వారు వివిధమార్గములయందు పలుతెఱంగుల ప్రయత్నించుచున్నారు. అట్లుండ నీ చేతనసంరక్షణ విషయమున దయాదేవికే ప్రథమస్థానము నియ్యవలయును. దయాదేవి లేనిచో మహాపరాధులైన సంసారులు (ఈశ్వరుని కోపమునగి) ఉజ్జీవించుటకు వేఱు గతిలేదు కావున శ్రీ భూదేవులుగూడ బహూమానించు స్థితిలో దయకు ప్రాధాన్యమున్నదను శాస్త్రార్థమిచట వివక్షితము.

శ్లో॥ ఫలవితరణదక్షం పక్షపాతానభిజ్ఞం
ప్రగుణమనువిధేయం ప్రాప్య పద్మాసహాయమ్ ।
మహతి గుణసమాజే మానపూర్వం దయే త్వం
ప్రతివదసి యథాహ౯ం పాప్మనాం మామకానామ్ ॥ 33

అర్థ:— హే దయే = ఓ దయాదేవీ! త్వం = నీవు, ఫలవితరణదక్షం = ఆ యా కృత్యములకుఁ దగిన ఫలముల నొసంగు సామర్థ్యము గలిగినట్టియు, పక్షపాతానభిజ్ఞం = పక్షపాతమను దాని నెఱుంగనట్టియు, ప్రగుణం = ఉత్కృష్టములగు గుణములు గలిగినట్టియు, అనువిధేయం = అందరికి నాశ్రయింపఁ దగిన సౌలభ్యముఁ గలిగినట్టియు, [ప్రగుణమనువిధేయం = ఉత్కృష్టమగు నష్టాక్షర్యాది మంత్రములచే వశీకరింపఁదగినవాడునగు,] పద్మాసహాయం = లక్ష్మీపతియగు పరమపురుషుని, ప్రాప్య = పొంది, మహతి = గొప్పదైన, గుణసమాజే = జ్ఞానము మొదలగు గుణములయొక్క సమాజమునందు, మానపూర్వం = ప్రమాణపూర్వకముగ, మామకానాం = మదీయములైన, పాప్మనాం = పాపములను గుఱించి, యథాహ౯ం = తగురీతిగ, ప్రతివదసి = ప్రతివాదము గావించుచున్నావు.

అవతా॥ దయాదేవి తన పాపములనుఁగూర్చి ప్రతివాదముఁజేయు ప్రక్రియ నీ శ్లోకములో ప్రతిపాదించుచున్నారు. లోకమునం దిరువురికి వివాదము సంభవించినపుడు అర్హుఁడైన న్యాయవాదికడకేగి వారి వారి వాదములకు వారిరువురు ప్రతిపాదించెదరు. సర్వవిధయోగ్యతలు గలిగినవాడగు ఆ న్యాయాధిపతి రెండు వాదములను విని తగిన తీర్మానముఁ జేయుచుండుట అనుభవసిద్ధమైన విషయము. అట్లే యిచటగూడ ఒక విచారము ప్రవర్తిలుచున్నదని కవి చిత్రించుచున్నారు.

తా॥ న్యాయాధిపుఁడు ఆ యా కృత్యములకుం దగురీతిని ఫలముల నిచ్చుటయందు సమర్థుండుగా నుండవలయును. ఏ పక్షమునందును అభిమానమును జూపక నిష్పక్షపాతుఁడుగ నుండవలయును. ఉత్తమగుణపూర్ణుఁడుగాను, ఎల్లర

చేతను నిర్భయముగ నాశ్రయింపఁబడి తమ తమ వాదములను విశదీకరించుటకు సులభుఁడుగా నుండవలయును. న్యాయసభలో నిష్పక్షపాతులును, మహనీయులు నైన అనేక మేధావులు ఉండవలయును. అట్టి సందర్భమునందు వాది ప్రతివాదులు తమ తమ వాదములను ప్రతిపాదించిరేని సభ్యులగు పెద్దల యభిమతము ననుసరించి న్యాయాధిపతి తీర్పుచేయును. అట్లే ఇచట జీవునియొక్క (కవియొక్క) పాపౌఘమే వాదివర్గము. ప్రతివాది దయాదేవి. భగవానుని జ్ఞాన బలాదిగుణవర్గమే సభ్యసమాజము. లక్ష్మీసహాయుఁడైన శ్రీనివాసుఁడు న్యాయాధిపతి. ఇట్టి సభయందు వాదులైన పాపములు, "నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి" (కల్పకోటి కాలమైనను చేసిన కర్మలకు ఫలము లనుభవింపనిచో ఆ కర్మలు నశింపవు). అను నేతదాదిప్రమాణముల ననుసరించి, ఈ సంసారియగు జీవుఁడు తానుచేసిన కర్మలకు ఫలముల ననుభవించియే తీరవలయును. వాటిం దొలఁగించుటకు వేఱగు నుపాయము లేదు. కావున వీఁడు గావించిన పాపములకు తగు దండనముల నియ్యవలయునని వాదించుచున్నవి. ఈ వాదమునకు దయాదేవి చేయు ప్రతివాదము పై శ్లోకములో వర్ణింపఁబడనున్నదని కొందరి యభిప్రాయము. ఈ శ్లోకమునందే ప్రతివాదప్రక్రియలను కొన్నింటిని కొందరు వ్యాఖ్యానించుచున్నారు. దాని నిచ్చట ప్రతిపాదించుచున్నాము.

దయాదేవి చేయు ప్రతివాద మేమన:— ఈ జీవుఁడు బహువిధపాపముల నాచరించెననుట వాస్తవమే. కాని శాస్త్రములయందు "నాభుక్తం క్షీయతే కర్మ" అని చెప్పఁబడిన విషయము ప్రపన్నునియం దన్వయించదు. ప్రపత్త్యాది బ్రహ్మవిద్యలకు సంబంధించినవానిని తద్విద్యాప్రభావంబున అభ్యుపగత ప్రారబ్ధమనెడు కర్మతప్ప శేషించిన సర్వకర్మములును, "ప్రారబ్ధేతర పూర్వపాప మఖిలం ప్రామాదికం చోత్తరం" అని చెప్పఁబడిన ప్రకారమున బంధించవని శాస్త్రములును, భగవానుఁడును చెప్పియుండుటచేత నట్టి కర్మములకు ఫలముల నియ్యక ప్రపన్నుఁడైన వీనికి మోక్షము నొసంగి కాపాడవలయు ననుటయే. ఈ దయావాదమును విని మహాగుణములు ఈ వాదమే యుక్తియుక్తముగ నున్నవని చెప్ప, ప్రక్కన నున్న మహాలక్ష్మియు నా మోదమునుఁజూప పరమపురుషుఁడగు నీతిపతి దయాదేవి కక్ష్య ననుసరించియే తీర్పుఁజేసి జీవుని వదలివేయుచున్నాఁడు. ఈ శాస్త్రార్థమిచట వివక్షితమైయున్నది.

అను విధేయశబ్దమునకు ప్రాడ్వివాకుండనునర్థము గలదని కొందరు చెప్పుదురు.

" మహతి గుణసమాజే " అను నీ సప్తమీ విభక్తికి అనాదరము, నిర్ధారణము మొదలగు నర్థములను వివక్షించి రసవత్తరములైన కొన్ని యర్థములను గూడ వ్యాఖ్యానింపుచున్నారు.

శ్లో॥ అనుభవితుమఘౌఘం నాలమాగామికాలః
ప్రశమయితుమశేషం నిష్క్రియాభిర్నశక్యం ।
స్వయమితి హి దయే త్వం స్వీకృతశ్రీనివాసా
శిథిలితభవభీతిః శ్రేయసే జాయసే నః ॥ 34

అర్థ :— హే దయే = ఓ దయాదేవీ !, అఘౌఘం = పాపసమూహమును, అశేషం = నిశ్శేషముగ, అనుభవితుం = అనుభవించుటకు, ఆగామికాలః = రానున్న కాలము, నాలం = చాలదు, అఘౌఘం = పాపసమూహమును, అశేషం = నిశ్శేషముగా, నిష్క్రియాభిః = ప్రాయశ్చిత్తములచే, ప్రశమయితుం = పోగొట్టుటకును, అశక్యం = సాధ్యము గాదు, ఇతి = అని యిట్లు వాదించి, స్వయం — తానే, స్వీకృత శ్రీనివాసా = వశీకరించుకొనబడిన శ్రీనివాసుని గలిగిన, త్వం = నీవు, శిథిలితభవభీతిః సతీ = వదలు గావించబడిన సంసారభీతిని గలదానవై, నః = మాయొక్క, శ్రేయసే = శ్రేయస్సుకొఱకు, జాయసేహి = (కారణముగ) అగుచున్నావు గదా !

అవతా॥ దయాదేవి గావించు ప్రతివాద మిచట వర్ణింపఁబడుచున్నది.

తా॥ పాపములఁ దొలఁగించుటకు రెండు మార్గములు గలవు. మొదటిది పాపఫలముల ననుభవించుట. రెండవది ప్రాయశ్చిత్తము నొనరించుట. ఈ రెండు ఉపాయములు శాస్త్రసిద్ధములైనను, ఈ జీవుని విషయములో సాధ్యము గానివి. వీఁడు చేసిన, చేయుచున్న పాపము లనంతములు కావున భవిష్యత్కాలములో పూర్తిగ ఫలముల ననుభవించినను ఆ కర్మములు నశింపవు. కాల మనంతమైనను వీని కర్మము తొలఁగదు. శాస్త్రోక్తప్రకారముగ చక్కని రీతిలో ప్రాయశ్చిత్తముల ననుష్ఠించి, ఆ పాపములం దొలఁగించుకొనుట యనునది ఎంతయు నసాధ్యము.

అసాధ్యమైన విషయములో నేమి జేయుట ? కావున, " నా పాదముల నాశ్రయించిన వానిని (ప్రపన్నుని) క్షమించి పరిరక్షించెద " నని తాము చెప్పినట్లుగ వీని యపరాధమును క్షమించి కాపాడుటయే యిపుడు చేయఁదగినదియు, సాధ్యమై

నదియు నగు కార్యముగ నున్నదని ప్రతిపాదించి స్వగుణములచే శ్రీనివాసుని వశీకరించి మహాపరాధులమగు మా శ్రేయస్సులకొఱకు నీవు పాటుపడుచున్నావు. ఆహా ! నీ వెంతటి వాత్సల్యము గలదానవోగదా !

ఈ శ్లోకమునందు, "స్వీకృత శ్రీనివాసా" అను పదముచేత దయాదేవి శ్రీనివాసుడను నీతిపతిని తనపక్షమున కనుకూలునిగ వశీకరించుటకు క్రింద చెప్పినట్టుగ బహువిధముల వాదించి పాటుబడుచున్నదని భావమేర్పడుచున్నది.

దయాదేవి యొనరించు ప్రతివాదప్రక్రియ ఇచట చెప్పఁబడుటలేదు. అది పూర్వశ్లోకమునందే చెప్పఁబడిన దనుపక్షములో 'ఇతి' అను పదమునకు "ఇట్లాలోచించి" అను నర్థమును చెప్పుకొనవలయును. అప్పుడు సమస్త శ్లోకమును కవి యొక్క వాక్యమని భావించఁదగును.

శ్లో॥ అవతరణవిశేషైరాత్మ లీలాపదేశైః
అవమతి మనుకంపే ! మందచిత్తేషు విందన్ ।
వృషభశిఖరినాథ స్త్వన్ని దేశేన నూనం
భజతి శరణభాజాం భావినో జన్మభేదాన్ ॥ 35

అర్థ :— హే అనుకంపే ! = ఓ దయాదేవీ !, వృషభశిఖరినాథః = శ్రీ వేంకటాచలాధీశుఁడగు శ్రీనివాసుఁడు, త్వన్నిదేశేన = నీ యాజ్ఞవలన, ఆత్మలీలాపదేశైః = తనయొక్క లీలలను వ్యాజముగాఁ గలిఁగిన, అవతరణ విశేషైః = ఆ యా యవతారములచే, మందచిత్తేషు=మందబుద్ధిఁగలిగిన వారియందు, అవమతిం= అవమానమును, విందన్ = పొందుచు, శరణభాజాం = శరణాగతులయొక్క. భావినః = (అనుభవించుటకు) నిశ్చయముగా కలుగనున్న, జన్మభేదాన్ = ఆ యా జన్మములను, భజతి = పొందుచున్నాఁడు, నూనం = నిశ్చయము.

అవతా॥ క్రింది శ్లోకమునందు దయాదేవి యొనరించు ప్రతివాదప్రక్రియ వివరింపఁబడినది. ఆ వాదముచే నేర్పడిన నిష్కర్షమేమన, శరణము పొందినవారి యొక్క పాపములకుఁ దండముఁ తత్పాపఫలమునిచ్చి, దుఃఖముల ననుభవింపఁ జేయుట) నొసంగుట తగదు. తత్పాపములను క్షమించుటయే ఇప్పటికి సాధ్యమని తలంపవలయును. అట్టియెడల వారుచేసిన పాపములకు గతియేమి ? అవి పలు జన్మముల నొసంగితీరవలయును గదా ! అనినచో దీనికి శాస్త్రీయసమాధాన మిది :— మన సిద్ధాంతములో పుణ్యపాపములనునవి భగవానుని యనుగ్రహ నిగ్రహములే.

అదియు కడపట, "ఈ పాపము చేసినవాఁడు ఈ విధములైన ప్రాయశ్చిత్తాది పరిహారములు చేయనియెడల ఈ జన్మమును పొంది, ఇట్టుల కష్టపడుగాక" అని భగవంతునియొక్క సంకల్పములో పర్యవసానము నొందును. ఇది పుణ్యమునకును సమానమైనదే. ఏవం చ శరణాగతియను సర్వకర్మపరిహారము నొనరించినచో, శరణాగతుని విషయమునందు పూర్వోక్త భగవత్సంకల్పముచే కలుగనున్న ఏయొక జన్మయును కలుఁగనేరదు. ఇట్టి పరిహారము నాచరించని వారియందే భగవానుని యొక్క పూర్వోక్తసంకల్పము సిద్ధించును. కావున కర్మమనునది యొకటి జన్మము నియ్యఁగల శక్తితో కూడినదై, ఈ శరణాగతుని విషయమున ప్రవర్తించుటలో న్యాయము లేదు.

తత్త్వ మీరీతిగ నుండినను కవి ఈ శ్లోకమునందు వేడుకకై యొక యుత్ప్రేక్షనుఁజేసి తద్వారా పూర్వోక్తప్రశ్నకు, (జన్మముల నియ్యఁదగిన కర్మముల కేమి గతి?) సమాధానము నొసంగుచు దయాదేవిని పొగడుచున్నారు. కనుక ఈ శ్లోకములో చెప్పఁబడిన విషయము చమత్కారోక్తియే గాని, తత్త్వార్థము కాజాలదు.

తా॥ భగవంతుఁడు మత్స్యకూర్మ మనుష్యాద్యనేకరూపములతో నవతరించుచున్నాఁడు. ఈ యవతారమునకు లీలలే ప్రయోజనములని శాస్త్రములు సిద్ధాంతీకరించుచున్నవి. కాని యచ్చట నున్న రహస్యము వేఱని కవి యుత్ప్రేక్షించుచున్నారు. క్రింద చెప్పఁబడిన విధంబున శరణాగతుని పాపములు, వాని కవశ్యము కలుఁగవలసియున్న జన్మముల నొసంగరాదని దయాదేవి వాదముచే తీర్మానమైన పిదప, ఆ కర్మములకేమి గతి? యని ప్రశ్న జనించినపుడు ఈ దయాదేవి తనకు సర్వస్వాధీనుఁడును, భర్తయు నగు శ్రీనివాసునిఁ జూచి, "ఈ శరణాగతునికిఁ బదులుగ వాఁడు పొందవలసియున్న జన్మములను తామే పొంది ఆ కర్మములను తొలఁగించుదురుగాక!" అని యాజ్ఞాపించుచున్నది. ఆ యాజ్ఞను నెరవేర్చుటకు సర్వేశ్వరుఁడు మత్స్యముగాను, కూర్మముగాను, సింహముగాను, మనుష్యుఁడుగాను నానాజన్మముల నెత్తి ఆయా జన్మలలో, "అవజానన్తి మాం మూఢాః" అను గీతోక్తి ప్రకారమున మూఢులగు రావణ శిశుపాలాదు లొనరించు యవమానములను గూడ సహించి, ఆ శరణాగతుని కర్మములను తొలఁగించుచున్నాఁడు.

ఒక స్త్రీ యొక్క మాటలను విని యిట్లు కడుతెలంగుల పరిభవమునొందుచున్నాడే! యని లోకస్థులు పరిహసించకుండుటకొఱకై భగవానుడు తనలీలార్థమై

యవతరించునట్లు శాస్త్రములలో ప్రకటీకరింపబడియున్నది. లోకములో ఒకనికి మఱి యొకడు ప్రతిభువుగా (జామీనుగా) నిలిచిన యెడల మొదటివాడు తానుచేయ వలసిన దానిని చేయని యెడల జామీనుగా నిలిచినవాడు దానిని చేసి తీరవలసినదే గదా! ఆ న్యాయము ననుసరించి శరణాగతుండగు జీవుని వదలించుటయందు మూర్ధన్యగా నిలిచిన దయాదేవి వాడు పొందవలసిన జన్మములను పొందుటకు వీలులేని పరిస్థితులు సంభవించినపుడు తనవాడైన భగవంతుడే యా జన్మములను పొందులాగుచేసి ఆ శరణాగతుని వదలించుచున్నది. ఈ ప్రకారముగ దయాదేవి యిచ్చట పొగడబడుచున్నది.

ఇచ్చట "అవతరణవిశేషైః" అని యనుటచే రామకృష్ణాది రూపములైన విభవావతారములు మాత్రమేగాక, పలు దివ్యదేశములయందు పలువిధముల నవత రించియుండు అర్చావతారములను గూడ వివక్షింపనగును. విభవావతారములకంటె యర్చావతారములో మందబుద్ధి కృతమగు నవమాన మత్యధికము. ఈ అవతార ములకు గూడ దయాదేవి యాజ్ఞయే కారణము. సాధు సంరక్షణాది లీల లిచ్చటయు సమానములే. ఇట్లు నానాహేతువులచే అర్చావతారములను గూడ నిచ్చట వివక్షింప వచ్చు నని తోచుచున్నది.

"శరణభాజామ్" అనుటకు మారుగ "చరణభాజామ్" అను పాఠమును గలదు. అప్పుడు మంత్రములో నుండు చరణ పదమిచట యాచార్య హృద్గత మైనదని కొందరు వ్యాఖ్యానించుచున్నారు.

శ్లో॥ పరహితమనుకంపే! భావయన్త్యాం భవత్యాం
స్థిరమనుపధి హార్దం శ్రీనివాసో దధానః।
లలితరుచిషు లక్ష్మీభూమినీలాసు నూనం
ప్రథయతి బహుమానం త్వత్ప్రతిచ్ఛన్దబుద్ధ్యా॥ 36

అర్థ :— అనుకంపే = ఓ దయాదేవీ! పరహితం = ప్రతికూల జీవులకు గూడ హితమునే, భావయన్త్యాం = భావించుచున్న, భవత్యాం=నీయందు, స్థిరం= స్థిరముగను, అనుపధి = నిరుపాధికముగనున్న, హార్దం = ప్రీతిని, దధానః = వహించుచున్న, శ్రీనివాసః = శ్రీనివాసుడు, లలితరుచిషు = మనోజ్ఞకాంత్యుపేత లైన, లక్ష్మీభూమినీలాసు = శ్రీ భూ నీళాదేవులయందు, త్వత్ప్రతిచ్ఛందబుద్ధ్యా = నీ ప్రతిబింబము లనుతలంపుచే, బహుమానం = ఆదరమును, ప్రథయతి = విస్త రించుచున్నాడు (ప్రకాశపరచుచున్నాడు).

అవతా॥ క్రింది శ్లోకమునందు దయాదేవి యాజ్ఞచే సర్వేశ్వరుడు పడెడి యవస్థలు వర్ణింపబడినవి. అట్లు తనను పలువిధములగు శ్రమలకు లోనుగావించిన దయాదేవియందు ఈశ్వరునికి ఏదైన కొంచెము మనఃక్లేశముగలదా ! అనినచో, ఇచ్చటనే యొక ఆశ్చర్యము గలదని కవి నిరూపించుచున్నారు. దయాదేవియందు మనఃక్లేశములేక, విశేషప్రేమ నామెయందు వహించుచున్నాడనుటయు గాక తన వక్షఃస్థలమునందును, ఇరు పార్శ్వములందును సర్వదా సన్నిహితలై యుండు శ్రీదేవి, భూదేవి, నీళాదేవులయందుగూడ వారు ఆ దయాదేవియొక్క ప్రతిబింబము లనెడు బుద్ధిచే విశిష్టమగు బహుమానమును చేయుచున్నాడు. ఇయ్యది నిశ్చయము. ఇది దయాదేవియొక్క ఎంతటి మహిమయో ! అను నీరీతి యుత్ప్రేక్షచే పై సందియమునకు (దయాదేవి యందేమైన మనఃక్లేశము గలదా ?) సమాధానము నొసంగుచు నీ శ్లోకమున దయాదేవిని కీర్తించుచున్నారు.

తా॥ దయాదేవి సర్వకాలముల యందును ప్రతికూలమునే యాచరించుచున్న సంసారుల విషయమునందును హితమునే చింతించుచును, చేయుచును ఉన్నది. కావున ఆమెయందు శ్రీనివాసుడు స్థిరమును, అవ్యాజమును నగు ప్రేమను గలిగి యున్నాడు. ఇవ్విధంబుననుండ, ఈ దయాదేవికున్న పరహిత చింతనమను గుణమును శ్రీ భూ నీళాదేవులయందు చూచినప్పుడు, " ఓ హో ! వీరు దయాదేవి ప్రతిబింబములే ! బింబగత గుణములేకదా ప్రతిబింబమున గాననగును ". అని తలంచి దయాదేవి యందువలె వారియందు విశేష బహుమానమును ప్రదర్శించి తన వక్షఃస్థలమునందును, ఇరు పార్శ్వములయందును వారిని యుంచుకొనియున్నాడు. ఈరీతిగ దయాదేవిని భగవానుడు కొనియాడుచున్నాడని కవి చమత్కారోక్తి యిట గ్రాహ్యము. సర్వేశ్వరుని సతులెల్లరు చేతన సంరక్షణ విషయములో ఏకాభిప్రాయముతో పరమ దయగలిగి పరమపురుషునికి పురుషకారముచేసి చేతనుని రక్షించుచున్నారను శాస్త్రార్థమిచ్చట వివక్షితము.

ఈ శ్లోకమునందు " పరహితమనుకంపే భావయన్త్యాం భవత్యాం " అనునది గ్రంథాంతరమున " పరహితప్రావణ్యం దయా " అని యాచార్యులు చేసిన నిష్కర్షమును జ్ఞాపకపరచుచున్నది.

" స్థిరమనువధి హార్దం " (ఆద్యంతరహితమును, నిర్వ్యాజమును నగు ప్రీతిని) అనుటచే " జలధేరివ శీతతా " అని పూర్వము చెప్పబడిన ప్రకారమున సర్వేశ్వరునికి దయ స్వాభావికగుణమని తెలియ నగుచున్నది.

శ్లో॥ వృషగిరిసవిధేషు వ్యాజతో వాసభాం
దురితకలుషితానాం దూయమానా దయే ! త్వమ్ ।
కరణవిలయకాలే కాన్దిశీకస్మృతీనాం
స్మరయసి బహులీలం మాధవం సావధానా ॥ 37

అర్థ :— హే దయే ! = ఓ దయాదేవీ !, వృషగిరిసవిధేషు = తిరుమలకు సమీప ప్రదేశములయందు, వ్యాజతః = ఏదో ఒక నెపముతో, వాసభాజాం = నివసించుచున్న, దురితకలుషితానాం = పాపములచే కలతజెందినవారికొఱకై, దూయమానా = చాలయు పరితపించుచున్న. త్వం = నీవు, కరణవిలయకాలే = ఇంద్రియములు లయమునొందు సమయమునందు, (మరణకాలమునందు) కాందిశీకస్మృతీనాం = లోపించి పోయినస్మృతిని గలిగినవారికి, బహులీలం = అనేక లీలలను గలిగిన, మాధవం = శ్రీనివాసుని, సావధానా (సతీ) = మిక్కిలి జాగ్రతగల దానివై, స్మరయసి = స్మరింపజేయుచున్నావు.

అవతా॥ క్రింది శ్లోకమునందు ప్రతికూలురయందు గూడ దయాదేవి హితమునే చింతించుచున్నదని సామాన్యముగ జెప్పబడిన విషయమును, ఈ శ్లోకము నుండి యీ దశకాంతమువరకు నామె చేయు కొన్నిహితములను స్పష్టముగ నిరూపించుచు విశదీకరించుచున్నారు. అర్థాత్తుగ నీ శ్లోకమునందు ఈ దశకప్రతిపాద్యార్థములలో నొకటియగు తిరుమలయొక్క ప్రభావమును, తత్పరిసర నివాసులయొక్క మహిమయును ప్రతిపాదించినట్లు లగుచున్నది.

తా॥ తిరుమలయొక్క ప్రాన్త ప్రదేశములయందు ఉదరపోషణాదులగు నేదో వ్యాజముల ననుసరించి నివసించుచున్న మహాపాపుల విషయములయందు గూడ భగవద్విషయవాసమహిమచే, వారి యంత్యకాలమునందు (సర్వేంద్రియములును లోపించి స్మృతితప్పిపోయి ప్రాణముబోవు తరుణమునందు) దయాదేవి మిగుల జాగ్రత గలిగినదియై జగద్వ్యాపారాది బహువిధలీలలయందు ప్రవర్తించియున్న శ్రీనివాసుని స్మరింపజేయుచున్నది. అనగా పాపులకు భగవద్విషయికమగు నంతిమ స్మృతిని గలుగజేయుచున్నదని భావము.

"దుష్టేంద్రియవశాచ్చిత్తం నృణాం యత్కల్మషైర్వృతమ్ ।
తదన్తకాలే సంశుద్ధిం యాతి నారాయణాలయే ॥"

అను ప్రమాణము ననుసరించి యాయుస్సు ఉండునంతవరకు నింద్రియ పరాధీనులై పాపములనే యాచరించువారికిగూడ దివ్యదేశవాసము గలుగుచో ప్రాణవియోగ

సమయమందు పరమదయాళువగు పరమపురుషుని సంకల్పముచే చిత్తశుద్ధి యేర్పడి యంతిమస్మృతియను భగవద్విషయికస్మృతి గలుగుచున్నదను శాస్త్రార్థమిచట వివక్షితము. ఈ యంతిమస్మృతి యోగులకును దుర్లభమైయున్నది.

ఇందువలన దివ్యదేశవాసముచేయువారికి నంతిమస్మృతియను నుత్తమహితమును దయాదేవి గలుగజేయుచున్నదని నిరూపితమైనది.

శ్లో॥ దిశి దిశి గతివిద్భిర్దేశికైర్నీయమానా
స్థిరతరమనుకంపే స్త్యానలగ్నా గుణైస్త్వమ్ ।
పరిగతవృషశైలం పారమారోపయన్తీ
భవజలధిగతానాం పోతపాత్రీ భవిత్రీ ॥ 38

అర్థ :— హే అనుకంపే = ఓ దయాదేవీ !, గతివిద్భిః = దయాగతుల నెఱింగిన (సముద్రమునందు మార్గముల నెఱింగిన), దేశికైః = ఆచార్యులచే (నావికులచే), దిశి దిశి = ఆ యా ప్రదేశములలో (ఆ యా దిక్కులయందు), నీయమానా = కొంపోబడుచున్నదానివిగాను (నడుపు కొనిపోబడుచున్నదిగాను), గుణైః = జ్ఞానాది కల్యాణగుణములచే (దారములచే), స్థిరతరం = దృఢముగనుండునట్లు, స్త్యానలగ్నా = సంబంధము గలిగినదానివిగాను (బాగుగ బంధింపబడిన నదిగాను), పరిగతవృషశైలం = వేంకటాద్రినిజేరియున్న, పారం = గట్టువలెనున్న శ్రీనివాసుని (గట్టును), ఆరోపయన్తీ = పొందింపజేయుదానివి గానునున్న (పొందింపజేయునదిగానున్న), త్వం = నీవు, భవజలధిగతానాం = సంసార సముద్రమున మునింగియున్నవారికి, పోతపాత్రీ = నావగా, భవిత్రీ = అగుచున్నావు.

అవతా॥ క్రింది శ్లోకమునందు భగద్దివ్యదేశవాసము నొందినవారి విషయములో దయాదేవి యొనరించెడి యుపకారము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమునందు సంసారసాగరమున బడియున్న అందరి విషయములలోను నామె యొనరించెడి హితము నిరూపింపబడుచున్నది.

తా॥ పెద్దలు వాక్రుచ్చినట్లు శ్రీనివాసదయ నొక నావగా కవి చిత్రించుచున్నారు. వివిధ తరంగములచేతను, భీకర జలచరములచేతను నిండియున్న మహాసముద్రమును ఓడచే దాటందలంచిన యెడల, ఆ యోడ సముద్రమార్గజ్ఞులైనట్టియు, ఓడ యొక్క శక్తి నెఱింగినవారు నగు నావికులచే నడపబడవలయును. ఆ నావికులు తీసికొనిపోయిన స్థలముననే యోడలోని ప్రయాణీకులు, ఓడయును చేరుదురు. మరి

యను దృఢములైన దారములతో నా నావ గట్టిగ కట్టబడియుండవలయును. లేనిచో నభీష్టస్థల ప్రాప్తిగలుగనేరదు. అట్టి యోడ నధిరోహించినవారే గట్టుజేరగలుగుదురు. అట్టులనే దయయు నిచట నొక నావయగుచున్నది. దీనిని నడుపు నావికులాచార్యులే. వారు తీసికొనిపోయిన చోటికే ఈ నావయు నేగును. ఎప్పుడు, ఎచ్చటికి, ఎట్టుల తీసికొనిపోవలయునను సమస్త విషయముల నెఱింగినవారు వారే. భగీరథమార్గమును గంగ యనుసరించినట్లు, ఆచార్యులమార్గమును దయ యనుసరించుచున్నది. నావికుని యనుమతిలేనిచో నావ యెట్లు స్థలమునొసంగ జాలదో, అట్లే ఆచార్యుని యనుగ్రహములేనిచో దయ యెట్టి ప్రాణినిగూడ విషయీకరింపనేరదు. అనగా దయాదేవి యాచార్యులద్వారా మాత్రమే మనలను కాపాడుచున్నది. మఱియు భగవానునియొక్క జ్ఞానబలైశ్వర్యాది కల్యాణగుణములనెడు దారములచే దయ చక్కగ కట్టబడియున్నది. అనగా ఆ సమస్తగుణములను తన కుపకరణములుగ జేసికొని వాటితో పూర్ణసంబంధమునొంది తాను జేయుపనులలో వాటిని సహాయభూతములుగ నేర్పఱచుకొనియున్నదని భావము.

ఈ దయానావ కొక వైలక్షణ్యము గలదు. అన్ని యోడలును నిమ్నప్రదేశములకేగి తీరమును జేరును. అట్లుగాక నీ యోడ యున్నతప్రదేశముననున్న (కొండపైనున్న) గట్టుని (శ్రీనివాసుని) పొంది తనయందున్న ప్రపన్నులను ప్రయాణీకులను పొందజేయుచున్నది. కావున నీ దయను నావగా చిత్రించుట యెంతయు సమంజసమే :

యదృచ్ఛాసుకృతాదులచే సదాచార్య సంబంధమేర్పడి, ఆ యాచార్యులచే భగవద్దయకు విషయీభావమును భజింపజేయబడిన సంసారిజీవులు అద్దయాదేవి యనుగ్రహమువలన సంసారసాగరమును దాటి గట్టుగా రూపించబడిన పరమపురుషుని (శ్రీనివాసుని) పొందుచున్నారు. "అనుచరశక్త్యాది గుణాం" అని పదునొకండవ శ్లోకమునందు జెప్పినట్టుల నీ దయకు మిగిలిన భగవద్గుణములు సాహాయ్యము నొనరించి ఈమె చేయు పనియం దానుకూల్యముతో వ్యవహరించుచున్నవి" యను నేతదాది శాస్త్రార్థములిచ్చట వివక్షితములు.

"స్థిరతర" మను స్థలమున "స్థిరచర" మను పాఠమును గన్పించుచున్నది. ఓడ దృఢమును, చలించునదిగను నుండవలెను. ఈ రెండింట నేదిలేకపోయినను నోడచే ప్రయోజనముండదను రసవంతమగు నర్థము "స్థిరచర" మను పాఠముచే గ్రహింపదగియున్నది.

శ్లో॥ పరిమితఫలసంగాత్ప్రాణినః కింపచానాః
నిగమవిపణిమధ్యే నిత్యముక్తానుషక్తమ్ ।
ప్రసదనమనుకంపే! ప్రాప్తవత్యా భవత్యా
వృషగిరిహరినీలం వ్యంజితం నిర్విశన్తి ॥ 39

అర్థ:— హే అనుకంపే = ఓ దయా దేవీ!, పరిమిత ఫలసంగాత్ = మిక్కిలి పరిమితములగు ఫలములయందలి యాశచే, కింపచానాః = క్షుద్రులైన, ప్రాణినః = ప్రాణులు, ప్రసదనం = అనుగ్రహమును, ప్రాప్తవత్యా = పొందియున్న, భవత్యా = నీచే, వ్యంజితం = చూపింపబడినదియు, నిత్యముక్తానుషక్తం = నిత్యుల తోడను ముక్తులతోడను కూడినదియు గానున్న (ఎల్లప్పుడును ముత్యములతో కూడి నదియు గానున్న), వృషగిరి హరినీలం = వేంకటాద్రియం దుదయమందిన ఇంద్ర నీలమణివంటి శ్రీనివాసుని (శ్రీనివాసునివలెనున్న ఇంద్రనీలమణిని), నిగమవిపణి మధ్యే = వేదమను నంగడివీధి మధ్యలో (పట్టణమునందలి యంగడివీధియందు), నిర్విశన్తి = అనుభవించుచున్నారు.

అవతా॥ క్రిందిశ్లోకమునందు ముముక్షువులగు సంసారుల విషయము నందు దయాదేవి, ఆచార్యులచే ప్రదర్శింపబడిన త్రోవలో ప్రవేశించి ఆ సంసారు లను సంసార సాగరమునుండి గట్టుజేర్చు ప్రకార ముపవర్ణింపబడినది. ఈ శ్లోకము నందు బుభుక్షువులగు అనగా మోక్షేతరములైన క్షుద్ర పురుషార్థముల నభిలషించు సంసారుల విషయమునందు దయాదేవియొక్క యనుగ్రహప్రకారము వివరింపబడు చున్నది.

తా॥ ఆచార్యులీ శ్లోకమునందత్యద్భుతమైన చిత్రము నారచించియున్నారు. విశిష్టాద్వైతసిద్ధాంతమును, "ఉదారాః సర్వ ఏవైతే" అను గీతావాక్యమునున్ను అనుసరించి ఈ చిత్రమును భావించవలయును.

సర్వవిద్యా పారంగతుడును, సర్వాంగసుందరుండును, సర్వకల్యాణగుణో పేతుడును, పరమదయాళువును, సర్వదేశాధిపతియగు సార్వభౌముడును, వివాహోర్హ తరుణవయస్కుండునగు నొకమహారాజు తనదేశమునందలి ప్రజలయొక్క చిత్త వృత్తులను పరిశీలింపగోరి స్వసమవయస్కులైన సుహృన్మంత్రులతోగూడి యొక సంవిధానము నేర్పఱచెను. ఎట్లనగా, అతడు రాజధానిలో నొక మహావిపణివీధి (అంగడివీధి) ని నిర్మించెను. అచట నతిక్షుద్రములగు శిలామయ పరికరములు

(తిఱుగలి: రుబ్బుడుఱాయి) మొదలుకొని మహార్ఘములగు వజ్రవైడూర్యాది నవ రత్నముల పర్యంతము సమస్త వస్తుజాతమును ఉత్తరోత్తర ముత్కృష్టములుగ నుండురీతిని సమాయత్త పఱచెను. అందు ప్రథమాపణమునందు శిలామయ పరికరములు, ద్వితీయాపణమునందు అయఃపరికరములు (ఇనుము), తృతీయాపణమునందు ఇత్తడిపాత్రాదులు, తదనంతరము కంచు, పిమ్మట రాగి. తరువాత వెండి, తదుపరి స్వర్ణము, తతఃపరము పీతాంబరాదులు, అటుపై వజ్రవైడూర్యాది నవరత్నములు నుండునటుల నంగడుల నేర్పఱచెను. ఈ విధమగు సంవిధానము నంతయు పూర్తిగావించి స్వదేశజనులకిట్లు స్వాభిప్రాయమును ప్రకటీకరించెను. "జాతిమత స్త్రీ పురుషాదులగు నే వ్యత్యాసములులేక సర్వజనులును ఈ యంగడి వీధిలో క్రమక్రమముగా ప్రవేశించి తమతమ కభిమతమగు నేదైన నొక వస్తువును మూల్యములేకనే తీసికొనవచ్చును. విపణివీధి తూర్పు పడమరలుగ నేర్పడియున్నది గావున తూర్పు ద్వారమున ప్రవేశించి తమ కభీష్టమగు వస్తువును స్వీకరించి పడమర ద్వారముగుండా వెడలిపోవలయును. ప్రవేశించినవాడు ఏమియు తీసికొనక రిక్తహస్తుండై పోరాదు". ఇట్లు చాటింపించి ఉద్దిష్టమైనదినమున నంగడివీధి తెఱచి తానుగూడ ఆ యంగడివీధియందే సర్వాలంకారోపేతమగు కడపటియందు స్వసుహృన్మంత్రులతోగూడ కూర్చుండి ప్రజల ప్రవృత్తిని, వారికోలాహలమును చూచుచుండెను.

పిమ్మట ప్రప్రథమముగా నొక గ్రామీణుడు విపణివీధియందు ప్రవేశించెను. ప్రథమాపణమునందు పాషాణమయ పదార్థములను గాంచినతోడనే తత్సౌష్ఠవముచే ఆకర్షింపబడిన మనస్సుగలవాడై తన యింటియందావస్తువు లేనందున అతిక్షుద్రమును, స్వల్పమూల్యము గలిగినట్టియు, మిక్కిలి బరువుగానున్న ఒక తిఱుగలి ఱాయిని తీసి భుజముపైనిడుకొని బయలుదేరెను. వాడు ఇనుము సామానుగల ద్వితీయాపణమునుండి నవరత్నపూరితమైన కడపటి యంగడివరకువెళ్లి ఆ పశ్చిమ ద్వారమునుండియే వెళ్లవలసినవాడుగావున నొక్కొక యంగడిలోను నుండెడి యుత్తరోత్తర ముత్కృష్టములైన పదార్థజాతములు వానికి దృగ్గోచరము లగుచుండ నొక్కొక్క యంగడిని దాటిపోవునప్పుడు "అయ్యో! ఇది తీసికోకుండపోతినే! అది తీసికోకుండపోతినే! అతిస్వల్పము, మిక్కిలి బరువైన మహాపాషాణమును దీసికొంటినే? నవరత్నములు దీసికొనుటకుకూడ ఏమియు నాటంకములేదుగదా! నా దౌర్భాగ్యమువలన రెండవయంగడినిగూడ చూడగలిగినంతటి ఓర్పులేకుండ

అన్యాయముగ చెడిపోతినే ?" అని పరమవేదననుభవించుచు తనను చూచుచున్న మధ్యస్థులకుగూడ హాస్యమునో, నిర్వేదమునో గలిగించు పశ్చిమద్వారముదాటి వెడలిపోయెను. అటుపై వానికంటె కించిత్తు క్షమగల మరియొక వ్యక్తి యంగడి వీధియందు ప్రవేశించెను. వాడుగూడ ప్రథమాపణస్థమైన పాషాణపదార్థములచే సమాకృష్ట హృదయుండాయెను గాని ద్వితీయాపణమున "నేమియున్నదో చూత" మను నోర్పుచే ప్రథమాపణమునుదాటి ద్వితీయాపణమునకు వచ్చెను. అచటనున్న ఆయస వస్తువులు పాషాణము ప్రథమాపణస్థిత వస్తువుకంటె నధికమూల్యము గలిగినవిగావునను, ఆ వస్తువులు తనకవసరములై యుండుటచేతను, దానినిదాటి పై యంగడులలో నేమియున్నదో చూచుటకు కావలసినంతటి క్షమలేనందునను ఒక పెద్ద గడ్డపారను తీసికొని బయలుదేరెను. వీడును పైపై విపణులలో నుంచబడి యున్న ఉత్తమోత్తమ పదార్థములను గాంచునపుడు మొదటివా డనుభవించిన మనో వేదన ననుభవించి వెడలిపోయెను. ఇటులనే పలువురు తాము తాము ప్రవేశించినపుడు కించిత్కించిత్క్ష మాధిక్యమువలన, ఒకడు ఇత్తడి, మరియొకడు కంచు, వేరొకడు రాగి, తదితరుడు వెండి మొదలగు పాత్రసామానులను గైకొనిపోయిరి. వారంద రును స్వస్వీకృతపదార్థముకంటె నుత్తమపదార్థమును గాంచినపుడు మితిలేని మనోవ్యథ ననుభవించియే వెళ్ళిరి. ఇట్లు నవరత్నాపణమువరకు రాగలిగిన వ్యక్తి మృగ్యమైపోయెను.

ఇట్లుండగా ; సర్వాంగసుందరియు, సకలకళానిష్ణాతయు, స్పృహణీయతమ సర్వాత్మగుణోపేతయు, అతిమేధావినియు, సర్వశాస్త్రార్థపారంగతయు, మహాపతి వ్రతా లక్షణోపేతయు, సర్వలోక సార్వభౌమునికి పట్టమహిషియగుటకు దగిన చిహ్నములు, అర్హతయు గలిగినవియు, అనవద్య యౌవనోపేతయునగు నొక రాజకన్యక తద్విపణివీధియందు బ్రవేశించెను. ఆమెయు రాజుగారేర్పఱచిన నియ మములన్నియు నెఱుంగును. పరమ క్షమారూపిణియగు నాకన్య ప్రథమాపణమును వీడి ఒక్కొక్క ఆపణములోనుండు వస్తువులనుగాంచి యలక్ష్యభావముతో దాటి పోవుచుండెను. నవరత్నాపణమునుగూడ ఆమె నిర్లక్ష్యముతో దాటిపోవునపు డామెను జూచినవారు "ప్రవేశించినవారు ప్రతివారును ఒక్కొక్కవస్తువును తీసికొని పోవలయునను నియమ మీమెకు తెలియదో ? లేక యున్మత్తయో ? కడపటి యంగ డినిగూడ దాటిపోవుచున్నదే ? అని చూచినవారు విస్మయ పడుచుండగ నామె నేఱుగా సుహృన్మిత్రులతో మహారాజు కూర్చుండు కడపటి మండపమునకేగి మిగుల ధైర్య

ముతో సోపానములనెక్కి సింహాసనోపవిష్టుండగు సార్వభౌముని భుజముమీద చేయివైచి విపణివీధిలోనే నిశ్చయించువస్తువు మీరే!, ఈ విపణివీధిలో నుంచబడిన యేవస్తువునైనను, ఎవరైనను గ్రహింపగలుగుదురని కదా మీప్రకటన. మీరును ఈ విపణివీధిలోనుండు వస్తువులలో నంతర్భూతులేగదా! కనుక పరిశుద్ధ కన్యయగు, సమస్త విషయములలో తమకు పట్టమహిషియగుటకు యోగ్యతయును గలిగిననేను మిమ్ములనే నాయకునిగా వరించుటకో మీ రేర్పఱచిన నియమమున కేమియు విరోధము లేదుగదా! కావున నేను పరిపూర్ణ భావశుద్ధితో మిమ్ములను వరించుటచే కృప జేసి నన్ను మీరు పరిగ్రహింపవలసినది" అని యాకన్య ప్రార్థించినపుడు ఆ రాజును తత్సుహృన్మిత్రాదులును ఆమెయొక్క సౌందర్యము, గుణము, శాస్త్రజ్ఞత, వాక్చాతుర్యము మొదలైనవాటినిగాంచి పరమాశ్చర్యమునొంది సమీచీనమైన ఆమె వాదమునకేమియు నాటంకము జెప్పుటకు వీలులేనివారైరి. తదుపరి ఆ సార్వభౌముం డామెను స్వమహిషిగా స్వీకరించెను.

ఇపుడు ఆయంగడివీధిలోనుండు పాషాణమయ పరికరములు మొదలుకొని నవరత్న పర్యంతమైన సమస్త వస్తుజాతమును రాజమహిషియగు నామెకు యథేచ్ఛానుభవ వినియోగాదుల కర్హమలేగదా! గ్రామీణులవలె నీమెయు నేదైన నొక వస్తువును గ్రహించియుండినయెడల అది యొక్కటియే ఆమెకు స్వకీయమైన వస్తువయి యుండునుగదా!

ఇట్లాకన్యక సర్వాపణములను దాటి సార్వభౌముని వరించుటకు హేతువేమనగా, ఆమెకు సార్వభౌమిగా నుండుటకు దగిన లక్షణములుండుటను దిలకించిన పరమదయావంతులును, సార్వభౌమునికి నంతరంగులును, ఈ యంగడివీధియొక్క స్వరూపమునెఱింగిన కొందరు మహాపురుషులయొక్క ఉపదేశమే. ఈ విధముగ నా మహనీయుల యుపదేశమువలన ఆ కన్య ఆ సార్వభౌముని తనకు ప్రియభర్తగా బొంది స్వవిభ్రమ విలాసాదులచే స్వాధీనపతికయై చిరకాలము సంపూర్ణానందము ననుభవించుచుండెను.

సర్వవిశిష్టాద్వైత సిద్ధాంతసార ప్రదర్శనకమగు నీ చిత్రము నాచార్యులీశ్లోకములో చిత్రించియున్నారు.

వేదమనునది యొక విశాలమైన విపణివీధి. అచట లభింపని వస్తువు లేనే లేదు. అనగా; సమస్త పురుషార్థోపలబ్ధికి వలయు నుపాయము లచ్చట నిరూపింపబడియున్నవి. ఆవేదవీధిలోనే కడపట వేదాన్త (ఉపనిషత్తులు) మను మంటపము

నందు నిత్యముక్తులను సుహృత్తులతోగూడి పరమపురుషుడగు సార్వభౌము డుప విష్టుడై యున్నవాడు. వానిని పతిగాపొంది వాని పాదారవిందములో కైంకర్యము నాచరించి మోక్షానందము నందుటకు సర్వజీవరాసులకును యోగ్యతగలదు. ఐనను కొందరు క్షుద్రులు స్వకర్మప్రాబల్యముచే ఆ వేదవీధియందు ప్రవేశించునపుడు పరిమిత ఫలములను (స్వరూప స్వభావములచే పరిమితములు) జూచి వాటినే పొంది పునః పునః సంసారగర్తములో పడిపోవుచున్నారు. ఈ పరిమిత ఫలసంగులైన కొన్ని ప్రాణులపై యదృచ్ఛాది సుకృతములవలన శ్రీనివాసదయయొక్క అనుగ్రహము సంభ వించిన (దయావతారులగు సదాచార్యుల యుపదేశానుగ్రహాదులు సంభవించినప్పుడు) నప్పుడు ఆ ప్రాణులు క్షుద్రఫలములపై విరక్తిగలిగి వేదాన్తమున విరాజమానుడగు హరినీలరూపుడైన శ్రీనివాస పరబ్రహ్మమును నిత్యముక్తులతోసహ తాము అను భవించి సంసారబంధమునుండి విముక్తులగుచున్నారు. ఇట్లు వీరు మోక్షమును పొందుటకీ దయాదేవి యనుగ్రహమే కారణము. విశిష్టాద్వైత సంప్రదాయములో పరమపురుషునికిని, జీవునికిని నాయికానాయక భావముచే అనుభవముగలుగుట సుప్ర సిద్ధమే. కావున పై జూపిన చిత్రములోనుండు సర్వాంశములును ప్రకృతార్థములో సమన్వయపఱచుకొనుట సహృదయులకు సులభమేగనుక దీనికంటె విస్తరము జేయలేదు.

ఈశ్లోకమునందును ఈదశకార్థమైన దివ్యదేశప్రభావము సూచింపబడియున్నది. ఈ పర్వతమును పొందినవారికే ఈ పురుషార్థము సిద్ధించునని చెప్పంబడియున్నదిగదా!

శ్లో॥ త్వయి బహుమతిహీనః శ్రీనివాసానుకంపే!

జగతి గతిమిహాన్యాం దేవి సంమ్మన్యతే యః।

న ఖలు విబుధసింధౌ సన్నికర్షే వహన్త్యాం

శమయితి మృగతృష్ణావీచికాభిః పిపాసామ్ ॥ 40

అర్థ:— హే దేవి! శ్రీనివాసానుకంపే! = ఓ శ్రీనివాసుని దయాదేవీ!, ఇహజగతి = ఈ లోకమునందు, యః = ఎవడు, త్వయి = నీయందు, బహుమతి హీనః (సన్) = గౌరవబుద్ధిలేనివాడై, అన్యాంగతిం = వేరుగతిని, సంమన్యతే = బహుమానించుచున్నాడో, సః = వాడు, విబుధసింధౌ = గంగానది, సన్నికర్షే = సమీపమునందు, వహన్త్యం (సత్యాం) = ప్రవహించుచుండగా, మృగతృష్ణావీచి కాభిః = ఎండమావుల యలలచేత, పిపాసాం = దప్పికను, శమయతిఖలు = శమింప జేసికొనుచున్నాడుగదా!

అవతా॥ క్రింది శ్లోకమునందు బుభుక్షుముముక్షువులనంబడు సమస్త చేతనుల విషయములోను దయాదేవిచేయు యనుగ్రహప్రకారము వర్ణింపబడినది. ఈ శ్లోకమునందు ; ఇట్లు పరహిత పావణ్యమే స్వరూపముగాగల దయాదేవి యందెవడు గౌరవభావమును ప్రవర్శింపకున్నాడో, వాని దుర్గతిని ' నిరూపించి ' ఈ దశకమును పూర్తిచేసి యలవాటుప్రకారము పై దశకమునుగూడ నవతరింపజేయుచున్నారు :

తా॥ ఎవడు ఏ ఫలము నభిలషించి ఏ యుపాయము నెవనియొద్ద ననుష్ఠించి నను వాడా ఫలమును భగవానుని కృపచేతనే పొందవలయును. " యస్య ప్రసాదే సతతం ప్రసీదేయురిమాః ప్రజాః " అని యభియుక్తోక్తి. " లభతే హి తతః కామాన్ మయైవ విహితాన్హి తాన్ " అని భగవానుడును గీతయందు ప్రవచించెను. ఇట్లు సామాన్యమగు నైహికాముష్మిక ఫలముల నాయా దేవతలొసంగుటయు భగవంతుని దయచేతనే యని తెల్లమగుచుండ నితర దేవతలకు కించిన్మాత్రముగూడ సంబంధమేలేని మోక్షమను ఫలమునందు భగవద్దయకు నెంతటి యవసరమున్నదో ప్రతిపాదింప నవసరము లేదు. భక్తి మార్గమునో, ప్రపత్తి మార్గమునో అవలంబించిన యెల్లరుగూడ " ప్రపన్నాదన్యేషాం న దిశతి ముకుందో నిజపదమ్ " అను రీతిగా భగవత్ప్రపన్నుండై తద్దయ నవలంబించియే తీరవలయును. తత్త్వస్థితి యిట్లుండ ; ఎవడు, శ్రీనివాసుడను పరమపురుషుని దయయందు బహుమానము లేనివాడై ( " ఈ భగవంతుని దయయే నన్ను సర్వవిధాపత్తులనుండియు కాపాడ గలిగియున్నది " అను జ్ఞానములేక ) దేవతాంతరముల నాశ్రయించి తద్దయ నవలంబించుచున్నాడో, వాడు, తనకు చాలయు సమీపమున ప్రవహించునదియు, బాహ్యాభ్యంతర తాపశమనము గల్గించునదియు, పరమ భోగ్యమైనదియునగు గంగానది ననాదరించి తీవ్రమగు నాతపమునందు జలతరంగ ప్రతీతిని గలిగించుచున్న ఎండ మావులచే అత్యధికమైన తన దప్పికను పోగొట్టుకొనుట కభిలషించు మూఢునితో సమానుండని భగవద్దయానవలంబి నింగాంచి పరిహసించువిధమున వాస్తవికముగ ఆచార్యులనుతాపము నొందుచున్నారు.

భగవద్దయాదేవికిని, గంగాదేవికిని బహువిధములో సామ్యము గలదు. వారిరువురును భగవత్పాదారవిందమునందుద్భవించినవారు ; సర్వపాపముల నపహరించుటయందు శక్తిగలవారు, ఆశ్రయించు సమయమునందే పరమభోగ్యముగా నుండు వారు నైయున్నారు. గావున ఆచార్యులకు బహుప్రదేశముల భగవద్దయను గంగాదేవిగా చిత్రించుట యలవాటు.

"సన్నికర్షే వహన్త్యాం" అనుటచే ఏ దేశమునందైనను, ఏ కాలమునందైనను ఆశ్రితులను కాపాడుటయందు భగవద్దయ చాలయు జాగరూకయై యున్నదను శాస్త్రార్థము స్ఫుటమగుచున్నది.

పిపాసా పీడితుడు గంగ నుపేక్షించి మరీచికలుండు ప్రదేశమున కేగినయెడల వాని దప్పిక శాంతినొందకపోవుటయేగాక ఎండలో ఎంతోదూరము పరుగిడుటచే పూర్వముండిన తాపము శతగుణితమై వాడు సమధికశ్రమ కాస్పదమగును. అటులనే దేవతాంతరము నొందువానివిషయములోగూడ సంసార తాప మధికమగునేగాక శమము నొంద దను తత్త్వస్థితియు నిచట స్పష్టమగుచున్నది.

పై దశకమునందు చతుర్ముఖ బ్రహ్మపదముపర్యంతమైన సర్వానిశ్వైర్య ములను నిష్ప్రయోజనములని యెఱింగిన సమర్థులు శ్రీనివాసునిదయనే శరణముగా నవలంబించుచున్నారని విశదీకరింపనున్న యర్థము నీ దశకాంత్య శ్లోకమునందు వ్యతిరేక ముఖమున నవతరింపజేసిరి.

చతుర్థదశకము సమాప్తము

శ్రీమతే నిగమాన్త మహాదేశికాయ నమః.

---

## పంచమ దశకము

శ్లో॥ ఆజ్ఞాం ఖ్యాతిం ధనమనుచరానాధిరాజ్యాదికం వా
కాలే దృష్ట్వా కమలవసతేరప్యకించిత్కరాణి।
పద్మాకాన్తం ప్రణిహితవతీం పాలనేఽనన్యసాధ్యే
సారాభిజ్ఞా జగతి కృతినః సంశ్రయన్తే దయే త్వామ్॥ 41

అర్థ:— హే దయే! = ఓ దయాదేవీ!, జగతి = లోకమునందు, సారాభిజ్ఞాః = సారము నెఱింగిన, కృతినః = సమర్థులు (ఆళ్వార్లు); కమలవసతేరపి = చతుర్ముఖునియొక్కయు, ఆజ్ఞాం = ఆజ్ఞను, ఖ్యాతిం = ప్రఖ్యాతిని, ధనం = ఐశ్వర్యమును, అనుచరాన్ = కింకరులను, ఆధిరాజ్యాదికం వా = సార్వభౌమత్వాదులను గూడ, కాలే = సమయ విశేషమునందు, అకించిత్కరాణి = కార్య కరములు కావివిగా, దృష్ట్వా = తెలిసికొని, అనన్యసాధ్యే = ఇతరులకు సాధ్యముగాని, పాలనే = రక్షణ వ్యాపారమునందు, పద్మాకాన్తం = శ్రియఃపతియగు శ్రీనివాసుని, ప్రణిహితవతీం = నియమించుచున్న, త్వాం = నిన్ను, సంశ్రయన్తే = ఆశ్రయించుచున్నారు.

అవతా॥ గత దశకాంతమున శ్రీనివాస దయోత్కర్షమును, ఇతర దయా నికర్షమును ప్రస్తావింపబడెను. ఈ దశకమునందు కులశేఖరాళ్వారు మొదలగు మహనీయుల శ్రీసూక్త్యనుభవపరీవాహరూపముగా తదుక్తమార్గము నవలంబించి ఆ దయోత్కర్షము ప్రతిపాదింపబడుచున్నది. పూర్వదశకమునందు తిరుమలయందు నివాస మభిలషింపబడెను. ఏతద్దశకమునందు తిరుమలయందలి పుట్టుక ప్రార్థింపబడుచున్నది. క్రింది శ్లోకమునందు ఇతరదయావలంబుల దుర్గతి వర్ణింపబడినది. ఈ శ్లోకమునందు శ్రీనివాసదయావలంబులు సారజ్ఞులనియు, సమర్థులనియు, భాగ్యవంతులనియు పొగడబడుచున్నారు.

తా॥ లోకమునందు సారమునెఱింగినవారగుటచేత భాగ్యవంతులుగా వ్యవహరింపబడెడి ఆళ్వార్లబోటివారలు శ్రీనివాసదయనే శరణముగా పొందుచున్నారు. వీరికి పరమ ప్రాప్యయు నా దయాదేవియే. పురుషకారభూతయగు మహాలక్ష్మితో గూడిన పరమపురుషుని చేతనసంరక్షణమునందు సర్వదా ప్రేరేపించుచున్న ఆ దయాదేవిని వదలి మరియొక వ్యక్తి నాశ్రయించినవారి కపేక్షితపాలనము లభింపదు.

"న హి పాలనసామర్థ్యం ఋతే సర్వేశ్వరం హరిమ్," అనియు,

"న సంపదాం సమాహారే విపదాం వినివర్తనే।
సమర్థో దృశ్యతే కశ్చిత్తం వినా పురుషోత్తమమ్॥"

అనియు ప్రమాణములు చెప్పుచున్నప్రకారమున సామాన్యమగు లౌకికపాలనమే సర్వేశ్వరుడగు శ్రీనివాసుని యధీనమని నిర్ణయింపబడినప్పుడు పాలనశబ్దమునకు ముఖ్యార్థమగు మోక్షప్రదానమనెడు ప్రధానపాలనము పరమపురుషునికిదప్ప మరియొక వ్యక్తికి మనసాపి దలంచుటకు వీలులేదు. కావున ఆ యాళ్వార్లబోటివారు, పెద్ద పెద్ద పదవులయం దధికారము వహించు బ్రహ్మరుద్రేంద్రాదులకుగూడ ఒక కాలవిశేషమునందు (వారి పుణ్యము పూర్తియగు సమయము మొదలగు కాలములయందు) పూర్వమునన్న ఆజ్ఞ, యశస్సు, ధనము, అనుచరులు, ఆధిరాజ్యసంపత్తు మొదలగునవి కొద్దియు కార్యకరములు గాకుండుటయేగాక విపరీతోపద్రవములనుగూడ కలుగచేయురీతిని యనేకవ్యక్తులయందు జూచి, ఆ పదవులలోగల దోషములను పరిశీలించి, అట్టి దోషములకు కించిత్తుగూడ అవకాశము లేకుండునట్లు పరమపురుషదయను ఉపాయముగాను, ఉపేయముగాను పొందుచున్నారు. ముముక్షువులగు పరమైకాంతులకు ప్రధాన ప్రాప్యము భగవన్ముఖోల్లాసమే (భగవద్దయయే). దాని కుపాయభూతయు నా దయయే యగుచున్నది. ఈ శాస్త్రార్థము నెఱింగినవారే

సారజ్ఞులు. వారే కృతులనబడు భాగ్యవంతులు. మోక్షైక వ్యగ్రులగు ఆళ్వార్లు ఈ గోష్ఠిలో చేరినవారే. ఇట్లు భగవద్దయావలంబుల నిచట పొగడుటచే భగవద్దయకు గల యుత్కర్షము ప్రతిపాదింపబడి నట్లగుచున్నది.

శ్లో॥ ప్రాజాపత్యప్రభృతివిభవం ప్రేక్ష్య పర్యాయదుఃఖం
జన్మాకాంక్షా వృషగిరివనే జగ్మషాం తస్థుషాం వా ।
ఆశాసానాః కతిచన విభోః త్వత్పరిష్వంగధన్యైః
అంగీకారం క్షణమపి దయే హార్దతుంగై రపాంగైః ॥ 42

అర్థ :— హే దయే ! = ఓ దయాదేవీ ! కతిచన = కొందరు మహనీయులు ( కులశేఖరాళ్వార్లు బోటివారు ), ప్రాజాపత్యప్రభృతివిభవం = చతుర్ముఖైశ్వర్యాది సర్వైశ్వర్యములను, పర్యాయదుఃఖం = దుఃఖ సమానములుగా (నామతః సుఖ ములుగా), ప్రేక్ష్య = చక్కగ నెఱింగి, త్వత్పరిష్వంగధన్యైః = నీ యాలింగన ముచే ధన్యములైనట్టియు, హార్దతుంగైః = ప్రీతిచే చాలియును తృష్టములైన. విభోః = ప్రభువగు శ్రీనివాసునియొక్క, అపాంగైః = కటాక్షములచే, క్షణమపి = ఒకక్షణకాలమైనను. అంగీకారం = స్వీకారమును, ఆశాసానాః = అభిలషించుచున్న వారై, వృషగిరివనే = వృషాద్రి వనమునందు, జగ్మషాం = జంగమ వస్తువుల యొక్కగాని, తస్థుషాంవా = స్థావర వస్తువులయొక్కగాని, జన్మ = పుట్టుకను, ఆ కాంక్షా = కోరిరి.

అవతా॥ క్రింది శ్లోకమునందు చతుర్ముఖ పదని పర్యంతమైన సర్వైశ్వర్య ములను నశ్వరములు గాపున వానిని యుపేక్షించి శ్రీనివాసదయనే యవలంబించు మోక్షాపేక్షులయొక్క ప్రభావము వర్ణింపబడినది. ఈ శ్లోకమునందు ఆ మోక్షమును గూడ అపేక్షింపక ఈ తిరుమలయందు శ్రీనివాసునియొక్క ఏకక్షణకాలికమైన కటాక్షమున కాశపడి జంగమముగాను, స్థావరముగాను జన్మనుకోరిన పరమ మహ నీయులగు కులశేఖరాళ్వార్లు బోటివారియొక్క ప్రభావము కీర్తింపబడుచున్నది.

తా॥ కులశేఖరాళ్వార్లు "ఊనేరు శెల్వమ్" అను దశకమునందు వృషాద్రి వనమున జంగమ జన్మమును మొదట ప్రార్థించి, తదనంతరము ఆ జన్మములో ఒక వేళ భగవానుని వదలి పోవుట సంభవించునేమోయను శంకచే తుదకు చలనరహిత మైన స్థావర జన్మమును ప్రార్థించిరి. ఇట్లు ప్రార్థించుటకు కారణము ఆ పరమ పురుషుని పరిపూర్ణ కృపాభరితమైన కటాక్షము తనమీద ప్రసరింపవలయునను నాశయే. అట్టి పరమపురుషకటాక్షమునకు విషయమగుటకంటె వేఱొక యుత్తమ పురుషార్థము

లేదని వారి యాశయము. ఆ కులశేఖరాళ్వార్ల యొక్క ఆశయము నటులనే వర్ణించి తద్ద్వారా దయ నిచ్చట నుతించుచున్నారు. గతశ్లోక ప్రతిపాదిత రీతిగా చతుర్ముఖైశ్వర్య పర్యంతములైన సర్వైశ్వర్యములును చూచుటకు ఆపాతతః సుఖముల వలె దోచినను, తదకు నవి దుఃఖములనుట నిస్సంశయము. ఇది శాస్త్రజ్ఞులకు చక్కగ దెలియును. కనుక వాటిని యుపేక్షించి యర్చావతారమందలి యాభిరూప్యానుభవములో విశేషాభిలాషచే మోక్షమునుగూడ ప్రార్థింపక నీ తిరుమలయందు "ఎంబెరుమాన్ పొన్మలై మేల్, ఏదేను మావేనే" (శ్రీనివాసుని యొక్క పర్వతశ్రేష్ఠమునందు ఏదైన నొక వస్తువుగా జనించెదనా!) అనియు, "పడియాయ్క్కిడందు ఉన్ పవళవాయ్ క్కాణ్బేనో" (మెట్టుగానైన నుండి త్వత్పల్లవాధరమును సేవించెదనా!) అనియు నొక జన్మమును ప్రార్థించిరి. ఈ జన్మమునకు ప్రయోజన మేమనగా; ఆ పర్వతమునందు సర్వత్ర సంచరించు విభువగు శ్రీనివాసుని కటాక్షము ఒకక్షణమైనను తనమీద ప్రసరించుననునదే. ఆ కటాక్షము ఒక్కొక్క పరమాణువులోను దయాసంబంధము నొందియున్నది. దయా గాఢోప గూఢమైనది. పరమపురుషుని హృదయములోనుండు పరమప్రీతి ప్రవాహముపొంగి తత్సంశ్లిష్టమై యున్నది. ఒకవ్యక్తియొక్క హృదయములోనుండు దయా ప్రీత్యాద్యుత్తమ గుణములను కటాక్షములో గానవచ్చునుగదా! అట్టి సర్వేశ్వరకటాక్ష మొకక్షణకాలము తనమీద ప్రసరించినను చాలును. దీనికై యెన్నివేల సంవత్సరములైనను స్థావరజంగమాది జన్మలనెత్తి పడియుండవచ్చునని యాళ్వార్ల యొక్క యభిప్రాయము. అట్టి భక్తులకే తత్కటాక్షప్రభావము గోచరమగును. తదితరులకు "లవణ వణిజః కర్పూరార్ఘం" అను న్యాయమున దానిమహిమ దెలియదను నభిప్రాయముచే ఆళ్వార్లను "కతిచన" అను పదముచే (మనోవాక్కుల కందని ప్రభావముగల వారుగా) నిర్దేశించుచున్నారు. ఇట్టి జన్మములనే ఋషులుగూడ "పత్యుః ప్రజానా మైశ్వర్యం పశూనాం వా న కామయే, అహం కదంబో భూయాసం కుందో వా యమునాతటే" అని వేడిరి. అట్లనగా; ప్రజాపతియను చతుర్ముఖపట్టమునో, పశుపతియను రుద్రపట్టమునో నేను కోరుటలేదు. సాక్షాద్విశ్వపతియగు కృష్ణపరమాత్మ విహరించు యమునానదీ తటమున కదంబవృక్షముగానో, కుందవృక్షముగానో జన్మించెదను. అపుడు కృష్ణుని దివ్యకటాక్షమును, తత్పాదస్పర్శమును లభించునుగదా అని యభిప్రాయము.

కులశేఖరాళ్వార్లు నీటిలోని వసించు పక్షి మత్స్యాదులయొక్క జన్మనుగూడ ప్రార్థించియుండుటచేత, తదనుగుణముగా "వృషగిరివనే" అను శబ్దమునందు వన పదముచేత జలస్థలోభయములును గ్రాహ్యములు.

శ్లో॥ నాభీపద్మస్ఫురణసుభగా నవ్యనీలోత్పలాభా
క్రీడాశైలం కమపి కరుణే! వృణ్వతీ వేంకటాఖ్యమ్ ।
శీతా నిత్యం ప్రసదనవతీ శ్రద్దధానావగాహ్యా
దివ్యా కాచిజ్జయతి మహతీ దీర్ఘికా తావకీనా ॥ 43

అర్థ:— హే కరుణే! = ఓ దయాదేవీ!, నాభీపద్మస్ఫురణసుభగా — నాభియందలి కమలముచే రమణీయమైనదియు, నవ్యనీలోత్పలాభా = నూతనమైన నల్లకలువలయొక్క కాంతిగలిగినట్టియు (సద్యో వికసితమైన నీలోత్పలమువంటి కాంతిగలిగినదియు), నిత్యం శీతా = ఎప్పుడును చల్లనైనట్టిదియు, (ఎప్పుడును సౌమ్యస్వభావము గలిగినట్టియు) నిత్యం ప్రసదనవతీ = ఎప్పుడును తేటగానున్నట్టియు, (అనవరతము ననుగ్రహముగల్గినట్టియు), శ్రద్దధానావగాహ్యా = విశ్వాసవంతులకు మునుగందగినదియు, దివ్యా = అత్యుత్కృష్టమైనదియు, (పరమాకాశములో నుండునదియు), మహతీ = మిగుల పెద్దదియు నగు, (అత్యుత్కృష్టమైనదియు నగు) తావకీనా = నీదైన, కాచిత్ = అతివిలక్షణమైన యొక, దీర్ఘికా = నడబావి, కమపి = విలక్షణప్రభావోపేతమైన, వేంకటాఖ్యం = వేంకటమని ప్రసిద్ధిగాంచిన, క్రీడాశైలం = క్రీడాపర్వతమును, వృణ్వతీ సతీ = వరించినదై, (ఆశ్రయించినదై) జయతి = సర్వోత్కృష్టముగా ప్రకాశించుచున్నది.

అవతా॥ క్రింది శ్లోకమునందు యోగులైన మహనీయులు భగవద్దివ్యకటాక్షాభిలాషచే తిరుమలయందేదైన నొక జన్మమును కోరిరని వర్ణింపబడినది. ఈశ్లోకము నుండి అట్లు తిరుమలలో జన్మలాభము గలిగినవారికి పూర్వోక్తప్రకారమున నా భగవానుని కటాక్షమేర్పడునట్లును, మఱికొన్ని మహాలాభములు గలుగునట్లును నిరూపింపబడుచున్నది. "యశ్చరామం నపశ్యేత్తు యంచరామోనపశ్యతి" అని చెప్పబడిన చొప్పున భగవత్కటాక్షప్రసారము గత శ్లోకమునందు ప్రస్తావింపబడినది. ఇచ్చట నాకటాక్షపాతముచే ఈ పుణ్యాత్ములకు (ఈ తిరుమలలో జన్మించినవారికి) సత్త్వగుణమభివృద్ధమై ఆభగవానుని సేవించుభాగ్యము గలుగుచున్నదని నిరూపింపబడుచున్నది. ఇదియొక మహాలాభము గదా? దివ్యమంగళవిగ్రహసేవయు, దివ్యాత్మస్వరూపానుభవమును, దివ్యకల్యాణగుణానుభవము నను త్రివిధానుభవములు నిచట క్రమేణ మూడు శ్లోకములయందు ప్రస్తావింపబడుచున్నది.

తా॥ శ్రీనివాసుని దివ్యమంగళవిగ్రహమును ఒక పెద్దదీర్ఘికగా చిత్రించుచున్నారు. వికసితకమలాలంకృతమైనదియు, సద్యోవికసిత నీలోత్పలములచే విశిష్టశోభగలిగినదియు, చాలయు నగాధమైనదగుటచే నెల్లవేళయందును శీతలమైనట్టిదియు, ప్రసన్నజలపూరితమైనదియు, సాధువులు నిర్భయముగ దిగి స్నానపానాదుల నాచరించి సర్వవిధతాపములను శమింపజేసి కొనుట కనుకూలముగ నున్నట్టిదియు, మిగుల పెద్దదియునగు నొక విలక్షణమైన నడబావి యొక విశాలపర్వతముయొక్క మధ్యనున్న యెడల నెటుల సర్వోత్కృష్టముగ ప్రకాశించునో, అటులనే శ్రీనివాసుని దివ్యమంగళవిగ్రహమునున్నదని భావము. భగవంతుని దివ్యమంగళవిగ్రహము నీలమేఘశ్యామలాకారము గావున దానియందలి నిగనిగ మనియెడు కాంతిస్రవంతి యొక పెద్దదీర్ఘికగా గోచరించుచున్నది. నల్ల గల్వలవంటి శోభాపరభాగమునచట గాంచవచ్చును. చతుర్ముఖబ్రహ్మ కుత్పత్తిస్థానమగు వికసితకమలపుష్పమీ దీర్ఘిక కొక యన్యాదృశమైన శోభను గలుగజేయుచున్నది. అది సదా శీతలమైయున్నది, అట్లనగా చెంగటకేగుటకు వీలుగాని యుష్ణగుణసంబంధము రవంతయైనను లేక సదా సౌమ్యమైయున్నదని యభిప్రాయము. అట్లే ఎప్పుడును ప్రసన్నమైయున్నది, అనుగ్రహైకశీలమైయున్నది. మహావిశ్వాసముగల వారువచ్చి శరణమునొంది తమ యొక్క సర్వవిధతాపములను పోగొట్టుకొనవచ్చును. మఱియు పరమాకాశమునందు ప్రకాశించుచున్నది (నాభియందు చతుర్ముఖబ్రహ్మను సంభవింపజేసిన పరమపురుషుని దివ్యమంగళ విగ్రహమునకును యర్చావిగ్రహమునకును నభేదముచే నీ విధముగ వ్యహరింపబడుచున్నది). మఱియు నా నడబావి సర్వోత్కృష్టమైయున్నది. అటువంటి దివ్యమంగళవిగ్రహమును నీ దీర్ఘిక దయాదేవికి క్రీడోపకరణమట అనగా, ఆశ్రితపాపహరణ మనెడు దయాదేవియొక్క క్రీడకు నియ్యది యంతరంగసాధనమని యభిప్రాయము. ఈ విగ్రహమును సందర్శించినవారికి సర్వపాపములును దొలగును గదా! అట్టి యీ దీర్ఘిక దయాదేవికి క్రీడాపర్వతముగానున్న వేంకటగిరిని పొందియున్నది. పూర్వోక్తప్రకారమున నీ తిరుమలయు దయాదేవియొక్క క్రీడోపకరణమే. తత్పర్వత నామధేయమునుండియే ఈ విషయము దెలియనగుచున్నది, వేంకటమను పదమునకు "సర్వపాపాని వేం ప్రాహుః కటస్తద్దాహ ఉచ్యతే" అను పురాణవ్యుత్పత్తిననుసరించి సర్వపాపదాహకత్వమే అర్థముగావునను, దయాదేవియొక్క క్రీడయు సర్వపాపాపహారకమే యగుటచేతను, ఆ క్రీడయందీపర్వతముపకరణమగుట కాక్షేపములేదు గదా! శ్రీనివాసుని దివ్యమంగళ విగ్రహమును, ఈ తిరుమలయు నేకస్వభావోపేతములని ఎతావతా ఫలించుచున్నది.

ఇచట " వృణ్వాణి " అను పదమునకు " వివృణ్వతీ " (ప్రకాశపరచుచున్న) అను నర్థమును స్వీకరించి భగవద్దివ్యమంగళ విగ్రహకాంతి యనెడి యొక మహా హ్రదము తనమధ్య దయాదేవికి క్రీడాపర్వతమైన తిరుమలను తేలించుకొని, దానిని ప్రకాశపరచుచున్న దనునొక విచిత్రానుభవ మాచార్యహృద్గతమాయె నని కొందరు వ్యాఖ్యానించుచున్నారు.

మఱియు " దీర్ఘికా " " క్రీడాశైలం " " వృణ్వతీ " అను పదములయొక్క సమభివ్యాహారమహిమచేతను, విశేషణములగతిచేతను నొక యుత్తమ నాయికా నాయకులయొక్క ప్రేమపూర్వకమైన పరస్పరసంశ్లేషవృత్తాన్తమగు నొక రస్యార్థ మిచట ధ్వనించుచున్నది.

శ్లో॥ యస్మిన్ దృష్టే తదితరసుఖైర్గమ్యతే గోష్పదత్వం
సత్యం జ్ఞానం త్రిభిరవధిభిర్ముక్తమానందసింధుమ్ ।
త్వత్స్వీకారాత్తమిహ కృతినః సూరిబృందానుభావ్యం
నిత్యాపూర్వం నిధిమివ దయే! నిర్విశంత్యంజనాద్రౌ ॥ 44

అర్థ :— హే దయే! = ఓ దయాదేవీ, యస్మిన్ = ఏ పరమాత్మస్వరూపము, దృష్టేసతి = సాక్షాత్కరింపబడినది కాగా, తదితరసుఖైః = తదన్యసుఖములచే, గోష్పదత్వం = గోష్పదత్వము (గోవుయొక్క పాదవిన్యాస ప్రదేశత్వము) ప్రాప్యతే = పొందఁబడుచున్నదో, సత్యం = స్వరూపస్వభావములయందు వికృతిలేనట్టియు, జ్ఞానం = స్వయంప్రకాశమైనట్టియు, త్రిభిః అవధిభిః ముక్తం = త్రివిధపరిచ్ఛేదములచే రహితమైనట్టియు, ఆనందసింధుం = ఆనందసముద్రమైనట్టియు, సూరిబృందానుభావ్యం = నిత్యసూరిబృందములచే ననుభవింపందగినట్టియు, నిత్యాపూర్వం = సర్వకాలములయందు నపూర్వముగానున్నట్టి, తం = ఆ పరమాత్మను, (దివ్యాత్మస్వరూపమును) త్వత్స్వీకారాత్ = నీయంగీకారమువలన, ఇహ = ఈ ప్రకృతిమండలమునందే, కృతినః = భాగ్యవంతులు (సమర్థులు), నిధిమివ = నిధినివలె, అంజనాద్రౌ = అంజనపర్వత మనబడు తిరుమలయందు, నిర్విశంతి = అనుభవించుచున్నారు.

అవతా॥ గతశ్లోకమునందు దివ్యమంగళవిగ్రహసేవయను మహాలాభము ప్రస్తావింపబడినది. ఇచట తద్ద్వారా లభించెడి దివ్యాత్మస్వరూపసాక్షాత్కారమను లాభము ప్రస్తావింపబడుచున్నది.

తా॥ ఉపనిషచ్ఛ్రుతిపాదితప్రక్రియ ననుసరించి దివ్యాత్మస్వరూపమునకుగల ప్రభావమును తత్రత్య పదములచేతనే ఈ శ్లోకమునందాచార్యులు వర్ణించుచున్నారు. "తస్మిన్ దృష్టే పరావరే" అను రీతిగ అపరిచ్ఛిన్నానంద సముద్రమగు పరమాత్మ స్వరూపమును గాంచినప్పుడు అంతవరకు సుఖరూపముగా తోచిన సాంసారిక సర్వ సుఖములను (చతుర్ముఖైశ్వర్య పర్యంతమైన సర్వసుఖములు) సముద్రములో గోష్ప దత్వ దశనందుచున్నవి. ఒక గొప్ప సముద్రములోనుండు నీటికిని, గోవుయొక్క పదవిన్యాస స్థలమున నిలుచు నీటికిని యెంత తారతమ్యము గలదో, అంత తార తమ్యము పరమాత్మానందమునకును తదితర సుఖములకును గలదని ఆ పరమాత్మ సాక్షాత్కర్త లెఱుంగుదురు. అట్లానంద సముద్రముగా నా పరమాత్మస్వరూపము ప్రకాశించుచున్నది. మఱియు నచేతన వస్తువులవలె స్వరూపములోను, చేతన వస్తువులవలె స్వభావములోను కదాచిత్తును వికారములేనిది. నిరుపాధికస్వయం ప్రకాశమైనది. అనగా తన ప్రకాశమునందు మఱొక వస్తువుయొక్క సహాయము నపేక్షింపనిది. దేశపరిచ్ఛేదము, కాలపరిచ్ఛేదము, వస్తుపరిచ్ఛేదము అనంబడు త్రివిధ పరిచ్ఛేదములు దానికి లేవు. ఇచ్చటనే యుండును, ఇపుడే యుండును, ఈ వస్తువుగనే యుండు ననుటయే త్రివిధ పరిచ్ఛేదములు. ఆ పరమాత్మస్వరూప మున కయ్యవి లేవు. ఎచ్చోటనైన నుండును. ఏ కాలమందైన నుండును. ఏ వస్తువుగా నైన నుండును. సర్వవస్తుస్వరూపత్వమనగా సర్వవస్తువులయందును నంతర్యా మిగా యుండుటచే సర్వశబ్దములును పరమాత్మనె చెప్పునని భావము. ఈ విషయ మునే "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" అను ఉపనిషద్వాక్యముద్ఘోషించు చున్నది. తత్రత్యానంతపద వివరణమే 'త్రిభిరవధిభిర్ముక్త' మనునది. మఱియు నా పర మాత్మ స్వరూపము నిత్యముక్తబృందములచే ననుభవింపదగినది. ఎంతకాల మనుభవించినను విసుగుబుట్టక అపుడే క్రొత్తగ జూడంబడు వస్తువువలె నొక యన్యాదృశమైన భోగ్యతను గల్గియున్నది. ఇటువంటి ప్రభావముతో గూడిన ఆ భగవద్దివ్యాత్మ స్వరూపమును అంజనాద్రియందు జన్మించిన భాగ్యవంతులు, ఓ దయాదేవీ! నీ యొక్క అంగీకారముచే ఈ ప్రకృతి మండలములోనే "అమృత ఇహ భవతి" అను ప్రక్రియ ననుసరించి ఈ కొండయందే ఒక పెద్ద నిధివలె ననుభవించుచున్నారు.

త్వత్స్వీకారాత్ (నీ యొక్క అంగీకారముచే ననుభవించుచున్నారు) అను పదమునకు రెండు విధములుగా భావమును వర్ణింపవచ్చును. "నన్ను చేరినవారు" అను నీ యొక్క (దయాదేవియొక్క) అనుగ్రహమను నంగీకారమును పొందిన

వారు భాగ్యవంతులు. కావుననే వారిచ్చటనే ఆ పరమాత్మ స్వరూపము ననుభవించు చున్నారనునది యొక ప్రకారము. ఇపుడంగీకార కర్మత్వము జీవులకున్నది. రెండవ ప్రకారములో, నీ యొక్క అంగీకారము పరమాత్మ కేర్పడుటవలన దాని నిచ్చటికి రప్పించి యిహలోకస్థులుగూడ అనుభవించునట్లు చేయుచున్నావని యభిప్రాయము. ఈ పక్షమునందంగీకారకర్మత్వము పరమాత్మ కేర్పడును. ఉపనిషత్తులు పరబ్రహ్మ స్వరూపమును నిధిగానే (నిధియను పదముచేతనే) వర్ణించుచున్నది. ఇటులనే ఈ శ్లోకమునందు సమ్యగ్దృష్టితో అవగాహించి చూచినయెడల వివిధోపనిషద్వాక్య రహస్యార్థములు నిండియుండుట విద్వాంసులకు గోచరమగును.

శ్లో॥ సారం లబ్ధ్వా కమపి మహతః శ్రీనివాసాంబురాశేః
కాలే కాలే ఘనరసవతీ కాలికేవానుకంపే ।
వ్యక్తోన్మేషా మృగపతిగిరౌ విశ్వమాప్యాయయన్తీ
శీలోపజ్ఞం క్షరతి భవతీ శీతలం సద్గుణౌఘమ్ ॥ 45

అర్థ :— హే అనుకంపే ! = ఓ దయాదేవీ !, మహతః = పెద్దదియగు, శ్రీనివాసాంబురాశేః = సముద్రమువంటి శ్రీనివాసునినుండి (శ్రీనివాసుండను సముద్ర మునుండి), కమపి = విలక్షణమైన, సారం = సారాంశమును ( శుద్ధజలమును ), లబ్ధ్వా = పొంది, (అతఏవ = కనుకనే), ఘనరసవతీ = సాంద్రసారాంశములగు గుణములను గలిగినదానివై (నిండిన తీర్థము గలిగినదై), మృగపతిగిరౌ = సింహాచలాఖ్యమైన వేంకటాద్రియందు (సింహ నివాస యోగ్య పర్వతమందు), వ్యక్తోన్మేషా = స్పష్టమగు నావిర్భావమును గలిగిన, భవతీ = నీవు, కాలికేవ = మేఘపంక్తి వలె, విశ్వం = ఉచ్చ నీచ విభాగము లేక సర్వప్రపంచమును, ఆప్యాయయన్తీ సతీ = సంతోషింపంజేయు దానివై, కాలే కాలే = జీవులయొక్క సుకృతములు పరిపాకదశనందు కాలమునందు (అవశ్యమగు నా యా సమయములయందు), శీలోపజ్ఞం = సౌశీల్యము నాదిగా గలిగిన (స్వభావమే కారణముగా) శీతలం = శైత్యోపేతమగు, సద్గుణౌఘం = ప్రవాహమువంటి కల్యాణగుణ బృందమును (కల్యాణ గుణములవంటి ప్రవాహమును), క్షరతి = వర్షించుచున్నావు (వర్షించుచున్నది).

అవతా॥ క్రింద శ్లోకమునందు దివ్యాత్మస్వరూపానుభవము వర్ణింపబడినది. ఈ శ్లోకమునందు దహరవిద్యావ్యాయముచే దివ్యాత్మ స్వరూపానుభవానంతర భావియైన దివ్యగుణానుభవము వర్ణింపబడుచున్నది.

తా॥ ఇచట దయాదేవిని మహావర్షమును వర్షించు నొక మేఘమాలగా చిత్రించు చున్నారు. మేఘము లవణసముద్రమునుండి సారమైన శుద్ధజలమును గ్రహించి నింపుకొని సింహాదిభయంకరమృగములు వసించు పర్వతశిఖరమునకు వచ్చి సర్వ జనములకును మహానందమును గలుగజేసి యేవిధమగు ప్రతిఫలము నెదురు చూడక స్వభావమే కారణముగా ఆ యా సమయవిశేషములో విశేషముగ వర్షించి సర్వ లోకమును, స్నానపానాది సౌకర్యముల చేతను, సర్వౌషధుల అభివర్ధనము చేతను పరమక్షేమము నెట్లు పొందించునో, అట్లే ఈ దయాదేవియు శ్రీనివాసుండను సాగ రమునుండి సారభూతములగు గుణములను గ్రహించి (తనకుపకరణములుగా చేసి కొని) సింహాచలమను తిరుమలకు వచ్చి సర్వానందకరముగ ప్రతిష్ఠితమై యుత్కర్ష నికర్షవిభాగము లేకుండ సర్వజనులను పరమక్షేమము పొందునట్లు భగవంతుని యొక్క సౌశీల్యాదికల్యాణగుణములను ఆ యా సమయములయందు వర్షించు చున్నది.

గుణములను దయాదేవి వర్షించుట యన నేమనగా ; భగవంతుని యందుండు కల్యాణగుణములను మహాపరాధులగు చేతనులయొక్క యుజ్జీవనవిషయమున నుప యోగపడునట్లు చేయుట దయాదేవియొక్క కార్యమే ; ఈ దయాదేవి లేనిచో ఆ గుణ ములు దోషములుగా గూడ పరిణమించునని పూర్వము చెప్పబడియున్నది. ఈకల్యాణ గుణములలో శీలమనెడు సౌశీల్యము చాలయు నుత్కృష్టమైనదని శాస్త్రజ్ఞుల యభి ప్రాయము. "సౌశీల్యం నామ మహతో మన్దైస్సహ నీరంధ్రసంశ్లేషః" అనగా చాలయు నుత్కృష్టమైన పురుషుడు చాలయు నికృష్టుడైన వానితో కలిసి మెలసి యుండుటయే సౌశీల్యమని చెప్పంబడియున్నది. ఈ గుణము మనబోటి వారి విషయమునందుపయోగపడి మనము క్షేమము నందవలయుననగా దయాదేవియొక్క ప్రయత్నము చాలయు నావశ్యకమైయున్నది. అనగా, భగవంతుడు పరమ దయ చేతనే పరమ నికృష్టులగు నిషాదగోపికాదులచే కలసి నిలుచుచున్నాడు. ఇదియే దయాదేవి గుణములను వర్షించుట యనునది. ఏవంచ సముద్రమతో విశేషముగా తీర్థముండినను మన ఉపయోగమునకు తగువిధమున శుద్ధపరచి మనకు లభించు నట్లు చేయునది మేఘమేగదా ! ఆ మేఘము లేనిచో ఆ జలమును మనముపయో గించుకొనుటకు వీలు లేదుగదా. అట్లే దయాదేవి లేనిచో భగవంతుని కల్యాణ గుణములు మన పర్యంత మందనివేయను తత్త్వార్థ మిచట వివక్షితము.

శ్లో॥ భీమే నిత్యం భవజలనిధౌ మజ్జతాం మానవానాం
ఆలంబార్థం వృషగిరిపతి స్త్వన్నియోగాత్ప్రయుంక్తే।
ప్రజ్ఞాసారం ప్రకృతిమహతా మూలభాగేన జుష్టం
శాఖాభేదై స్సుభగమనఘం శాశ్వతం శాస్త్రపాణిమ్ ॥ 46

అర్థ :— ( హే దయే ! = ఓ దయాదేవీ ), వృషగిరిపతిః = వేంకటాద్రీశుడైన శ్రీనివాసుడు, త్వన్నియోగాత్ = నీ యాజ్ఞవలన, భీమే = కామక్రోధాది జలచరములచే భయంకరమైన, భవజలనిధౌ = సంసారమను సముద్రమునందు, నిత్యం = ఎప్పుడును, మజ్జతాం = మునుగుచున్న, మానవానాం = జనులయొక్క, ఆలంబార్థం = అవలంబముకొఱకు, ప్రజ్ఞాసారం = వివేకమను సారాంశమును గల్గినట్టియు (బలమును గలిగినట్టియు), ప్రకృతిమహతా = స్వభావముచేతనే చాలయు నుత్కృష్టమైనదియు, (పెద్దదైనదియు) మూలభాగేన = ప్రణవముచే (భుజమనెడి మూలభాగముచే), జుష్టం = కూడినదియు, శాఖాభేదైః = అనేక శాఖలచే (వ్రేళ్లచే) సుభగం = మనోహరమైనదియు, అనఘం = అపౌరుషేయమగుటచే నెట్టి దోషము లేనట్టిదియు (ఎట్టి ఊనము లేనిదియు), శాశ్వతం = నిత్యమైనదియు (దృఢమైనది) నగు, శాస్త్రపాణిం = చేయివలె నున్న వేదశాస్త్రమును (చేతిని), ప్రయుంక్తే = ఇచ్చుచున్నాడు.

అవతా॥ క్రింది శ్లోకమునందు సౌశీల్యము మొదలగు గుణములు ప్రస్తావింపబడినవి. ఈ శ్లోకమునందు ఆ సౌశీల్యమువలె నున్న దయాకార్యమగు శాస్త్ర ప్రదానమను మఱియొక గుణ మనుభవింపబడుచున్నది. "మగ్నా నుద్ధరతే లోకాన్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా", "శాస్త్రం ప్రదీప మివ కారుణికో దదాతి" ఇత్యాది ప్రమాణములు, శాస్త్రముల నిచ్చుటను పరమదయాకార్యముగా వర్ణించుచున్నవి. సంసారమను మహాసముద్రమునందు పడి దిర్దిర దిరుగుచు నవస్థపడు వారికి శాస్త్రమను చేతిపట్టు లేనియెడల లేచివచ్చుటకు వేరుమార్గము లేదు. శాస్త్రమను కరదీపికచే మంచి చెడ్డల నెఱింగినపుడే సరియగు త్రోవలో నడువగల్గుదుము. గావున నిట్టి యుత్కృష్టమగు నుపకరణమునొసంగి ఆ సముద్రమునుండి బయల్వెడలి సరియైన త్రోవలో నడచునట్లు చేయుట దయాకార్యమనుట నిస్సంశయము. శాస్త్రములలో "వేదాచ్ఛాస్త్రం పరం నాస్తి" అని వ్యాసభగవంతుడు చెప్పినటుల ప్రధానమైనది వేదశాస్త్ర మొకటియే. అట్టి శాస్త్రమును "కారుణ్యా చ్ఛాస్త్ర పాణినా" అను ప్రమాణము ననుసరించి మునిగిపోవు వారిని వెలుపలకు దీయుట కవలంబముగా నొసంగబడు హస్తముగా వర్ణించుచున్నారు. బహువిధ జల జన్తువులచే నిండిన భయంకరసముద్రములో

మునిగిపోవు వానిని వెలుపలకు దీయ గోరిన ఆప్తుడు, మంచిబలము గల్గినదియు, స్వభావముచేతనే పెద్దదై పుష్టమైన భుజము గల్గినదియు, ఊనములేనిదియు, వ్రేళ్లను గల్గినదియు, ఎట్టి యోగుతనము లేనిదియు, దృఢమైనదియు నగు హస్తమునొసంగి యెట్లు రక్షింపునో; అట్లే దయాప్రేరితుండగు సర్వేశ్వరుడు (శ్రీనివాసుడు) జగత్తును సృష్టించిన వెంటనే దానిని ఈ కామక్రోధములచే నిండియుండు సంసారసముద్రము నుండి యుద్ధరింపగోరి పూర్వోక్తహస్తముంబోలు వేదశాస్త్రమునిచ్చుచున్నాడు. ఆ శాస్త్రము తనచే గలుగజేయబడు కృత్యాకృత్యవివేకమను ప్రజ్ఞను సారముగా (బలముగా) గల్గియున్నది. సర్వవేదార్థములు ప్రణవమునందంతర్భూతమైనవి గావున మహాప్రభావముతో గూడిన ప్రణవముతో గూడియున్నది. సహస్ర సంఖ్యాకములైన శాఖలను గల్గియున్నది. ఒక పురుషునిచేత నిర్మితముగానందున భ్రమ ప్రమాదాది దోషములు లేకయున్నది. ఇట్లు దోషరహితముగా నుండుటకు అయ్యది నిత్యమగుటయే పరమకారణము. అందుచే యిట్టి మహత్త్వముగల శాస్త్రమును పరమ దయచే సర్వేశ్వరుడు మనకిచ్చుచున్నాడను తత్త్వమిచట వివక్షితము.

మఱియు నిచట సర్వోపబృంహణములతో కూడిన వేదమును శాస్త్రపదము చేత వివక్షించుటయు యుక్తము. గావున పరదేవతా పారమార్థ్యనిశ్చయమునకు పరమసాధనమైన సాత్త్వికపురాణాది శాస్త్రములుగూడ భగవద్దయచేతనే యావిర్భవించుచున్నవి యని చెప్పుటయు యుక్తతమమే.

శ్లో॥ విద్వత్సేవా కతకనికషైర్వీతపంకాశయానాం
పద్మాకాంతః ప్రణయతి దయే ! దర్పణం తే స్వశాస్త్రమ్ ।
లీలాదక్షాం త్వదనవసరే లాలయన్ విప్రలిప్సాం
మాయాశాస్త్రాణ్యపి ద(శ)మయితుం త్వత్ప్రపన్నప్రతీపాన్ ॥ 47

అర్థ :— హే దయే ! = ఓ దయాదేవీ ! పద్మాకాన్తః = లక్ష్మీపతియగు శ్రీనివాసుడు, విద్వత్సేవాకతకనికషైః = విద్వత్సేవయనెడు చిల్లగింజయొక్క రాపిడుల చేత, వీతపంకాశయానాం = నశించినట్టియజ్ఞానపాపాది పంకములు గలిగినవారికి, తే = నీకు, దర్పణం = దర్పణమగు, స్వశాస్త్రం = తన శాస్త్రమును (భగవచ్ఛాస్త్రమనబడు పాంచరాత్ర శాస్త్రమును), ప్రణయతి = ఇప్పించుచున్నాడు, త్వదనవసరే = నీ కవసరములేని సమయమునందు, లీలాదక్షాం = లీలలయందు సమర్థమైన, విప్రలిప్సాం = వంచనేచ్ఛను, లాలయన్ = కొనియాడుచు, త్వత్ప్రపన్నప్రతీపాన్ = నిన్నాశ్రయించిన వారియొక్క విరోధులను, దమయితుం = శిక్షించుటకు, మాయాశాస్త్రాణ్యపి = మోహన శాస్త్రములనుగూడ, ప్రణయతి = చేయుచున్నాడు.

అవతా॥ గత శ్లోకమునందు ఉత్తము శాస్త్రమగు వేదమునిచ్చుట యను భగవద్దయాకార్యమగు నొక గుణ మనుభవింపబడినది. ఇచట, ఆ వేదమువలె మిగుల కొనియాడందగినదియు, సాక్షాద్భగవానుని చేతనే చేయబడినదియునగు భగవచ్ఛాస్త్రమను పాంచరాత్రాగమమును భగవంతుడిచ్చుటయు, అటులనే కొన్ని సమయములలో మోహనశాస్త్రమనెడు వేదవిరుద్ధములైన బౌద్ధాదిశాస్త్రములను తానుగను, మఱికొందఱ మూలముగాను కలుగచేయుటయు దయాకృత్యములే యని నిరూపించు చున్నారు.

తా॥ పాంచరాత్ర శాస్త్రమును దయాదేవియొక్క అద్దముగా చిత్రించుచున్నారు. ప్రపన్నులను రక్షించుటయే దయాస్వభావము. పాంచరాత్రాగమములో ప్రపత్తియొక్క ప్రభావమును, దాని స్వరూపాదులును బహూపపత్తులచే చక్కగ యుపపాదింప బడియున్నవి. కావున భగవద్దయయొక్క మహత్వమును చక్కగ నిరూపించి చూపించుటచే ఆ శాస్త్రము దయాదేవి కద్దమగుట కడ్డులేదు.

ఇట్టి పాంచరాత్ర శాస్త్రమునందు విద్వాంసులను సదాచార్యుల సంబంధము పొంది సత్సంప్రదాయనిష్ఠులయొద్ద పరిచర్య చేసి తన్మూలముగా ఆత్మలోనుండు అజ్ఞాన పాపాది దోషములు తొలంగి నిర్మలాన్తఃకరణులైన వారికే విశ్వాసము గలుగును. అట్టి సాత్వికులకే, ఇట్టి యుత్తమమైన (భగవద్దయా ప్రభావ ప్రతిపాదకమైన) పాంచరాత్ర శాస్త్రమును పరమదయచే భగవంతు డిప్పించుచున్నాడు. ఈ అర్థమును 'విశ్వస్తే వా' యని యుపక్రమింపబడిన పుర్వార్ధములో నిరూపించిరి. ఎల్లరును సద్గతి చెందునట్లు చాలయు నుత్తమమైన ప్రపత్తిమార్గమును నిరూపించు వ్యాజముచే భగవద్దయాప్రభావమును బోధించు భగవచ్ఛాస్త్రమును ఆ దయాదేవియాదేశముచేతనే భగవానుడు చేయుచున్నాడు గనుక నా శాస్త్రము దయాకార్య మగుచున్నది. కాని ఆ భగవంతుడే బుద్ధాద్యవతారములలో స్వయముగాను, మరికొన్ని సమయములలో " త్వం వా రుద్ర మహాబాహో ! మోహశాస్త్రాణి కారయ ! " అను రీతిగ మరికొందఱి మూలముగాను జనములను తత్త్వహిత పురుషార్థములలో మోహపడునట్లుచేయు మోహన శాస్త్రములను ప్రవర్తింపచేయుట దయారూపియగు వాని స్వభావమునకు తగునా ? అను సంశయమున కుత్తరార్ధములో తగు సమాధానము నొసంగుచున్నారు.

ఇచట సర్వ శాస్త్రములచేతను తదనుసారులగు పూర్వా చార్యులచేతను అంగీకరింపబడిన ఒక ముఖ్యమైన తత్త్వార్థము నాచార్యులు నిరూపించుచున్నారు. అదే

ట్లనగా ; భగవత్ప్రపన్నులనెడు బ్రహ్మవిత్తులయందు అపచారము చేసినయెడల ఆ పాపము ఎన్నియో కల్పకాలము లనుభవించినను తొలగని నరకానుభవమును గలుగ జేయుననుటయే. ఇట్టి భాగవతాపచారమను క్రూరకర్మచేయు కార్యమునే ఇచట ప్రతిపాదించుచున్నారు. జీవునిదైన ఈ క్రూరకర్మ భగవంతునినుండి దయను కించిత్కాలము విడదీసి విప్రలిప్సయనెడు వంచనేచ్ఛను స్వీకరింపజేసి తన్మూలముగా తత్త్వహితాదులలో విపరీతములగు విషయములను బోధించు మోహన శాస్త్రములను గలుగజేసి వానిలో ఈ జీవులను ఆసక్తులనుజేసి దానిచే వారిని విపరీతానుష్ఠానపరులుగ గావించి తత్ఫలమైన నరకానుభవ పర్యంతమైన శిక్షను వారికిచ్చుచున్నది. [" కంజా భవన్తి ......అవిధేయ పుత్రా భవన్తి " (పంగువులగుచున్నారు ........ అవిధేయపుత్రులగుచున్నారు) ఇట్టి శిక్షలు సాక్షాద్దయాదేవిచే గలుగునవి.] మోహనశాస్త్రములో పెగి తన్మూలముగావచ్చు నరకానుభవము భగవంతుని విప్రలిప్సచే యేర్పడుచున్నది. ఇది తుషాగ్నివలె అతిదుస్సహము. ఇట్టి కఠినశిక్షను ఆశ్రిత విరోధుల విషయములో భగవంతుడిచ్చుచున్నాడు. ఇంతటికిని ఈ జీవకర్మయే కారణము. దీనినే " దమయితుం త్వత్ప్రపన్న ప్రతీపాన్ " అనుటచే బోధించుచున్నారు. భగవద్దయాశ్రితుల విరోధులను శిక్షించుటకు పుట్టిన మోహనశాస్త్రము పరంపరగా దయాదేవియొక్క ప్రభావమునే స్థిరపరచుచున్నది. ఇట్టి కఠినశిక్ష దయాశ్రితుల విరోధులకు గలదనుట, విప్రలిప్సామూలకమగు మోహనశాస్త్ర మావిర్భవించుటచేతగదా తెలియుచున్నది. కావున దయాదేవి కించిత్కాలము విడిచిపోయినను అప్పుడు కలుగు విప్రలిప్సయు. తన్మూలకమైన మోహనశాస్త్రములును "భగవద్దయా ప్రభావమును ప్రాపంచికు లెఱుంగవలయును. తదాశ్రిత విరోధుల కిట్టి కఠినశిక్షగలదు. కావున అట్టి అపచారమునుండి జనులు నివర్తితులు కావలయును " అను దయ చేతనే ఏర్పడినవి గనుక మోహనశాస్త్రముగూడ దయాకార్యమగుట కాక్షేపము లేదు.

ఈ అర్థమున కనుకూలమైన అర్థమును " ప్రణత ప్రతికూల మూల ఘాతీ ప్రతిఘః కోఽపి వృషాచలేశ్వరస్య " అను 24-వ శ్లోకమునం దొకరీతిగా వివరించియున్నారు.

శ్లో॥ దైవాత్ప్రాప్తే వృషగిరితటం దేహిని త్వన్నిదానాత్
స్వామిన్ ! పాహీత్యవశవచనే విన్దతి స్వాపమన్త్యమ్ ।
దేవః శ్రీమాన్ దిశతి కరుణే దృష్టిమిచ్ఛం స్త్వదీయాం
ఉద్ఘాతేన శ్రుతిపరిషదాముత్తరేణాభిముఖ్యమ్ ॥ 48

అర్థ :— హే కరుణే = ఓ దయాదేవీ!, త్వన్నిదానాత్ = నిన్ను కారణముగా గలిగిన, దైవాత్ = సుకృతవిశేషముచేత, వృషగిరితటం — తిరుమల ప్రదేశమును, ప్రాప్తే = పొందిన, దేహిని = ఒక ప్రాణి, "స్వామిన్ = ఓ స్వామీ!, పాహి = కాపాడుము", ఇతి = అని, అవశవచనే = తనకు స్వాధీనములేని వాక్కుగలిగిన వాడై, అన్త్యం స్వాపం = అన్తిమ నిద్రను (మరణమును), విన్దతిసతి = పొందిన వాడు కాగా, శ్రీమాన్ దేవః = శ్రీనివాసుడు, త్వదీయాం దృష్టిం = నీ కటాక్షమును, ఇచ్ఛన్ = కోరుచు, శ్రుతిపరిషదాం ఉద్ఘాతేన = సర్వవేద బృందములకు నారంభ రూపమగు ప్రణవమనబడు, ఉత్తరేణ = ఉత్తరముచేత, ఆభిముఖ్యం = తన ఆభిముఖ్యమును, దిశతి = ఇచ్చుచున్నాడు.

అవతా॥ తిరుమలయందు లబ్ధజన్ములగు ప్రాణులకు అచట నేర్పడు లాభము లింతవరకు వర్ణింపబడినవి. ఈ శ్లోకమునందు అటుల తిరుమలలో జన్మము లభింపక పోయినను ఏదైన నొక సుకృతవిశేషముచే ఆ తిరుమలను తాత్కాలికముగా పొంది యచట దేహన్యాసము చేయువానికిగూడ తత్క్షేత్రప్రభావముచే నేర్పడు లాభము వర్ణింపబడుచున్నది.

తా॥ యాదృచ్ఛికాది సుకృతము గల్గుటయు దయాదేవి యనుగ్రహము చేతనే, అట్టి యాదృచ్ఛికాది సుకృత విశేషముచే నొక ప్రాణి తిరుమలను పొంది యచట నా దయాదేవియనుగ్రహము చేతనే తాను బుద్ధిపూర్వకముగ చెప్పవలంపక పోయినను, అర్థజ్ఞానాదులు శూన్యములే యైనను "స్వామీ కాపాడవలయును" అను మాటలు చెప్పుచు మరణించినయెడల; లక్ష్మీసహితుడును, పరమపురుషుడు నగు శ్రీనివాసుడు ఆ దయాదేవియొక్క లీలాకటాక్షముల కాశపడి "అటులనే నిన్ను కాపాడుదును" అను భావమును వెల్లడించు "ఓమ్" అనెడు సర్వ వేదారంభమగు మాటను చెప్పుచు ఆ ప్రాణి కభిముఖుడగుచున్నాడు. వానియందు శాంతకోపుడై ప్రసన్నుడగుచున్నాడని భావము. "ఓమ్" అను మాటకు అంగీకరించితినని యర్థము. "ఓమ్" అను ప్రణవము నుచ్చరించిన పిదపనే సర్వ వేదముల నారభింపవలయును గనుక "సర్వ వేదముములకును ఆరంభరూపమగు" అను విశేషణ మియ్యబడియున్నది. సర్వ వేదార్థసారమునే ప్రణవము చెప్పుచున్నది గనుక నా వేదములన్నియు నిట్టి సర్వప్రాణి సంరక్షణ దీక్షితుడును, దయామూర్తియునగు పరమపురుషునియొక్క గుణములనే చెప్పుచున్నవి యను శాస్త్రార్థమును ప్రకటీకరించుటయే ఈ విశేషణకృత్యము.

శ్లో॥ శ్రేయస్సూతిం సకృదపి దయే ! సమ్మతాం యస్సఖీం తే
శీతోదారామలభత జనః శ్రీనివాసస్య దృష్టిమ్ ।
దేవాదీనామయమనృణతాం దేహవత్త్వేఽపి విందన్
బంధాన్ముక్తో బలిభిరనఘైః పూర్యతే తత్ప్రయుక్తైః ॥ 49

అర్థ:— హే దయే ! = ఓ దయాదేవీ !, యః జనః = ఏ జనము, శ్రేయస్సూతిం = సర్వశ్రేయస్సులను గలుగంజేయు నట్టిదియు, శీతోదారాం = శైత్యము, ఔదార్యములతో కూడినదియు, తే = నీకు, సమ్మతాం సఖీం = ఇష్టమైన సఖియు నగు, శ్రీనివాసస్య దృష్టిం = శ్రీనివాసునియొక్క కటాక్షమును, సకృదపి = ఒక సారియైన, అలభత = పొందెనో, అయం = అట్టి యీ జనము, దేహవత్త్వేఽపి = శరీరముతో కూడియుండు దశయందును, దేవాదీనాం = దేవతాదుల విషయమున, అనృణతాం = అప్పులేని తనమును, విందన్ = పొందుచు, బంధాన్ముక్తః = దేహ బంధమునుండి విడవబడినవాడై, తత్ప్రయుక్తైః = ఆ దేవతలచే సమర్పింపబడిన, అనఘైః = పరిశుద్ధములైన, బలిబిః = ఉపహారములచేత, పూర్యతే = పూరింప బడుచున్నాడు.

అవతా॥ ఈ దశకారంభమునందు " ఆశాసానాః కతిచన విభోః " అనుచోట దయాలింగితమైన శ్రీనివాసకటాక్షమును గోరి కొందరు మహనీయు లీ పర్వతము నందు జన్మను ప్రార్థించిరని చెప్పిరి. తదుపరి గతశ్లోకపర్యంతము ప్రసక్తానుప్రసక్తముగా అచట జన్మించినవారికిని, దైవాత్తుగా అచట వచ్చిచేరిన వారికిని గలుగు లాభములు వివరింపబడినవి. ఈ శ్లోకములోను పై శ్లోకములోను యథాక్రమముగా ఆ శ్రీనివాసునియొక్కయు, దయాదేవియొక్కయు, కటాక్షములచే ఏర్పడు సత్ఫలములను వర్ణించి తద్ద్వారా ఆ కటాక్షములకును, దయాదేవికినిగల ప్రభావమును విశదీకరించి ఈ దశకమును పూర్తిచేయుచున్నారు.

తా॥ దయాదేవికి చాలయు నిష్టతమయగు సఖి శ్రీనివాసుని దృష్టి (కటాక్షము). ఆ శ్రీనివాసుని కటాక్షముతోడనే ఎప్పుడును దయాదేవి కలిసిమెలిసి యుండును. మఱియు నా కటాక్షములు చాలయు ప్రసన్నములుగాను. పరమోదారములుగాను నున్నవి. తాపత్రయవగ్ధుని కా శీతకటాక్షము చాలయు నింపుగా నుండును. అట్టి కటాక్షముల నొకమారైన నొకడు పొందినచో వాడు ఈ దేహసంబంధముండు వరకు దేవతలు, ఋషులు, పితృలు అనే వీరి విషయమునందు కలుగు ఋణములను దొలగించుకొని ఈ దేహసంబంధము వదలినతోడనే అర్చిరాదిగతి యను

ను_త్తమమార్గముచే పరమపదమున కేగునపుడు ఆ దేవతలచేత చాలయు ప్రీతితోడను, గౌరవముతోడను సమర్పింపబడిన యుపహారములచే సంతోషించుచున్నాడు.

ఒక్కొక ద్విజుడును జన్మించినపుడే దేవతలు, ఋషులు, పితృలు నను నీ మువ్వురి విషయమునందును ఋణిగానే జన్మించుచున్నాడు. బ్రహ్మచర్యముచే (వేదాధ్యయనముచే) ఋషులయొక్కయు, యజ్ఞములచే దేవతలయొక్కయు, ప్రజలచే (సంతానముచే) పితృలయొక్కయు అప్పులను తొలగించుకొనుచున్నాడని వేదములు చెప్పుచున్నవి. అటువంటి యీ మూడు ఋణములును భగవానుని శరణముపొంది, వాని కటాక్షము నందినవాని విషయమునందు ఏ మాత్రము లేవని.

" దేవర్షిభూతాత్మనృణాం పితౄణాం
న కింకరో నాయమృణీ చ రాజన్ ।
సర్వాత్మనా యశ్శరణం శరణ్యం
నారాయణం లోకగురుం ప్రపన్నః ॥ "

అను ప్రమాణానుసారముగా పెద్దలు నిశ్చయించియున్నారు. కావున దేహముండు నప్పుడును వాడు అప్పుపడిన వాడుకాడు. ఈ దేహత్యాగానంతరమే మోక్షమును పొందుచున్నాడు. అట్లు పరమపదమున కేగునపుడు మార్గములో "సర్వేఽస్మై దేవా బలిమావహంతి" అని యుపనిషత్తు ప్రతిపాదించినట్లు భావదోషములేక పరిశుద్ధములగు నుపహారములచే దేవతలు వీనివి పూజించుచున్నారు. శ్రీనివాసకటాక్షమునకు ఇంతటి యుత్కర్షము తత్సఖియగు దయాదేవిచేతనే ఏర్పడుచున్నది. యని పరంపరయా దయామాహాత్మ్యమే ఇచటను ప్రకటీ కృతమగుచున్నది.

శ్లో॥ దివ్యాపాంగం దిశసి కరుణే ! యేషు సద్దేశికాత్మా
క్షిప్రం ప్రాప్తా వృషగిరిపతిం క్షత్రబన్ధ్వాదయ_స్తే ।
విశ్వాచార్యాః విధిశివముఖాః స్వాధికారోపరుద్ధాః
మన్యే మాతా జడ ఇవ సుతే వత్సలా మాదృశే త్వమ్ ॥ 50

అర్థ:— హే కరుణే = ఓ దయాదేవీ !, త్వం = నీవు, యేషు = ఏ చేతనుల యందు, సద్దేశికాత్మాసతీ = సదాచార్యరూపిణివగుచు, దివ్యాపాంగం = ఉ_త్తమ కటాక్షమును, దిశసి = ప్రయోగించుచున్నావో, తే = అటువంటి, క్షత్రబంధ్వాదయః = క్షత్రబంధువు మొదలగువారు, వృషగిరిపతిం = వృషాద్రినాథుడగు శ్రీనివాసుని, క్షిప్రం = శీఘ్రముగా, ప్రాప్తాః (భవన్తి) = పొందిన వారగుచున్నారు. విశ్వాచార్యాః = లోకాచార్యులగు, విధిశివముఖాః = బ్రహ్మరుద్రాదులు, స్వాధి

కారోపరుద్ధాః=తమతమ యధికారములచే అడ్డగింపబడినవారై యున్నారు, (అతః=కావున), మాతా = తల్లి, జడే = మందుడగు, సుతే ఇవ = పుత్రునియందు వలె, త్వం = నీవు, మాదృశే = మాబోటివారియందు, వత్సలా = ఎక్కువ ప్రీతిగలదానివి, (ఇతి = అని), మన్యే = తలంచుచున్నాను.

అవతా॥ భగవత్కటాక్షప్రభావము గతశ్లోకమునందు వర్ణింపబడినది, ఆచార్యకటాక్ష ప్రభావమిచట వర్ణింపబడుచున్నది. ప్రథమమునకన్నను ద్వితీయ మెక్కువ ప్రభావముగలదనియు నిచట విశదీకరింపబడుచున్నది. దయాస్తోత్రము నందాచార్య కటాక్షమునకు సంబంధమేమనగా; దయాదేవియే ఆచార్యరూపము నందుచున్నది గావున దయ వేఱు, ఆచార్యుడు వేఱు నుట లేదు. అందుచే ఆచార్య వేషము పొందిన దయాదేవీకటాక్ష ప్రభావమిచట వర్ణింపబడినట్లగుచున్నది. అనంతర దశకమునందు మోక్షోపాయమగు ప్రపత్తిని స్వానుష్ఠాన ముఖతః ప్రస్తావింప బోవుచున్నారు. దానికి ప్రథమమున నాచార్యకటాక్ష మత్యావశ్యకము గనుక దాని నిచట కీర్తించి యుత్తరదశకము నవతరింపజేయుచున్నారు.

తా॥ మిగుల పాపులగు క్షత్రబంధువు మొదలగువారు సదాచార్యకటాక్ష విశేషముచే అతిశీఘ్రముగ మోక్షముపొందిరని ప్రమాణములు చెప్పుచున్నవి. అట్టి పాపులు అంతత్వరగా మోక్షమును పొందుట కాచార్యవేషమును పొందిన దయాదేవీకటాక్ష విశేషమే కారణము. సర్వలోకమునకును ఆచార్యపదమును వహించుటకు తగిన యోగ్యతలు గలిగిన బ్రహ్మరుద్రవ్యాసాదులు ఆ యా పదవులలో అధికారము వహించుచున్నవారగుటచే మోక్షోపాయపూర్తి గలిగియుండినను, ఆ అధికారస్థానమునకు కారణమైన సుకృతము పూర్తియగువరకు మోక్షమునందుటకు వీలులేక నిరుద్ధులుగనే యున్నారు. లోకములో ఒకతల్లి కనేక పుత్రులుండినను సమర్థులైన పుత్రునికంటె మందుడగు పుత్రునియందే ఆమెకధిక ప్రేమయుండుట అనుభవసిద్ధము. ఆ తల్లి, సమర్థు డెటులనైనను 'బ్రతికిపోవును. మందుడును, చేతగానివాడునగు నీ మూఢుడెట్లు బ్రతుకునో' అని చాలయు చింతించి వీనికి తనచేత నగు సాహాయ్యము నెక్కువగా చేయును. ఇది మాతృస్వభావము. అట్లే సర్వలోక మాతవగు నో దయామాతా! నీవు క్షత్రబంధువువలె అతిపాపిష్ఠులైన మాబోటివారియందే ఎక్కువ ప్రేమను వహించుచున్నావు. లేనిచో మాకుగూడ త్వరలో లభించు మోక్షము అతిసమర్థులైన బ్రహ్మాదులకును లభించలేదుగదా! అని ఏవం ప్రకారముగా దయను పొగడి తద్ద్వారా సదాచార్యకటాక్షమునకు గల శాస్త్రోక్తమైన యుత్కర్షము నిచట ఆచార్యులు ప్రకటీకరించియున్నారు.

క్షత్రబంధువనువాని వృత్తాంతము విష్ణుధర్మ పురాణములో 97-వ అధ్యాయములో చెప్పబడియున్నది. క్షత్రబంధువు సూర్యవంశములో జన్మించినవాడు. చాలయు పాపిష్ఠి. అడవియందు బాటసారులను సర్వజంతువులను హింసించుచుండెను. ఒక దినము త్రోవదప్పి వాడు వసించు స్థలమునకు వచ్చిన మహర్షియందు యాదృచ్ఛికముగా వానికి సద్భావమేర్పడెను. ఆ మహర్షి వీనిని ఈ క్రూర కృత్యములను వీడమని యుపదేశించెను. దానిని వదలుటకు వీలుగాదని వాడు చెప్పగా; మహర్షి ఎటులనైనను వానిని సద్గతికి త్రిప్పవలయునని తలంచి తుమ్మినప్పుడును, దగ్గినప్పుడును, "గోవిందా" యని చెప్పునటుల నుపదేశమిచ్చి వెళ్ళెను. అతడును అటులనే యాచరించుచు వచ్చెను. ఆ భగవన్నామోచ్చారణ ప్రభావముచే అనంతర జన్మమునం దుత్తమ జన్మమును పొంది పూర్వజన్మ స్మరణము గలిగి గోవిందనామ ప్రభావము నెఱింగి ఆ గోవిందుని శరణముపొంది మోక్షమునందెను.

ఇంత శ్రేయస్సును వాని కా మునిరూపమున వచ్చిన యాచార్యుని యనుగ్రహము చేతనే గల్గినది. ఏ తద్విస్తరమును విష్ణుధర్మములో తిలకించుడు.

పంచమదశకము సమాప్తము.

శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః

## షష్ఠ దశకము

శ్లో॥ అతికృపణోఽపి జన్తురధిగమ్య దయే! భవతీం
అశిథిలధర్మసేతుపదవీం రుచిరామచిరాత్।
అమితమహోర్మిజాలమతిలంఘ్య భవాంబునిధిం
భవతి వృషాచలేశపదపత్తననిత్యధనీ॥ 51

అర్థ:— హే దయే! = ఓ దయాదేవీ!, అతికృపణోఽపి జన్తుః = చాలయు వకించునదైన జంతువుగానుండువాడును, రుచిరాం = అందమైన, అశిథిలధర్మసేతుపదవీం = దృఢమైన దానివియు, ధర్మమనియెడు పరమపురుషుని పొందింపజేయు సేతుమార్గరూపయైన దానివియు నగు, భవతీం = నిన్ను, అధిగమ్య = పొంది, అచిరాత్ = శీఘ్రముగా, అమితమహోర్మిజాలం = అధికమైన పెద్ద అలలను గలిగిన, భవాంబునిధిం = సంసారసముద్రమును, అతిలంఘ్య = దాటి, వృషాచలేశపదపత్తన నిత్యధనీ = వేంకటాధీశుడగు శ్రీనివాసుని యొక్క పదముల నెడు పట్టణమునందు నిత్యమైన సంపత్తును గలవాడుగా, భవతి = అగుచున్నాడు.

అవతా॥ గతదశకమునందు శ్రీనివాసుని దివ్యకటాక్షమున కాశపడి ఈ పర్వతమునందు జన్మమును గోరిన కొందఱు మహనీయుల ప్రభావమును వర్ణించి అట్టి భగవద్దివ్యకటాక్షముగూడ సర్వశ్రేయస్సులకును కారణమగు దయారూపులగు నాచార్యుల యొక్క కటాక్షముచేతనే ఏర్పడవలయునని నిరూపించి ఆ యాచార్యకటాక్షమునకు, ఏదో ఒక మోక్షోపాయమునందు సంబంధమును కలుగజేసి మోక్షపర్యంతమగు నైశ్వర్యము నిచ్చు శక్తిగలదని ప్రతిపాదించిరి.

ఈ దశకమునందట్టి మోక్షోపాయములలో నుత్కృష్టమైన ప్రపత్తియొక్క స్వరూపాదులను, దాని కనుకూలమగు కొన్ని గుణములను దయాదేవి కనుగుణమైన రీతిలో ప్రతిపాదించి దశకాంతములో ఆచార్యులప్రభావము ననుసంధించి స్వయముగ దయాదేవియందు ప్రపత్తి ననుష్ఠించి దశకమును పూర్తిచేయుచున్నారు.

క్రింది శ్లోకమునందు మోక్షోపాయమునకు అంతరంగమైన ఆచార్యకటాక్ష ప్రభావము వర్ణింపబడినది. ఈ శ్లోకమునంవు ఆ కటాక్షముచే గలుగు ప్రపత్త్యధికారము నిరూపింపబడుచున్నది.

తా॥ పరమదరిద్రుడును దయాదేవీ యవలంబముచే శాశ్వతసంపత్తును పొంది మహానందమును పొందుచున్నాడు. కొద్దిపాటి పెట్టుబడియు లేని దరిద్రుడమిత సంపత్తు కాశపడి అనేక భయంకరజంతువులచేతను, బ్రహ్మాండమైన అలలచేతను వ్యాపించిన సముద్రమును, ఓడమొదలగు సాధనములచే నిరపాయముగా దాటుటకు వీలులేదు గనుక మహారాజుచే చాలయు నందముగాను దృఢముగాను, పన్ను మొదలగునవి లేనట్టుగ ధర్మార్థముగ నెల్లరు ప్రయాణించులాగు కట్టి విడువబడిన సేతుమార్గముచే శీఘ్రముగాదాటి పెద్ద పెద్ద కొండలు మొదలగు ప్రకృతిసౌందర్యముతో గూడి పర్వతప్రాంతముననున్న ఒక పెద్దనగరమును పొంది యచట విశేషక్రయవిక్రయాది వ్యాపారముచే ఎట్లు శాశ్వతసంపత్తును బొంది సుఖించునో, అట్లే అకించను డనంబడు, మోక్షమును పొందుటకు శాస్త్రములయందు ముఖ్యోపాయముగా చెప్పబడిన భక్త్యాద్యుపాయముల ననుష్ఠించుటకు శక్తిలేనివాడు, తనకు ఎట్టి ఘూలధనము లేకపోయినను శ్రీనివాసునిదయను శరణముగా పొందినయెడల, అనగా "ఆ భక్త్యాద్యుపాయ స్థానములో నీవే నిలిచి పరమాకించనుడ నగు నాకు ఆ మోక్షము నియ్యవలయు" నని ప్రార్థించినయెడల ఆ దయాదేవీ యనుగ్రహముచేత మిక్కిలి దృఢమైనదియు, ధర్మమనియు, సంసారసేతువనియు శాస్త్రములలో చెప్పబడిన పరమపురుషుని పొందజేయు సేతువువంటి మార్గముగా ఆ దయాదేవినే యవలంబించి క్షుత్పిపాసాశోక మోహాది మహాతరంగములచే వ్యాప్తమైయుండు ఈ సంసారమహాసముద్రము నతిశీఘ్రముగా దాటి వేంకటాద్రీశుని చరణారవిందములను పెద్ద పట్టణ

మును పొంది ఆ పాదారవిందములయందు కైంకర్య మను నాశములేని శాశ్వత సంపత్తును పొంది పరమానందము నొందుచున్నాడు. ఆహా! ఎంతటిదోగదా దయాదేవియొక్క ప్రభావమని యాశ్చర్యమును వెలిబుచ్చుచున్నారు. ప్రపత్తి యనబడు శీఘ్రముగా ఫలమునిచ్చు మోక్షోపాయమునందు అకించనుడుగను, అనన్యగతికుడుగా నుండువాడే పూర్ణాధికారి. అనగా వేఱు ఉపాయముల ననుష్ఠించుటకు శక్తి చాలనివాడును, భగవద్దయతప్ప వేఱు శరణము లేనివాడును ముఖ్యాధికారియని భావము.

"జంతుః" అనుటచే ఈ ప్రపత్తియందు ఏ ప్రాణికైనను అధికారముగలదని స్పష్టమగుచున్నది. ఇట్లు ఇచ్చట ప్రతిపదముచేతను వేదాంతోక్తములైన ప్రపత్తి విషయములగు పలుశాస్త్రార్థములు నిరూపింపబడుచున్నవి. అవహితులై తిలకించువారికవి స్పష్టమగును.

వేంకటేశ్వరునియొక్క చరణారవిందములను పట్టణముగా రూపించుటచే మహానగరమునం దపేక్షితములైన సమస్తపదార్థములు లభించునట్లు తచ్చరణారవిందముల నాశ్రయించువారికి కోరిన సమస్తపురుషార్థముల నిచ్చునది యా భగవచ్చరణారవిందయుగమే అను తత్త్వార్థమిచట వివక్షితము.

శ్లో॥ అభిముఖభావసంపదభిసంభవినాం భవినాం
క్వచిదుపలక్షితా క్వచిదభంగురగూఢగతిః ।
విమలరసావహా వృషగిరీశదయే! భవతీ
సపది సరస్వతీవ శమయత్యఘమప్రతిఘమ్ ॥ 52

అర్థ:— హే వృషగిరీశదయే = వేంకటాధీశుని దయాదేవీ! విమలరసావహా = నిర్దుష్టమగు స్నేహముగలిగిన దానవును, (కాలుష్యములేని తీర్థమును ప్రవహింపజేయునదియును). క్వచిదుపలక్షితా = కొన్ని ప్రదేశములందు కొన్ని కాలములందు జనులచే చూడబడియు, క్వచిదభంగురగూఢగతిః = కొన్ని దేశకాలములందు యెవ్వరిచేతను చూడబడ జాలకుండియు (అంతః ప్రవాహమును) ప్రవాహమును కలిగిన దానవును అగు, భవతీ = నీవు, సరస్వతీవ = (అంతర్వాహినియగు) సరస్వతీనదివలె, అభిముఖభావసంపదభిసంభవినాం = నీ యందు ఆభిముఖ్యమనే సంపదకు అనుకూలమైన జన్మమును కలిగినటువంటి, భవినాం = సంసారులయొక్క, అప్రతిఘం = తీర్చుటకు శక్యముకాని, అఘం = పాపమును, సపది = తత్క్షణమే, శమయతి = పోగొట్టుచున్నావు.

అవతా॥ క్రిందటి శ్లోకమునందు దయాదేవిని శరణముపొందిన అకించనాధికారుల విషయములో ఆమెచేయు నుపకారము వర్ణింపబడినది. ఈ శ్లోకమునందు

'ఆ దయాదేవిని ఆశ్రయించినవారిలో కొందఱకు కొన్ని సమయములలో క్లేశదుఃఖాదులు కలుగుచున్నవే ఇది యుక్తమా' అను సందేహమునకు దృష్టాంతపూర్వముగ సమాధాన మొసంగబడుచున్నది.

తా॥ ఇచ్చట దయాదేవిని సరస్వతీనదిగా చిత్రించుచున్నారు. సరస్వతీనది అంతర్వాహిని. ఆ నది కొన్ని ప్రదేశములలో కొన్ని సమయములలో అందఱకును కనుబడులాగున బహిరంగముగా ప్రవహించును. మఱికొన్ని ప్రదేశములలో మఱి కొన్ని సమయములలో యెవ్వరిచేతను చూడబడజాలక భూమిలోపలనే నిర్మల తీర్థముతో ప్రవహించును. అచ్చట కనుబడక పోవుటచేతనే ఆ నది లేదని తలచరాదు. అట్టి ఆ నది పుణ్యతీర్థమగుటచే దానియందు యావచ్ఛక్తి ఆభిముఖ్యము వహించు వారిని పాపములనుండి విడదీసి వారికి క్షేమమునిచ్చును. అట్లే దయాదేవియు ప్రపంచములోనుండు సర్వజంతువులందును సర్వదా పరిపూర్ణమైన స్నేహరసమును అనగా అనుగ్రహబుద్ధిని కలిగియున్నది. కొన్ని సమయములలో కొందఱియందు స్పష్టముగా ఆ దయాదేవియొక్క అనుగ్రహము (ప్రవాహము) కనుబడును. మఱి కొందఱియందు కొన్ని సమయములలో ఆ యనుగ్రహప్రవాహము కనుబడదు. అయినను అచ్చటను ఆమెయొక్క ప్రవాహములోపల ఉండియున్నదనియే తలంచవలయును. సుఖము యేర్పడునపుడు ఈశ్వరునిదయచే కలిగినదిగా తలంచుచున్నాము. దుఃఖక్లేశాదులు సంభవించినపుడు ఈశ్వరునిదయలేదని తలంచుచున్నాము. అది పొరపాటు. కష్టము సంభవించినపుడుకూడ దయయున్నదనియే తలంచవలయును. దయాదేవి హితమును చేయునది. కఠిన ప్రకృతులకు ఆమె కష్టముల నిచ్చుటయు వారియొక్క హితము నుద్దేశించియే. సుఖము నిచ్చునప్పుడు ఆమె స్పష్టముగా కనుబడుచున్నది. కష్టమునిచ్చునపుడు లోపలనే మఱుగుబడి యుండి మన హితమునకుగాను పాడుపడుచున్నది, అచ్చటను ఆమె ఉన్నది. కాగా దయాదేవియే మన హితమునకుగాను కష్టములను ఇచ్చుచున్నది అనియే శాస్త్రముల తాత్పర్యము అను శాస్త్రార్థమును ఇచ్చట సరస్వతీదృష్టాంతముచే ఆచార్యులు విశదీకరించియున్నారు. ఇట్లు సర్వజంతువులందును హితబుద్ధికలిగిన దయాదేవి తనయందాభిముఖ్యము మాత్రము కలిగిన వారినికూడ ఉన్నతస్థితికితెచ్చి అతిత్వరలో వారియొక్క క్రూరమగు పాపములను సరస్వతీ నదివలెనే పోగొట్టు చున్నది.

ఈ ప్రపత్తి దశకమునందు "సర్వహితప్రావణ్యము" అనే దయాదేవియొక్క గుణము అవశ్య మపేక్షితమగుటచే నిరూపింపబడినది.

శ్లో॥ అపి కరుణే! జనస్య తరుణేన్దువిభూషణతా -
మపి కమలాసనత్వమపి ధామ వృషాద్రిపతేః ।
తరతమతావశేన తనుతే నను తే వితతిః
పరహితవర్ష్మణా పరిపచేలిమకేలిమతీ ॥ 53

అర్థ :— హే కరుణే = ఓ దయాదేవీ, పరహితవర్ష్మణా = పరహితమను రూపముచే, పరిపచేలిమకేలిమతీ=పరిపక్వముచెందిన లీలలనుగల, తే=నీయొక్క, వితతిః = విస్తారము (ప్రవాహము), జనస్య = జనులకు, తరుణేన్దువిభూషణతామపి=బాలచంద్రుని శిరమునగల శివునియొక్క స్థానమును, కమలాసనత్వమపి= పురుషోత్తముని నాభికమలమును ఆసనముగా కలిగిన చతుర్ముఖునిపదవిని, వృషాద్రిపతేః = వేంకటాద్రిపతియగు శ్రీనివాసునియొక్క (పరమ పురుషునియొక్క) ధామాపి= స్థానమును (మోక్షమును) కూడ, తరతమతావశేన = తారతమ్య వశముచే, తనుతే నను = ఇచ్చుటలేదా! (ఇచ్చుట నిశ్చయము).

అవతా॥ గతశ్లోకద్వయముచే అకించనులగు మోక్షాధికారుల విషయములో దయాదేవి యవలంబించు ప్రక్రియ వర్ణింపబడినది. ఇచ్చట మోక్షార్థులే దయాదేవిని శరణము పొందవలయునా? ఐశ్వర్యము మొదలగు పురుషార్థముల నపేక్షించువారి విషయములో ఆమె చేయగలది యేమియులేదా? అని కొందఱకేర్పడు సందేహమును పోగొట్టి సర్వ పురుషార్థములను భగవద్దయచేతనే కలుగుచున్నదను శాస్త్రార్థమును ప్రసంగవశమున నిరూపించుచున్నారు.

తా॥ క్రిందిటి శ్లోకమునందు వ్యంగ్యముగా జెప్పబడిన 'పరహిత ప్రావణ్యము' అను దయాస్వరూపము ఇచ్చట వ్యక్తముగా చెప్పబడుచున్నది. దయాదేవియొక్క ప్రవాహము పరహితమును చేయుట అను రూపముననే యుండును. ఇదే దయాదేవియొక్క పరిపక్వమగు లీల. పరమఫలమగు మోక్షమును ఒక్కొక్క జంతువుకును ఆమె ఇచ్చుటకు సిద్ధముగానున్నది. ఐతే వారువారు తమతమ పూర్వకర్మానుగుణముగ వేఱువేఱు ఫలములను కోరుచున్నారు. అందుచే వారివారి ప్రార్థనయొక్క తారతమ్యము ననుసరించి శివపదమో చతుర్ముఖపదమో లేక సాక్షాత్పరమపురుష పదమగు మోక్షమో దేనిని కోరుచుందురో దాని నొసంగుచున్నది. కాగా సర్వ పురుషార్థములను ఆమె యొద్దనుండియే పొందవలయును. ఉత్తమపురుషార్థమును ప్రార్థించకుండుట మన పొరపాటేగాని ఆమె దోషము కాదు.

శ్లో॥ ధృతభువనా దయే త్రివిధగత్యనుకూలతరా
వృషగిరినాథపాదపరిరంభవతీ భవతీ ।
అవిదితవైభవాఽపి సురసిన్ధురివాతనుతే
సకృదవగాహమానమపతాపమపాపమపి ॥ 54

అర్థ :— హే దయే = ఓ దయాదేవీ !, ధృతభువనా = పోషింపబడెడి సకల లోకములను కలదానవును (జలమును ధరించినదియు), త్రివిధ గత్యనుకూలతరా = త్రివిధ పురుషార్థములకును అనుకూలురాల వగునట్టియు (ఆకాశము భూమి పాతాలమునను మూడు చోటులందును ప్రవహించి యెల్లరకును నానుకూల్యము నొసంగు నదియు). వృషగిరినాథ పాదపరిరంభవతీ = వేంకటాచలపతియగు పరమ పురుషుని యొక్క తిరువడి సంశ్లేషము గలిగినదానవును నగు. భవతీ = నీవు, సురసింధురివ = దేవనదియగు గంగవలె, అవిదిత వైభవాఽపి=యెఱుంగబడని వైభవమును కలదానవైనను, సకృదపి = ఒక సారియైనను, అవగాహమానం = స్నానముచేయు వానిని (ఆశ్రయించిన వానిని). అపతాపం = తాపము పోయిన వానినిగను, అపాపమపి = పాపములేని వానినిగను, ఆతనుతే = చేయుచున్నావు.

అవతా॥ 'అభిముఖభావ' శ్లోకములో శ్రీనివాసుని దయను సరస్వతీనదిగా చిత్రించినారు. తదనంతర శ్లోకమందు మధ్య సంభవించిన సందేహమునకు సమాధానము నిచ్చిరి. ఈ శ్లోకమునను పై శ్లోకమునందును దయాదేవిని గంగానదిగా చిత్రించుచున్నారు.

తా॥ ప్రపత్తికి ఉద్దేశ్యయగు దయాదేవికిగల ఉత్కర్షమును అవశ్యమగు గుణాంతరములను ఇచ్చట వర్ణింపబడుచున్నవి. ప్రపత్తిచేయువాడు ప్రపత్తి విద్యను భక్తియోగమువలె చాలకాలము ఆవృత్తిచేయ నక్కరలేదు. ఒకేసారి భగవద్దయను శరణము నొందిన చాలును. అటులనే ఆ దయాదేవియొక్క పూర్ణ ప్రభావము తెలిసికొనవలయునను నిర్బంధమును లేదు. ఆమె ప్రభావమును యెఱుంగని వానిని కూడ 'యదృచ్ఛయాఽపి సంస్పృష్టః దహత్యేవ హి పావకః' (నిప్పు అని తెలియక స్పృశించినను అది తన స్వభావము ననుసరించి దహించియే తీరును). అనునట్లు తన స్వభావమునకు తగినట్లు శరణము పొందినయెడల అట్టివారిని రక్షించియే తీరును అను నియమే ఆ యుత్కృష్టగుణము. ఈ విషయముననే గంగానదిని దృష్టాంతీకరించి ఆచార్యులవారు వర్ణించుచున్నారు. గంగానదికిని దయకును

గల సామ్యమును పలువిశేషణములచే విశదీకరించుచున్నారు. గంగానది భువన మనెడి తీర్థమును ధరించుచున్నది. ఇంతియెగాక సర్వలోకమును తన పారిశుద్ధ్యముచే ధరించుచున్నది. అట్లనే దయాదేవియు సర్వలోకములను తన పాలనాధికారముచే ధరించుచున్నది. గంగకు స్వర్గము భూలోకము పాతాలము నను మూడు లోకములందును గతి కలది. కనుకనే దానికి త్రిపథగా త్రిమార్గగా అను మొదలగు పేరులు కలవు. దయాదేవియు త్రివిధగతి కలిగియున్నది. అనగా ఐశ్వర్యము కైవల్యము మోక్షము నను మూడు పురుషార్థములకును అనుకూలమైనది. గంగ భగవంతుని పాదారవిందములనుండి పుట్టుచున్నది. దయయు భగవంతుని పాదములందే మొదట పుట్టుచున్నది. ఈ విషయము 'రూఢా వృషాచలపతేః పాదే' అను శ్లోకమున నిరూపింపబడియున్నది. గంగయొక్క ప్రభావమును యెఱుంగనివాడును ఒకసారి దానిలో స్నానము చేసినచో ఆ నది తన స్వభావమునకు తగినట్లు వాని శరీరములోని బాహ్యతాపములను పోగొట్టి ఆత్మగతమైన పాపములనుకూడ పోగొట్టును. అటులనే దయాదేవియు తన ప్రభావమును యెఱుంగని వాడైనను ఒకసారి శరణమునందిన తావన్మాత్రముచే స్వస్వభావానుగుణముగ వానికిగల ఆధిభౌతికాధిదైవికాదితాపములను వానికి మూలకారణమైన పాపములనుకూడ పోగొట్టి ఉత్తమపురుషార్థము నిచ్చుచున్నది.

ప్రపత్తి దశకమునందు దయాదేవియొక్క ఈ యుత్తమగుణము అవశ్య నిరూపణీయమని తలంచిన ఆచార్యులు దీనిని చాల మనోహరమగు ప్రక్రియలో ప్రకటీకరించిరి.

'క్రిందటి 52-వ శ్లోకమునందు సరస్వతీ నదీసామ్యమును పై శ్లోకమునందు గంగానదీసామ్యమును వర్ణించుచున్న ఆచార్యులు ఈ శ్లోకమున యమునానదీసామ్యమును (దయాదేవికి) వర్ణించుచున్నారు. రెండు శ్లోకములలో గంగాసామ్యము చెప్పుటకంటె ఈ శ్లోకమున యమునాసామ్యము నంగీకరించి ప్రసిద్ధమైన మూడు పుణ్యనదుల సామ్యము ఈ ప్రకరణములో వర్ణించుట చాల యుక్తము'. అని కొందఱు పెద్దల అభిప్రాయము. దాని కనుగుణముగ నీ శ్లోకమునందు 'త్రివిధగత్యనుకూలతరా' 'వృషగిరినాథ పాదపరిరంభవతీ' అను మొదలగు విశేషణంబులు అమరియున్నవని వారి హృదయము. ఇచ్చట ప్రాచీన వ్యాఖ్యానములను పెద్దల అభిప్రాయములను అనుసరించి మా వ్యాఖ్యానము ప్రవృత్తమైనది. తత్త్వమును సహృదయులు గమనించవలెను.

శ్లో॥ నిగమసమాశ్రితా నిఖిలలోకసమృద్ధికరీ
భజదఘకూలముద్రుజగతిః పరితప్తహితా ।
ప్రకటితహంసమత్స్యకమఠాద్యవతారశతా
విబుధసరిచ్ఛ్రియం వృషగిరీశదయే ! వహసి ॥ 55

అర్థ :— హే వృషగిరీశదయే=ఓ వేంకటాద్రీశుని దయాదేవీ !, నిగమ సమాశ్రితా = వేదమును పొందినదానివియు (వేదప్రతిపాద్యమయినట్టియు) నిఖిలలోక సమృద్ధికరీ = సర్వలోకమునకును సమృద్ధి నొసంగుదానివియు, భజదఘకూలముద్రుజగతిః = ఆశ్రితులయొక్క పాపమనెడు గట్టును పెకలించివేయు గమనవతివియు, పరితప్తహితా = మిక్కిలి తాపమునొందిన వారికి హితకరివియు, ప్రకటిత హంస మత్స్యకమఠాద్యవతారశతా = ప్రకాశింపఁజేయంబడిన హంస - మత్స్య - కూర్మాద్యనేక భగవదవతారములు గలదానివియునగు (హంసములు, మత్స్యములు, కూర్మములు నాదిగాగల వివిధ జల జంతువులను ప్రకాశపరచు పలు రేవులను గలిగినట్టి). త్వం = నీవు, విబుధ సరిచ్ఛ్రియం = దేవనదియగు గంగయొక్క శోభను, వహసి = వహించుచున్నావు.

అవతా॥ ఈ శ్లోకమునందును గంగా సామ్యము వర్ణింపఁబడుచున్నది.

తా॥ గంగానదియొక్క ప్రభావము వేదములలో విశేషముగా ప్రతిపాదింపబడియున్నది. స్వర్గము, భూలోకము, పాతాళమునను త్రిలోకములలోను తన ప్రవాహముచే గంగానది విశేష సమృద్ధిని గలుంగజేయుచున్నది. ఆ నదిలో స్నానాదుల నాచరించువారియొక్క పాపములను పూర్తిగా నశింపజేయు స్వభావముగలది. మిక్కిలి తాపము నొందినవానికి తన శైత్య మాధుర్యాది స్వభావములచే పరమహితకరియగుచున్నది. హంసము, మత్స్యము, కూర్మము మొదలగు వివిధ జల జంతువులను ప్రదర్శించు పలు రేవులను గలిగినది. ఈ యర్థములను ప్రతిపాదించు విశేషణములు దయాదేవికిగూడ నమరియుండుటచే ఇచట దయను గంగగా చిత్రించియున్నారు.

భగవద్దయాదేవియు వేదములయందు విశేషముగ ప్రతిపాదింపఁబడియున్నది. భగవద్దయ ఏ వేదములో ఎట్లు ప్రతిపాదింపఁబడియున్న దనగా ఏతద్విశదీకరణమే ఈ దయాశతకముయొక్క పరమోద్దేశ్యమనుటయుఁ దగును. వేదములలో భగవానుండొనరించు జగత్సృష్టి - రక్షణ - సంహారము మొదలగు వ్యాపారములును, పాంచరాత్రాగమాదులలో వానియొక్క వివిధావతారములును ప్రతిపాదింపఁబడి

యున్నవి. ఈ సృష్ట్యాది సర్వవ్యాపారములును, పరవ్యూహాది సర్వావతారములును, భగవంతుని దివ్యమంగళవిగ్రహమును, కిం బహునా ? సర్వమును దయాదేవి యొక్క కార్యములే అని ఈ స్తోత్రములో మిగుల సుందరముగ నచట నచట నిరూపించియుండుటచే దయయొక్క విచిత్రమైన కార్యవర్గమును ప్రతిపాదించు వేదము నాదిగాగల శాస్త్రములన్నియు దయనే (కార్యముఖేన) ప్రతిపాదించుచున్నట్లు తెలియ పరుపబడు చున్నదిగదా ! ఇటులనే భగవంతునియొక్క సకల కల్యాణగుణములును దయాదేవియొక్క కింకరవర్గములే అనియు ప్రతిపాదింపఁబడియున్నది. ఏవంచ భగవద్గుణములను వర్ణించు వేదభాగములుగూడ మఱుగున దయనే పొగడినవి యగుచున్నవి. ఇటులనే మఱియు నూహింపనగును. మరియు దయాదేవి సమస్త లోకములకును సర్వ సమృద్ధులనుఁ గలుఁగఁజేయునది. తనను శరణము పొందు వారియొక్క పుణ్యపాపము లనెడు ద్వివిధకర్మములను నిశ్శేషముగ నంతరింపఁ జేయునది. సంసారతాపదగ్ధునకు పరమహితకారిణి యగుచున్నది. భగవంతుని యొక్క హంస మత్స్యాది జ్ఞానప్రదములగు వివిధావతారములను గఁలుఁగఁ జేయునది. భగవదవతారములన్నియు దయాకార్యములే గదా ! కాగా, గంగకుండు స్వభావములన్నియు దయాదేవికినున్నవి గావున ఈయమను గంగాదేవికి సమముగ చెప్పుట కడ్డు లేదని యాచార్యుల హృదయము.

ఇచ్చట నిరూపింపంబడియుండు దయాగుణములన్నియు ప్రపత్తిచేయు నధికారిచే నెఱుంగబడవలసిన దవశ్యము గనుక నీ దశకములో నవి వర్ణింపబడినవి.

శ్లో॥ జగతి మితంపచా త్వదితరా తు దయే ! తరళా
ఫలనియమోజ్ఝితా భవతి సంతపనాయ పునః ।
త్వమిహ నిరంకుశప్రశకనాదివిభూతిమతీ
వితరసి దేహినాం నిరవధిం వృషశైలనిధిమ్ ॥ 56

అర్థ :— హే దయే ! = ఓ దయాదేవీ !, జగతి = ప్రపంచమునందు, త్వదితరా = నీకంటె వేఱైన, దయా తు = దయ యయినచో, మితంపచా = చాలయు నల్పములగు ఫలముల నిచ్చునదిగాను, తరళా = చంచలమైనదిగాను, ఫలనియమోజ్ఝితా = నిశ్చయముగ ఫలముల నొసంగెడు నియమము లేనిదియు, సంతపనాయ పునః = ఆధ్యాత్మికాది తాపములనుగూడ మరల నిచ్చునదిగాను, భవతి = అగుచున్నది, నిరంకుశప్రశకనాదివిభూతిమతీ = ఎవరిచేనైన నడ్డగించుటకు వీలుగాని నిరంకుశ శక్తి, స్వాతంత్ర్యము మొదలగు గుణములను విభూతిగాగలిగిన, త్వం = నీవు,

ఇహ = ఈ లోకమునందు, దేహినాం = ప్రాణులకు, నిరవధిం = అపరిమితమైన, వృషశైలనిధిం = వేంకటగిరియందుండు నిధిని (శ్రీనివాసుని), వితరసి = ఇచ్చుచున్నావు.

అవతా॥ క్రింది శ్లోకమునందు గంగాసామ్యముచే శ్రీనివాసుని దయకుగల సర్వలోక సమృద్ధికరత్వాది గుణము లనుభవింప బడినవి. తద్ద్వారా ఇతరదయల స్వభావములుగూడ స్మృతిపథము నధిరోహించగా వానియొక్క కొఱతలను, వానికెదురుగ శ్రీనివాసుని దయకుండు సంపూర్తిని ఈ శ్లోకములో వర్ణింపుచున్నారు. మోక్షార్థముగా ప్రపత్తిచేయువాడు ఇతరదయలకును, భగవద్దయకునుగల తారతమ్యమును అవశ్య మెఱుంగవలయును. అపుడే పై శ్లోకములలో చెప్పబోవు మహావిశ్వాసము మొదలగు ప్రపత్త్యంగములు పూర్ణముగ సిద్ధించును. కాగా, అవశ్య నిరూపణీయమైన ఈ విషయమును ఈ శ్లోకములో (పూర్వార్థముచే ఇతర దయలకుగల కొఱతను - ఉత్తరార్థముచే శ్రీనివాసుని దయకుగల పూర్తిని) నిరూపించుచున్నారు.

తా॥ శ్రీనివాసదయేతరములైన బ్రహ్మరుద్రాదిదయలును, లౌకిక ప్రభువుల దయలును కొన్ని ఫలములనిచ్చుటకు శక్తిలేనివి. ఇయ్యఁబడు ఫలములును చాలయు పరిమితములుగనే యుండును. మరియు నాదయలు నశ్వరములు. అనగా మనము ఆ బ్రహ్మరుద్రాదుల నుపాసించి వారికి దయగలిగినను ఆ దయచే మనకు ఫలము లభించుటకుముందే వారు నశించినయెడల తద్దయలును నశించును. కావున నిశ్చయముగ ఫలములు గలుగునని నమ్ముటకు వీలులేదు. మరియు ఈ దినము మనకు ననుకూలురుగ నుండినచో దయ యుద్భవించును. రేపు ప్రతికూలురైనచో ఆ దయ నశించి విపరీత ఫలప్రదమగు కోపము నుదయించును. ఒకవేళ వారిదయచే ఒక ఫలమును పొందినను ఆ ఫలము నిత్యముగాను, అపరిచ్ఛిన్నముగా నుండనేరదు. ఆ స్వల్పఫలము ముగించినచో మరల సంసారతాపత్రయము మనలను పీడించును. శ్రీనివాసదయ యయినచో అన్ని విషయములలోను, దీనికెదురైనది. భగవంతుని యొక్క నిరంకుశ స్వాతంత్ర్యము, నిరంకుశశక్తి మొదలగు గుణములను దయ తనకనుకూలముగ జేసికొని వానిని సర్వ ప్రాణిహితమునందే యుపయోగపరచుచున్నది. ఈ శ్రీనివాసదయ యొసంగు ఫలము లపరిమితములుగనుండును. నిత్యమగు మోక్షమునుగూడ నామె యొసంగుటకు శక్తి గలిగియున్నది. ఆమె యొక ప్రాణిని విషయీకరించినయెడల వానికి కర్మాధీనముగ నేర్పడు పలు ప్రతిబంధకములను తగురీతిలో పోగొట్టి ఏదైన నొకదినమున పూర్ణఫలమును నిశ్చయముగ

నొపంగియేతీరును. ఆమెచే మోక్షమను పూర్ణఫలమును పొందినవాడు మరల సంసారతాపమును పొందడు. ఇంత మాత్రమేగాక భగవద్దయను పొందినవానికి ఇహలోకములోనే మోక్షానుభవమని చెప్పందగిన వేంకటగిరిలోనుండు శ్రీనివాసుడను పెద్ద నిధియొక్క అనుభవమునిచ్చి సంతోషింపజేయుచున్నది. ఉపనిషత్తులును పరమపురుషుని నిధిగా జెప్పుచున్నవి.

శ్లో॥ సకరుణలౌకికప్రభుపరిగ్రహనిగ్రహయోః
నియతిముపాధిచక్రపరివృత్తిపరంపరయా ।
వృషభమహీధరేశకరుణే! వితరంగయతాం
శ్రుతిమితసంపది త్వయి కథం భవితా విశయః ॥ 57

అర్థ :— హే వృషభమహీధరేశకరుణే = ఓ వేంకటాధీశుని దయాదేవీ!, సకరుణలౌకికప్రభుపరిగ్రహనిగ్రహయోః = దయతోగూడిన లౌకికప్రభువుల అనుగ్రహనిగ్రహములయొక్క, నియతిం = వ్యవస్థను, ఉపాధిచక్రపరివృత్తిపరంపరయా = ఆనుకూల్య - ప్రాతికూల్యములను కారణములయొక్క పరంపరచే గలిగినదిగా, వితరంగయతాం = నిశ్చయించువారికి, శ్రుతిమితసంపది = వేదములచే ప్రకటింపబడిన వైభవముగలిగిన, త్వయి = నీయందు, విశయః = సంశయము, కథం భవితా = ఎట్లు కలుగును ? (కలుగదు).

అవతా॥ క్రింది శ్లోకమునందు ఇతర దయలకంటె శ్రీనివాసునిదయకు గల యత్కర్షము నిరూపింపబడినది. అట్టి దయాదేవియందు ప్రపత్తిచేయువానికి సంశయము లేకుండుటయు. ధృఢమైన విశ్వాసమును అవశ్యాపేక్షితములు. భగవద్దయాస్వరూపమును చక్కగ పరిశీలించువారికి సంశయమునకు ప్రసక్తియే లేదని ఈ శ్లోకములో విశదీకరించుచున్నారు.

తా॥ లోకములోనుండు నొక కారుణిక ప్రభువు ఆ యా దేశకాలములలో ఒకని యనుగ్రహించుటకును, నిగ్రహించుటకును కారణమేమనగా ఆ పేదవాడా ప్రభువునందు అనుకూలుడుగాను, ప్రతికూలుడుగా నుండుటయే. వీడు ఎప్పు డనుకూలుడగుచున్నాడో అప్పుడు ప్రభువనుగ్రహించుచున్నాడు. ఎప్పుడు ప్రతికూలుడగుచున్నాడో, అప్పుడు నిగ్రహించుచున్నాడు. ఏవంచ ప్రభ్వనుగ్రహమును కోరినచో అవశ్యము వాయనయెడల నానుకూల్యము ప్రదర్శింపవలయును. అట్టులననుకూలుడైనచో నిశ్చయముగ ననుగ్రహమేర్పడును. లౌకికప్రభువునందే ఇట్టి నియమముండగా, వేదములలో విశేష వైభవోపేతగా వర్ణింపబడు శ్రీనివాసుని

దయాదేవి విషయమునందు అనుకూలుడుగా యుండినచో తదనుగ్రహముద్భవించు నను విషయములో సందేహమునకు ప్రసక్తియేమి? అనుకూలుడుగా యుండిన యెడల దయాదేవియనుగ్రహమును నిశ్చయముగా పొందవచ్చును. తన మహా పాపములను గాంచి సంశయింప నవసరము లేదు. ఇంతవరకు మహాపరాధియే యైనను ఇదిమొదలు అనుకూలుఁడుగా నుండెదనని నిశ్చయించుకొని ధృఢమగు విశ్వాసముతో శరణము పొందవచ్చును. ఇందుచే ప్రపత్తికి ముఖ్యాంగమగు మహా విశ్వాసమిచట ఎట్లు ప్రతిపాదింపబడి నట్లగుపన్నచో అట్లే అనుకూల్య సంకల్పము, ప్రాతికూల్యవర్జనమను నంగములుగూడ ఈ శ్లోకములో ప్రతిపాదింపబడుచున్నవని గ్రహింపవలయును. ప్రపత్తిచేయువానికి ముఖ్యమైన ఈ యంగములయొక్క స్వరూపమును, ఇయ్యది ప్రపత్తిలో ఉపయోగించు ప్రక్రియయును అవశ్యము నెఱుంగదగినది గనుక ఈ దశకము నందిచట వీనిని నిరూపించియున్నారు.

ఇచట లౌకికప్రభు దృష్టాంతముచే ఒక సంశయ ముద్భవింపవచ్చును. అదే మన. లౌకికప్రభువు ప్రతికూలుని విషయమునందు నిగ్రహించుటవలె దయాదేవియు ప్రతికూలునియందు నిగ్రహించునా? అని. దీనికి సమాధానము "శ్రుతిమితసంపది" అను పదముచే చెప్పబడుచున్నది. వేదములు భగవన్మహిషులను "అజ్ఞాత నిగ్రహాలు" (నిగ్రహమను విషయము నెఱుంగనివారు) అని నిరూపించుటచే భగవన్మహిష్యగ్రగణ్యయు లక్ష్మీస్వరూపిణియునగు దయాదేవియు నిగ్రహించుటలేదని కొందరు సమాధానము నొసంగుచున్నారు. మఱికొందరు, నిగ్రహానుగ్రహములను నుభయ విషయములలోను లౌకికప్రభు దృష్టాంతమును వివక్షించినను బాధకములేదు. దయాదేవి కిక్కడ ప్రతికూలురయందు నిగ్రహముగలదు. కాని దయాదేవిచేయు నిగ్రహములన్నియు ననుగ్రహమునందే పర్యవసించును. తత్కాలము మన కప్రియ మగుటచే నిగ్రహమువలె నుండినను లఘువైన అట్టి శిక్షణలచే మనకుగల ప్రతికూలాచరణకు కారణీభూతమైన పాపములను బోగొట్టి సన్మార్గమునకుంద్రిప్పి యంతమున ననుగ్రహమునే చేయును. ఈ విషయమే "శ్రుతిమితసంపది" అను పదముచే వివక్షితము అని చెప్పుచున్నారు.

శ్లో॥ వృషగిరికృష్ణమేఘజనితాం జనితాపహరాం
త్వదభిమతిం సువృష్టిముపజీవ్య నివృత్తతృషః।
బహుషు జలాశయేషు బహుమానమపోహ్య దయే!
న జహతి సత్పథం జగతి చాతకవత్కృతినః॥ 58

అర్థ:— హే దయే! = ఓ దయాదేవీ!, జగతి = లోకమునందు, కృతినః = భాగ్యవంతులు (ఆళ్వార్లు ప్రభృతులు), చాతకవత్ = చాతకపక్షివలె, వృషగిరికృష్ణమేఘజనితాం = వేంకటగిరియందుండు కృష్ణుండను కృష్ణమేఘమునుండి యుత్పవించినదియు, జనితాపహరాం = జనన పరంపరచే గలుగు తాపమును బోగొట్టునదియు, త్వదభిమతిం=నీ యభిమానమనే, సువృష్టిం=మంచివర్షమును, ఉపజీవ్య= పొంది, నివృత్తతృషః = దప్పిలేని వారుగాను, బహుషు జలా (డా) శయేషు = పలు మడుపులలోను (జడులయందును), బహుమానం=ఆదరమును, అపోహ్య = వదలి, సత్పథం = సన్మార్గమును (ఆకాశమును), న జహాతి = వదలుట లేదు.

అవతా॥ క్రింది శ్లోకమునందు ఆనుకూల్యసంకల్పాదులగు కొన్ని ప్రపత్త్యంగములు వర్ణింపబడినవి. ఇచట భగవద్దయనే తనకు రక్షయిత్రిగా వర్ణించుట. వేఱొక శరణము లేకుండుట అనునాదిగాగల గోప్తృత్వవరణ కార్పణ్యాదులగు మఱికొన్ని యంగములు ప్రస్తావింపబడుచున్నవి. ఈ అంగములను ప్రస్తావించు వ్యాజముతో ఆళ్వార్లుబోటి మహనీయుల యనుష్ఠానమును దెలియపరచి తద్ద్వారా భగవద్దయను కీర్తించుచున్నారు. పూర్వోక్తాంగములవలె ఈ యంగములుగూడ ప్రపన్నుని కవశ్యజ్ఞాతవ్యములు గావున ఈ దశకము నందిచట చెప్పబడుచున్నవి.

తా॥ చాతకపక్షులు లోకములో చెఱువు, సరస్సులు మొదలగు అనేక తీర్థాశయములుండినను ఆకాశమునుండి గుఱియు వాననీటియందే ఆధారపడి దానినే త్రాగి తమ దప్పిని పోగొట్టుకొనుచున్నవి. అటులనే ఆళ్వార్లుంబోలు భాగ్యవంతులు లోకములో ఎందరో దేవతలుండినను వానిని జడాశయములుగా తలంచి వానియందాదరములేక వేంకటాచలమునందు నివసించు కృష్ణరూపుండగు శ్రీనివాస మేఘమునుండి యుత్పవించిన దయాదేవియొక్క అభిమానమనే వర్షమునే తమ కవలంబముగా తలంచి ఆమెనే యాశ్రయించి సంసారతాపము నుపశమింపజేసికొనుచున్నారు. ఇది యే వేదము ననుసరించి నడచు పెద్దలయొక్క త్రోవ. ఈ రీతిగా భగవద్దయను శరణముగా పొందు పరమైకాంతులను చాతకపక్షిగా ఆచార్యులు చిత్రించియున్నారు.

"కృతినః" అను పదముచే ఆళ్వార్లను వివక్షించుట ప్రాయశః ఆచార్యుల యొక్క అలవాటను నది యుపదేయము.

శ్లో॥ త్వదుదయతూలికాభిరమునా వృషశైలజుషా
స్థిరచరశిల్పినైవ పరికల్పితచిత్రధియః ।
యతిపతియామునప్రభృతయః ప్రథయన్తి దయే
జగతి హితం న నస్త్వయి భరన్యసనాదధికమ్ ॥ 59

అర్థ :— హేదయే ! = ఓ దయాదేవీ !, వృషశైలజుషా = వేంకటాద్రిని వేంచేసియుండు, అమునా = ఈ, స్థిరచరశిల్పినైవ = సర్వచరాచరములను సృష్టించు శ్రీనివాసుడను శిల్పిచేతనే, త్వదుదయతూలికాభిః = నీయావిర్భావమును కలుగచేయు భగవత్సంకల్పములనెడు వర్ణము పూయు కుంచెలుచేత, పరికల్పిత చిత్రధియః = కల్పించబడిన విచిత్రమైన విజ్ఞానచిత్రములుగల, యతిపతియా మునప్రభృతయః = ఉడయవర్లు ఆళవందార్లు మొదలగు పరమాచార్యులు, నః = మాకు, త్వయి = నీయందు, భరన్యసనాత్ = భరన్యాసము (శరణాగతి) కంటె, అధికం = గొప్పదగు, హితం = హితము, న = లేదు, (ఇతి = అని), ప్రథ యన్తి = ప్రకాశపరచుచున్నారు.

అవతా॥ క్రిందిశ్లోకమువరకు భగవద్దయయందు ప్రపత్తి ననుష్ఠించు వానికి అవశ్యజ్ఞాతవ్యమైన అంశములు నిరూపింపబడినవి. పై శ్లోకమునందు సాక్షాత్తుగా ప్రపత్తిని స్వానుష్ఠానముఖముగా తెలియపరచుచున్నారు. ఈ శ్లోకము నందు అట్టి ప్రపత్తి మార్గమును, భగవంతునియందు విశేషముగా భక్తిచేసి తద్ద్వారా ఆ ఔపనిషదపరమపురుషుని విశేషానుగ్రహమునుపొంది దానిచే ఉత్త మజ్ఞానమును చెందిన శ్రీభాష్యకార్లు ఆళవదార్లు నాథమునులు నమ్మాళ్వార్లు వంటి మహనీయులు దీనికంటే ఉత్తమమైన మార్గాంతరము మనబోటి అశక్తులకు లేదనియు ఇదియే చాలశ్రేష్ఠమనియు పొగడి తమయొక్క వివిధోపదేశములచేతను గ్రంథములచేతను అనుష్ఠానముచేతను నిరూపించియున్నారు, అని చెప్పి ఈ ప్రపత్తిమార్గమునకు భగవత్సమ్మతియు తదనుయాయులగు భాగవతుల పరి గ్రహమును కలదుగాన ఇది పరమవైదికమైన ప్రాచీనమార్గమనియు చూపించి జ్ఞానశక్తులులేని మనబోటివారలకు ఇదియే ఉత్తమమార్గమని నిరూపించుచున్నారు. క్రింద శ్లోకమునందు ప్రపత్తి మార్గమును విశేషముగ ఆదరించు ఆళ్వార్లు స్మరింప బడిరి. ఈ శ్లోకమునందు అట్టి ఆచార్యులు స్మరింపబడుచున్నారు అనుటయు సంగతి కాగలదు.

తా॥ ఇచ్చట శ్రీభాష్యకారులు ఆళవందారులబోటి పరమాచార్యుల జ్ఞాన మును చిత్రముగా చిత్రించుచున్నారు. ఈ విజ్ఞానచిత్రమును వ్రాసినది సర్వ చరాచరప్రపంచనిర్మాతయగు ఉత్తమ శిల్పియగు శ్రీనివాసుడే. ఆతనికి సాధన

ముగానుండు కుంచికలు వాని సంకల్పములే. లేఖనమందలి వర్ణము దయయే. దయయను వర్ణమునందు ముంచిన సంకల్పములనెడి కుంచికలచే వ్రాయబడిన చిత్రములే పూర్వాచార్యుల విజ్ఞానములు. కుంచికలు కనుబడకపోయినను వర్ణము యెట్లు చిత్రమునందు కనుబడుచుండునో, అట్లే భగవంతుని దయ ఈ యాచార్యుల యొక్క జ్ఞానములందు నిండి నిలచియున్నది. ఆ జ్ఞానమే శబ్దరూపముగా వెలువల ప్రవహించుచున్నది కావున వారల శ్రీసూక్తులయందుగూడ ఆ దయా ప్రవాహము ప్రవహించుట కాటంకము లేదు. భగవద్దయాప్రవాహము వారల శ్రీసూక్తులయందు ప్రవహించుట యనగా ఆ దయాదేవియొక్క పూర్ణప్రభావమున్నూ వారల శ్రీసూక్తులలో ప్రకాశించుటయే. దీనిని ఇంకను వివరించినంతట; అనాది కాలముగా అతిఘోరముగ ననంతాపరాధములనుజేసి అతిదుస్సహమగు నీ సంసారచక్రములో భ్రమించుచున్న మనబోటి వారలకు ' నాకు గత్యంతరములేదు. నీవే రక్షించి ఈ కష్టమును పోగొట్టి నాకు ప్రాప్తమైన సుఖమును ఈయవలయును ' అని ప్రార్థించి దయాదేవిచరణారవిందములను పట్టుకొని శరణాగతి చేసిన మాత్రముచే ఇంతకాలము చేసిన అపరాధములను క్షమించి ఆ పాపములను పోగొట్టి మోక్షపర్యంతమైన సుఖమునిచ్చు పరమోదారస్వభావము కలది ఆ దయాదేవి, అని నిరూపించుటయే యగును.

ఇట్లు సులభమైన ఉత్తమ క్షేమోపాయమును వారు చూపించియున్నారుగాన మన పూర్వులవలంబించిన ఆ ప్రపత్తి మార్గమునే మనమును అవలంబించెదము. అని ఈ ప్రబంధ నిర్మాతయగు శ్రీ దేశికులవారి తిరువుళ్లము.

ఈ శ్లోకమునందు ' త్వదుదయతూలికాభిః ' అను పదమునకు ' నీ యావిర్భావము అనే కుంచికలచే ' అని కొందరు వ్యాఖ్యానించుచున్నారు అట్లైనచో దయయే కుంచికయగుచున్నది. శ్రీ దేశికులువారు యాదవాభ్యుదయ కావ్యమందు,

' క్రీడాతూలికయా స్వస్మిన్ కృపారూషితయా స్వయమ్ ।
ఏకో విశ్వమిదం చిత్రం విభుః శ్రీమానజీజనత్ ॥

అను శ్లోకమునందు విశ్వమనే చిత్రమునకు దయను వర్ణముగా పెట్టుకొనినట్లు వ్రాసియున్నారు. దాని ననుసరించి ఈ విజ్ఞానచిత్రమునకుకూడా దయయే వర్ణముగానుండవచ్చును అని తలంచి పై జెప్పిన ప్రకారము వ్యాఖ్యానింపబడినది. ఈ వ్యాఖ్యానమునకు తగినట్లు పదవ్యుత్పత్తిని సరిజేసికొనునది.

శ్లో॥ మృదుహృదయే దయే మృదితకామహితే మహితే
ధృతవిబుధే బుధేషు వితతాత్మధురే మధురే ।

వృషగిరిసార్వభౌమదయితే మయి తే మహతీం
భవుకనిధే నిధేహి భవమూలహరాం లహరీమ్॥ 60

అర్థ :— మృదుహృదయే = మృదువగు హృదయము కలిగినట్టియు, మృదితకామహితే=విరక్తులయందు హితచింత కలిగినట్టియు, మహితే = గొప్ప దానవుగా పొగడబడునట్టియు, ధృతవిబుధే=ధరింపబడిన జ్ఞానులు కలిగినట్టియు, బుధేషు = జ్ఞానులయందు, వితతాత్మధురే = ఉంచబడిన తనభారమును (జీవ సంరక్షణ కార్యములను) కలిగినట్టియు, మధురే = ఇంపైనట్టియు, వృషగిరి సార్వభౌమదయితే = వేంకటాద్రీశుని ప్రియమహిషియైనట్టియు, భవుకనిధే = సర్వమంగళములకు నిధియుగను ఉన్న, హేదయే = ఓ దయాదేవీ, (త్వం = నీవు) భవమూలహరాం = సంసారవృక్షమునకు వేరునుపెళ్లగించగల, తే = నీయొక్క, మహితీం = గొప్పదగు, లహరీం = ప్రవాహమును, మయి = నా యందు, నిధేహి = ఉంచుము, (పవహింపజేయుము.)

అవతా॥ క్రిందిశ్లోకమునందు ఎట్టి భేదములేక సర్వచేతనులును ఉజ్జీ వించుటకుపాయమైన ప్రపత్తి మార్గమును ప్రపంచమునకు ప్రకాశపరచిన పరమ కారుణికులగు పూర్వాచార్యుల యొక్క ప్రభావము వర్ణింపబడినది. ఈ శ్లోకము నందు అట్టి యాచార్యులు ప్రదర్శించిన మార్గము ననుసరించి భగవంతునియందు చేయవలసిన ప్రపత్తిని భగవద్దయాదేవిని చేతనసమాధిలో నిలిపి ఆమెయందను ష్ఠించి స్వాభీష్టమును ప్రార్థించుచున్నారు. భగవంతునికుండు ప్రభావమంతయు ఈ దయాదేవిసంబంధము చేతనే గనుక ఈమెయె ముఖ్యముగా యుపాసింపబడ దగినది అని బహుధా నిరూపించి యున్నారు. దానిననుసరించి ఇచ్చట ఆమెనే ప్రార్థించుట.

తా॥ 'వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః' అనునట్లు యెవరికి యేవిధమగు కష్టమేర్పడినను దానిని సహింపక హృదయము ద్రవించి కష్టపడు నట్టి స్వభావము కలది దయాదేవి. మఱియు వైషయికాశలనుపసంహరించుకొని విరక్తులై భగవత్ప్రీత్యర్థముగానే సర్వకర్మలననుష్ఠించు పరమైకాంతులయందు మిక్కిలి హితమునుగోరియుండునది దయాదేవి. తత్కాలమునందు అప్రియము వలె కొన్నిసంఘటన లేర్పడినను అయ్యవి పరమహితముగానే చేయబడినవని వెనుక స్పష్టపడును. పరమైకాంతులయందు పరమప్రీతిచేతనే అయ్యవిచేయబడు నుండునని శాస్త్రజ్ఞులకు చక్కగాతెలియును. ఇట్లు పరమైకాంతులయందు మిక్కిలి అభిమానము కలిగియుండుట చేతనే శాస్త్రములయందు ఆమె నవలంబించి సులభముగా మోక్షము పొందదగు మార్గము విశేషముగా ప్రశంసింపబడి యున్నది. ప్రపత్తిని పొగడినంతట దయాదేవిని ప్రశంసించినట్లే యగును.

ప్రపత్తియనగా కేవలము దయనే అవలంబించినదిగదా! మఱియు జ్ఞానులను ధరించునది దయ. అనగా వారలకు 'ఉణ్ణుం శోరు' అను రీతిలో ధారక పోషక భోగ్యములుగా నుండునది. ఇచ్చట 'మృదిత కామ' అను చోటున పరమై కాంతులను 'ధృతవిబుధే' అనుటచే ఆళ్వారులును 'బుధేషు వితతాత్మధురే' అనుటచే ఆచార్యులును వివక్షింపబడుచున్నారనుట ఉచితమని తోచుచున్నది. కావున ఆళ్వారులబోటు జ్ఞానులను ధరించునది దయాదేవి. నాథమునులు ఆళ వందారు భాష్యకార్లు మొదలగు పరమాచార్యులయందు తనభారమును ఒప్పగించునది దయాదేవి. అనగా క్రింద దశకమున అంత్య శ్లోకమునందు 'సద్దేశికాత్మా' అని చెప్పినట్లు ఆచార్యులు దయాదేవియొక్క రూపాంతరము గాన చేతన సంరక్షణమను తన కార్యమును ప్రాయశః వారలయందు ఒప్పగించియున్నదని భావము. మఱియు, లోకములో హితపరులు కొందఱు పలుమారు హితములను ఆచరించినను ఆశ్రయించునప్పుడు సుముఖముగా లేకపోవుట కలదు. అట్లుకాక దయాదేవి క్షీరసేవనమువలె ఎప్పుడును మధురముగానే యుండునది. ఇన్ని విశేషములు ఈమెయందుండుటకు కారణమేమనిన సర్వప్రపంచసార్వభౌముడగు శ్రీనివాసుడు చెప్పుచేతలలో మెలగుచు ఈమెకు పరమవిధేయుడుగ నుండుటయే. ఆతడిట్లు విధేయుడుగానుండుటకు కారణముగూడ ఈమె సర్వమంగళనిధిగా యుండుటచే ఈమె యొద్దనుండి మంగళములను సేకరించి ప్రపంచమునకు ఈయవలసి యుండుటయే. ఇట్టి మహాప్రభావముగల దయాదేవిని సంబోధించి 'ఓ దయామాతా! ఈ సంసారమను మహావృక్షమును వేరుతో పెకలించి తోసి తిరిగి మొలచుటకు అవకాశములేకుండ చేయునట్లు నీయొక్క గొప్ప ప్రవాహమును మిక్కిలి పాపియగు నా యందు ప్రవహింపజేయుము' అని ప్రార్థించుచున్నారు. తనయొద్దనుండు సంసారమూలకారణమగు పాపవృక్షము అనాదికాలముగ వృద్ధి చెంది యుండుటచే అట్టి మహావృక్షమును పెకలించుటకు కొలదియగు ప్రవాహము చాలదనియు చాలగొప్పదగు నొక యపూర్వప్రవాహము యేర్పడినంతటగాని సాధ్యము కాజాలదనియు అట్టి ప్రవాహముచే ఆపాపవృక్షము సమూలముగ నశించిన యెడల తనకు క్రమప్రాప్తమైన మోక్షము లభించుననియు ఆచార్యుల తిరువుళ్లము.

ఇట్లు దయాదేవిని ప్రార్థించుటతోకూడ మామూలు మేరకు పై దశకమున ప్రసంగించబోయెడి దయాప్రవాహప్రభావమును, శ్రీనివాసుడు దయకు చెప్పుచేతలలో నుండునను విషయమును ఈ దశకమున కంత్యమగు నీ శ్లోకమున సూక్ష్మముగ ప్రస్తావించియున్నారు.

షష్ఠదశకము సమాప్తము.

శ్రీమతే నిగమాన్త మహాదేశికాయ నమః

సప్తమ దశకము

శ్లో॥ అకూపారై రేకోదకసమయవై తండికజవై -
రనిర్వాప్యాం క్షిప్రం క్షపయితుమవిద్యాఖ్యబడబామ్ ।
కృపే త్వం తత్తాదృక్ప్రథిమవృషపృథ్వీధరపతి -
స్వరూపద్వైగుణ్యద్విగుణనిజబిందుః ప్ర(భవ)వహసి॥ 61

అర్థ :— హే కృపే = ఓదయాదేవీ!, తత్తాదృక్ప్రథిమ వృషపృథ్వీధర పతిస్వరూపద్వైగుణ్యద్విగుణనిజబిందుః = ఇంతింతని వివరింపవీలులేక అంతంతదనియే చెప్పవలసినంతటి వైశాల్యము గల్గిన వేంకటాద్రీశుని దివ్యాత్మ స్వరూపమునకు రెండింతలు పెద్దదైన వస్తువునకంటె రెండు రెట్లు పెద్దదగు తన దైన యొక బిందువుగల, త్వం = నీవు, ఏకోదకసమయవైతండిక జవైః = ఒకే జలమయమగు ప్రళయకాలమునందలి వితండావాదుల వాదములకంటె నెక్కువ వేగముగల, అకూపారైః = సముద్రములచే, అనిర్వాప్యాం = ఆర్ప జాలని, అవిద్యాఖ్యబడబాం = అవిద్యయను బడబాగ్నిని, క్షపయితుం = ఆర్పుటకు, ప్రభవసి = సమర్థయగుచున్నావు, (ప్రవహసి = ప్రవహించుచున్నావు)

అవతా॥ క్రింది దశకమునందు సాంగమైన ప్రపత్తి ప్రస్తావింపబడినది. ఈ దశకమునందు ప్రపత్త్యుత్తర కాలమునందు దయాదేవిచే గలుగు నానుకూల్య ములు వర్ణింపబడుచున్నవి. గత దశకాంతమున దయాదేవియొక్క బృహత్తర ప్రవాహము స్మరింపబడినది. ఆ ప్రవాహకార్యములే ఈ దశకమునం దచట నచట నిరూపింపబడుచున్నవి.

క్రింది శ్లోకమునందు "నా యొక్క అనాది పాపవృక్షములను పెళ్లగించి త్రోచివైవ సమర్థమగు ప్రవాహమును నాపై ప్రవహింపజేయు"మని ప్రార్థించిరి. "నీ పాపములనెడు కర్మములు మహా ప్రళయకాలమునందు నయితము నశింపక చాలయు దార్ఢ్యము గలిగియున్నవిగదా! వాని నంతరింపజేయు శక్తి నాకు గలదా?" అను దయాదేవియొక్క సంశయమును, ఆ దయాదేవియొక్క చాలా బ్రహ్మాండాకారమైనదియు, ఎక్కువ దార్ఢ్యముగలిగినదియు నగు మహా ప్రవా హముయొక్క ప్రభావమును స్మరింపజేసి ఈ శ్లోకమునందు నివర్తింపజేయు చున్నారు. దయా ప్రవాహమును ప్రార్థించినంతట అది ప్రవహించిన పిదప ప్రపన్నునికి గలుగు ఆనుకూల్యముగూడ యిచ్చట అర్థాత్తుగ నిరూపింపబడు చున్నది.

తా॥ ఈ శ్లోకములో చిత్రించు విధము చాలయు రమణీయము. ప్రళయ కాలమునందు సమస్త సముద్రము లేకములై ప్రకోపించి యమిత వేగముతో పొంగి ప్రవహించును. ఆ సమయమునందు ఆ సముద్రముయొక్క వేగము వితండావాదముచేయువాని వాగ్జాలమువలె నుండునని యాచార్యులు చిత్రించు చున్నారు. వితండావాదులకు తనదని స్థాపింపదగిన పక్షమేమియు నుండదు. ఎవ్వరేది చెప్పినను ఆడంబరపూర్ణమగు శబ్దజాలమును వెదజల్లి, మహాద్ఘోష మును గావించి యాక్షేపించి యార్భాటము చేయుటయే వాని లక్ష్యము. అట్లే ప్రళయకాల సముద్రములుగూడ రక్ష్యనాశ్య విభాగము లేక సమస్త వస్తువులను మహాజవముతో మ్రింగివేయును. అట్టి ప్రళయ సముద్రములతోగూడ ఆర్పబడ జాలని బడబాగ్నితో సమమైనవి అవిద్య యను జీవులయొక్క పాపములు. అగ్నికి ఆశ్రయాశమను నొకపేరు గలదు. తాను ఏ పదార్థము నాశ్రయించు చున్నదో ఆ పదార్థమును గ్రసించును. బడబాగ్నియు నీ నియతికి బహిర్భూత ముగాదు. అట్లే ఈ కర్మములుగూడ తమ కాశ్రయములైన జీవులను నాశము జేయుచున్నవి. ఆ ప్రళయకాల సముద్రములు ప్రసిద్ధబడబాగ్ని నొకవేళ యార్పినను ఆర్పవచ్చును. ఈ కర్మ బడబాగ్ని నార్పుట కవి శక్తిలేనివి. ఆ కర్మములంతటి దార్ఢ్యము గలవి. అనగా జీవ కర్మములు ప్రళయకాలములోగూడ నశింపనివి యని తాత్పర్యము. అట్టి ఈ కర్మ బడబాగ్నిని ఒక క్షణములో నశింపజేయుటకు నీయొక్క ప్రవాహమే సమర్థమైనది. పరబ్రహ్మముయొక్క స్వరూపము (దివ్యాత్మస్వరూపము) విభువు. అనగా సర్వ ప్రదేశములయందును వ్యాపించి తనకంటె పెద్దదైన వేరొక పదార్థమును గల్గియుండక నన్నిటికంటే పెద్దదిగా నుండుటయే. అట్టి బృహత్తమమైన బ్రహ్మస్వరూపమునకంటె రెండింతలు పెద్దదగు నొక వస్తువును మనసా భావించి ఆ వస్తువునకంటెగూడ రెండు రెట్లు పెద్దదగు నొక వస్తువును భావించినయెడల, అనగా సర్వవ్యాపియగు పరమాత్మ స్వరూపమును నాల్గురెట్లుగా పెంచిచూచిన నేర్పడు వస్తువెయ్యదిగలదో, అయ్యది "ఓ దయాదేవీ; నీయొక్క ఒకబిందువే" అని యాచార్యులు రూపించుచున్నారు. ఒకపెద్ద గంగానదివంటి దయాప్రవాహములో ఒకబిందువు పరబ్రహ్మమునకంటె నాల్గింతలు పెద్దదనగా ఆ పూర్ణప్రవాహము వింతదని నిరూపించుటెట్లు? ఎట్లు మనసా భావించుట అని యాచారులు విస్మయించు చున్నారు. నీ ప్రవాహము అంత పెద్దదిగాను, బలిష్ఠముగా నున్నందున ఎంత దృఢమైనను, ప్రళయములో నశింపకపోయినదైనను జీవంర్మ సముదాయము నొక క్షణములో నశింపజేయుట కడ్డులేదని భావము.

పరమాత్మ స్వరూపమునకంటె దయ యెంతయో పెద్దదని వర్ణించుటచే కృత్స్న పరమాత్మస్వరూపమును, దయా కబళీకృతమని యేర్పడును. దానిచే దయాసంబంధ రహితమైన పరమాత్మ స్వరూపము లభింపదని సిద్ధించుచున్నది. ప్రపత్తిచేసిన వానియందు భగవద్దయా ప్రవాహమేర్పడి, సంచితము, ప్రారబ్ధమునను పలువిధములైన పాపములను పోగొట్టుచున్నది. ఇదియే ప్రపత్త్యుత్తర కాలమున దయచే ప్రపన్ననకుగల్గు ప్రథమానుకూల్యమను శాస్త్రార్థ మిచట వివక్షితము.

లోకములో ఒకటికంటె నొకటి పెద్దదని వర్ణించుసమయమున దానికంటె రెండింతలు పెద్దదని చెప్పుట ప్రాయశః అలవాటులోనున్నది. పరమాత్మ స్వరూపమునకంటె పెద్దవస్తువు లేదనుట నిశ్చయము. మనసా పరికల్పించి పెద్ద వస్తువును భావించవలయును. అట్లుండగా నిచట పరమాత్మ స్వరూపమునకంటె దయాదేవీ బిందువు రెండింతలు పెద్దదనిచెప్పిన చాలదా? నాల్గింతలు పెద్దదని చెప్పవలెనా ? దానినిగూడ ఒకేసారి నాల్గురెట్లు పెద్దదనిచెప్పక విడి విడిగా రెండు రెండింతలని చెప్పి నాల్గింతలుగా చూపించుటలో నేదియేని విశేష తాత్పర్యముగలదా ? అని విమర్శకు లాలోచింపవలయును. పరబ్రహ్మస్వరూపమును నాల్గు పాదములుగలదిగా ఉపనిషత్తులు చెప్పుచున్నవి. అట్లు నాల్గు పాదములుగల పరబ్రహ్మము దయాబిందువులో నాల్గింటిలో నొకభాగముగా నిల్చి యున్నదని తాత్పర్యమని కొందరు వ్యాఖ్యానింతురు. మరికొందరు రెండింతలు పెద్దదనే చెప్పదలచిరి. కాని ఈశ్వరస్వరూపమైన శ్రీ దేవిగూడ స్మృతిపథమునకు రాగా దానిని చేర్చి ఈశ్వర స్వరూప ద్వంద్వముయొక్క రెండింతలని వర్ణించిరని చెప్పుదురు. ఈ పక్షములో రెండు రెండ్లుగా చెప్పినదిగూడ యొక విధముగ సమంజసమగును.

శ్లో॥ వివిత్సావేతాళీవిగమపరిశుద్ధేఽపి హృదయే
పటుప్రత్యాహారప్రభృతి పుటపాకప్రచకితాః।
నమ న్త్వాం నారాయణశిఖరికూటస్థకరుణే
నిరుద్ధత్వద్ద్రోహాః నృపతిసుతనీతిం న జహతి ॥ 62

అర్థ :—నారాయణశిఖరికూటస్థకరుణే = నారాయణాచల మను వేంకటాద్రియందు స్థిరవాసముచేయు శ్రీనివాసుని దయాదేవీ ! హృదయే = మనస్సు, వివిత్సావేతాళీవిగమపరిశుద్ధేఽపి = (స్త్రీ-భూమి-స్వర్ణాదులను) పొందవలయు

నను నాశ యనెడు శ్రీ పిశాచము వదలుటచే పరిశుద్ధమైనప్పటికిని, పటుప్రత్యాహారప్రభృతి పుటపాకప్రచకితాః = (అష్టాంగభక్తియోగములో చేరిన) ఉగ్రమైన ప్రత్యాహారము (ఇంద్రియ నిగ్రహము) మొదలగు నంగములనెడు పుటపాకము నుండి చాలయు భయపడిన కొందరు మహనీయులు, త్వాం=నిన్ను, నమన్తః = శరణీకరించినవారై, నిరుద్ధత్వద్ద్రోహాః = నీయందు ద్రోహచిన్తచేనివారై, నృపతిసుతనీతిం = రాజపుత్ర న్యాయమును, న జహతి = విడుచుట లేదు,

అవతా ॥ క్రింది శ్లోకమునందు దయాప్రవాహముయొక్క వేగమును వర్ణించి తద్ద్వారా ప్రపన్నుని పాపములను ఆ ప్రవాహము పోగొట్ట శక్తిగల్గినదని సామాన్యముగా నిరూపించిరి. ఈ శ్లోకమునందు ఆ ప్రపన్నునికి ప్రపత్త్యుత్తర కాలమున బుద్ధిపూర్వకమైన పాపములను (ఉత్తరాఘములను) ఆ దయాదేవి నశింపజేయు ప్రక్రియను విశదీకరించుచున్నారు. ఇట్లే ఈ దశకమునందు ప్రపన్నుని విషయములో దయాదేవి చేయు నానుకూల్యములను అచటచట ఆ దయాదేవీప్రవాహప్రభావవర్ణనావ్యాజమున ప్రకటీకరించుచున్నారు. భక్తియోగము ననుష్ఠించువారికంటె ప్రపత్తిచేయువారు దయాదేవి కెక్కువ యనుగ్రాహ్యులు గాన ఒకరీతిలో వీరిని శ్రేష్ఠులని చెప్పనగునని తాత్పర్యము ఈ దశకములో వ్యక్తమగుచున్నది.

తా॥ ధనము, ధాన్యము, స్త్రీ అని నీలాగుననున్న భోగసాధనములను పొందవలయునను నాశయొక్క బేతాళస్త్రీ (స్త్రీ పిశాచమున)కు సమానము. స్త్రీ పిశాచమునకు అడిగిన వస్తువులన్నింటి నిచ్చుచుండవలయును. కోరినవస్తువులలో నొక్కవస్తువు నియ్యకపోయినను అయ్యది ఆ మనుష్యుని మ్రింగివేయును. ఇది పిశాచియొక్క స్వభావము. క్రింద జెప్పబడిన యాశయు నిట్టిదే. ఆశను పూర్తిచేయనిచో నది మనుష్యుని ఛిన్నాభిన్నముచేయును. ఇట్టి ఆశ మోక్షము నొందుటకు ప్రధాన విరోధి. దీనిని మొదట తొలగించినపుడే ముముక్షువు కావచ్చును. అనగా మోక్షమునందిచ్ఛ జనించునని యభిప్రాయము. అట్టి యాశను తొలగించి మనస్సును శుద్ధపరచికొని ముముక్షువులుగా తేరినవారిలో కొందరు పెద్దలు, ఆ మోక్షమునకు శాస్త్రోక్తములైన భక్తి, ప్రపత్తులనెడు ద్వివిధోపాయములలో భక్తియోగమునుజూచి భయపడుచున్నారు. ఎందుకనగా ఆ భక్తియోగమున కంగములుగా చెప్పబడిన ప్రత్యాహారము మొదలగువానిని స్మరించినంతటనే అయ్యవి పుటపాకములుగా తోచుచున్నవి. పుటపాకమునందలి యగ్నిజ్వాలలు బయటికి కనిపించవు అంతర్దాహము నధికముగ కలుగంజేయును. అట్లె ఈ ప్రత్యాహార ప్రభృతులుగూడ నాచరించుచున్నవి

కావున వాని ననుష్ఠించి తేరి నిలుచుట యనునది మనబోటి యశక్తులకు సర్వాత్మనా సాధ్యముగాదని భయపడుచున్నారు. అశక్తిచే భయపడుచున్నారేగాని ఆ భక్తియోగము తమ స్వరూపమునకు విరుద్ధమనియో లేక అది వికృష్టోపాయమనియో తలంపుచే గాదు. ఇట్లు భీతులైనవారు శ్రీనివాసదయను శరణము పొందుచున్నారు. శరణాగతియను మోక్షోపాయము ననుష్ఠించిన వీరు రాజపుత్రులవలె యగుచున్నారు. రాజపుత్రులకు గూడ అపరాధము చేసినపుడు దండన కలదు. ఇతరులకు వలె దండము తీవ్రముగా నుండదు. దండము తీవ్రముగా లేకపోయినను రాజపుత్రులు, చక్రవర్తి కోపమునకు పాత్రులు గాక వాని యాజ్ఞలను చక్కగా ననుష్ఠించి స్వల్ప దండమునకు గూడ ఆస్పదులు గాక తమను రక్షించుకొని రాబోవు యువరాజ్యపట్టాభిషేకమునకు తగు స్థితిలో నుందురు. అట్లే ఈ ప్రపన్నులు గూడ భగవంతుని కత్యంతాంతరంగులు గనుక వాని యాజ్ఞోల్లంఘనమును మనసాఽపి స్మరించరు. భగవదాజ్ఞ ననుసరించుట యనగా "శ్రుతిఃస్మృతిర్మమైవాజ్ఞా యస్తాముల్లంఘ్య వర్తతే" అను భగవంతుడు వాక్రుచ్చిన రీతిగా శ్రుతిస్మృతి విహిత కర్మములను చేయుటయే. ఏవంచ ప్రపన్నులు "మమ ద్రోహీ" అని చెప్పబడిన స్థితి తమకు సంభవింపకయుండులాగున శాస్త్రోక్త కర్మములను చక్కగా ననుష్ఠించియే తీరవలయును. కొందరు ప్రపన్నులకు ప్రబలమైన జన్మాంతరకర్మముచే శాస్త్రోల్లంఘనము చేసి పాప కర్మములను బుద్ధిపూర్వకముగా చేయు సందర్భ మేర్పడినప్పుడు ఈ దయాదేవి రాజపుత్ర న్యాయము ననుసరించి వారి విషయములో స్వల్పమైన దండమును వారు మోక్షము నందుట కుద్దేశించిన కాలమునకు లోపలనే అనుభవింపజేసి, పరిశుద్ధుల గావించి మోక్షము నొసంగుచున్నది. తథాచ ప్రపన్నుని విషయములో బుద్ధిపూర్వోత్తరాఘమనే పాపములకు దయాదేవిస్వల్పమైన దండనమును విధించుచున్నదని తేలుచున్నది. ఇటువంటి సుసూక్ష్మ శాస్త్రార్థము లిచట నిరూపింప బడియున్నవి.

శ్లో॥ అనన్యాధీనస్సన్ భవతి పరతంత్రః ప్రణమతాం
కృపే! సర్వద్రష్టా న గణయతి తేషామపకృతిమ్।
పతిస్త్వత్పారార్థ్యం ప్రథయతి వృషక్ష్మాధరపతిః
వ్యవస్థాం వైయాత్యాదితి విఘటయన్తీ విహరసి॥ 63

అర్థ :— హేకృపే=ఓదయాదేవీ, వృషక్ష్మాధరపతిః=వేంకటాద్రీశుడగు శ్రీనివాసుడు, అనన్యాధీనఃసన్ =మత్తొకరికధీనుడుకాకపోయినను, ప్రణమతాం=

తన్నాశ్రయించినవారికి(శరణాగతులకు), పరతంత్రః = పరతంత్రుడుగా, భవతి = అగుచున్నాడు. సర్వద్రష్టా=సర్వవిషయములనెల్లప్పుడును సాక్షాత్తుగా చూడగల్గు సర్వజ్ఞతగల్గియుండినను, తేషాం = ఆశరణాగతులయొక్క, అపకృతిం = అపరాధములను, నగణయతి = లెక్కపెట్టుటలేదు. పతిస్సన్ = (నీకు)భర్తగానుండినను త్వత్పారార్థ్యం = నీయందు పరతంత్రతను, ప్రథయతి = ప్రకాశపరచుచున్నాడు. వైయాత్యాత్ = (నీయొక్క) ధార్ష్ట్యముచవలన, వ్యవస్థాం = శాస్త్రములో నేర్పడియున్నవ్యవస్థను, ఇతి = ఇట్లు, విఘటయన్తీ = మీఱఁజేయుచు, విహరసి = విహరించుచున్నావు.

అవతా॥ క్రిందిశ్లోకమునందు ప్రపన్నుల విషయమునందు ప్రాచీనకర్మవశాత్తు ఏర్పడుచున్నకొన్ని బుద్ధిపూర్వకాపరాధములకు, చాలయునల్పమైన దండనమును దయాదేవి యిప్పించుచున్నదని నిరూపించిరి. ఈశ్లోకములో అంతియేగాక ఆప్రపన్నులవిషయమైన సర్వస్వామియగు భగవంతుని పరతంత్రుని గావించి వారుచేయు నపరాధముల నతడుపేక్షించునట్లుచేసి నీవాల్లభ్యమువలన శాస్త్రమర్యాద నుల్లంఘించుచున్నావని దయాదేవిని కీర్తించుచున్నారు.

తా॥ ఉపనిషత్తులు "న తస్యేశే కశ్చన" అనగా భగవంతునిపై నియామకుడొకడు లేడు అని చెప్పుచున్నవి. అట్టి భగవంతుడాశ్రితుల విషయమునందు మిగుల పరతంత్రుడై దౌత్యసారథ్యాదులను సయితమాచరించుటకు ముదంజ వేయుచున్నాడు. ఇట్లే వివిధ సేవలనొనరించు చున్నాడు. అటులనే "యస్సర్వజ్ఞః సర్వవిత్" అనగా అన్నింటిని సర్వదా సాక్షత్కరించు స్వభావము గలవాడు అని ప్రశంసింప బడినవాడు ఆశ్రితులుచేయు కొన్నియపరాధముల నెఱుంగని వానివలె యుండి యుపేక్షించుచున్నాడు. అట్లే "పతిం విశ్వస్య" అనగా సర్వపతిగాయుండినను హేదయాదేవీ! (నీకు పతిగాయుండినను) నీయందు పరతంత్రుడైయున్నాడు. అనగా నీచెప్పుచేతలలో మెలంగుచు నీయిచ్ఛ ననుసరించుచున్నాడు. ఇవన్నియు నీవాల్లభ్యమువలననే ఏర్పడుచున్నవి. శాస్త్రములో వానికి మహత్త్వాధాయకములుగా చెప్పబడిన యాకృతులను తుడిచివైచి వానికి నిహీనతను గలుగంజేయు నాకృతిని గలుగజేయుచున్నావు. ఆహా! నీధార్ష్ట్య మెంతటిదో గదా! అని విస్మయించుచున్నారు. ఇట్లు నిందవలె దోచు నీవాక్యములన్నత

స్తోత్రమున పర్యవసించుచున్నవని రసికులకు వేఱుగా వివరింప నవసరము లేదు. ఉత్తమ ప్రభువులకు క్రిందచెప్పబడిన యాశ్రితపారతంత్ర్యాద్యుత్తమ గుణము లత్యావశ్యకములే గదా ? అట్టివి లేనివాడుత్తమ ప్రభువు కాజాలడు.

ఐనను శాస్త్రపద్ధతి నుల్లంఘించుట అయుక్తమేగదా అని యిచట శంకింపనగును. కాదు. ఏశాస్త్రములు వానిని సర్వస్వామిగా పొగడుచున్నవో, అవియే వాని చరణారవిందమునందు శరణాగతి చేసినయెడల వాని హృదయము ద్రవించి దయోద్రేకముగల్గి శరణాగతుని విషయమున దాసానుదాసుడుగా మెలగు చున్నాడని చెప్పుటవలన నిదియు శాస్త్రసమ్మతపద్ధతియే.

క్రిందిశ్లోకమునందు ప్రపన్నుని బుద్ధిపూర్వకములగు నుత్తరాఘములకు స్వల్పదండన యనిరి. ఇచ్చట ఆప్రపన్నులయొక్క అబుద్ధిపూర్వకాపరాధము లకు దండనయే లేదనుచున్నారు. ఇదియే ఇచ్చట వివక్షితమైన ప్రధాన శాస్త్రార్థము. ఇటులనే ప్రపన్నునికి బుద్ధిపూర్వకముగ నుద్భవించు నుత్తరాఘ విష యమున పూర్వోక్తదండన, ఆ యపరాధములకు ప్రాయశ్చిత్తము నాచరించనివాని విషయమునందు మాత్రమే. ఆ యపరాధమునకు శాస్త్రోక్తనిష్కృతి ననుష్ఠించిన యెడల నాస్వల్పదండనము లేదు. అట్లాప్రాయశ్చిత్తములనుష్ఠించుటకు వీలు లేనివాడు " ప్రాయశ్చిత్తిరియం ప్రోక్తా యత్పునఃశరణాగాతిః " అనునట్లు " పాప ములను చేసితిని. దానికి శాస్త్రోక్తములగు ప్రాయశ్చిత్తము లనుష్ఠించుటకు శక్తిసామర్థ్యములు లేక యున్నాను. కావున హే ప్రభో ! నీవే ఆప్రాయశ్చిత్త స్థానములో నిలిచి ఆ పాపములకు దండన నొసంగక నన్ను రక్షింపవలయు"నని మఱల నొక ప్రపత్తిచేసిన యెడల వాని విషయమునందును ఆ పాపములను లెక్కింపక యుపేక్షించుచున్నాడను శాస్త్రార్థము సయితమిచట వివక్షితము కావచ్చును.

శ్లో ॥ అపాంపత్యుః శత్రూనసహనమునేర్ధర్మనిగలం
కృపే ! కాకస్యైకం హితమితి హినస్తి స్మ నయనమ్ ।
విలీనస్వాతంత్ర్యో వృషగిరిపతి స్త్వద్విహృతిభిః
దిశత్యేవం దేవో జనితసుగతిం దండనవిధిమ్ ॥ 64

అర్థ :— హేకృపే = ఓ దయాదేవీ !, త్వద్విహృతిభిః = నీ లీలలచే, విలీనస్వాతంత్ర్యః = దారపోసికొన్న స్వాతంత్ర్యముగలిగిన, వృషగిరిపతిః =

వేంకటాద్రీశుడగు శ్రీనివాసుడు, అపాంపత్యుః = జలములకధిపతియైన సముద్ర రాజముయొక్క, శత్రూన్ = శత్రువులను, అసహనమునేః = ఇతరుల మహత్త్వ ములను సహింపజాలనిపరశురామునియొక్క, ధర్మనిగలం = పుణ్యమనుసంకెలను, కాకస్య = కాకాసురునియొక్క, ఏకంనయనం = ఒకకంటిని, హితమితి = హిత మని తలంచి, హినస్తిస్మ = పోగొట్టెను. ఏవం = ఇట్లు, దేవః = ప్రభువగు శ్రీనివాసుడు, జనితసుగతిం = సద్గతినిగలుగజేయు, దండనవిధిం ( గతిం ) = దండనను, దిశతి = ఇచ్చుచున్నాడు.

అవతా :– గతశ్లోకద్వయముచే దయాపరతంత్రుడగు శ్రీనివాసుడు ఆశ్రితులవిషయములో కొన్ని యపరాధములకు స్వల్పదండన నిచ్చుచున్నాడనియు మఱికొన్నింటిని గమనించుటయేలేదనియు నిరూపించిరి. ఈశ్లోకములో పరమ పురుషుడొసంగుదండనను దయాదేవి తగ్గించి స్వల్పముగాజేయుటమాత్ర మేగాక ఆ దండనమును పర్యవసానములో ఆ యపరాధులకు హితములనే గలుగజేయు నట్లు చేయుచున్నదని యీప్రకారముగా దయాదేవిని పొగడుచున్నారు.

తా॥ ఈవిషయమును రామావతారములో జరిగిన మూడు వృత్తాంతములను దృష్టాంతీకరించి యాచార్యులు విశదీకరించుచున్నారు. శ్రీరాములు సముద్రమును దాటుటకు తగు నుపాయమును గల్గింపుమని సముద్రరాజును ప్రార్థించునప్పుడతడు శీఘ్రముగా రాకపోవుటచే ప్రభువు కోపమునొంది బాణమును ధనువున సంధించు నంతట సముద్రరాజు స్వపత్నీసమేతుడై వచ్చి పరమాత్ముని నమస్కరించి తగు సమాధానము చెప్పినపిమ్మట వానికేర్పడదగిన దండనమును వాని శత్రువులయెడల ప్రయోగించెను. దీనికి దయాదేవియొక్క ప్రేరణయే కారణము. ఇట్లే వివాహ పూర్త్యనంతరము అయోధ్యకు తిరుగుచుండగా అతని ప్రసిద్ధిని సహింప జాలక యెదురుగవచ్చి యుద్ధమునకీడ్చిన పరశురామునియందు సంభవించిన కోపము గూడ కడపట (పరశురాముడు ప్రణతుడై నపిదప) అతని పుణ్యమనెడు సంకెళ్ళ ను విరుగజేసి అతనిని బంధమునుండి విప్పివేయుటలో పర్యవసించినది. ఇదియు దయాదేవివిహారమే. మోక్షముఁజెంద నిశ్చయించువానికి పాపమునెట్లు బంధ కములో, అట్లే ఐహికము ఆముష్మికము అని చెప్పబడు ఈలోకసుఖములను, స్వర్గాది సుఖములను గలిగించు పుణ్యములు గూడ బంధకములే. ఇట్లు పుణ్య పాపములు రెండును ముముక్షువునకు సంకెలలే. కావలయునెడల పుణ్యములు బంగారు సంకెలలని తలంపనగును. బంగారుమయములైనను సంకెలలే గదా!

అటులనే సీతాదేవి యందు అసహ్యాపచారము నాచరించిన కాకాసురుడును బ్రహ్మాస్త్రమునకు భయపడి త్రిలోకములను చుట్టి శ్రమజెంది వచ్చి క్రింద పడి పోయినంతటనే వానిని సంహరించవలసినది తత్కాలప్రాప్తమైనను ప్రభువు దయాపరవశుడై ఒక కంటినిమాత్రము గ్రుడ్డిగావించి మఱల యిట్టి దుష్కార్యములయందు వానికి ప్రవృత్తి లేశమేర్పడక యుండునటుల హితమును గావించెను.

ఇట్లు పూర్వోక్త సన్నివేశములయందు మొదట ప్రభువునకు వారి యపరాధము వలన కోపము సంభవించినను పిదప దయాదేవీవిలాసవశుడై ఫలమునిచ్చు సమయమున వారికి హితమునే గలుగజేయు (ఆపాతతః చూచుటకు దండనవలె కనిపించినను) దండనము నిచ్చుచున్నాడు. ఆహా! ఎంతటిది దయాదేవీ ప్రభావము. "నాహితం కారయేత్ హరిః" పరమపురుష డొకప్పుడును అహితమునకు కారణముకాడు. వాడు మనకిచ్చు దండనలును ఒక విధముగ హితములే. ప్రపంచములో ఈశ్వరసంకల్పముచే జరుగుచున్నవన్నియు దయా కార్యములే యను తత్త్వమిచట నవధేయము.

శ్లో॥ నిషాదానాం నేతా కపికులపతిః కాఽపి శబరీ
కుచేలః కుబ్జా సా వ్రజయువతయో మాల్యకృదితి।
అమీషాం నిమ్నత్వం వృషగిరిపతేరున్నతిమపి
ప్రభూతైః స్రోతోభిః ప్రసభమనుకంపే! సమయసి ॥ 65

అర్థ:— హే అనుకంపే = ఓ దయాదేవీ!, నిషాదానాం నేతా = బోయ వారి కధిపతియగు గుహుడు, కపికులపతిః = వానరేశుడగు సుగ్రీవుడు, కాఽపి శబరీ = శబరియను నొక బోయస్త్రీ, కుచేలః = జీర్ణవస్త్రుండగు కుచేలుడు, సా కుబ్జా = కంసునికి చేటియైన త్రివక్రయను గూనిది, వ్రజయువతయః = గోపయువతులు, మాల్యకృత్ = మాలాకారుడు, ఇతి = అని యిటువంటి, అమీషాం = వీరి యొక్క, నిమ్నత్వం = తక్కువ తనమును, వృషగిరిపతేః = వేంకటాద్రీశుని యొక్క, ఉన్నతిమపి = ఎక్కువతనమును, ప్రభూతైః = చాలయు పెద్దదైన, స్రోతోభిః = నీ ప్రవాహములచే;, సమయసి = సమీకరించుచున్నావు.

అవతా॥ ఆశ్రితులగపరాధులయందు దయాదేవిచేయు నాముకూల్యము లింతవరకు వర్ణింపబడినవి. ఇటుపై రెండు శ్లోకములచే నిరపరాధులైన భగవదా

శ్రితుల విషయములో దయాదేవీకృత్యము వర్ణింపబడుచున్నది. రామావతార ములోను, కృష్ణావతారమునందును కొన్ని యుదాహరణలను జూపి ఈ విషయము నీ శ్లోకములో విశదీకరించుచున్నారు.

జాత్యాచులచే నిహీనులయందును దయాదేవి తనకు పరివారమైన సౌశీల్యమను భగవద్గుణమును ప్రేరేపించి ఆమె నడచుకొను విధమిచట చాలయు నందముగా చిత్రింపబడుచున్నది. ఏ వంచ ఆశ్రితుల విషయములో దయాదేవి యొక్క అనుగ్రహము నింతవరకు నిరూపించి ఇటుపై ఆమెకు పరికరమైనఇతర భగవద్గుణములు ఆ యాశ్రితుల విషయములో చేయు నుపకారము నిరూపింప బడుచున్నదనుటయు నిచ్చట సంగతియగును.

తా॥ గుహుడు, సుగ్రీవుడు, శబరి, కుచేలుడు, త్రివక్ర ( గూనిది ) గోపయువతులు, మాలాకారుడు మొదలగు పరమ భాగవతులు విషయములో భగవానుడు సర్వస్వదాన మనబడు తనయొక్క గాఢాలింగనము నొసంగి నీ రంధ్ర సంశ్లేషము చేసిన ప్రకారము శ్రీ మద్రామాయణ భాగవతాది గ్రంధములలో ఆ యా ప్రకరణములను చదివిన వారికి సువిదితమగును. గుహాదులు జాత్యా దులచే చాలయు తగ్గినవారైనను భగవంతునియందు వీరికున్న ప్రేమ చెప్పజాల నంతటిది. దీని ననుసరించియే భగవంతుడును "తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్ '' అను రీతిలో "సంశ్లిష్యసి త్వమిహ తేన సమానధర్మా" అని పెద్దలు చెప్పినట్లు నీ రంధ్ర సంశ్లేషము గావించెను. ఈ గుణమునే, "మహతో మందైస్సహ నీరంధ్రసంశ్లేషః సౌశీల్యమ్ " చాలయు గొప్పవాడు చాలయు నిహీనులతో భేదములేక కలసి మెలసి యుండుటయే సౌశీల్యము అని పెద్దలు నిర్వచించుచున్నారు. ఈ సౌశీల్యగుణము దయాదేవికి ప్రాణసఖి. దయచేత నేగదా వీరి యందిట్లు భగవంతుడు ప్రవర్తించుట.

ఒక పెద్దప్రవాహము, మిట్టప్రదేశమును పడద్రోసి తగ్గించియు పల్లపు ప్రదేశమును పూరించి యున్నతీకరించియు చేయుటను చూచుచున్నాముగదా. అటులనే ఆశ్రితుల విషయములో పలు ప్రకారములుగ నూటలూరి వృద్ధిచెందిన దయాప్రవాహము పరమపురుషుని యున్నతిని పడద్రోసియు, అతినీచులగు క్రింద చెప్పినవారి నిమ్నత నున్నతీకరించియు సమీకరించుచున్నది. చాలయు పెద్ద ప్రవాహములకే ఇట్లు చాల విపరీతమైన మిట్టపల్లములను సమీకరించు

శక్తియుండును గనుక ఆశ్రితుల విషయములో దయ అనేక విధములైన (సౌశీల్యాది గుణములనెడు) పెద్ద ప్రవాహములను ప్రవహింపజేయుచున్నదనుట నిచట రస్యము.

ఇచట యేడుకొండలవాని దయ గుహాదులగు నేడుగురిమీద ప్రవహించు ప్రకారము వర్ణింపబడియుండుట యొక వైచిత్ర్యమని కొందరు చెప్పుదురు.

శ్లో॥ త్వయా దృష్టస్తుష్టిం భజతి పరమేష్ఠీ నిజపదే
వహన్మూర్తీరష్టౌ స జయతి మృడానీపరిబృఢః ।
బిభర్తి స్వారాజ్యం వృషశిఖరిశృంగారికరుణే !
శునాసీరో దేవాసురసమరనాసీరసుభటః ॥ 66

అర్థ:— హే వృషశిఖరిశృంగారికరుణే = ఓ వేంకటాద్రీశుడగు శ్రీనివాస విలాసుని (ప్రియమహిషియగు) దయాదేవీ !, పరమేష్ఠీ = చతుర్ముఖ బ్రహ్మదేవుడు, త్వయా = నీచే, దృష్టః = కటాక్షింపబడినవాడై, నిజపదే = తన స్థానమునందు, తుష్టిం = సంతోషమును, భజతి = పొందుచున్నాడు. మృడానీపరిబృఢః = పార్వతీవల్లభుండగు పరమేశ్వరుడును, త్వయా దృష్టః = నీచే కటాక్షింపబడినవాడై, అష్టౌ మూర్తీః = ఎనిమిది రూపములను, వహన్ = వహించుచు, విహరతి = విహరించుచున్నాడు, శునాసీరః = దేవేంద్రుడును, త్వయా దృష్టః = నీచే కటాక్షింపబడినవాడై, దేవాసురసమరనాసీరసుభటః = దేవాసుర యుద్ధములయందు సమరాంగణమున యోధాగ్రగణ్యుడై విలసిల్లుచు, స్వారాజ్యం = తన స్వర్గసామ్రాజ్యమును, బిభర్తి = వహించుచున్నాడు.

అవతా॥ క్రింది శ్లోకమునందు నికృష్టులైన భగవదాశ్రితుల విషయములో దయాప్రవాహముయొక్క యుత్కృష్టత వర్ణింపబడినది. ఈ శ్లోకమునందు చాలయు నుత్కృష్టులుగా శాస్త్రములలో వ్యవహరింపబడుచున్న బ్రహ్మ రుద్రేంద్రుల విషయములలో దయాదేవీకృత్యము వర్ణింపబడుచున్నది. గత శ్లోకమునందు దయాగుణముయొక్క రూపాంతరమైన సౌశీల్యగుణము ప్రస్తావింపబడినది. ఇచట అటులనే దయకు నత్యంతాంతరంగమైన యౌదార్యమను గుణము నిరూపింపబడుచున్నది.

తా॥ చతుర్ముఖుడు, రుద్రుడు, దేవేంద్రుడు అను నీ త్రిమూర్తులును భగవదంతరంగు లనుటలో సందియము లేదు. వారు తమ తమపదవులలో సుఖముగా

పరిపాలించుట దయాదేవియొక్క కటాక్షముచేతనే. ఈమె కటాక్షము లేనియెడల వారా పదవులలో ఒకక్షణముకూడ నుండుటకు వీలు కాదు. వారికాయాసమయ ములయందు సంభవించు పరమాపత్తులను. వానిని భగవానుడు పరమదయచే నిరసించి వారిని రక్షించిన ప్రకారములును పురాణములలో సుప్రసిద్ధములు. ఇచట దయాదేవి, యౌదార్యమను గుణమూలముగా ఇట్టి పెద్ద పెద్ద పదవులలో వారిని స్థాపించుచున్నదనియు. శ్రీనివాసుడను శ్రీమన్నారాయణుడే సర్వదేవతా సార్వభౌముడనియు వాని దయచేతనే తదితర సర్వదేవతలును స్వస్వపదములలో నిలిచి జీవించుట యనియు నాదిగాగల శాస్త్రార్థములు వివక్షితములు.

శ్లో॥ దయే ! దుగ్ధోదన్వద్వ్యతియుతసుధాసింధునయతః
త్వదాశ్లేషాన్నిత్యం జనితమృతసంజీవనదశాః ।
స్వదన్తే దాన్తేభ్యః శ్రుతివదన కర్పూరగుళికాః
విషణ్వన్తశ్చిత్తం వృషశిఖరివిశ్వమ్భరగుణాః ॥ 67

అర్థ :— హే దయే = ఓ దయాదేవీ !, దుగ్ధోదన్వద్వ్యతియుతసుధా సింధునయతః = క్షీరసముద్రముతో బాగుగా కలిసియుండు నమృత సముద్రము వలె, త్వదాశ్లేషాత్ = నీయొక్క దృఢ సంబంధమువలన, జనితమృతసంజీవన దశాః = మృతినొందిన వారినిగూడ యుజ్జీవింపజేయు దశను గలిగినట్టియు, శ్రుతి వదనకర్పూరగుళికాః=శ్రుతి దేవియొక్క నోటికి కర్పూరమాత్రలుగా నున్నట్టియు, చిత్తం = మనస్సును, విషణ్వన్తః = పిండునవియు గానున్న (ద్రవింపజేయునవి గాను), వృషశిఖరివిశ్వమ్భరగుణాః = వేంకటాద్రిలోనుండు జగద్రక్షకుడగు శ్రీనివాసునియొక్క కల్యాణగుణములు, దాన్తేభ్యః = జితేంద్రియులకొఱకు, నిత్యం = ఎప్పుడును, స్వదన్తే = రుచించుచున్నవి.

అవతా॥ గతశ్లోకద్వయముచే సౌశీల్యము, ఔదార్యమునను రెండు భగవద్గుణములు దయాదేవీ సంబంధముచే భగవదాశ్రితుల విషయములో చేయు నుపకారము వర్ణింపబడినది. ఈ శ్లోకములో మిగిలిన సమస్తగుణములును దయాదేవీ సంబంధముచే విరక్తులగు పరమైకాంతులకు చాలయు తీపుగానున్న వని వర్ణించుచున్నారు.

తా॥ భగవంతుని కల్యాణగుణములు క్షీరసముద్రమువంటివి. అందరికిని చాలయు భోగ్యములైనవి. వానిలో దయ యనుగుణము అమృతసాగరమువంటిది. మృతినొందినవారిని యుజ్జీవింపజేయుట అమృతముయొక్క స్వభావము. భగవంతునియందు నుండు నితరగుణములు దయతో కలిసియుండుటచే ఆ సమస్త గుణములును స్వయం పరమభోగ్యములుగానుండుటయేగాక సంసారతాపముచే మృతతుల్యులగు జీవులను సయిత ముజ్జీవింపజేయుచు నున్నవి. సంసారులనుజ్జీవింపజేయుట యనగా భగవద్గుణములను ధ్యానించువారికి సద్గతిని గల్పించుటయే. మఱియు నీ గుణములు శ్రుతియను నాయికయొక్క నోటికి (వదనమునకు వేదాంతములకని భావము) పచ్చకర్పూరపు మాత్రలవలె నున్నవి. అనగా కర్పూరపుమాత్రలు నాయికయొక్క నాలుకకు ఎట్లు విలక్షణరుచిని గలుగజేయునో అట్లే వేదాంతములు భగవద్గుణములను వర్ణించునపుడు కర్పూరమాత్రలనాస్వాదించుటవలె వొక విలక్షణరసాస్వాదమును బొందుచున్నవి. అట్టి యీ గుణములు "పరమాత్మని యో రక్తః విరక్తోఽపరమాత్మని" అనురీతిలో విషయవైరాగ్యపూర్వకముగా భగవత్ప్రేమ గల్గినవారికి చాలయు రుచించునని భావము.

శ్లో॥ జగజ్జన్మస్థేమప్రళయరచనాకేళిరసికః
విముక్త్యేకద్వారం విఘటితకవాటం ప్రణయినామ్ ।
ఇతి త్వయ్యాయత్తం ద్వితయముపధీకృత్య కరుణే !
విశుద్ధానాం వాచాం వృషశిఖరినాథః స్తుతిపదమ్ ॥ 68

అర్థ :— హే కరుణే = ఓ దయాదేవీ!, వృషశిఖరినాథః = వేంకటాద్రీశుడగు శ్రీనివాసుడు, జగజ్జన్మస్థేమప్రళయరచనాకేళిరసికః = జగత్తుయొక్క సృష్టిస్థితి సంహారములను రచించుటయను లీలయందు రసికుడుగాను, ప్రణయినాం = తమయందు విశేషప్రేమగల్గినవారికి ( భక్తులకు ), విఘటితకవాటం = తెఱువబడిన తలుపునుగల, విముక్త్యేకద్వారం = మోక్షమునకు ప్రధాన ద్వారముగాను, ( భవతి = అగుచున్నాడు ), ఇతి = ఇట్టి, త్వయ్యాయత్తం = నీచే ఏర్పడిన, ద్వితయం = ఉత్కర్షద్వయమును (జగత్కారణత్వం, మోక్షప్రదత్వం), ఉపధీకృత్య = నిమిత్తముగా జేసికొని, విశుద్ధానాం వాచాం = అపౌరుషేయములగుటచే నెట్టి దోషములకును ప్రసక్తి లేక చాలయు పరిశుద్ధములైన వేదవాక్కులకు, స్తుతిపదం = స్తోత్ర పాత్రుడుగా, (భవతి = అగుచున్నాడు).

అవతా॥ క్రింది శ్లోకమునందు శ్రీనివాసుని సర్వగుణములును దయాసం బంధముచేతనే వేదయువతియొక్క నాలుకకు కర్పూరగుళికలగుచున్నవని వర్ణించిరి. అనగా దయాసంబంధముచేతనే ఆ గుణములుత్కర్షమునొంది వేద ములు పొగడు స్థితిని పొందుచున్నవని భావము. ఈ శ్లోకమునందు అట్టి గుణ ములకు ఆధారభూతుడగు శ్రీనివాసుని ఆ వేదములు కీర్తించుటయు ఆ దయా దేవి యధీనముగా భగవంతుని యందమరియుండు జగత్కారణత్వము, మోక్ష ప్రదత్వమను రెండాకారములను బట్టియేయని వర్ణించి దయకుండు మహోన్నత స్థితిని విశదీకరించుచున్నారు.

తా॥ శ్రీనివాసుడను పరమపురుషుడు సర్వజగత్తుయొక్క సృష్టిస్థితి సంహారములను స్వలీలార్థమాచరించుచు ఇతర దేవతలకు లేని జగత్కారణుడను నుత్కర్షమును పొందియున్నాడు. అట్లే మోక్షలోకమునకు తలుపుతెఱువబడిన యొకే మార్గముగాను, (ప్రధానోపాయముగాను) ఈతడేర్పడియున్నాడు. అనగా భగవంతునియందు భక్తి ప్రపత్తియను నుపాయముల ననుష్ఠించినవారికి మోక్షము నొసంగుట యనునది ఇతర దేవతలకు సాధ్యముగాని యొక ప్రధానకార్యమని భావము. ఏవంచ జగత్కారణత్వము, మోక్షప్రదత్వమునను నీ రెండాకారములు శ్రీనివాసునికసాధారణములు, మఱొకరికి లేనివని సిద్ధించును. ఈ రెండాకార ములుకూడ దయాధీనములగుటంబట్టియే భగవంతునియందు నుత్కర్షమును నొందుచున్నవి. అనగా ద్వితీయదశకములో నిరూపించినట్లుగా జగత్సృష్టిస్థితి సంహారకర్తృత్వము, మోక్షమిచ్చుట మొదలగున వన్నియు దయచేతనే ఏర్పడు చున్నవని భావము. చాలయుత్కృష్టములుగా కొనియాడబడుచుండు నీ రెండు గుణములును దయాసంబంధముచేతనే ఉత్కృష్టములగుచున్నవి యను కారణ మున అపౌరుషేయములగు వేదములుసయితమా గుణద్వయాశ్రయుడగు శ్రీని వాసుని పొగడుచున్నవి. తద్గుణద్వయరహితుడుగా శ్రీనివాసుండుండినను, ఆ గుణద్వయము దయాధీనముగా లేకపోయినను ఆ వేదములు వానిని కీర్తించవు. కావున నా వేదములు తద్గుణద్వయద్వారా భగవంతుని స్తుతించుటకు ముఖ్యమైన కారణము నీ సంబంధమేయని దయాదేవియొక్క యుత్కృష్టప్రభావము నాచార్యులిచట విశదీకరించియున్నారు.

జగత్సృష్ట్యాది కార్యములును, మోక్షప్రదత్వమును దయచే ఏర్పడు నవియే యను శాస్త్రార్థమిచట వివక్షితము.

పురుషునిచే నిర్మింపబడినయెడల భ్రమము, ప్రమాదము, విప్రలంభము మొదలగు నానా దోషముల కవకాశముగలదు. అట్లుకాక న పౌరుషేయము గాను. నిత్యముగానుండుటచే వేదమునందిట్టి దోషముల కవకాశములేదను భావము. "విశుద్ధానాం వాచాం" అను పదముచే వివక్షితము.

శ్లో॥ కలిక్షోభోన్మీలత్త్రితికలుషకూలంకషజవైః
అనుచ్ఛేదైరేతైరవటతటవైషమ్యరహితైః ।
ప్రవాహైస్తే పద్మాసహచరపరిష్కారిణి ! కృపే !
వికల్ప్యం(ల్ప్యే)తేఽనల్పా వృషశిఖరిణో నిర్ఝరగణాః(గుణాః)॥ 69

అర్థః:— పద్మాసహచరపరిష్కారిణి = మహాలక్ష్మితోకూడిన శ్రీనివాసుని కలంకారమును జేయుచున్న, హే కృపే = ఓ దయాదేవి !, కలిక్షోభోన్మీలత్త్రితి కలుషకూలంకషజవైః = కలియొక్క ఉగ్రతవలన వృద్ధిచెందు ప్రాపంచికుల పాపములను వేరుతో పెళ్లగించి త్రోసివేయునట్టి వేగమునుగల్గి నట్టియు, అనుచ్ఛేదైః = విరామములేక సంతతము ప్రవహించునవియు, అవటతటవైషమ్యరహితైః = మిట్ట పల్లమను (ఉత్కృష్ట, నికృష్టులను) భేదములేక సమస్త ప్రదేశములయందును ప్రవహించునట్టివియునగు, ఏతైః = ఈ, తే = నీ యొక్క, ప్రవాహైః = ప్రవాహములతో, అనల్పాః = చాలయు పెద్దవియైన, వృషశిఖరిణః = వేంకటాద్రియందలి. నిర్ఝరగణాః = జలప్రపాతబృందములు. వికల్ప్యంతే = సమానములని భావింపబడుచున్నవి.

అవతా॥ గతశ్లోకమువరకు భగవద్గుణములకును, భగవానునకు నేర్పడు సమస్తోత్కర్షములును దయాసంబంధముచేతనే నని నిరూపించిరి. ఈ దశకారంభమున "అకూపారైః" అను శ్లోకములో భగవంతునియందు ప్రపత్తి చేసినవారి విషయములో దయాదేవి పెద్ద ప్రవాహముతో ప్రవహించు ప్రక్రియను దయాదేవియొక్క ఒక బిందువు పరబ్రహ్మ స్వరూపమునకంటె నాల్గింతలు పెద్దదనియు, ఆ దయాప్రవాహముచే అవిద్యయను కర్మములన్నియు నశించుచున్నవనియు ప్రతిపాదించి విశదీకరించియున్నారు. తదుపరిగతశ్లోకమువరకు ప్రసంగాద్గవతరించినవి. ఈ దశకమునకుపాంత్యమగు నీ శ్లోకమునందు పూర్వోక్త ప్రవాహప్రభావమును సమీచీన దృష్టాంతముచే విశదీకరించుచున్నారు. దీనిచే

"దయాదేవియొక్క ప్రవాహము ప్రపన్నుల విషయములో సంభవించు ప్రక్రియ" అను నీ దశకార్థముగూడ అర్థాత్తుగ నిరూపింపబడినదగుచున్నది.

తా॥ "తెళింద పెరుంతీర్థంగళ్ శెరింద పెర్పు" (నిర్మలమైన మహా తీర్థములు ప్రవహించు పర్వతము) అని యాచార్యులు తామే చెప్పినట్లుగా ఈ తిరుమలయందు ప్రవహించు పెద్ద జలపాతములను దయాప్రవాహముతో పెద్ద లుపమించుచున్నారని వర్ణించుచున్నారు. దయయే రూపీకరించి వచ్చినట్లున్న మహాలక్ష్మితో ననవరతము సంశ్లేషించియుండు శ్రీనివాసునియొక్క దయ, వాని కొక ముఖ్యాలంకారముగా నమరియున్నది. అట్టి ఈ దయ పలువిధముల నూటలూరి ప్రవహించుచున్నది. అతివేగము గల యా ప్రవాహము కలి తైక్ష్ణ్యముచే గలుగు ప్రాపంచికుల పాపములను సమూలోన్మూలనము గావించు చున్నది. అనగా భగవంతుని దయకు విషయమైనవారి పాపము నిశ్శేషముగా తొలగుచున్నదని భావము, అట్టి దయాప్రవాహము మనలను విషయీకరించుటకు మన మామెను శరణీకరించవలయును. మఱియు నా దయాప్రవాహము ఇచటనే ఈ సమయముననే ప్రవహించునను నియతి లేనిది. అవిచ్ఛిన్నముగా నెప్పుడును ప్రవహించును. ఈ విషయమును ఈ వేంకటాద్రియందు ఇప్పుడును నానా జనులెల్లప్పుడును వచ్చి శ్రీనివాసుని సేవించి తమ అభీష్టములనుపొంది పోవుటను ప్రత్యక్షముగా చూచుచున్న మనకు విశదీకరింప నవసరము లేదు. ఈ ప్రవాహము మిట్ట పల్లమను భేదములేక అన్నిచోట్లను చాలా వేగముగా ప్రవహించును. అనగా జాత్యాదులచే ఉత్కృష్టులయందును, నికృష్టులయందు నేలాటి పక్షపాతము లేక ప్రవహించి స్వకార్యమును చేయును. ఈ విషయమును వివిధోదాహరణ ములచే ఈ దశకములోనే నిరూపించియున్నారు. ఇది దయాప్రవాహముయొక్క స్వభావము. ఇటులనే ఈ తిరుమలలో ప్రవహించు జలపాతములకును, క్రింద జెప్పిన స్వభావము కలదు గాన ఆ జలపాతములను ఈ దయాప్రవాహముతో సమముగ దలంపవచ్చును. సమానమగు ప్రయోజన మున్నచోటులలో వికల్ప మని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. ఈ జలప్రపాతములును తమ వేగముచే భువి యందున్న సమస్తాశుద్ధములను పోగొట్టును. అవి యన్నియు మహాపుణ్య తీర్థములు కనుక ప్రాపంచికుల పాపములనుగూడ పోగొట్టును, మఱియు కాల నియమములేక ఎప్పుడును ప్రవహించునవి. పెద్ద ప్రవాహములగుటచే మిట్ట పల్లములను భేదములేక ఎచ్చటనైనను నిరర్గళముగా ప్రవహించును. ఏవం చ

దయాప్రవాహమునకు గల గుణములన్నియు నీ జలప్రపాతములకు గూడనున్నవి గనుక వీనిని దయాప్రవాహముతో నుపమించుట కద్దులేదని భావము.

ఇచట దయాప్రవాహము నుపమేయముగాను, జలప్రపాతముల నుపమానముగాను జెప్పవలసియుండ నిట్లు విపర్యస్తముగా జెప్పుట " దయాప్రవాహమున కుపమానమగుటకు కావలసినంతటి యున్నతి ఆ ప్రపాతములకు లేదు. దయాప్రవాహము నానా రీతుల నుత్కృష్టమైనది. కొన్ని యంశములలో మాత్రము ఆ దయాప్రవాహము నీ జలప్రపాతములనుకరించుచున్నవి '' యను కారణము చేతనే.

ఇచట "వికల్పంతే నిర్ఝరగుణాః" అను పాఠమునకంటె "వికల్ప్యంతే నిర్ఝరగణాః '' అను పాఠము స్వరసమను నభిప్రాయముతో పూర్వులు వ్యాఖ్యానించిరి. దాని ననుసరించియే మేమును వ్యాఖ్యానించితిమి.

శ్లో॥ ఖిలం చేతోవృత్తేః కిమిదమితి విస్మేరభువనం
కృపే! సింహక్ష్మాభృత్కృతముఖచమత్కారకరణమ్ ।
భరన్యాసచ్ఛన్నప్రబలవృజిన ప్రాభృతభృతాం
ప్రతిప్రస్థానం తే శ్రుతినగరశృంగాటకజుషః ॥ 70

అర్థ :— హే కృపే = ఓ దయాదేవీ!, శ్రుతినగరశృంగాటకజుషః = వేదమను పట్టణమునకు చతుష్పథము వంటియుపనిషత్తులను బొందియున్న, తే = నీ యొక్క, భరన్యాసచ్ఛన్నప్రబలవృజినప్రాభృతభృతాం = భరస మర్పణము (శరణాగతి) అను వస్త్రముచే మూయబడిన ప్రబల పాపముల నెడు నుపహారములను తీసికొని వచ్చువారి నుద్దేశించి, ప్రతిప్రస్థానం = ఎదురేగి స్వీకరించుట యనునది, చేతోవృత్తేః = మనోవ్యాపారముయొక్క, కిమిదంఖిలం = ఇదేమి లోపము (విస్మరణము), ఇతి=అని, (చేతోవృత్తేః ఖిలం = మనోవృత్తి నుండి జారినదిగాను, అనగా మనసుచేతగూడ భావించుటకు వీలులేనిదిగాను), విస్మేరభువనం = ఆశ్చర్యోపేతమైన ప్రపంచమును గలిగినదానినిగాను, (కిమిదమితివిస్మేరభువనం = ఇదేమిటిది యను నాశ్చర్యముతోగూడిన ప్రపంచము గలిగినదిగాను), సింహక్ష్మాభృత్కృతముఖచమత్కారకరణం = సింహాచలమనెడు వేంకటాద్రియందుండు విద్వాంసుడగు శ్రీనివాసునికి ఆశ్చర్యమును గలుగజేయునదిగాను, (అస్తి = ఉన్నది).

అవతా॥ ఇంతవరకు నీ దశకములో ప్రపన్నుని విషయములో దయాదేవి చేయు వివిధోపకారములను చెప్పి తద్ద్వారా ప్రపన్నుడు నిర్భయుడుగా నుండ నగునని యుపపాదించిరి. దశకాంత్యమగు నీ శ్లోకములో ప్రపన్నుని విషయములో దయాదేవిచేయు అతి ప్రధానమైన ఒక మహోపకారమును విశదీకరించి దశకము నుపసంహరించుచున్నారు.

తా॥ వేదమనునది యొక పెద్ద పట్టణము. పట్టణమునందు సమస్త వస్తువులను లభించునట్లు వేదములోను ఐశ్వర్యము, కైవల్యము, మోక్షమనబడు సమస్త పురుషార్థములును లభించును. అనగా వానిని పొందుట కుపాయములు వేదములో గలవు. పట్టణమునకు నాల్గు మహాపథములుగూడు చతుష్పథమెట్లు ప్రధానస్థలమో, అట్లే వేదమున కుపనిషద్భాగము. అన్నిమార్గములను భగవానునియందు సమన్వయింపజేసి యున్న భాగముగదా అది. అట్టి స్థలములో భగవద్దయా ప్రభావము చక్కగా నిరూపింపబడుటచే అట్టి చతుష్పథమును దయాదేవి పొందియుండునట్లు ఇచట చిత్రింపబడుచున్నది. చతుష్పథములో నుంచు వారికి ఏ మార్గములో నెవరు వచ్చినను చక్కగా దృష్టి గోచరులగునట్లు. దయాదేవికిని "చతుర్విధా భజన్తే మాం" అను రీతిలో ఏ ఫలము నుద్దేశించి ఎవరు వచ్చినను వారు చక్కగ దృష్టి గోచరులగుదురు. వెంటనే వారువారు కోరిన ఫలములనొసంగి యనుగ్రహించుచున్నది. ఇట్లుండగా. మోక్షమును కోరి ప్రపత్తి చేయువాని విషయములో ఈ దయాదేవి చూపించు అత్యాదరము చాలయు నాశ్చర్యకరముగా నున్నదని యాచార్యులిచట విస్మయించుచున్నారు. శరణాగతిచేయువాడు తన మహాపాపములను దయాదేవికి నుపాయనముగ తీసికొని పోవుచున్నాడు. వీనికి పండే ధనమిదియేగదా! వారి వారికి ఫలించిన వస్తువులనే వారువారు తమతమ దైవతములకు ఉపహారముగ నర్పించుట యలవాటై యున్నదిగదా! ఏవంచ ఈ పాపోపహారమును "భరన్యాసం" (శరణాగతి) అను నొక చిన్న ధర్మమనెడు వస్త్రముచే చక్కగ మూసికొని పోవుచున్నాడు. పైన మూయంబడిన వస్త్ర స్వరూపమును చూచి ఆ ఉపహారము నటులనే దయాదేవి స్వీకరించుచున్నది. అట్లు స్వీకరించునప్పుడు సంభవించు నొక ప్రక్రియ నిచట నాచార్యులు చాలయు రమణీయముగ వర్ణించుచున్నారు. ఆదేమనగా;—
ఈ జీవుడీయుపహారము నిట్లు మూసి యెత్తుకొని పోవుటకు బయలుదేరినప్పుడే దయాదేవి చాలయు నాదరముతోను సంభ్రమముతోను నెదురేగి దానిని స్వీకరించు

చున్నది. అప్పుడు వేదములును, నిత్యముక్తులు నాశ్చర్యపడుచున్నారు. "ఆహా! సర్వలోక సార్వభౌమియగు దయాదేవి యెక్కడ? పాపపుంజమగు వీడెక్కడ? ఆమె వీని నెదుర్కొనుటేమి? ఇదేమి యాశ్చర్యము? ఈశ్వరుడు సర్వజ్ఞుడు గనుక వాడు పాపము నాచరించు ప్రతి సమయమునందు నా పాపములను చక్కగ నెఱింగియున్నాడే! అట్లుండగా ఇప్పుడు దయాదేవి వానికెదురేగి వాని నాదరించుట యుక్తమా? ఈశ్వరుడును, దయాదేవియు నితని పాపములను మఱచిపోయిరా? ఈ దయాదేవియొక్క యౌదార్యము, మనసుచేతను భావింప వీలుగానంతటి యున్నత రీతిలోనున్నదిగదా" అని యందఱు నాశ్చర్యచకితులగునట్లును, సర్వజ్ఞుడగు సాక్షాచ్ఛ్రీనివాసునికే విలక్షణాశ్చర్యమును గలుగజేయునదియు గానున్నది దయాదేవిచేయు ప్రపన్నజీవాదరణమని భావము.

జీవుడెన్ని పాపముల నాచరించినవాడైనను భగవానుని సమీపించి "నేనేమియు తెలియక నింత జేసివైచితిని. దీనిని పోగొట్టుటకు వేదాంతోక్త భక్తి యోగాదుల నాచరింప నాకు శక్తిలేదు. క్షమయులేదు. కావున ఆ భక్తి యోగము నాచరించిన నే ఫలము వచ్చునో, ఆ ఫలము నా భక్తి యోగస్థానములో నీవే నిలిచి నన్ను రక్షించి నా కా ఫలము నొసంగవలయు" నని చెప్పి శరణాగతి చెందినయెడల నా పరమపురుషుడు పరమ దయాళువగుటచే ఆ దయచే ఇతని సర్వపాపములును ఇతడు శరణాగతి చేసినవాడను హేతువుచే క్షమించి ఇతనిని సంసారబంధమునుండి వదలించి మోక్షపర్యంతమగు నైశ్వర్యమునిచ్చుచున్నాడు. ఇవన్నియు దయాకార్యములే యను శాస్త్రార్థమిచట వివక్షితము.

పై దశకమునందు కృపణుడగు ప్రపన్నుని భరమును దయాదేవి మోయుచున్నదని నిరూపింపబోవు విషయమును నీ దశకాంత్యమున నిచట యథాపూర్వముగ నవతరింపజేసియున్నారు.

(సప్తమదశకము సమాప్తము)

శ్రీమతే నిగమాన్తమహాదేశికాయ నమః

## అష్టమదశకము

శ్లో॥ త్రివిధచిదచిత్సత్తాస్థేమప్రవృత్తినియామికా
వృషగిరివిభోరిచ్ఛా సా త్వం పరైరపరాహతా।
కృపణభరభృత్కింకుర్వాణప్రభూతగుణాంతరా
వహసి కరుణే! వైచక్షణ్యం మదీక్షణసాహసే॥ 71

అర్థ:— హే కరుణే = ఓ దయాదేవీ, త్రివిధచిదచిత్సత్తాస్థేమప్రవృత్తి నియామికా = మూడువిధములైన చేతనాచేతనములయొక్క స్వరూపస్థితి ప్రవృత్తులను నియమించు దానివిగాను, పరైః అపరాహతా = ఇతరులచే ప్రతిరోధించుట కసాధ్యవుగాను, కృపణభరభృత్ = గత్యంతరవిహీనుడైన ప్రపన్నుని యొక్క భారమును వహించు దానివిగాను, కింకుర్వాణప్రభూత గుణాంతరా = (నీకు) సేవజేయు సమస్త భగవద్గుణములు గలిగినదానివిగాను, వృషగిరివిభోః = వేంకటాద్రీశుడగు శ్రీనివాసునియొక్క, ఇచ్ఛా=ఇచ్ఛా రూపయునగు, సా త్వం= అట్టి నీవు. మదీక్షణసాహసే = నన్ను కటాక్షించుట యను సాహసకృత్యమునందు, వైచక్షణ్యం = సామర్థ్యమును, వహసి = వహించుచున్నావు.

అవతా॥ గతదశకమునందు ప్రపన్నవిషయమునందు దయాప్రవాహముచే నేర్పడు నానుకూల్యములు వర్ణింపబడినవి. ఈ దశకమునందు ఈ ప్రపన్నుని విషయములో, ప్రపత్తికి పూర్వకాలమునందును, తదుత్తర మిహలోకములో నుండు కాలమునందును, మోక్షేతర ఫలాపేక్షులవిషయములోను, మోక్షార్థమై భక్తియోగమననుష్ఠించువారి విషయములోను ఈ దయాదేవిచే కలుగు నుపకార పరంపరవర్ణింపబడుచున్నది. ఏతదనుగుణముగా దయాస్వరూపము ఈ దశ కారంభమున నిరూపింపబడుచున్నది. ఇట్లు సర్వలోకమును భగవద్దయ నవలంబించి నిలుచుచున్నది యని తెలినయెడల ప్రపన్నుకు తనకు రక్షణము సిద్ధమని నిర్భయుడుగా నుండవచ్చుననుటయు నిచట నర్థాత్తుగ సిద్ధించుచున్నది.

క్రింది శ్లోకమునందు ప్రపన్నుని విషయమున దయ చేయు ప్రత్యుత్థానమును జూచి ప్రపంచ మాశ్చర్యపడుచున్నదని వర్ణించిరి. ఈ శ్లోకమునందు దానికంటె మిక్కిలి సాహసవంతమగు నొక పనిని దయాదేవి యొనరించుచున్నది. ఇది చాలయు నాశ్చర్యము నొందదగిన విషయమని చెప్పుచున్నారు.

తా॥ ఇతరులదుఃఖమును పోగొట్టవలయునను సమర్థుని యిచ్ఛయే దయ. ఇది పరహితప్రావణ్యమనుటలో పర్యవసించునని మన సిద్ధాంతము. ఇట్టి భగవదిచ్ఛయే బద్ధులు (సంసారులు), ముక్తులు, నిత్యులు, నన(బడు త్రివిధ చేతనులయొక్కయు; ప్రకృతి, కాలము, శుద్ధసత్త్వము నన(బడు త్రివిధ అచేతనుల యొక్కయు స్వరూపస్థితిప్రవృత్తులకు నియామికగా నుండును. ప్రపంచములో నుండు సర్వచేతనాచేతనులయొక్క సమస్తవ్యవహారములును భగవద్దయ చేతనే జరుగుచున్నవని పరమతాత్పర్యము. మఱియు నీ భగవదిచ్ఛకు నెవరిచేతను నడ్డుగల్పించుటకు సాధ్యముగాదు. భగవంతుఁడొకరిని రక్షింపఁదలఁచిన వానినడ్డగించువా రెవరును లేరు. ఇట్టి దయాదేవి నొకఁడు శరణమునొందిన యెడల వానియొక్క సర్వభారమును దయాదేవి మోయుటకు సిద్ధముగానున్నది. ఈ దయాదేవికి సేవచేయుటకు జ్ఞానబలైశ్వర్యాదులను నమిత మహిమోపేతములైన నానాభగవద్గుణములు గలవు. ఇట్టి వైభవమును గాంచిన ఈ దయాదేవి, అపరాధచక్రవర్తి యని వ్యవహరింపందగిన మహాపరాధియు, స్వపాపముచే సర్వలోకపుణ్యములను భస్మీకరించు సామర్థ్యమును గలవాడునగు నన్ను కటాక్షించుటయను పెద్ద సాహసకృత్యమును చాలయు సామర్థ్యముతో చేయుచున్నదనునది మిగుల నాశ్చర్యకరమని యాచార్యులిచట ననుసంధించుచున్నారు. ఎట్టి దోషగంధములేని దయాదేవి, నన్ను కటాక్షించుటయను వ్యాపారంద్వారా నాసంబంధమేర్పడినచో నా దోషములు ఆమెనుగూడ తొలగింపనో, ఏమో అని భయపడవలసినది నా పరిస్థితి. అట్టి నన్ను కటాక్షించి యుజ్జీవింపజేయుటను నది పూర్వోక్తరీతిగ నంతటి ప్రభావమునుజెందిన నీకేగాని, మఱియొకరికి సాధ్యముగాదని తాత్పర్యము.

ఇట్లు ఆచార్యులు స్వవిషయములో నొనరించిన నైచ్యానుసంధానము తదుత్తరకాలస్థులగు మనబోటివారి యనుసంధానమునకు మార్గదర్శకముగా నున్నది. ఇచట దయాదేవియొక్క స్వరూపము (ఇచ్ఛారూపత్వము) నిరూపితమగుచున్నది.

శ్లో॥ వృషగిరిపతేర్హృద్యా విశ్వావతార సహాయినీ
క్షపితనిఖిలావద్యా దేవి(వీ) క్షమాదినిషేవితా।
భువనజననీ పుంసాం భోగాపవర్గవిధాయినీ
వితమసి పదే వ్యక్తిం నిత్యాం బిభర్షి దయే! స్వయమ్॥ 72

అర్థ :— హే దయే దేవి ! = ఓ దయాదేవీ ; వృషగిరిపతేః హృద్యా = వేంకటాద్రీశునికి మనోహారిణియు (మనస్సులో ఉదయించుదానివిగాను ; శ్రీనివాసుని హృదయములో వసించుదానివిగాను) ; విశ్వావతార సహాయినీ = సర్వావతారములలోను సహాయభూతవుగాను; సమస్తావతారములలోను పత్నిగా కూడనే వచ్చుచున్నదానివిగాను ; క్షపిత నిఖిలావద్యా = పోగొట్టబడిన అంతటియొక్క దోషములు గలదానివిగాను; (నిరస్తసమస్తదోషయుగాను) ; క్షమాదినిషేవితా = క్షమాదిగుణములచే సేవింపబడుదానివిగాను, (భూదేవి మొదలగువారిచే సేవింపబడుదానివిగాను ; భువనజననీ = ప్రపంచసృష్టికి కారణభూతవుగాను, (ప్రపంచమాతవుగాను) ; పుంసాం = ఆయా చేతనులకు ; భోగాపవర్గ విధాయినీ = భోగము మోక్షమనబడు సర్వపురుషార్థములనిచ్చుదానివిగా నున్న; (త్వం=నీవు) స్వయం = స్వయముగనే ; వితమసిపదే = తమోగుణసంబంధములేని పరమపదమునందు ; నిత్యాం వ్యక్తిం = శాశ్వతమైన ప్రకాశమును, ( నిత్యమైన విగ్రహమును ; బిభర్షి = ధరించుచున్నావు.

అవతా॥ క్రింది శ్లోకమునందు తనను కటాక్షించుట యను సాహసకృత్యమును దయాదేవి చేయుచున్నదని వర్ణించిరి. ఇట్లు ఆమె చేయుటకు కారణమేమనగా మాతృప్రేమయే. లోకమాతయగు మహాలక్ష్మి ఈ దయాస్వరూపిణి గావున ఆమె వేఱు, ఈమె వేఱుగాదు. ఈ విషయము "కరుణామివరూపిణీం" అని ప్రథమశతకములోనే నిరూపింపబడియున్నది. కనుక లక్ష్మివలె దయయు తల్లియే. ఈ విషయమును ఇరువురికి సమానములగు వివిధవిశేషణములచే నాచార్యులీ శ్లోకములో విశదీకరించుచున్నారు. దీనిచే అచేతనమగు గుణమును సంబోధించి స్తోత్రముచేయుట యుక్తమా ? అను నాక్షేపణము సముచితము పరిహరింపబడినదగుచున్నది. లక్ష్మి దయాస్వరూపిణియగుటచే లక్ష్మిస్తోత్రములోనే పర్యవసించుచున్నది గదా ! మఱియు క్రిందిశ్లోకములో భగవంతుని యిచ్ఛావిశేషమే దయ యనిరి. ఆ యిచ్ఛ యొక రూపమిచ్చిన యెడల నది సాక్షాన్మహాలక్ష్మియొక్క రూపముగనే యుండుననుతత్త్వము నిచట యెఱుంగదగినది.

తా॥ ఈ శ్లోకములో చెప్పియున్న విశేషణములన్నియు దయకును, లక్ష్మికిని (శ్లేషలో) సమానమైనవి. దయ పరమపురుషుడగు శ్రీనివాసునియొక్క హృదయములో నున్నదించునది. మిగలగుణములకంటె దయాగుణమునందే పరమపురుషున కెక్కువ ప్రేమ. మహాలక్ష్మియు హృద్యయే. అనగా "అహల

హిల్లేన్ ఇత్తైయు మెన్టు" అనునట్లు ఒక క్షణకాలమును శ్రీనివాసుని వదలి యుండజాలక వాని వక్షఃస్థలములోనే వసించునని భావము. సర్వావతారములలోను దయయే సహాయముగా నుండునది. దయచేతనేగదా అవతరించుట! మహాలక్ష్మియు "రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని" అనునట్లు సమస్తావతారములలోను సహధర్మచారిణిగా కూడనే అవతరించుచున్నది. దయ సర్వావద్యములను (దోషములను) పోగొట్టునది. లక్ష్మియు నెట్టిదోషములకు నాస్పదముగానిది. అజ్ఞాతనిగ్రహ. దయకు క్షమాదిగుణములు సేవచేయుచున్నవి. అనగా సహాయభూతములని భావము. లక్ష్మికిని క్షమయనబడు భూదేవ్యాది మహిషులు సేవచేయుచున్నారు. మఱియు ప్రథమదశకములో వివరించియుండు రీతిగ నీ ప్రపంచసృష్టికి దయయే కారణము. అట్లే లక్ష్మియు భువనజనని, ప్రపంచమాత. దయ సర్వజనులకును వారు వారు కోరిన భోగము, మోక్షమనను పురుషార్థముల నిచ్చుచున్నది. లక్ష్మియు,

> 'శ్రేయో నహ్యరవిందలోచన మనఃకాన్తా ప్రసాదాదృతే
> సంసృత్యక్షరవైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్' ॥

అను సంప్రదాయప్రకారము సమస్తపురుషార్థములనిచ్చునది. అనేకవిధముల లక్ష్మిగుణములను గల్గిన దయాదేవి తమోగుణసంబంధములేని పరమపదములో స్వేచ్ఛచేతనే నిత్యమైన మూర్తిని ధరించుచున్నది. అనగా; దయయే ఒక మూర్తిని స్వీకరించినట్లు మహాలక్ష్మి పరమపదములో ప్రకాశించుచున్నదని తాత్పర్యము.

ఈ శ్లోకములో విధేయమగు చతుర్థపాదమును, తమోగుణము తలయెత్తని సాత్వికాధికారివిషయములో ఈ దయాదేవి పైపై తనకార్యములనుచేసి పూర్ణముగా నభివ్యక్తమగుచున్నదనియు, మరియు పరమపదములో దయయొక్క అభివ్యక్తి నిత్యముగా నున్నది అనగా ప్రకృతిమండలములో జీవుల కర్మములు ప్రతిబంధకములుగా నున్నందున దయ ప్రతిరోధములేక తన పూర్ణస్వరూపమును ప్రకాశపరచుటకు వీలుగాకయున్నది. పరమపదములో అట్టి ప్రతిబంధకము లేనందున నిత్యముగా నిరాటంకముగా ప్రకాశించుచున్నదనియు ప్రాచీనులు వ్యాఖ్యానించిరి. ఇచట వాస్తవమైన విధేయమును పరిశీలించవలయును.

శ్లో॥ స్వయముదయినస్సిద్ధాద్యా విష్కృతాశ్చ శుభాలయాః
వివిధవిభావవ్యూహావాసాః పరం చ పదం విభోః ।
వృషగిరిముఖేష్వేతేష్విచ్ఛావధి ప్రతిలబ్ధయే
దృఢవినిహితా నిశ్శ్రేణిస్త్వం దయే! నిజపర్వభిః ॥ 73

అర్థ :— హే దయే = ఓ దయాదేవీ ; స్వయముదయినః = స్వయం వ్యక్తమైన దివ్యమంగళవిగ్రహములను గలిగినవియు ; సిద్ధాద్యావిష్కృతాశ్చ = సిద్ధులు, దేవతలు మొదలగువారిచే ప్రకాశపరచబడిన విగ్రహములను గలిగినవియు ; వివిధవిభవవ్యూహావాసాః = అనేకవిధములైన విభవములకు, వ్యూహములకు వాసస్థానములును ; విభోః = ప్రభువైన పరమపురుషుని యొక్క ; పరం పదం చ = పరమపదమనబడు స్థానమునగు ; శుభాలయాః = ఏ శుభాలయములు గలవో ; వృషగిరిముఖేష్వేతేషు = వేంకటాద్రి మొదలగు నిట్టి స్థానములలో ; ఇచ్ఛావధి ప్రతిలబ్ధయే = తమ ఇష్టపూర్తిని పొందుట కొఱకు ; త్వం = నీవు ; నిజపర్వభిః = నీ సొంత పర్వ భేదములచే ( గెణుపులచే ) ; దృఢవినిహితా = గట్టిగా నిర్మింపబడిన ; నిశ్శ్రేణిః = నిచ్చెనగా ; భవసి = అగుచున్నావు.

అవతా॥ గత శ్లోకద్వయముచే చెప్పబడిన సర్వలోకహితైషిత్వమను దయాస్వరూపమును విశదీకరించుచు క్రిందిశ్లోకములో చెప్పిన సర్వఫలప్రదత్వమను గుణము నిచట సమీచీనదృష్టాంతముచే స్పష్టీకరించుచున్నారు.

తా॥ ఇచట దయనొక దృఢమైన నిచ్చెనగా చిత్రించుచున్నారు. నిచ్చెన క్రిందనుండువారిని పైకెక్కించును. పైనుండువారిని క్రిందికి దింపును. ఇట్లు చేయుటకీ నిచ్చెన దృఢమైన పలుపర్వములచే నిర్మింపబడి యుండవలయును. దయాప్రక్రియయు నిట్టిదే. పరమపురుషుని కనేక వాసస్థలములు గలవు. స్వయం వ్యక్తములగు కొన్ని దివ్యదేశములు గలవు. ఇచట భగవంతుడు స్వయముగనే ఆశ్రితసంరక్షణముకొరకు కావిర్భవించుచున్నాడు. ఇటులనే సిద్ధులు, ఋషులు, దేవతలు అను నట్టి వారి ప్రార్థనల ననుసరించి యావిర్భవించు స్థలములును అనేకములు గలవు. మఱియు క్షీరాబ్ధినాధుడు, కేశవాదులు మొదలగు వ్యూహావతారములయొక్క స్థలములును గలవు. ఇటులనే రామకృష్ణాది విభవావతారములును పలుచోట్ల నున్నవి. ఇవి యన్నింటికిని శ్రేష్ఠమైన పరమపదమును,

పరవాసుదేవుని స్థానమును గలదు. వీనిలో స్వయంవ్యక్తభగవదావిర్భావము గలది వేంకటాద్రి. ఇటువంటి వేంకటాద్రి మొదలగు స్థలములో నుండు నా యా మూర్తులను ఆయా జనము లుపాసించి తమ తమ యిష్టములను పూర్తి చేసికొనుచున్నారు. ఇంద్రుడు మొదలగువారి నారాధించి ఫలము నొందుటయు భగవంతునిదయచేతనే అని శాస్త్రములలో స్పష్టము. ఇట్లు ఈ ప్రకృతిలోకము మొదలు, పరమపదమువరకు నచట నటట భగవంతుని ప్రతిష్ఠించి వారు వారు కోరిన ఫలమును పొందులాగు చేయునది భగవద్దయాదేవియే. ఏవం చ పరమపదములోనుండు భగవానుని, సర్వులను సేవించి యుజ్జీవింపనట్లు అర్చా రూపపర్యంతము క్రిందికి దింపుకొనివచ్చుటయు, ఇచటనుండువారిని వారు వారు కోరు ఫలములనిచ్చి క్రమేణ పైకెక్కించుకొని పోవుటయు దయాకృత్యములే యని యేర్పడుచున్నవి. కావున ఈ దయాదేవి నొక నిచ్చెనగా భావించుట కడ్డు లేదుగదా! ఈ దయానిశ్శ్రేణియొక్క పర్వములు భగవంతునియొక్క పరవ్యూ హాది రూపములుగాను, పై శ్లోకములలో చెప్పబోవురీతిగా యాదృచ్ఛికాది సుకృతమూలముగా ఏర్పడు దయాదేవీకటాక్షపాతము మొదలగు ననుకూల పరంపరయుగాను ఉండును.

ఇచట "ఇచ్ఛావధి ప్రతిలబ్ధయే" అను పదములో జీవేచ్ఛవలె పరమపురుషేచ్ఛయు వివక్షితము. వానికిని దిగివచ్చి యనుగ్రహించినపుడే ఇచ్ఛాపూర్తి గలుగుచున్నది. కనుక పరమపురుషునకును, జీవులకును, దిగుటకును ఎక్కుటకు ననుకూలముగా ఈ దయానిచ్చెన యమరియున్నది. ఇచట హార్దావతారమును "పరం చ పదం" అనుచోట నుండు చకారముచే వివక్షించుచున్నారని ప్రాచీనుల వ్యాఖ్యానము.

భగవంతునియొక్క సర్వవిధావతారములును దయచే నేర్పడుచున్నవి. జీవుయ ఆయా యవతారము నుపాసించి ఫలము నొందుటయు ఆదయాదేవి చేతనే అనునది యిచట ముఖ్యతాత్పర్యము.

శ్లో॥ హితమితి జగదృష్ట్యా క్లృప్తైరక్లృప్తఫలాంతరైః
అమతివిహితై రన్యైర్ధర్మాయితైశ్చ యదృచ్ఛయా।
పరిణతబహుచ్ఛద్మా పద్మాసహాయదయే! స్వయం
ప్రదిశసి నిజాభిప్రేతం నః ప్రశామ్యదపత్రపా॥ 74

అర్థ :— హే పద్మాసహాయ దయే ! = లక్ష్మీసహాయుడగు నో శ్రీనివాసుని దయాదేవీ ! జగద్రష్ట్యా = లోకసృష్టిచే ; హితమితి = హితమని : క్లృప్తైః = కల్పించుకొనబడిన ప్రాసంగికసుకృతములచేతను ; అక్లృప్తఫలాంతరైః=తాను చేయు సుకృతకర్మముచే కోరినఫలమునకంటె వేఱుఫలములో ఉద్దేశములేని - ఆనుషంగికసుకృతములచేతను ; అమతి విహితైః=బుద్ధిపూర్వములుకాని అజ్ఞాత సుకృతములచేతను ; యదృచ్ఛయా ధర్మాయితైః = స్వయముగనే ధర్మముగా నగుచున్న యాదృచ్ఛిక సుకృతములచేతను ; అన్యైశ్చ = వీనికంటె వేఱైన సామాన్యబుద్ధిపూర్వక సుకృతములచేతను ; పరిణత బహుచ్ఛద్మా = పరిపక్వమైన అనేక వ్యాజములనుగల ; (త్వం = నీవు) ; ప్రశామ్యదపత్రపా సతీ = శమించిన లజ్జనుగలదాని వగుచు ; స్వయం = స్వయముగానే ; నిజాభిప్రేతం = తనకు ( నీకు ) అభిమతమైన పురుషార్థమును ; నః = మాకు ప్రదిశసి = ఇచ్చుచున్నావు.

అవతా ॥ క్రింది శ్లోకమునందు దయనొక నిచ్చెనగా రూపించి సర్వఫలమును శ్రీనివాసదయచేతనే లభింపబడుచున్నదని సాధించిరి. ఈ శ్లోకముమొదలీ దశకాంత్యము వరకు నిచ్చెన యెట్లు క్రమేణ మెట్లుమెట్లుగా జనముల నెక్కించునో అట్లే ఈ దయాదేవి చేతనులను మెట్లుమెట్లుగ నెక్కించు ప్రక్రియ వర్ణింపబడుచున్నది. దానిలో మొదట ప్రపత్త్యుద్యుపాయాన్వయమునకు పూర్వము దయాదేవి చేయు నుపకారప్రకారమును విశదీకరించి పిదప ఆమెచే నేర్పడు ఉపాయసంబంధమును (ప్రపత్త్యన్వయమును), తదనంతరము ప్రపత్త్యుత్తరకాలములో నేర్పడు ఫలములను, మోక్షప్రాప్తియును చెప్పి కడపట భక్తియోగము చేయువారి విషయములోను ఈ దయాదేవి ప్రదర్శించు ననుగ్రహప్రకారమును వర్ణించి ఈ దశకమును ముగించుచున్నారు. దానియందు దీ శ్లోకములో ఆచార్యాశ్రయణమునకు గూడ ముందు ప్రప్రథమమున దయాదేవి చేయు నుపకారము వర్ణింపబడుచున్నది.

తా॥ చేతనులయందు కొన్నిసమయములలో ఏర్పడు ప్రాసంగికము, ఆనుషంగికము, అబుద్ధిపూర్వము, యాదృచ్ఛికము, సామాన్యబుద్ధిపూర్వకమునను నట్టి సుకృతములను, తాను రక్షించుటకొరకు వ్యాజముగా చేసికొని దయాదేవి ఈ చేతనులను రక్షించుచున్నది. రక్షించునపుడు తన కభిమతమైన పురుషార్థమునిచ్చి రక్షించును. అనగా దయాదేవికభిమతమైన పురుషార్థము

నిత్యానందరూపమగు మోక్షమే. దానినిచ్చినపుడే పూర్ణరక్షణ మొనరించిన ట్లగును. ఆ మోక్షపురుషార్థము నామె యొసంగురీతిని పైశ్లోకములో చక్కగ నిరూపింపనున్నారు. ఇట్లు రక్షించునపుడు ఆమె కింతవరకుండిన సిగ్గు తొలగి పోయినదట. "ఈచేతను నింతవరకు రక్షించలేదే. దానికొక వ్యాజము దొరక లేదే! మనముండియు నేమి ప్రయోజనము?" అని సిగ్గుపడిన దయాదేవి ముందు చెప్పినప్రకార మేదో యొక సుకృతమును వ్యాజముగా చేసికొని విగత లజ్జయై రక్షించుచున్నది. ఇదియు గాక బహుకాలముగా దేహాత్మభ్రమము చేతను స్వతంత్రాత్మభ్రమముచేతను నిండియున్న ఈ జీవుడు దయ తన్ను రక్షింప వచ్చునపుడు "నిన్నెవరు పిలిచినది? పిలువనిచోటుకు వచ్చుటకు నీకు సిగ్గులేదా?" అని యడిగినయెడల, "సుకృతము చేయువారిని రక్షించుట యనునది నా కర్తవ్యము. సుకృతముచేయుట యనునదే నన్ను పిలుచుట. కావున నీవు (క్రిందిచెప్పినరీతిలో) కొన్నిసుకృతములను చేసియుండుట వలన నిన్ను రక్షించుట నాకర్తవ్యమగుటచే కర్తవ్యమననుష్ఠించుటలో సిగ్గుపడదగినదేమున్నది?" అని సమాధానము చెప్పి విగతలజ్జయై వీనిని రక్షించుచున్నదనియు నిచట వివరింపవచ్చును.

ప్రాసంగిక సుకృతమనగా — భగవన్నామముల నుచ్చరించిన యెడల పుణ్యము గలదని యేర్పడియున్నది. తమ పుత్రాదులయొక్క "నారాయణుడు, గోవిందుడు" మొదలగు పేర్ల నుచ్చరించునపుడు, "ఇది భగవన్నామము దీని నుచ్చరించి నేను పుణ్యము సంపాదించుకోగలను" అను తలంపు లేకపోయినను ఆ నామప్రభావము వలన నేర్పడు సుకృతము మొదలైనవి.

ఆనుషంగికమనగా — ముందు పోవుచున్న ఒక భాగవతుని దొంగలు చుట్టుకొని హింసించుసమయమున స్వకార్యమునుద్దేశించి వెనుక వచ్చుచున్న ఒక మనిషిని చూచిన ఆ దొంగలు ఈ భాగవతుని కాపాడుటకే వచ్చుచున్న భటుడే వీడని భ్రమించి ఆ భాగవతుని వీడి పరుగెత్తుచున్నారు. ముందువెళ్ళిన భాగవతుని దొంగలు పట్టుకొనినది, వదలినదేమియు వెనుకనేగువానికి తెలియదు. ఐనను వీడే (వెనుకవచ్చువాడు) ఆ భాగవతునికి హింసలేకుండుటకు కారణమైనాడు గనుక ఆరీతిలో సుకృతము వీనికి చేరుచున్నది. ఇట్టివి యానుషంగికములు.

అబుద్ధిపూర్వ మనగా — స్వప్రయత్నము లేకయే దైవవశాత్తు గంగా మరణము సంభవించుట మొదలగునవి.

యాదృచ్ఛిక సుకృతమనగా — మత్స్యగ్రాహి యొకడు అర్ధోదయము మొదలగు పుణ్యకాలములయందు సముద్రము మొదలగు పుణ్యతీర్థములలో మత్స్యగ్రహణమునకుగానై మునుగునపుడు వానికి పుణ్యముసంపాదించవలయు నను నాశ లేకపోయినను ఆ కాలముయొక్కయు, పుణ్యతీర్థముయొక్కయు ప్రభావముచే నేర్పడు సుకృతము మొదలగునవి.

సామాన్య బుద్ధిమూలక సుకృతమనగా—" వీడొక బ్రాహ్మణుడు " అను సామాన్యబుద్ధిచే ఒక బ్రాహ్మణు నారాధించినపుడు ఆ బ్రాహ్మణుడు చాలయు నుత్కృష్టశ్రోత్రియుడుగాను, సర్వశాస్త్రవేత్తయు, ఆత్మగుణపూర్తిగలిగినవాడును మంచి యనుష్ఠాతయును, సత్కులప్రసూతుడుగా నుండినయెడల నారాధకునికి ఈ యాకారములు తెలియకపోయినను సామాన్యబ్రాహ్మణబుద్ధ్యా వాడుచేసిన ఆరాధనమును ఈ పాత్రవైలక్షణ్యముచే నుత్కృష్టారాధనమై వీనికి విశేష సుకృతమును గలుగజేయును. ఇటువంటివి సామాన్యబుద్ధిమూల సుకృతములు.

ఈ సుకృతములకు వేఱు కొన్ని యుదాహరణములను వ్యాఖ్యాతలు చెప్పుదురు. వీనిలో మూడింటికి పరస్పరభేదమును వేఱు విశేషమును శ్రీవచన భూషణ వ్యాఖ్యాన అరుంపదములో చూడనగును. ఈ సుకృతములను మన వేదాంతదేశికులు పరమపదసోపాన మను గ్రంథములోను చెప్పియున్నారు.

ఇచట ప్రతిపదార్థమును తాత్పర్యార్థమును ప్రాచీనులవ్యాఖ్యానము ననుస రించి యింతవరకు వ్రాయబడినవి.

వాస్తవములో, "హితమితి జగదృష్ట్యాక్లృప్తై" అనుటచే సామాన్యబుద్ధి మూలసుకృతమును, "అక్లృప్తఫలాంతరైః" అనుటచే ప్రాసంగికానుషంగిక ములను, "అమతి విహితైః" అనుటచే అబుద్ధిపూర్వమును, "అన్యైశ్చ ధర్మా హితైః యదృచ్ఛయా" అనుటచే యాదృచ్ఛికమును నాచార్యులు నిర్దేశించు చున్నారనుట యుక్తమని తోచెడిని.

ఇచ్చట సామాన్యబుద్ధిమూలమునందు బుద్ధిపూర్వమైన ప్రవృత్తికలదు. ప్రాసంగికములో ఒక ప్రయత్నముచేతనే తనకుద్దేశ్యమగు నొక ఫలమునకంటె మేలైన కొన్ని ఫలములు సిద్ధించుటయు, ఆనుషంగికమునందు వీనికుద్దేశ్యము లేనప్పుడే ఫలము సిద్ధించుటయు, అబుద్ధిపూర్వములో వేరొకరిప్రయత్నముచేతనే వీనికి ఫలము సిద్ధించుటయు, యాదృచ్ఛికములో ఎదురుచూడనపు డకస్మాత్తుగ సుకృతము సంభవించుటయు విశేషాంశములు. ఈ ఆకారములనుబట్టి వీనికి పరస్పరభేదమును నిరూపింపనగును.

వీనికి క్రమేణ ఉదాహరణములు :— సామాన్యబుద్ధిమూలమునకు పూర్వోక్తమే ఉదాహరణము కావచ్చును. ప్రాసంగికమునకు ; తన కుద్దేశ్యమైన ఒక భాగవతునికి వీజనము నొనరించునపుడు మఱొక భాగవతుడచటికి వచ్చినయెడల ప్రథమభాగవతవీజనకైంకర్యముచేతనే ద్వితీయభాగవతునికి గూడ వీజనఫలము సిద్ధించుటచే ఇద్దరుభాగవతులకు కైంకర్యము చేసినయెడల నేర్పడు సుకృతము వీనికి కల్గుచున్నదనుట యుదాహరణము కావచ్చును. ఆనుషంగికమునకు పశువులను తరుముకొని పోవునపుడు ఆ పశువు గుడికి ప్రదక్షిణముగా వెళ్లినపుడు దానిననుసరించిపోవు వీనికిని ప్రదక్షిణఫలము సిద్ధించుట యుదాహరణము. అబుద్ధి పూర్వమునకు ;— ఒకడు తనకు తెలియకనే త్రోవలో దారపోసికొనిన డబ్బును వేఱొకడు దీసికొనిపోయి భగవంతునికి మాలా సమర్పణాది కైంకర్యము చేసినయెడల డబ్బు దారపోసికొనిన వానికేర్పడు సుకృతముదాహరణము. యాదృచ్ఛికమునకు, ఏతపుగెడగొన గోరి వచ్చిన వానికినచింతితముగ భగవద్దర్శనము సంభవించి తద్ద్వారా గలుగు సుకృతముదాహరణము. ఈ యాదృచ్ఛికములో సుకృతము సంభవించుననువిషయము పూర్వనిశ్చితముగాదు. ఆనుషంగికములో పశువు ప్రదక్షిణముగా పోవునపుడు దానిని తరుముచు వీడు దానివెనుకనేగినయెడల ప్రదక్షిణపుణ్యము నిశ్చయముగా కలుగుననుట యిచట భేదకాకారము గావచ్చును.

శ్లో॥ అతివిధిశివైరైశ్వర్యాత్మానుభూతిరసైర్జనాన్
అహృదయమిహోపచ్ఛంద్యైషామసంగదశార్థినీ ।
తృషితజనతాతీర్థస్నానక్రమక్షపితైనసాం
వితరసి దయే! వీతాతంకా వృషాద్రిపతేః పదమ్ ॥ 75

అర్థ :— హే దయే = ఓ దయాదేవీ, అతివిధిశివైః = బ్రహ్మరుద్రాదుల నతిక్రమించియున్న. (అనగా వారి యానందమునకంటెనుత్కృష్టమైన), ఐశ్వర్యాత్మానుభూతిరసైః=ఐశ్వర్యము, కైవల్యము వీనియొక్క అనుభవానందములచే, జనాన్ = జనులను, ఏషాం = ఈ జనులకు, ఇహ = ఈ ఐశ్వర కైవల్యములలో, అసంగదశార్థినీ = ఆశలేక పోవుదశను కలుగజేయ గోరినదానివై, అహృదయం యథా తథా = తనకభిప్రాయము లేకయే, ఉపచ్ఛంద్య = ఆ ఐశ్వర్యాదిఫలములనిచ్చి వారిని సమాధానపరచి, తృషితజనతాతీర్థస్నానక్రమ

క్షపితైనసాం = దప్పిగొనిన వానియొక్క పుణ్యతీర్థస్నాన న్యాయముచే పోగొట్ట బడిన పాపముగల. (ఏషాం = ఈ జనులకు.) వీతాతంకాసతీ = విగతభయ లజ్జాదులుగల దానివై. వృషాద్రిపతేః = వేంకటాద్రీశుడగు శ్రీనివాసునియొక్క, పదం = స్థానమును (మోక్షమును), వితరసి = ఇచ్చుచున్నావు.

అవతా॥ క్రింది శ్లోకమునందు చెప్పిన "ప్రకటితబహుచ్ఛద్మా. నిజాభిప్రేతం ప్రదిశసి" — అనేకవ్యాజములనాధారముగావించి తనకభిమతమైన పురుషార్థమునొసంగుచున్నావను విషయమును. నిచ్చెన క్రమేణ మెట్టు మెట్టుగా నెక్కించుచున్నదని తత్పూర్వ శ్లోకములో చెప్పిన విషయమును ఈ శ్లోకములో విశదీకరించుచున్నారు.

తా॥ ఆతపాదులచే తాపముచెందినవాడు తాపాపనోదనార్థమై పుణ్యతీర్థమునందు స్నానము చేయునపుడు ఆ తీర్థప్రభావమువలన వాని పాపములును వదలిపోవుచున్నవి. అటులనే శ్రీనివాసుని దయనవలంబించి ఐశ్వర్యం, కైవల్యం మొదలగు పురుషార్థములను పొందునపుడు ఆ భగవత్సేవ, వీనికి క్రమేణ ఆ యైశ్వర్యాదినశ్వరపురుషార్థములలో రుచిని పోగొట్టి మోక్షపురుషార్థమునందాశను కలుగజేసి తదనుగుణముగా తదుపాయాన్వయమును గావించి మోక్షమును గూడ నొసంగుచున్నదను శాస్త్రార్థమిచట వివక్షితము.

దయాదేవికి చేతనుని పూర్ణసంరక్షణములోనే, అనగా మోక్షప్రదానములోనే ముఖ్యోద్దేశ్యము. ఐనను బహుకాలముగా సంసారములో సంచరించుచున్నవారికి వారు కోరిన ఫలములనే (ఐశ్వర్య కైవల్యాదులను) ఇచ్చి వారి నుపచ్ఛందనము చేసి, అనగా వారి యిష్టమును (తనకిష్టములేకపోయినను) అనుసరించి పిదప వారికే ఈ నశ్వరపురుషార్థములలోనుండు దోషములనెఱుకపరచి క్రమశః మోక్షేచ్ఛను, ఉపాయాన్వయమును, ఫలమును నిచ్చుచున్నది. ఇట్లు పాయాన్వయపూర్వముగా ఫలమునొసంగిన యెడలనే ఆమెకు పక్షపాతాది దోషములకవకాశమేర్పడదు. దీనినే "వీతాతంకా" అను పదముచే సూచించుచున్నారు. సాక్షాద్భగవద్దయచే ప్రదీయమానఫలములు గనుకనైశ్వర్యాదులు గూడ బ్రహ్మాండసృష్టికర్తయొక్కయు, తత్సంహారకర్తయగు రుద్రునియొక్కయు నైశ్వర్యాదులను మించి యుండునని "అతివిధిశివైః" అను పదముచే తెలియజేయుచున్నారు.

ఇక్కడ కైవల్యమను ఆత్మానుభవరసము బ్రహ్మరుద్రాద్యానందముల కంటె నుత్కృష్టముగానుండు ననుటలో సందియము లేదు. ఐశ్వర్యము గూడ తదానందమునకంటె నుత్కృష్టమని చెప్పియుండుట ప్రమాణసమ్మతమా ? అను శంక సంభవింపవచ్చును. దీనికి సమాధానము. బ్రహ్మరుద్రా ద్యానందములోను దుఃఖసంబంధము గలదు. అప్పుడప్పుడు వారు పడిన యవస్థలు పురాణములో ప్రసిద్ధములు. ఇట్లుకాక యుత్కటపాపాంశసంబంధములేక సుకృతాంశ పూరితుడైన యొక భగవదనుగ్రహవిషయభూతుడగునధికారికి బ్రహ్మరుద్రాదులవలె దుఃఖసంబంధములేక నిరంతరసుఖరూపమగు నైశ్వర్యమే కలుగవచ్చును. కావున వీని యనుభవమును బ్రహ్మరుద్రాద్యనుభవమునకంటె నుత్కృష్టానుభవమని చెప్పుటలో నెట్టి ప్రమాణవిరోధమును లేదు.

శ్లో॥ వృషగిరిసుధాసింధౌ జన్తుర్దయే ! నిహితస్త్వయా
భవభయపరీతాపచ్ఛిత్త్యై భజన్నఘమర్షణమ్ ।
ముషితకలుషో ముక్తేరగ్రేసరై రభిపూర్యతే
స్వయముపనతైః స్వాత్మానందప్రభృత్యనుబంధిభిః ॥ 92

అర్థ:— హే దయే = ఓ దయాదేవీ!, త్వయా=నీచేత, భవభయపరీతాపచ్ఛిత్త్యై = సంసారములో కలుగు భయము, తాపత్రయము వీనియొక్క నివృత్తి కొఱకు, వృషగిరిసుధాసింధౌ = వేంకటాద్రియందుండునమృతసముద్రమునందు (శ్రీనివాసునియందు). నిహితః = చేర్చబడిన, జన్తుః = ప్రాణి, భవభయపరీతాపచ్ఛిత్త్యై = సంసారతాపత్రయనివృత్తికొఱకు. అఘమర్షణం = సర్వపాపప్రాయశ్చిత్తరూపమగు ప్రపత్తిని (ధర్మశాస్త్రోక్తాఘమర్షణస్నానమును). భజన్ = పొందినవాడై (అనుష్ఠించినవాడై). ముషితకలుషః = పోగొట్టబడిన పాపము గలిగినవాడై, స్వయముపనతైః = తానుగానే సంభవింపదగిన, ముక్తేః = మోక్షమునకు. అగ్రేసరైః = అగ్రయాయులగు, స్వాత్మానంద ప్రభృత్యనుబంధిభిః = స్వాత్మానందము మొదలగు భోగములచే, అభిపూర్యతే = పూరింపబడుచున్నాడు.

అవతా॥ క్రింది శ్లోకమునందు దయాదేవి యైశ్వర్యకైవల్యాదిపురుషార్థములనిచ్చి తద్ద్వారా శ్రీనివాససంబంధము కలుగంజేసి క్రమేణ మోక్షమువిచ్చుచున్నదని వర్ణించిరి. ఇట్లు నశ్వరపురుషార్థములకు గాను భగవంతునాశ్రయించిన

వారికి ప్రపత్తిరూపమైన మోక్షోపాయాన్వయమేర్పడుటను, ఉపాయానుష్ఠానానంతరమువచ్చు ఫలములను ఈ శ్లోకములోను అనంతర శ్లోకములోను వర్ణించుచున్నారు.

తా॥ ప్రపత్తియను నుపాయము అఘమర్షణమని చెప్పబడుచున్నది. ఇది సర్వపాపములను తొలగించు ప్రాయశ్చిత్తము. దీనిని ప్రాణులకు కలుగంజేయ గోరిన దయాదేవి ప్రథమతః వేంకటాద్రియందుండు అమృతసముద్రమువంటి శ్రీనివాసుని పొందజేయుచున్నది. ఫలాంతరోద్దేశముతో శ్రీనివాసుని పొందిన వానికికూడ ఆ వస్తుప్రభావమువలన మోక్షతదుపాయములలో ఉత్కంఠేచ్ఛ జనించుచున్నది. అట్లు ఉపాయాన్వయమేర్పడినపిదప పరమపదమను మోక్షమునకు పోవుటకుముందు ఈ ప్రపంచములోనుండు కాలమువరకు పరమపదమున నెట్టి భోగములననుభవింపనగునో, అట్టి పరమాత్మానుభవమును (తానుగానే వచ్చుచున్న) పూర్ణముగననుభవింపవచ్చును. అనగా, సర్వేశ్వరునియందు ప్రపత్తి చేసినపిదప నీ ప్రపన్నుడు తానుచేయు నిత్యనైమిత్తికాదిసర్వకర్మములను భగవత్ప్రీతినుద్దేశించియే చేయుచున్నాడు. కావున భగవానుడును, తత్కల్యాణగుణములును సర్వదా యితని బుద్ధి యందు ప్రకాశించుచునే యుండు గావున పరమాత్మానుభవమితనికి పరిపూర్ణముగ సంభవించుచున్నది. ఇంతయు దయాకార్యమే.

ఇచట భగవంతుని యమృతసముద్రముగా రూపించుటచే నిదాఘకాలమునందు ఆతపతప్తుడతిశీతలామృతోదధియందవగాహనమాచరించినచో వానికెట్లు మహానందము కలుగునో, అట్లే ఈ బ్రహ్మహ్రదావగాహనము చేసిన వానికి బాహ్యాభ్యంతరాది సర్వతాపములును తొలగుననుట సూచితమగుచున్నది.

ధర్మశాస్త్రోక్తమగు నఘమర్షణస్నానమువంటిది బ్రహ్మహ్రదావగాహనము. అనగా ప్రపత్తి యనునది సర్వపాపప్రాయశ్చిత్తరూపము. ఇది యీ స్తోత్రమునందే పలుమారులు చెప్పబడియున్నది.

ఇచట "స్వాత్మానందప్రభృత్యనుబంధిభిః" అను పదములో "స్వాత్మానంద" అను భాగమునకు తనకాత్మయైన పరమపురుషునియొక్క ఆనందానుభవమని వ్యాఖ్యానించితిమి. పరమాత్మననుసంధించునపుడు తనకు "ఆత్మ" అను నాకారములో అనుసంధింపవలయునను విషయమునెఱుకపరచుటకొఱకై "స్వాత్మానంద" అను నిర్దేశము గావింపబడినది. ఇట్లుగాక "స్వాత్మ" శబ్ద

ముచే జీవాత్మను వివక్షించి "తదానంద" శబ్దముచే జీవస్వరూపానందమును, "ప్రభృతి" శబ్దముచే పూర్వోక్తభగవదనుభవమును చెప్పబడుచున్నదని కొందరు వ్యాఖ్యానింతురు. అప్పుడు జీవాత్మానుభవమనగా భగవచ్ఛేషముగాను, భగవద్దాసుడుగాను జీవాత్మననుభవించుటయే. ప్రతికర్మానుష్ఠానమునందును తనను భగవచ్ఛేషుడుగా తలంచియే యనుష్ఠించుటవలన అప్పుడు సంభవించెడి యానందము చాలయునుత్కృష్టమని భావము.

ప్రపత్తి మోక్షార్థముగా చేయంబడినను మోక్షమునకేగుటకు ముందు ఇహ లోకములో ఇట్టి స్వాత్మానుభవమును, భగవదనుభవమును ఆనుషంగికముగా స్వయముగనే దయాదేవి యనుగ్రహముచేత సంభవించుచున్నదనుట "స్వయ ముపనతైః" అను పదమునకు భావము.

శ్లో॥ అనితరజుషామంతర్మాలేఽప్యపాయపరిప్లవే
కృతవిదనఘా విచ్ఛిద్యైషాం కృపే! యమవశ్యతామ్।
ప్రపదనఫలప్రత్యాదేశప్రసంగవివర్జితం
ప్రతివిధిముపాధత్సే సార్థం వృషాద్రిహితైషిణా॥ 77

అర్థ:— హే కృపే = ఓ దయాదేవీ, అనితరజుషాం = దేవతాంతర ములను, ఫలాంతరముల నవలంబించని ప్రపన్నులకు, అంతర్మాలే = బుద్ధి పూర్వమైన, అపాయపరిప్లవే = అపరాధమను కీడు, సంభవత్యపి = సంభవించి నను, కృతవిత్ = చేసిన ప్రపత్తిని తలంచి కృతజ్ఞవుగాను, అనఘా = నిగ్ర హేచ్ఛ యను దోషములేనిదానివిగానున్న, (త్వం = నీవు), ఏషాం = ఈ ప్రపన్నులకు యమవశ్యతాం = యముని వాతబడుట యను మహాపత్తును, విచ్ఛిద్య = తొలగించి, వృషాద్రిహితైషిణా సార్థం = వేంకటాద్రియందుండు హితమునే గోరు శ్రీనివాసునితో కూడుకొని, ప్రపదనఫలప్రత్యాదేశప్రసంగ వివర్జితం = ప్రపత్తికి ఫలముగా సంకల్పింపబడిన మోక్షమునకెట్టి ప్రతిరోధమున కవకాశము లేనట్లుగ, ప్రతివిధిం = పరిహారమును (పునః ప్రపదనము లఘుదండ నము మొదలగువానిని), ఉపాధత్సే = ఏర్పాటుచేయుచున్నావు.

అవతా॥ క్రింది శ్లోకమునందు ప్రపత్తియనునుపాయములో సంబంధ మును, తదనంతరము నిర్యాణకాలపర్యంతమైన యుత్తరకాలములో ఈ ప్రపన్నునికేర్పడు పరమాత్మానుభవానందమనునిష్టప్రాప్తిరూపమైన ఫలమును

వర్ణింపబడినవి. ఈ శ్లోకములో ఆ యుత్తరకాలములోను, నిర్యాణకాలము లోను సంభవింపదగిన అనిష్టముయొక్క పరిహారరూపమైన ఫలము వర్ణింప బడుచున్నది.

తా॥ ప్రపన్నుడు ప్రపత్తిచేయునపుడు "ఈశ్వరునకనుకూలుడుగనే యుండగలను. ప్రాతికూల్యము చేయుటలేదు" అని సంకల్పపూర్వముగా ప్రపత్తిననుష్ఠించుటవలననుత్తరకాలములో (ప్రపత్తి చేసినపిదప) నతనికి బుద్ధిపూర్వకములగునపరాధములు ప్రాయశః సంభవింపవు. (ఇచట అప రాధము లనగా భగవదాజ్ఞారూపములగు శాస్త్రములనుల్లంఘించుటయే). ఒక వేళ ప్రారబ్ధకర్మ ప్రాబల్యమువలన బుద్ధిపూర్వమైన యపరాధములు సంభవించి నను నీప్రపన్నునికి మోక్షప్రాప్తికెట్టి విరోధమును సంభవింపదను శాస్త్రార్థము నాచార్యులిచట ప్రకటీకరించుచున్నారు. అబుద్ధిపూర్వములైన (తనకు తెలియ కనే) అపరాధములేర్పడినయెడలనాదోషము ప్రపన్నునికి ప్రపత్తియను బ్రహ్మవిద్యయొక్క మాహాత్మ్యముచేత నంటుటలేదు. అట్లన నా పాపములకు ఫలమియ్య నీశ్వరుడు సంకల్పించుటలేదని భావము. ఇదే అబుద్ధిపూర్వమైన పాపమును ప్రపన్నేతరు డనుష్ఠించినయెడల (బ్రహ్మ విద్యాన్వయము లేనివాడు) ఆ దోషమునకుగూడనతనికి దండన కద్దు.

కొన్ని సమయములలో ప్రపన్నుడే బుద్ధిపూర్వమైన పాపమును చేసినప్ప టికిని ప్రపత్తిచేయు సమయమున వీడు కోరిన ప్రకారముగ వీనికిష్టమైన కాలములో మోక్షమిచ్చునట్లీశ్వరుడు సంకల్పించివేసినయెడల, ఇప్పుడు చేసిన యపరాధ మునకు వీడు కోరిన కాలమునకు మునుపే పునశ్శరణాగతి యను పరిహారమునో, లేక వాడు కఠిన ప్రకృతిగాయుండి పునశ్శరణాగతి ననుష్ఠించనియెడల పూర్వోక్త ప్రకారముగ రాజపుత్రన్యాయముచే లఘుదండనదానమను పరిహారమునో, ఈ దయాదేవి సర్వభూతహితైషియైన శ్రీనివాసునితో కలసి యాలోచించి సంవిధాన మును గావించి యితని నిర్యాణకాలములో యముడో, తద్భటులో వీనిని స్వాధీనపరచుకొని నరకానుభవమునియ్యకుండనుండునట్లు కాపాడి ముందు సంకల్పించిన మేఱకు తాను, ప్రపత్తి ఫలమైన మోక్షమునకు ఏరీతిలోను విఘాత మేర్పడనట్లు వీనికి మోక్షమునిచ్చియే తీరును.

"సకలా భాగవతాః యమవిషయం గచ్ఛంతి" యనిగదా ప్రమాణములు వాక్రుచ్చుచున్నవి. దీనిచే ప్రపత్త్యుత్తరకాలములో సంభవించు అనిష్టనివృత్తి

నిరూపితమగుచున్నది. ఈ శాస్త్రార్థమునే " ధీపూర్వోత్తరపాప్మనామజననాజ్ఞాతేఽపి తన్నిష్కృతేః, కాటిల్యే సతి శిక్షయాఽప్యనఘయన్ క్రోడీకరోతి ప్రభుః " అని " శ్రీ మద్రహస్యత్రయసారము " లో ఆచార్యులు స్పష్టముగా విశదీకరించి యున్నారు.

శ్లో॥ క్షణవిలయినాం శాస్త్రార్థానాం ఫలాయ నివేశితే
సురపితృగణే నిర్వేశాత్ప్రాగపి ప్రలయం గతే ।
అధిగతవృషక్ష్మాభృన్నాథామకాలవశంవదాం
ప్రతిభువమిహ వ్యాచఖ్యుస్త్వాం కృపే ! నిరుపప్లవామ్ ॥ 78

అర్థ :— హే కృపే=ఓ దయాదేవీ, క్షణవిలయినాం=స్వల్పకాలములో నశించుచున్న, శాస్త్రార్థానాం = శాస్త్రములలో విధింపబడు యాగము, దానము, హోమము మొదలగు పుణ్యకర్మములయొక్క, ఫలాయ = ఫలములనిచ్చుట కొఱకు, నివేశితే = నియమింపబడిన. సురపితృగణే = దేవపితృబృందము, నిర్వేశాత్ప్రాక్ = పుణ్యకర్మము చేసినవాడు తత్ఫలమ్ము ననుభవించుటకుముందే, ప్రలయంగతేఽపి = నశించిపోయినను, అకాలవశంవదాం=కాలమునకు లోబడనిదియు, (కాలముచే నాశములేక నిత్యముగానుండునదియు), నిరుపప్లవాం = ఎవరిచేనెట్టి యుపద్రవమును పొందనిదియు, అధిగతవృషక్ష్మాభృన్నాథాం = ఆశ్రయింపబడిన వేంకటాద్రీశుడగు శ్రీనివాసుని గలిగిన దానివియునగు. త్వాం = నిన్ను, ఇహ = ఈ విషయిములో (దేవపితృలకు బదులుగా చేసిన పుణ్యములకు ఫలమిచ్చు విషయములో,) ప్రతిభువం = బదులుదానివిగా (జామీనుగా), వ్యాచఖ్యుః = (పెద్దలు) చెప్పియున్నారు.

అవతా॥ ఈ శ్లోకము ప్రాసంగికమైనది. అనగా క్రింది శ్లోకమునందు మోక్షార్థమై ప్రవత్తి చేసినవాని విషయములో వానికి ఫలప్రాప్తికి మునుపు సంభవించు కొన్ని ప్రతిబంధకములను దయాదేవి పోగొట్టి క్లుప్తకాలములో ఫలమేర్పడులాగు చేయుచున్నదని వర్ణించితి. ఈ శ్లోకములో అట్లే స్వర్గాదిపురుషార్థములనుద్దేశించి యాగదానాదిపుణ్యకర్మములననుష్ఠించువారి విషయము లోను కొన్ని ప్రతిబంధకములు సంభవించినయెడల వానినిగూడ దయాదేవియే పోగొట్టి వారికాఫలములనందజేయుచున్నదని నిరూపించుచున్నారు.

తా॥ యాగము మొదలగు పుణ్యకర్మములను చేయువారికి ఫలమునొసంగుట కొఱకు సర్వేశ్వరుడు; ఇంద్రుడు మొదలగు దేవతలను. పితృలు మొదలగు వారినేర్పాటుచేసియున్నాడు. యాగము మొదలగు కర్మములే ఫలముల నిచ్చుననునది యంగీకరణీయము గాదు. కర్మములు క్షణములో నశించిపోవును గాన కాలాంతరభవములగు స్వర్గాదిఫలములకునవి కారణమగుటకు వీలుగాదుగదా! ఏతదర్థముగా మధ్య "నపూర్వ" మనునొకపదార్థము నొప్పుకొనుటలోను పలు దోషములున్నవి. కాన నా యా కర్మలలో ఉద్దేశ్యులగు నింద్రాది దేవతల యనుగ్రహముచేతనే ఫలమేర్పడుచున్నది. ఇది యిట్లుండగా ఆ దేవతలుగూడ పరమపురుషానుగ్రహముచేత నా యా పదవులలో గుర్తించిన కాలమువరకు నియమితులు గావున వారికిని నాశము కద్దు. స్వర్గమునుద్దేశించి యాగము చేసినవాడు తన కాలసమాప్త్యనంతరము ఆ ఫలమును పొందవలసిన సమయములో పూర్వోక్తేంద్రాది దేవతలకేర్పడిన కాలావధి తీరిపోయి వారు నశించినయెడల నా ఫలమునెవరియ్యగలరను సందేహమేర్పడునప్పుడు శాస్త్రజ్ఞులైన పెద్దలిట్లు చెప్పుదురు. కాలావధిలేకయు, నిత్యయు, స్వోపరి వేఱొక యధికారి లేనందున స్వేష్టవిరోధాద్యుపద్రవరహితయునైన శ్రీనివాసునిదయమే నశించిపోయిన యింద్రాద్యధికారులకు ప్రతినిధిగానుండి యా యా ఫలములనిచ్చుచున్నది. అనగా శ్రీనివాసుడను పరమపురుషుడు పరమదయచే ఇంద్రాదులు నశించిపోయినను వారికియ్యదగిన ఫలములనిప్పించుచున్నాడు. వాడు నిత్యుడు. అకాలకాల్యుడు. వానికిపై యెవరును లేరు. కావున ప్రతిరోధమునకవకాశము లేదని భావము.

ఇంద్రాదులు స్వయం ఫలమునొసంగుట కూడ పరమపురుషుడు వారి కంతర్యామిగానుండి యొసంగిన శక్తిచేతనే యనియు, యాగాద్యనుష్ఠాతలగు నారాధకులును (తామెఱుంగకపోయినను) ఇంద్రాదులనుద్దేశించి యారాధించినను, తదంతర్యామియగు పరమపురుషునే యారాధించుచున్నారనియు గీతాది శాస్త్రములలో స్పష్టము. ఇట్లుండగ నా యింద్రాదులు నశించినయెడల నీ పరమపురుషుడే ఆ నష్టేంద్రాదులకు ప్రతిభువుగానుండి, తత్స్థానస్థాపితేంద్రాంతర ద్వారా పూర్వోక్తఫలము నొసంగుచున్నాడు. ఇంద్రాంతరమూలముగా ఫలము నిచ్చినను జవాబుదారితనము పరమపురుషునే చేరినందువలన ఆతడే ఇచ్చునట్లుగ భావింపవలయుననునీశాస్త్రర్థమిచట వివక్షితము. విస్తరభీతులమై యిచట నింతమాత్రమే యుపపాదించితిమి.

శ్లో॥ త్వదుపసదనాదద్య శ్వో వా మహాప్రలయేఽపి వా
వితరతి నిజం పాదాంభోజం వృషాచలశేఖరః ।
తదిహ కరుణే! తత్తత్క్రీడాతరంగపరంపరా -
తరతమతయా జుష్టాయాస్తే దురత్యయతాం విదుః ॥ 79

అర్థ:— హే కరుణే = ఓ దయాదేవి!, త్వదుపసదనాత్ = నిన్ను శరణము పొందుటచే, అద్య వా=నేడో, శ్వో వా=రేపో, మహాప్రలయేఽపివా = మహాప్రలయములోనో. వృషాచలశేఖరః = వేంకటాద్రికి శిరోభూషణుడగు శ్రీనివాసుడు, నిజం = తనదైన, పాదాంభోజం = చరణారవిందమును. వితరతి= ఒసంగుచున్నాడు, తత్ = కనుక, ఇహ = ఈ రక్షణవిషయములో, తత్తత్క్రీడా తరంగ పరంపరా తరతమతయా = ఆ యా నా నా విధతరంగములంబోలిన క్రీడల యొక్క తారతమ్యముతో, జుష్టాయాః = కూడుకొన్న, తే=నీ యొక్క, దురత్యయ తాం=దాటుటకు నలవిగాని తనమును ; విదుః = (శాస్త్రజ్ఞులు) తెలిసికొనిరి.

అవతా॥ క్రింది శ్లోకములో ప్రాసంగికవిషయము చెప్పబడినది. ఈ శ్లోకములో దయాదేవియందు ప్రపత్తి చేసినవానికి నేడో యొకదినమున మోక్ష మను నుత్తమఫలములభించుట నిశ్చయమను ప్రతినజేసి ప్రపన్నప్రకరణము నుపసంహరించుచున్నారు.

తా॥ దయాదేవి యొక పెద్దనది. దానిలో చేతనుని విషయీకరించుట యనులీలలే తరంగములు. అవి చిన్నవిగాను, పెద్దవిగాను నుండును. అనగా చేతనునియొక్క కర్మతారతమ్యము ననుసరించి దయాదేవియొక్క అలలలోను తారతమ్యము గలదు. కొందఱికి శీఘ్రముగా ఫలము లభించవలయునను కోరిక గలిగి తదనుగుణమైన రీతిలో నుపాయముల ననుష్ఠించినయెడల నచట దయా దేవియొక్క తరంగములు తదనుగుణరీతిలో నమరును. పెద్దపెద్ద తరంగము లుద్భవించి శీఘ్రముగ ఫలము లభించును. ఇట్లుగాక మోక్షము మొదలగు ఫల ములో నుత్కటేచ్ఛలేక "నిదానముగావచ్చినను మునిగిపోయినది లేదులే" అను తలంపుచే నుపాయము ననుష్ఠించినయెడల తదనుగుణముగా దయాదేవీతరంగ మేర్పడును. అట్లన చిన్నతరంగము జనించునని భావము. ఇట్లు అనేకవిధము లగు నుదాహరణముల నిచ్చుట చెప్పవచ్చును.

ఇట్లు తనకర్మానుగుణముగా దయాదేవియందు పూర్వోక్తరీతిగ నేదో యొక ప్రక్రియలో నొక ఫలమునుద్దేశించి ప్రపత్తిచేసినను వాడుకోరిన ప్రకారము నేడో, రేపో, మహాప్రలయములోనో, ఎప్పుడైనను శ్రీనివాసుడు తన చరణారవిందమునిచ్చియే తీరును. అనగా వాని చరణారవిందములో నిత్యకైంకర్యమను మోక్షమునిచ్చునని భావము. దీనియందు సందియములేదు. మోక్షేతర ఫలమును కోరకయుండుటయు, మోక్షమును శీఘ్రముగా త్వరలో కోరుటయు అధికపుణ్యులకే సంభవించును. ఇట్లుగాక ఫలాంతరముల నంతరీకరించియో, విలంబితముగానో ఫలమును కోరినను శ్రీనివాసునిదయ నాశ్రయించినయెడల వారికిని కాలక్రమములో మోక్షపర్యంతమైన ఫలము లభించుననుటయే యిచట ముఖ్యవివక్షితము.

"మహాప్రలయేఽపివా" అనునది చతుర్ముఖబ్రహ్మపదవి నధిరోహించిన వారికి ప్రాయశః మఱల నీ సంసారప్రవేశము లేక మహాప్రళయకాలములో మోక్షము లభించునను విషయము నుద్దేశించి చెప్పినదిగాను వ్యాఖ్యానింపవచ్చును.

శ్లో॥ ప్రణిహితధియాం త్వత్సంపృక్తే వృషాద్రిశిఖామణౌ
ప్రస్నుమరసుధాధారాకారా ప్రసీదతి భావనా ।
దృఢమితి దయే దత్తాస్వాదం విముక్తివలాహకం
నిభృతగరుతో నిధ్యాయన్తి స్థిరాశయచాతకాః ॥ 80

అర్థ:— హే దయే = ఓ దయాదేవీ!, త్వత్సంపృక్తే = నీతో దృఢసంబంధముగల్గిన, వృషాద్రిశిఖామణౌ = వేంకటగిరి శిఖరమునందు మణిమాడ్కి ప్రకాశించు శ్రీనివాసునియందు, ప్రణిహితధియాం = చక్కగ నివేశితబుద్ధులగు వారికి (నిరంతరధ్యాతలకు), ప్రస్నుమరసుధాధారాకారా = పారుచున్న అమృతధారకు సమానమైన, భావనా = ధ్యానము, ప్రసీదతి = తేటగనేర్పడును, ఇతి = ఇట్లు, దత్తాస్వాదం = ఇయ్యబడిన రసమునుగల, విముక్తివలాహకం = మోక్షమును వర్షించు మేఘమగు శ్రీనివాసుని, స్థిరాశయచాతకాః = ఒక భగవంతుని యందే స్థిరముగ నివేశింపబడిన బుద్ధినిగల చాతకపక్షులను యోగులు, నిభృతగరుతః సంతః = ముడుచుకొనబడిన తెక్కలు గలిగినట్టివారై, దృఢం = దృఢముగా, నిధ్యాయన్తి = ధ్యానించుచున్నారు.

అవతా॥ క్రింది శ్లోకములో ప్రపన్నునికి నేదోయొకదినము నిశ్చయముగ ఫలము లభించునని చెప్పిరి. ఈ శ్లోకములో భక్తియోగమునసుష్ఠించు వానికిని దయాదేవి యనుగ్రహముచేతనే ఆ భక్తియోగము నిర్విఘ్నముగ పూర్తియగు చున్నదని వర్ణించుచున్నారు. మోక్షమునకై చేయుభక్తియోగమనగా పరమ పురుషుని విషయముగాను, వస్త్వంతరస్మృతిచే ననంతరితముగాను, ఒకేధారగా నేర్పడు స్మృతియే. దీనినే ధ్యానమనియు, ఉపాసనమనియు పలు రీతుల జెప్పు దురు. ఈ ధ్యానము యోగులకు నమృతధారవలె చాలయు నింపుగనుండ వలయును. మఱియు నా పరమపురుషునియొక్క రూపము, గుణము, స్థానము మొదలగు వానితోగూడ గూడియుండవలయును. వానిలో గుణములు చాలయు ప్రధానములు. (ఇది దహరవిద్యలో స్పష్టము) ఆ గుణములోను "దయ" యను గుణము చాలయు ముఖ్యమైనది. ఈ గుణముచేతనేగదా మిగతగుణ ములును దోషములుగాక గుణములు గానగుట. కావున నీ దయాన్వితుడగు పరమ పురుషుని ధ్యానించిన యెడలనే ఆ ధ్యానమమృతధారలవలె చాలయు నింపుగా నమరుట. ఈ గుణము లేనియెడల అపరాధులగు మనబోటివారు ప్రభువును సమీ పించుట కవకాశములేదుగదా! యోగులుగూడ ఈ గుణమును పురస్కరించియే వేంకటాద్రీశుని ధ్యానించుచున్నారు. అప్పుడే వారికాభక్తియోగము ప్రసన్న మగుచున్నది. అనగా భగవత్సాక్షాత్కార పర్యంతమైన దశను బొందుచున్నదని తాత్పర్యము. ఈ విషయమునెఱింగియే, మేఘమునే రక్షకముగాగలిగిన చాతక పక్షులవంటి యోగులు ఇట్టి యుత్కృష్టరసాస్వాదము నిచ్చువాడును మోక్షమను వర్షమునకు మేఘమువంటివాడునగు భగవానునే తమకు సిద్ధోపాయముగాదలంచి తమ జ్ఞానము కర్మము అను రెండు తెక్కలనెగురు విడువక అనగా, దేవతాం తరమునందు ప్రవేశింపజేయక పరమపురుష విషయములోనే ప్రయోగించి వానిని ధ్యానించుచున్నారు.

ఇట్లు ఈ శ్లోకమును పూర్తిగా యోగుల విషయముగానే వ్యాఖ్యానించితిమి. "చాతక" పదమును ప్రాయశః ప్రపన్నుని విషయములోనే ప్రయోగించుట ఆచార్యుల యలవాటుగనుక దానిననుసరించి పూర్వార్థమును యోగులవిషయము గాను; ఉత్తరార్థమును ప్రపన్నుల విషయముగాను గూడ వ్యాఖ్యానింప నగును.

అప్పుడు "ఇతి" అను పదమునకు "ఇట్టి నందున" అని యర్థము. యోగులకును దయాన్వితుడగు పరమపురుషుని విషయీకరించుటచేతనే వారి ధ్యానము అమృతధారవలె మిక్కిలి యింపుగానుండుటయు. ఆ ధ్యానము పూర్తి యగుటయు సంభవించుచున్నదను విషయమునెఱింగియే చాతకమువంటి ప్రపన్నులుగూడ తమ కర్మజ్ఞానములను ముడుచుకొని అనగా, దేవతాంతరము నందో, ఫలాంతరమునందో ప్రయోగింపక ఆ దయాన్వితుడైన పరమపురుషునే స్వయంపురుషార్థముగ (ఫలోపాయముగాగాక) ధ్యానించుచున్నారని తాత్పర్యము. ఈ పక్షములో ప్రపన్నులును స్వయంప్రయోజనముగా పరమపురుషుని ధ్యానింప వచ్చుననను శాస్త్రార్థము వ్యక్తమగుచున్నది.

అలవాటుప్రకారము పై దశకములో శ్రీనివాసుని కాలమేఘముగా వర్ణింప బోవుటను ఈ దశకాంత్యమగు నీ శ్లోకములోను "విముక్తి వలాహకమ" ని చెప్పి ఈ దశకమును పూర్తిగావించుచున్నారు.

అష్టమదశకము సమాప్తము.

---

## నవమదశకము

శ్లో॥ కృపే! విగతవేలయా (విధృతలోకయా) కృతసమగ్రపోషైస్త్వయా
కలిజ్వలనదుర్గతే జగతి కాలమేఘాయితమ్ ।
వృషక్షితిధరాదిషు స్థితిపదేషు సానుప్లవైః
వృషాద్రిపతివిగ్రహైర్వ్యపగతాఖిలావగ్రహైః ॥ 81

అర్థ:— హే కృపే! = ఓ దయాదేవీ!, విగతవేలయా = ఎల్ల లేనటు వంటి, (విధృతలోకయా = ధరింపబడిన సర్వలోకములను గలిగినట్టి). త్వయా = నీచే, కృతసమగ్రపోషైః = చేయబడిన సమస్తవిధములైన పోషణములుగలిగి నట్టియు (సమస్తప్రాణుల పోషణములు గలిగినట్టియు). వ్యపగతాఖిలావ గ్రహైః = పోయినట్టి సకలవిధములైన విగ్రహములు గలిగినట్టియు (పోగొట్ట బడిన దుర్భిక్షములు గలిగినట్టియు). వృషక్షితిధరాదిషు స్థితిపదేషు = వేంక టాద్రి మొదలగు దివ్యస్థానములయందు, సానుప్లవైః = అనుచరులతో

కూడినవియునగు. వృషాద్రిపతివిగ్రహైః = వేంకటాద్రీశుడగు శ్రీనివాసుని యొక్క దివ్యమంగళ విగ్రహములచే, కలిజ్వలనదుర్గతే = కలి యనునగ్నిచే దుర్గతినొందిన, జగతి = జగద్విషయములో. కాలమేఘాయితం = కాలమేఘము వలె నాచరించుట (కలదు).

అవతా॥ దయాస్తోత్రమునందు ఎనిమిది దశకములు సంపూర్తినందినవి. ఇయ్యది తొమ్మిదవ దశకము. ఇంతవరకు నీ దయాదేవిచే ప్రపంచమునకేర్పడు బహువిధానుకూల్యములు ఉపనిషత్ప్రభృత్యనేకశాస్త్రములలో నిరూపిత ప్రక్రియననుసరించి బహుధా వర్ణింపబడినవి. రాబోవు అన్తిమదశకమునందు ప్రతి శ్లోకమునందును అస్మచ్ఛబ్దముచే తనను నిర్దేశించి దయాదేవియందు తనకు కావలసిన కొన్ని ఫలములను ప్రార్థింపబోవుచున్నారు. కాగా ఈ తొమ్మిదవ దశకముతోనే ఈ దయాస్తోత్ర మొకవిధముగా పూర్తియగుచున్నదనియు చెప్ప వచ్చును. దయాదేవిచే ప్రపంచమునకు సంభవించెడి యుపకారములలో ఉత్తమోత్తమమైన యుపకారము పరమపురుషుని, శ్రీనివాసుడు మొదలగు నర్చారూప ములలోను మత్స్య కూర్మ రామ కృష్ణాది విభవ రూపములలోను నవతరింప జేయుటయే. దీనికంటె నుత్తమమైన పరమోపకార మింకొకటి లేదని చెప్ప వచ్చును. ఈ అవతారములచేతనేకదా సకలప్రపంచములును సద్గతిచెందుట :

> " యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
> అభ్యుత్థానమధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్ ।
> పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
> ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥ ".

అనియేగదా ఆ పరమపురుషుని సంకల్పముండు ప్రక్రియ ! ఇట్టి ఉత్తమోప కారమును ఉపాంత్య దశకమునందు నిరూపించి, అనగా అర్చావతారము వి. దశావతారములు మొదలగు భగవదవతారములలో దయాకృత్యమును విశదీకరించి దశకమును ముగించుచున్నారు. తత్రాపి విభవావతారములకంటె నర్చావ తారములు పలువిధముల నుత్కర్షము చెందినవని ఆళ్వార్లును, ఆచార్యులును చక్కగ నిరూపించియున్నారు. ఆరీతి ననుసరించి ప్రప్రథమముగ వేంకటా చలము మొదలగు దివ్యదేశములలో వేంచేసియుండు శ్రీనివాసుడు మొదలగు

నర్చామూర్తులయొక్క ప్రభావమును (దయాదేవిచే ఏర్పడుదానిని) ప్రథమ శ్లోకము నందు వర్ణించుచున్నారు. ఉపరి తొమ్మిది శ్లోకములలో మత్స్యకూర్మావతారద్వయమునకొక శ్లోకమును, తదితరాష్టావతారములకు క్రమేణ ఎనిమిది శ్లోకములను అమర్చి ఈ దశకము సమాప్తి చేయబడుచున్నది.

క్రింది దశకమునందు ప్రపన్నునకు ప్రపత్త్యుత్తరకాలములో నేర్పడు దయాదేవి చేయు ఉపకారములు వర్ణింపబడినవి. ఆ యుత్తరకాలమునందు ప్రపన్నులకు నర్చావతారసేవ చాలయు ముఖ్యముగాన తన్మహిమయు, తదను బంధియగు విభవావతారవైభవమును ఈ దశకములో వర్ణింపబడుచున్నవి.

క్రింది శ్లోకమునందు శ్రీనివాసుని మోక్షమును వర్షించు మేఘముగా రూపించిరి. ఈ శ్లోకమునందు శ్రీనివాసునివంటి సమస్త దివ్యదేశములలో నుండు సర్వమూర్తులును సర్వవిధదురితములను (దుర్భిక్షములను) పోగొట్టి సర్వవిధ ఫలములను (మంచి వర్షములను) ఒసంగు నొక మహాకాలమేఘముగా రూపించుచున్నారు.

తా॥ దయాదేవికి ప్రపంచరక్షణ విషయములలో ఒక యడ్డంకియు లేదు. ఈ దేశములో, ఈ కాలములో, ఇతనినే రక్షించుటయను నియమము లేదు. ఏ కాలమునందైనను, ఏ దేశమునందైనను, ఏ ప్రాణినైనను రక్షించును. అట్టి దయాదేవిచేతనే భగవదవతారము లేర్పడుచున్నవి. "అవతారము" నగా "దిగుట" యని యర్థము. మేఘము జలభారమును మోయజాలక పర్వతములయందు దిగి భూమిపై వర్షించును. అట్లే పరమపురుషుడును కారుణ్య భారమును మోయజాలక పరమపదమునుండి దిగుచున్నాడు, అనగా కరుణచే నవతారముల నెత్తుచున్నాడని భావము. సమస్తజనులును ఈ అర్చావతారములను సేవించి సమస్తఫలములను పొందుచుండు గాతమను దయయే ఇచట ముఖ్యకారణము. కావుననే భగవద్దివ్యమంగళవిగ్రహములన్నియు దయచే పోషింపబడినవగుచున్నవి. మేఘమెట్లు జలముతో నిండినదో, అట్లే భగవానుని యర్చాది విగ్రహములు దయచే నిండినవి. ఆ మేఘమవతరించునప్పుడెట్లు తనకు సహచరములగు గాలి, మెఱుపు మొదలగువానితోకూడియే అవతరించునో; అట్లే భగవంతుడును తన కనుచరులగు పత్నులు, అనంతగరుడాదినిత్య

సూరులు మొదలగు వారితోడనే అవతరింతురు. ఆ మహాకాలమేఘము వర్షించిన యెడల సర్వదుర్భిక్షములును శాంతమై ప్రపంచక్షేమ మేర్పడునో, అట్లే ఈ శ్రీనివాసుడు మొదలగు సర్వావతారము లావిర్భవించినవెంటనే కలియనే అగ్నిచే మలమల మాడిపోయిన ప్రపంచమునకు సర్వవిధక్షోభములును తొలిగి, అనగా వారు వారు చేసిన పాపములు భగవత్సేవచే తొలగి భగవంతుని నిగ్రహ సంకల్పము శాంతమై సమస్తులకును పరమక్షేమ మేర్పడుచున్నది. ఏవం చ వేంకటాచలము మొదలగు దివ్యదేశములలో నుండు అర్చామూర్తులు కాలమేఘమువలె సర్వ తాపములు పోగొట్టునను ప్రధానశాస్త్రార్థమిచట నిరూపింపబడి తద్ద్వారా అర్చావతార ప్రభావము విశదీకృత మగుచున్నది.

ఇచట "త్వయా" అను పదమును కర్తృవాచకముగా వివక్షించి, దయాదేవినే కాలమేఘముగా వర్ణించి వ్యాఖ్యానించుటయు కద్దు.

ఈ శ్లోకములో అన్ని దివ్యదేశములలోనుండు అర్చామూర్తులును శ్రీనివాసుని మూర్తులే అని తోచునట్లు పదములమరియుండుటచే సర్వార్చాదివ్య మంగళ విగ్రహములకును మూలకందమువలె ఈ శ్రీనివాసుని మూర్తియున్నదని తోచుచున్నది. దీనిచే శ్రీనివాసున కుండు ఉత్కర్ష మొకవిధముగానిరూపితమగును.

ఆశ్రితసంరక్షణమను భగవత్కార్యమును చక్కగ నెరవేర్చుటకొఱకు భగవంతునితోకూడనే భగవన్మహిషులు, నిత్యసూరులు మొదలగు వారవతరించు చున్నారు. ఎట్లు వర్షమునకు గాలి, మెఱపు మొదలగువాని సాహాయ్యమవశ్యా పేక్షితమో, అట్లే వీరిసహాయముగూడ భగవంతుని కవశ్యాపేక్షితమని తెలియ పరచుటకొరకై "సానుప్లవైః" అను విశేషణపదము వాడబడినది.

శ్లో॥ ప్రసూయ వివిధం జగత్తదభివృద్ధయే త్వం దయే!
సమీక్షణవిచింతనప్రభృతిభిః స్వయం తాదృశైః।
విచిత్రగుణచిత్రితాం వివిధదోషవైదేశికీం
వృషాచలపతేస్తనుం విశసి మత్స్యకూర్మాదికామ్ ॥ 82

అర్థ :— హే దయే = ఓ దయాదేవీ!, త్వం = నీవు. వివిధం = నానా విధమైన, జగత్ = జగత్తును, ప్రసూయ = ప్రసవించి (సృష్టించి), తాదృశైః = అట్టివైన, సమీక్షణవిచింతనప్రభృతిభిః = కనులచే చూచుట మనసుచే ధ్యానిం

చుట మొదలగు వ్యాపారములచే, తదభివృద్ధయే = ఆ జగత్తుయొక్క అభివృద్ధి కొఱకు, విచిత్రగుణచిత్రితాం = నానా విధ గుణములచే చిత్రమైనదియు, వివిధ దోష వై దేశికీం = ఎట్టి దోషములకును అస్పదముగాని, వృషాచలపతేః = వేంక టాద్రీశునియొక్క, మత్స్య కూర్మాదికాం – మత్స్యము, కూర్మము మొదలగు తనుం=శరీరమును, విశసి = ప్రవేశించుచున్నావు.

అవతా॥ గత శ్లోకమునందు అర్చావతారముఖేన దయాదేవిచేయు లోకోప కారమును వర్ణించిరి. ఈ శ్లోకము మొదలు ఈ దశకాంతమువరకు పురాణములో పసిద్ధమైన మత్స్య కూర్మాది దశవతారముఖేన దయాదేవిచేయు ఉపకారములను వర్ణింపదలచి ఈ శ్లోకములో ప్రథమ – ద్వితీయావతారములగు మత్స్యకూర్మ ములను వర్ణించుచున్నారు.

తా॥ ప్రపంచములో నుండు మత్స్యములు, కూర్మములు, హంసములు- ఇయ్యవి తమ అపత్యములను కాపాడుట ఇతర జంతువుల వలెగాక విలక్షణ ముగా నుండును. మత్స్యములు నేత్రములచే తమ శిశువులను బాగుగా చూచుట చేతను, కూర్మములు వానిని మనసా స్మరించుటచేతను, హంసములు బాగుగ స్పృశించుటచేతను ఆ శిశువులకు పూర్ణపోషణ మేర్పడును. ఈ విషయమును "ఈ క్షణధ్యాన సంస్పర్శై మత్స్యకూర్మవిహంగమాః, రక్షంతి స్వాన్య పత్యాని" అని పెద్దలు చెప్పియున్నారు. ప్రకృత శ్లోకములో "విచింతన పృభృతిభిః" అను పదములో "ప్రభృతి" శబ్దముచేతను, "మత్స్య కూర్మాది కామ్" అనుచోట "ఆది" శబ్దముచేతను, భగవంతుని హంసావతారము గూడ వివక్షితమే. ప్రసిద్ధ దశావతారములలో ఆ అవతారము గణింపబడలేదు గావున దానిని స్పష్టముగా చెప్పక "ఆది" శబ్దముచే సంగ్రహించిరి.

దయాదేవి పరమానుగ్రహముచేత ప్రపంచములోనుండు వివిధప్రజలను సృష్టించి తత్పోషణార్థమై భగవత్స్వీకృత మత్స్యకూర్మాదివిగ్రహములలో ప్రవేశించి, ప్రపంచములోనుండు మత్స్యకూర్మాదులు ఎట్లు తమ ప్రజల నిరీ క్షణధ్యానాదులచే కాపాడుచున్నవో, అటులనే భగవదవతారరూపమగు మత్స్య కూర్మములనుగూడ నిరీక్షణధ్యానాదికార్యములను ఆచరించునట్లుచేసి తద్ద్వారా ప్రపంచ ప్రాణులను కాపాడుచున్నదని తాత్పర్యము.

మత్స్యావతార, కూర్మావతారములు విరీక్షణధ్యానములనెపుడు, ఎక్కడ చేసినవి ? దానిచే ప్రపంచక్షేమమెట్లేర్పడినది ? అవివ — అసురుడు వేదముల నపహరించుకొని సముద్రములో మునిగిపోయినపుడు భగవంతుడు మత్స్యరూప మెత్తి సముద్రములో ప్రవేశించి నాలుగుప్రక్కలలోను బాగుగ నిరీక్షించి వేద ములను కనిపెట్టి వెలికి గొనివచ్చెననుట ప్రసిద్ధము. వెదకునప్పుడు భగవంతుని పుండరీకనయనములు సముద్రములో పలుచోట్ల కనబడి ఒక పద్మారణ్యమే అచట సంభవించినట్లుండెనని ఆచార్యులు "దశావతారస్తోత్రము" లో వర్ణించి యున్నారు. ఇట్లు సమ్యఙ్నిరీక్షణములతో వేదముల నుద్ధరించుటచేతగదా జగత్తునకు వేదమూలమైన సర్వక్షేమములును సంభవించినవి. కాగా, ఈ అవతారములో దయాదేవి మత్స్యమూర్తియొక్క నయనములో ప్రవేశించి తన్నిరీక్షణద్వారా వేదములనుద్ధరించి జగత్తును సంరక్షించినదిగా చెప్పుట కడ్డులేదు.

ఇట్లే ప్రపంచమాతయగు మహాలక్ష్మిని క్షీరసాగరమునుండి యుద్ధరించి తన్మూలముగా ప్రపంచమునకు "చైతన్య స్తన్యదాయినీమ్" అను రీతిలో పరమ క్షేమమును కలుగజేయగోరిన పరమపురుషుడు కూర్మావతారమెత్తి ఎంతయో పెద్దదియగు మందరపర్వతము వీపునందొరసికొనుచుండినను దేవాసురులు, సముద్రము వీనియొక్క మహాఘోషముండినను నిశ్చలముగా ధ్యానములోనుండు వానివలె నుండి మందరపర్వతమును ధరించి, సముద్రమును చిలికి మహాలక్ష్మిని పొంది తద్వారా ప్రపంచమునకు పరమక్షేమమునొసంగెను. ఈ అవతారములో భగవంతుని మనస్సులో దయాదేవి ప్రవేశించి పూర్వోక్తకార్యమును చేయించి నది. కావున "విచిన్తనము" ను ధ్యానస్థితిని పొందియే ఈ కార్యము జరిగిన దని చెప్పనగును. ఇట్లే హంసావతారములో ఊహించుకొనునది.

"తాదృశైః, సమీక్షణవిచింతనైః" అను పదములకు ప్రపంచములో నుండు సామాన్యమైన మత్స్యకూర్మముల సమీక్షణవిచింతనములకు సమాన ములైన సమీక్షణవిచింతనములచే అని వ్యాఖ్యానించితిమి. ఇదిగాక పర బ్రహ్మము, ప్రపంచసృష్టికిముందు సమీక్షణాదులను చేసి ప్రపంచమును సృష్టించి దానిలో ప్రవేశింపుచున్నదని యుపనిషత్తులు చెప్పుచున్నవి. అట్టి వ్యాపారమును ఇప్పుడు దయాదేవి భగవంతునియొక్క మత్స్య కూర్మాది దివ్యమంగళవిగ్రహ

మూలముగా చేయుచున్నదను నదియు "తామ్రశైః" (ఉపనిషత్ప్రసిద్ధములైన) అను పదముచే సూచింపనగును. ఏవంచ వేదోద్ధారమును, మహాలక్ష్మిని అందజేసినదియు, మత్స్య కూర్మావతారములలో దయాదేవి చేసిన పరమోప కారములని విశదీకృతమగును.

ఇట్లే భగవంతునియొక్క అవతారదశలో ఏర్పడు దివ్యమంగళవిగ్రహ ములును (మత్స్య కూర్మాదులు) అప్రాకృతమైన విగ్రహములు గనుక పరబ్రహ్మ స్వరూపమునకువలె వీనికిని సర్వకల్యాణగుణములును, సర్వదోష రహితత్వ మును అగు ఉభయలింగమును పూర్ణముగానున్నవను విషయమును దెలియ పరచుటకై "విచిత్రగుణ చిత్రితాం, వివిధదేశ వైదేశికీం" అను విశేషపద ద్వయ మిచట నీయబడియున్నది.

శ్లో॥ యుగాన్తసమయోచితం భజతి యోగనిద్రారసం
వృషక్షితిభృదీశ్వరే విహరణక్రమాజ్జాగ్రతి ।
ఉదీర్ణచతురర్ణవీకదనవేదినీం మేదినీం
సముద్ధృతవతీ దయే! త్వ(త)దభిజుష్టయా దంష్ట్రయా॥ 83

అర్థ:— హే దయే! = ఓ దయాదేవి!, త్వం = నీవు, యుగాన్త సమయో చితం = ప్రళయకాలమున కనుకూలమైన. యోగనిద్రారసం = యోగనిద్రారసమును, భజతి = పొందియున్న, వృషక్షితిభృదీశ్వరే = వేంకటాద్రీశుండగు శ్రీనివాసుడు, విహరణక్రమాత్ = లీలాక్రమముచే, జాగ్రతిసతి = మేల్కొనియుండగా, ఉదీర్ణ చతురర్ణవీ కదనవేదినీం = పొంగిపొరలెడి నాల్గు సముద్రములచే నేరడ్పిన హింసను తెలియపరచుచున్న, మేదినీం = భూమిని, త్వదభిజుష్టయా = నీతోకూడిన, దంష్ట్రయా = (వరాహమూర్తి యొక్క) కోఱచేత, సముద్ధృతవతీ = పైకెత్తితివి.

అవతా॥ "మత్స్యఃకూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః, రామో రామశ్చ రామశ్చ కృష్ణః కల్కీ తథైవచ" అను పురాణప్రసిద్ధి ననుసరించి మత్స్య కూర్మావతారములను క్రింది శ్లోకములో వర్ణించి తదనంతరమైన వరాహావతారము నందు దయాదేవి చేసిన లోకోపకారము నిందు వర్ణించుచున్నారు.

తా॥ యుగసమాప్తికాలములో, అనగా, చతుర్ముఖబ్రహ్మకు రాత్రియగు ప్రళయకాలమునందు సత్యలోకమువరకు సర్వలోకములును నీటిలో మునిగిపోవు

చున్నవి. అట్లే సమస్త సముద్రములును అప్పుడు పొంగి పొరలిపోవును. ఆ కాలమునందు భగవంతుడు యోగనిద్ర ననుభవించును. అనగా, నిద్రవలె నుండు యోగము ననుభవించుచున్నాడని భావము. యోగమనగా, పునః ప్రపంచమును సృష్టించి జీవులకు సద్గతిని గలిగించి క్షేమమునొందించుటలో నుండు చింతయే. (అలబ్ధస్య లాభః యోగః = పొందబడని వస్తువుయొక్క ప్రాప్తియోగము). ఇట్లు ప్రళయావసానమువరకు యోగరసము ననుభవించి పిదప సృష్ట్యారంభకాలములో తన లీలాక్రమముచే, అనగా, ప్రళయమునందు యోగనిద్ర, తదనంతరము సృష్టియను స్వసంకల్పక్రమముచే భగవంతుడు మేల్కాంచుచున్నాడు. ప్రళయకాలములో అన్ని సముద్రములును పొంగి ఏకోదకముగ నైపోయినందువలన భూమి యెచటనో పాతాళములో అణగిపోవుచున్నది. అప్పుడు భూమికి సంభవించిన పీడను దయాదేవి తెలిసికొని భగవంతుని వరాహావతారమును స్వీకరింపజేసి, అయ్యవతారమున కసాధారణమైన కోఱలో తాను ప్రవేశించి సముద్రములో మునిగిపోయిన బ్రహ్మాండమగు భూమిని పైకెత్తుచున్నది. పరమదయచే భగవానుడు వరాహావతారమును ధరించి భూమినుద్ధరించుచున్నాడని భావము. మునిగిపోయిన భూమినుద్ధరించి పూర్వస్థితిలో నిలిపి ప్రాణులను సంరక్షించుటయే వరాహావతారములో దయచే నేర్పడు ప్రధానోపకారము.

ఇచట "జాగ్రతీ" యనియు, "కదనవేదినీ" యనియు ప్రథమాంతమైన పాఠములుకూడ కలవు. అప్పుడవి రెండును దయకు విశేషణములగుటచే భగవంతుడు యోగనిద్ర ననుభవించినను దయాదేవి స్వయముగ మేల్కొనియేయుండి తానే భూపరిశ్రమమునెఱింగి యుద్ధరణము చేయించుచున్నదని తాత్పర్యము. "త్వదభిజుష్టయా" అనుచోట "తదభిజుష్టయా" అను పాఠమును కద్దు. అప్పుడు "శ్రీనివాసునిచే స్వీకరింపబడిన" అని యర్థము.

శ్లో॥ సటాపటలభీషణే సరభసాట్టహాసోద్భటే
స్ఫురత్క్రుధి పరిస్ఫుటద్భ్రుకుటికేఽపి వక్త్రే కృతే।
దయే! వృషగిరీశితుర్దనుజడింభదత్తస్తనా
సరోజసదృశా దృశా సముదితాకృతిర్దృశ్యసే॥ 48

అర్థ:— హే వృషగిరీశితుః దయే ! = ఓ వేంకటాద్రీశుని దయాదేవీ !, సటాపటలభీషణే = కేసరసమూహముచే భయంకరమైనదియు, సరభసాట్టహాసోత్కటే = అతి సంభ్రమముతో కూడిన అట్టహాసముచే మద్ధతమైనదియు, పరిస్ఫురద్భ్రుకుటికే = అతి ప్రకాశమైన భ్రుకుటీవక్రతనుగల్గిన, వక్త్రే = (నృసింహావతారముయొక్క) ముఖమండలము, స్ఫురత్క్రుధి = కోపమును గలిగినదిగా, కృతేఽపి = చేయబడి యుండినప్పటికిని, సరోజసదృశా = తామర పుష్పముతో సమానమైన, దృశా = నేత్రముచే, దనుజడింభ దత్తస్తనా = అసుర బాలుడగు ప్రహ్లాదునకియ్యబడిన స్తన (న్య) మును గలిగిన, త్వం = నీవు, సముదితాకృతిః = సమ్యగావిర్భవించిన స్వరూపము గలదానివై, దృశ్యసే = కనపడుచున్నావు.

అవతా॥ శ్రీ నృసింహావతారమూలముగా దయాదేవి యొనరించెడి యుపకారమీ శ్లోకములో వర్ణింపబడుచున్నది.

తా॥ అఘటితఘటనకు ప్రథమోదాహరణమైన నృసింహావతారములో దయాదేవియు నొక యఘటితఘటనను కలిగించియున్నది. "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం" అను ప్రమాణము ననుసరించి అవతారమునకు ముఖ్యప్రయోజనము సాధుసంరక్షణమే. దుష్కృద్వినాశనమానుషంగికముగ నేర్పడునది. కాగా, ఈ యవతారమునకు నయితము ముఖ్యప్రయోజనము భాగవతోత్తముడగు ప్రహ్లాదుని వాక్కును పరిపాలించి వానిని సంరక్షించుటయే. తదానుషంగికముగా హిరణ్యాసురసంహారము సంభవించినది. ఈ యవతారముండినది కొన్ని నిముషములే. అంతలో జరిగిన యొక విచిత్రవృత్తాంతము నాచార్యులిచట వర్ణించుచున్నారు. సింహజాతికి స్వాభావసిద్ధమైన కేసరములు గుంపులు గుంపులుగా ముఖమున వ్రేలాడుటచే మహాభయంకరముగాను, స్తంభమునుండి యావిర్భవించునపుడే మిక్కిలి కోపముతోను, వేగముతోను, ప్రపంచమంతయు గడబిడజెందునట్లు పెద్ద అట్టహాసముతో కూడినదియు, కోపమే మూర్తీకరించినట్లు వక్రభ్రుకుటిని గల్గినదియు, భయంకరనేత్రములు గల్గినదియునగు ముఖమండలమే క్షణములో దృష్టిగోచరమైనదో, ఆ క్షణములోనే ఆ ముఖమండలములో నుండు ఆ నేత్రములద్వారా దయాదేవియొక్క ప్రవాహముద్భవించి యతిమధురమును, శీతమునైన కటాక్షము నాబడు స్తన్య

ముచే అసురబాలుడగు ప్రహ్లాదుని సమాశ్వాసింపజేసి తన్మూలముగా ప్రపంచములో స్వపరత్వమును భగవంతుడు స్థాపించెను. ఏ క్షణములో భగవన్నేత్రము అసురునకు మహాభయంకరముగానుండినవో, ఆక్షణములోనే అదే నేత్రములు తామర పుష్పములవలె ప్రహ్లాదునకు పరమభోగ్యములుగాను, హార్దానుగ్రహ ప్రస్రావకములుగాను, పరమశాంతములుగా నుండినవి. ఇదియే ఇచ్చట యొక్క అఘటిత ఘటన. దయాదేవిచేయు సాధుపరిత్రాణరూపమైన యుపకారమిటులనేగదా యుండుసు! ఆ ఒక సాధువును (ప్రహ్లాదుని) సంరక్షించినచో తన్మూలముగా ప్రపంచమునకేర్పడెడి యుపకారమునంతయు వేఱుగ వివరింపనక్కరలేదుగదా! కోపమో, అనుగ్రహమో, వాత్సల్యమో అన్నియు నేత్రద్వారముగాగదా యితరు లెఱుంగసాధ్యమగును! దయామాత తనకు బిడ్డడగు భాగవతరత్నమైన ప్రహ్లాదునకు అనుగ్రహమయమైన కటాక్షమనెడు స్తన్యము నొసంగి వాని కాత్మధారణము గలుగజేసినది. అప్పుడు దయాదేవియొక్క స్వరూపము భగవన్నేత్రములో స్ఫుటముగా ప్రకాశించినది. ఏవం చ ఈ అవతారము దయాదేవి భగవన్నేత్రమునందు ప్రవేశించి ప్రహ్లాదద్వారా ప్రపంచమునకుపకరించినదని పండితభావము.

"కృతేఽపి" అను పదముచే, కోపమునది భగవంతునకు "క్రోధమాహారయ త్తీవ్రం" అను వాల్మీకి వాక్యప్రకారముగా ఆగన్తుకముగాను, తాత్కాలికముగాను వచ్చునదనియు, ఉత్తరార్ధోక్త వాత్సల్యభరిత కటాక్షమే స్వాభావికమనునదియు వివక్షితము.

శ్లో॥ ప్రసక్తమధునా విధిప్రణిహితైస్సపర్యోదకైః
సమస్తదురితచ్ఛిదా నిగమగంధినా త్వం దయే!।
అశేషమవిశేషతః త్రిజగదంజనాద్రీశితుః
చరాచరమచీకరశ్చరణపంకజేనాంకితమ్ ॥ 85

అర్థ :— హే దయే! = ఓ దయాదేవీ! త్వం = నీవు, విధిప్రణిహితైః = చతుర్ముఖునిచే సమర్పింపబడిన, సపర్యోదకైః = పూజా (పాద్య) తీర్థములచే, ప్రసక్తమధునా = తేనెయొక్క ధారలు గలిగినదియు, సమస్తదురితచ్ఛిదా = సమస్తపాపములను పోగొట్టునదియు, నిగమగంధినా = వేదవాసన గల్గినదియునగు (వేద ప్రతిపాదితమునగు), అంజనాద్రీశితుః = వేంకటాద్రీశునియొక్క,

చరణపంకజేన=పాదారవిందముచే, చరాచరం=చరాచరరూపమైన. త్రి=జగత్ త్రిలోకములను, అశేషం=నిశ్శేషముగ, అవిశేషతః=తారతమ్యము లేక, అంకితం=ముద్రింపబడినదిగా, అచీకరః=చేసితివి.

అవతా॥ ఈ శ్లోకములో త్రివిక్రమావతా ద్వారా దయాదేవి చేసిన మహోప కారము వర్ణింపబడుచున్నది. వామనావతారఫలితము త్రివిక్రమావతారమునందే పర్యవసించుచున్నది గావున ఈ యవతారమునే యిచట వర్ణించుచున్నారు.

తా॥ ఇంద్రాదిదేవతలను హింసించిన మహాబలియొక్క గర్వము నణచు వ్యాజమున నీ యవతారమేర్పడినది. ఎప్పుడెప్పుడవకాశము గల్గునో: ఎల్లెల్లు ప్రపంచమున కుపకరింతునో' అని చాలయు జాకరూకతను దయాదేవి గల్గి యున్నది. ఈ యవతారమేర్పడు సమయమున భగవంతుని పాదమునందు తాను ప్రవేశించి త్రిజగత్తునందు సర్వప్రాణులకు నొక పరమోపకారమును దయా దేవి చేయించినది.

మహాబలియొద్ద యాచించి కైకొనిన మూడడుగుల భూమిని కొలచు వ్యాజమున భగవంతుడు చాలయు బృహత్తమరూపమును స్వీకరించి యొక యడుగుచే అధఃస్థిత సర్వలోకములను, రెండవయడుగుచే ఉపరి తనలోక ములను కొలచివైచెను. అప్పుడా బృహత్పాదము సత్యలోకములో ప్రవేశింప చతుర్ముఖుడు పరమాదరముతో దర్మతీర్థములచే దాని నభిషేకించెను. అత్తఱి ఆ తీర్థములో కలసియుండు మధుధారలు తచ్ఛ్రీపాదమునకు సంబంధించినవి. మఱియు నా పాదము సర్వపాపములను పోగొట్టుశక్తిగలిగినది. ఏరీతిగనైన తత్పాదసంబంధ విశిష్టులగువారికి నావంతయు పాపసంబంధ ముండదు. మఱియు నాభగవత్పాదము వేదమునందు పలుచోట్ల వివిధ విధముల పొగడంబడి యున్నది. పద్మమువలె మృదువుగను, ఎఱ్ఱగను, మనోహరముగను నున్న ఈ పాదముచే ప్రపంచమును కొలుచునపుడు స్థావరజంగమాత్మకమైన సర్వజగత్తుకును తత్సం బంధమేర్పడినది. అది భగవత్పాదముచే తద్వస్తుజాతమునకు ముద్రవైచినట్లా యెను. భగవత్పాద సంబంధమేర్పడుట యనునది సామాన్యముగ లభ్యముగాదు. విశేషపుణ్యముచే మాత్రమే అయ్యది లభ్యమగును. ఇట్టి ఉత్తమ పురుషార్థ మును దయాదేవి సంధర్భమేర్పడినపుడు సర్వవస్తు వర్గములకును నొక దానిని

సయితము వీడక తారతమ్యమును ప్రదర్శింపక, అనగా; పుణ్యాధికుల యందధి కాదరము, పాపులయందు తన్న్యూనత యనెడి యెవ్విధమైన వ్యత్యాసమును లేక సర్వులకును నొకేరీతిలో కలుగజేయించినది. ఆహా! దయాదేవి ప్రభావ మెంతటిదని యాచార్యులిచట ఆశ్చర్యపడుచున్నారు. ఈ యవతారమునకు, ఇట్లు సర్వప్రాణులకును భగవత్పాదసంబంధము నేర్పఱచి వానిని కృతార్థులుగ నొనర్చుటయే ప్రధాన ప్రయోజనము. బలిచక్రవర్తి యొక్క గర్వము నపహరించుట యానుషంగికము. తదితరావతారములలో కొందఱికిమాత్రమే మేలు గల్గెను. ఈ యవతారమున నన్ననో; పుణ్యశాలి – పాపియనియు, చేతనుడు – అచేతనుడనియు నీవిధముగు నే విభాగమును లేక సర్వవస్తువులకును అమితమగు మేలు గల్గినదిగదా! కావుననే వేదములీయవతారమున నత్యాదరమును ప్రదర్శించుచున్నవి.

ఏ వస్తువున నెవనిముద్ర అంకితమగునో, ఆ వస్తువు వానిదే యనుట లోక సిద్ధము. పరమపురుషుని పాదముద్రను (వైష్ణవముద్రను) సర్వవస్తువులలోను ముద్రించి యొక యణువునైనను వదలక సర్వవస్తువులును వైష్ణవములే, అనగా; పరమపురుషునివేనని దయాదేవి స్థాపించినది. ఇదియే యిచట ప్రధానవిషయము. ముద్రణోపకరణము కఠినముగ నుండినయెడల నొప్పిగల్గును, అట్లుగాక తామరసపుష్పమువలె నతిమృదువైన పాదముచే ముద్రించుటవలన యిచ్చట నెట్టి నొప్పికిగూడ నవకాశములేదు. తామరసపుష్పమునకు తేనె సంబంధమును, వాసనయు స్వభావసిద్ధములు. ఇచ్చట్టియు (భగవత్పాదమునందు) వానికెట్టి కొఱతయు లేదను విషయము నాచార్యులు "ప్రసక్తమధు", "నిగమగంధినా" అను పదములచే సూచించుచున్నారు.

శ్లో॥ పరశ్వథతపోధనప్రధనసత్క్రతూపాకృత –
క్షితీశ్వరపశుక్షరత్క్షతజకుంకుమస్థాసకైః।
వృషాచలదయాళునా నను విహర్తుమాలిప్యథాః
నిధాయ హృదయే దయే! నిహతరక్షితానాం హితమ్ ॥ 86

అర్థ:— హే దయే! = ఓ దయాదేవీ!, వృషాచలదయాళునా = వేంకటాచలమున నుండు దయాళువైన శ్రీనివాసునిచే, నిహతరక్షితానాం = నిహతులై

రక్షింపబడిన వారియొక్క. హితం=హితమును, హృదయే నిధాయ=మనమున నాలోచించి, విహర్తుం = విహరించుటకై, పరశ్వథతపోధనప్రధనపక్కృతా పాకృత క్షితీశ్వరపశుక్షరక్షతజకుంకుమ స్థాసకైః = పరశువు నాయుధము గాగల పరశురామునియొక్క యుద్ధమని యెడు ఉత్తమయాగములో బలిగావింప బడిన రాజులనెడు యాగపశులనుండి స్రవించు రక్తమనెడు కుంకుమ ద్రవ్యముచే, ఆరిప్యథా = పూయంబడితివో యన నొప్పుచున్నావు.

అవతా॥ క్రింది శ్లోకమునందు త్రివిక్రమావతారమున దయాదేవి యొనర్చిన లోకోపకారమును వర్ణించిరి. ఈ శ్లోకములో తదుపరితనమైన పరశురామావ తారములో ఏర్పడిన కృత్యములను దయాకార్యములే యని నిరూపించుచున్నారు. తదితరావతారములవలెగాక ఇరువదియొక్క పర్యాయములు క్షత్రియులను సంహ రించి నెత్తురుమడుగులగట్టించిన పరశురాముడెట్లు దయాళువగును ? అను సం శయముగల్గును. బాగుగ నాలోచించినయెడల నిదియు దయాకార్యమేయని స్ఫురించును. లోకకల్యాణార్థమై చేయంబడు యాగములలో పశువులను సంహ రించుచున్నారు. అట్లు సంహరింపబడిన పశువులకుత్తమపుణ్యలోకప్రాప్తి గల్గునని శాస్త్రములు చెప్పుచున్నవి. అటులనే అపరాధులను రాజులుచేయు దండనచే శుద్ధులగుచున్నారనియు శాస్త్రసిద్ధము. ఈ విధముగ సచ్చరిత్రభ్రష్టు లైన దుష్టక్షత్రియులను మరణమను దండనచే శుద్ధీకరించి వారికిని సద్గతినొసంగ గోరిన దయాదేవి పరశురామావతారద్వారా దానిని నెరవేర్చినది. వేఱు ప్రకార ములచే దిద్దుబడు వీలుగాని యామదుష్టక్షత్రియులకు సంహారమే పరమహితము. గీతలో చెప్పబడిన "వినాశాయ చ దుష్కృతాం" అను మాటను బాగుగా నాలోచించినయెడల సాధుపరిత్రాణమువలె దుష్కృద్వినాశనమును తత్పరిత్రాణము నందే పర్యవసించును.

భగవంతుడు చేయు సర్వజగత్సంహారరూపమైన ప్రళయమే దయా కార్యమైనపుడు వాడొనరించు కొందఱు రాజులయొక్క సంహారము దయా కృత్యమగుటలో సంశయమేల ? కాగా, పరశురాముడు చేసిన క్షత్రియమర్దన మొక ఉత్తమయాగము. దీనిచే ప్రపంచమునకు బహువిధక్షేమమేర్పడుచున్నది. ఆ యాగములో దుష్టక్షత్రియులే ఉపాకరణమనెడి యొకవిధమైన సంస్కారముచే సంస్కరింపబడిన పశువులు. అనగా వధముజేయుటకు సిద్ధపరుపబడిన పశువులు.

ఆ పశువులయొక్క సంహారసమయమునందేర్పడిన రక్తప్రవాహమనెడు కుంకుమ ద్రవముచే దయాదేవి నలంకరించి ఆమెతో వేంకటాద్రీశుడగు శ్రీనివాసుడు విహరించుచున్నాడు. దుష్టులకును హితమునే కోరు స్వభావముగల దయాదేవికి ఆ దుష్టులకిట్టి హితమును గావించి, వారిని రక్షించుటయే చాలయు నిష్టమను శాస్త్రార్థమును, వారి రక్తమనెడు కుంకుమద్రవమును పూసి ఆమెతో శ్రీనివాసుడు విహరించుచున్నాడని వర్ణించుచున్నారు.

పరశ్వథమనగా గొడ్డలి. దానిం ధరించినముని పరశ్వథతపోధనుడు. రాజులను పశువులను సంహరించుటకా గొడ్డలి యుపయుక్తమగుచున్నది. యాగముచేయుటకర్తుండు తపోధనుడు.

శ్లో॥ కృపే ! కృతజగద్ధితే ! కృపణజన్తుచిన్తామణే !
రమాసహచరం క్షితౌ (తదా) రఘుధురీణయంత్యా త్వయా ।
వ్యభజ్యత సరిత్పతిః సకృదవేక్షణాత్ తత్క్షణాత్
ప్రకృష్టబహుపాతకప్రశమహేతునా సేతునా ॥ 87

అర్థ :— కృతజగద్ధితే ! = లోకహితము నొనరించుదానివియు, కృపణజన్తుచిన్తామణే ! = గత్యన్తరములేని కృపణప్రాణుల యభీష్టములనొసంగు చిన్తామణివియునగు, హే కృపే ! = ఓ దయాదేవీ !, క్షితౌ = భూమియందు, (తదా = ఆ కాలమునందు), రమాసహచరం = లక్ష్మీసహచరుండగు శ్రీనివాసుని, రఘుధురీణయన్త్యా = రఘువంశమునకు నిర్వాహకుడగు శ్రీరాముడుగా చేయించిన, త్వయా = నీ చేత, సకృదవేక్షణాత్ = ఒకసారి చూచుటచేతనే, తత్క్షణాత్ = ఆ నిమిషములోనే, ప్రకృష్టబహుపాతకప్రశమహేతునా = ప్రబలమైన యనేకవిధములగు పాపములను ప్రశమింపజేయుటలో సమర్థమైన, సేతునా = సేతువుచే, సరిత్పతిః = సముద్రుడు, వ్యభజ్యత = రెండుగ విభజింపబడియెను.

అవతా॥ తరువాతిదైన రామావతారములో దయచే నేర్పడిన లోకోపకారమీ శ్లోకములో వర్ణింపబడుచున్నది.

తా॥ కరుణయే మూర్తీభవించి వచ్చినదనుట కనుగుణముగా కరుణాకాకుత్స్థుడని వ్యవహరింపబడునదీ యవతారము. కారుణ్యమునకు పరాకాష్ఠ

గత్యన్తరహీనులగు కృపణప్రాణులను కాపాడి వారి యభీష్టములనొసంగుటయే. దీనినే శరణాగతత్రాణమందురు. ఇట్టి శరణాగతిధర్మమును ప్రపంచమునకు వెల్లడించి, తాను బహువిధముల ననుష్ఠించి చూపుటకే శరణాగతరక్షణమున వ్యగ్రమగు రఘువంశములో శ్రీరాముడవతరించెను. ఇట్లవతరింపజేసినది దయాదేవియే. ఈ శరణాగతి ధర్మానుష్ఠానమునకు మహాలక్ష్మీసంబంధ మత్యావశ్యకము (నాన్తరీయకము). "అగ్రతస్తే గమిష్యామి" అనియేగదా ఆమె మాట! కాగా, ఆమెననుసరించి నడచునట్లు దయాదేవి పరమపురుషు నవతరింపజేసినది. రావణునిచే మహోపద్రవమేర్పడిన సమయమునందు భూలోకములో నవతరించిన శ్రీరామునిచే రావణసంహారము మొదలగు నానా కార్యములు నిర్వహింపబడినను, వాని యందత్యన్తము శ్రేష్ఠమైనది సేతుబంధనమను కార్యమేయని యాచార్యులిచట సాధించుచున్నారు. ఋషులతో కలసిమెలసి యుండుట, రావణసంహారము మొదలగు కార్యములచే తత్కాలస్థితులకు లాభమే గాని, మనబోంట్లగు వెనుకటవారికెట్టి లాభమును లేదు. సేతుబంధనమనినచో, కల్పావసానమువరకు సర్వులకును ఉత్తమఫలము నియ్యదగినది. "సేతుం దృష్ట్వా సముద్రస్య బ్రహ్మహత్యాం వ్యపోహతి" అని ప్రమాణములు చెప్పినట్లొకపర్యాయము సేతువును గాంచినయెడల బ్రహ్మహత్య మున్నగు క్రూర పాపములు సయితము తొలగును. అట్టి సేతువు భగవంతునియొక్క యొక దయాకటాక్ష విశేషముచే తత్క్షణమునందే సంభవించినది. దానిచే సముద్రము రెండుగా విభక్తమాయెను. ఆ సేతువునేగదా యీనాటివరకు సర్వజనులును దర్శించి గతపాపులై సద్గతినొందుట! కాగా, రామావతారకార్యములో ఈ కార్యము చాలయు నుత్కృష్టమనియు, దయాదేవికి దీనియందు ముఖ్యోద్దేశము గలదనియు చెప్పుటకడ్డులేదుగదా! దీనినాలోచించియే యొక మహాకవి రామావతారములో అనేకకార్యములు సంభవించియుండినను సేతుబంధనమునకుగల యుత్కర్షమును కీర్తించి "సేతుబంధ"మను నొక యుత్కృష్టమైన మహాకావ్యమును ప్రాకృతభాషలో చాలకాలమునకు మునుపే రచించియున్నాడు.

"సకృదవేక్షణాత్, తత్క్షణాత్" అను పదములను "భగవంతుడు సముద్రమును కటాక్షించుటచే ఆ క్షణమునందే యేర్పడిన" అనియు నన్వయింపవగునని యోచించి రెండువిధములుగ నర్థము వర్ణింపబడినది. ఏ సేతువు భగ

వంతునికి లవణసముద్ర తరణమునకు కారణమాయెనో, అదేసేతువు మనబోం ట్లకు సంసారసముద్ర తరణమునకు (భగవత్సంబంధముచే) కారణమగుచున్న దను విషయమును "తం వీక్ష్య సేతుమధునాఽపి శరీరవంతః సర్వే షడూర్మి బహుళం జలధిం తరన్తి" అని మఱొకచోట నాచార్యులు సాధించియున్నారు.

శ్లో॥ కృపే పరవత స్త్వయా వృషగిరీశితుః క్రీడితం
జగద్ధితమ శేషత స్తదిదమిత్థమర్థాప్యతే ।
మదచ్ఛలపరిచ్యుతప్రణతదుష్కృతప్రేక్షితై ః
హతప్రబలదానవై ర్హలధరస్య హేలాశతై ః ॥ 88

అర్థ :— హే కృపే ! = ఓ దయాదేవీ !, త్వయాపరవతః = నీ కధీను డగు, వృషగిరీశితుః = వేంకటాద్రీశుడగు శ్రీనివాసునియొక్క, క్రీడితం = విహారము, అశేషతః = అంతయు, జగద్ధితం భవతి = లోకమునకు హితముగ నగుచున్నది, తదిదం = ఆ యీ క్రీడితము, మదచ్ఛలపరిచ్యుతప్రణతదుష్కృత ప్రేక్షితైః =(మద్యపానముచే నేర్పడిన) మదమనియెడు వ్యాజముచే స్మృతినుండి విచ్యుతమైన ఆశ్రితపాపనిరీక్షణము గల్గినవియు, హతప్రబలదానవైః = సంహ రింపబడిన అతిపరాక్రమశాలురైన అసురులను గల్గినవియునగు, హలధరస్య = బలరామునియొక్క, హేలాశతైః = అనేకలీలలచే, ఇత్థం = ఇట్లు లోకహితమే అని), అర్థాప్యతే = నిరూపింపబడుచున్నది.

అవతా॥ బలరామావతారములో దయాదేవీకృతోపకారమిట వర్ణింపబడు చున్నది.

తా॥ వేంకటాద్రీశుడగు శ్రీనివాసునియొక్క సర్వలీలలును ప్రపంచమునకు క్షేమకరములే. ఈ నిజమునెట్లు నిరూపించుటయనగా, బలరామావతారమునందు దీనిని చక్కగ కానంబడును. ఆ యవతారము నందాశ్రితపక్షపాతము బాలయు కాష్ఠాప్రాప్తముగనుండినది. కావుననే దుర్యోధనుని సమస్తాపరాధము లాయన నేత్రములకు గోచరములు కాలేదు. మద్యపానముచేయుట ఆ యవతారమునం దలవాటుగానుండెను. దానిచే నేర్పడిన మదమను వ్యాజముచే తననాశ్రయించిన వారియొక్క ప్రబలమైన దుష్కృతముల నాయన గమనించుటలేదు. కావుననే ఆశ్రితుల కెట్టికీడును సంభవించుటలేదు. తననాశ్రయించని దుష్టులగు అనేకా

సురుల నాయన వధించెను. ఆ వధముకూడ పూర్వోక్తప్రకారముగ వారి హితము నందే పర్యవసించును. కాగా, ఆశ్రితా నాశ్రితులను నిరువురి విషయములోను ఆయన ప్రవర్తించిన విధానము ( లీలలు ) జగత్తునకు హితమునే కలుగజేయు చున్నది గనుక శ్రీనివాసునియొక్క సర్వలీలలును లోకహితపరములనుటకెట్టి సంశయమును లేదుగదా !

మద్యపానముచే నేర్పడిన మదమనుట వ్యాజమేగాని ఆశ్రితపక్షపాతమే ఇచ్చట ముఖ్యకారణము. అనగా దయయే వారి యపరాధములను గమనింపకుండు టకు కారణమని భావము. ఈ శ్లోకమునకు విశేషతాత్పర్యమును "తత్త్వబోధిని" అను ద్రావిడ వ్యాఖ్యానములో చూడుడు.

శ్లో॥ ప్రభూతవిబుధద్విషద్భరణఖిన్నవిశ్వంభరా-
భరాఽపనయనచ్ఛలాత్త్వ మవతార్య లక్ష్మీధరమ్ ॥
నిరాకృతవతీ దయే ! నిగమసౌధదీపశ్రియా
విపశ్చిదవిగీతయా జగతి గీతయాంధంతమః ॥ 89

అర్థ :— హే దయే ! = ఓ దయాదేవీ !, త్వం = నీవు. ప్రభూతవిబుధ ద్విషద్భరణఖిన్నవిశ్వంభరాభరాఽపనయనచ్ఛలాత్ = దేవశత్రులగు ననేకాసురు లను భరించుటచే మిక్కిలి శ్రమజెందిన భూదేవియొక్క భారమును పోగొట్టుట యను వ్యాజముచే, లక్ష్మీధరం = లక్ష్మీపతిని, అవతార్య = (శ్రీకృష్ణునిగా) అవతరింపజేసి, నిగమసౌధదీపశ్రియా = వేదశిఖరమగు వేదాంతమునకు దీప శోభవంటిదియు, విపశ్చిదవిగీతయా=ఏ విద్వాంసులచేతను అప్రమాణమని చెప్ప బడనిదియునగు (సర్వ సంప్రతిపన్నమగు), గీతయా = భగవద్గీతచే, జగతి = ప్రపంచములో, అంధంతమః = గాఢ తమస్సును, నిరాకృతవతీ=పోగొట్టితివి.

అవతా॥ కృష్ణావతారము నందేర్పడిన దయోపకారము నీ శ్లోకమున వర్ణించుచున్నారు.

తా॥ శ్రీరామావతారములో ఎట్లు సేతుబంధనము చాలయు ప్రధానమో, అట్లే కృష్ణావతారములో ప్రధానకృత్యము గీతోపదేశమే. ఈ యవతారమున కుద్దేశ్యము, అసురభారమును మోయజాలని భూమి దేవియొక్క ప్రార్థననుస

రించి యామె భారమును వీడజేయుటయే (అసురులను సంహరించుటయే) యని పురాణములో వర్ణించియుండుట యొక వ్యాజము మాత్రమే. భూభారమును పోగొట్టుట ప్రధానోద్దేశముగాదు. గీతోపదేశమే ప్రధానోద్దేశము. కంసాద్యసుర సంహారములచే తత్కాలస్థితుల కానుకూల్యము గల్గియుండవచ్చును. కాలవ్యవహితులైన మనబోటి, లక్షలు కోట్లకొద్ది జనులకు గీతచేనేర్పడు ఆనుకూల్యము వర్ణింపదరమా ? కాగా, దయాదేవి యే కాలముననైనను, సమ్యజ్ఞానమును పొంది సర్వజనులును పరమక్షేమమును పొందవలయునని తలంచి లక్ష్మీపతి యగు పరమపురుషుని (శ్రీనివాసుని) కృష్ణుడుగా నవతరింపజేసి తన్మూలముగా నుత్తమ ప్రమాణమైన గీతాశాస్త్రమును ప్రపంచమున కొసంగెను. ఈ గీతాశాస్త్రము వేదశిఖరమగు వేదాంతమునకు దీపమువంటిది. వేదాంతములోనిమిడి యుండు సర్వ రహస్యములును ఈ దీపముచేతనే ఎఱుంగబడవలయును. సౌధమునకు దీపము వినాశోభగలుగనట్లు, ఈ గీతా సంబంధములేనిచో వేద వేదాంతములు శోభింపజాలవు. అనగా, తత్తాత్పర్యమెఱుంగ వీలుగాదని భావము. ఱెయు నీ గీతను ప్రమాణముగ నొప్పుకొనని పండితుడీప్రపంచములో లేడని చెప్పవచ్చును. అట్టియుత్తమప్రమాణమిది. గాఢతమస్సువంటి అజ్ఞానము నీ గీతా దీపమే పోగొట్టజాలినది. ఆ తమస్సును వదలినపుడేగదా యీ ప్రపంచమునకు పరమక్షేమమేర్పడుట । ఈ గీతలోనేగదా శరణాగతి నుపదేశించు చరమశ్లోకమమరియున్నది । కాగా, అజ్ఞానముతొలగి పరమపురుషార్థమగు మోక్షపర్యంతమైన పురుషార్థములను పొందుటకు సదుపాయముల నుపదేశించి సర్వకాలస్థులును క్షేమ - నందునట్లు చేయుచున్న యీ గీతోపదేశమునకంటె నుత్తమ దయాకార్యము వేఱొకటి యుండజాలదని తలంచి యీ యవతారమునకు దీనినే పరమ ప్రయోజనమనియు, ఇది దయాదేవిచే నేర్పడిన మహోపకారమనియు నాచార్యులు సాధించిరి.

శ్లో॥ వృషాద్రిహయసాదినః ప్రబలదోర్మరుత్ప్రేక్షిత
స్త్వేషా స్ఫుటతటిద్గుణ స్త్వ దవనేక సంస్కారవాన్ ।
కరిష్యతి దయే । కలిప్రబలఘర్మనిర్మూలనః
పునః కృతయుగాంకురం భువి కృపాణధారాధరః ॥ 90

అర్థ — హే దయే ! = ఓ దయాదేవీ !, త్వదవసేక సంస్కారవాన్ = నీచే (దయచే) తడుపుట (పూయుట) యను సంస్కారమును గల్గినదియు, వృషాద్రి హయసాదినః = వేంకటాద్రియందుండు గుఱ్ఱపురౌతగు శ్రీనివాసునియొక్క, ప్రబలదోర్మరుత్ప్రేజ్ఖితః = మిక్కిల బలముగలిగిన చేయి వీచుటలచే గలుగు గాలిచే నాందోళితమైనదియు, త్విషా = స్వకాంతిచే, స్ఫుటతటిద్గుణః = ప్రకాశించు మెఱపు దీగను గల్గినదియు, కలిప్రబలఘర్మనిర్మూలనః = కలిచే నేర్పడు ప్రబలతాపమును నిర్మూలించునదియునగు, కృపాణధారాధరః = కత్తియను మేఘము, భువి = భూలోకములో, పునః = మఱల, కృతయుగాంకురం = కృతయుగాంకురమును, కరిష్యతి = కలుగజేయు బోవుచున్నది.

అవ॥ కడపటిదియు, కలియుగావసానమున నేర్పడబోవునదియు నగు కల్క్యవతారమునందు దయాదేవిచే సంభవింపనున్న యుపకారము నీ దశకాంత్య మగు నీ శ్లోకములో వర్ణించుచున్నారు.

తా॥ కలియుగావసానమునందు పరమపాపులగు జనులే మిగుల గల రనియు, అప్పుడు భగవంతుడు వెల్ల గుఱ్ఱముమీద స్వారిజేయుచు హస్తోద్ధృత ఖడ్గుండై యా పాపులను నిశ్శేషముగ సంహరించి యీ దుష్కలిని ముగించి చాలయు ధర్మోత్తరమైన కృతయుగము నారంభింపబోవుచున్నాడనియు, ఇదియే ఆ యవతారముయొక్క ప్రధానకృత్యమనియు పురాణములు వర్ణించుచున్నవి. ఆ విషయము నాచార్యులిచట కవితాచిత్రములో చూపించుచున్నారు.

మేఘము సముద్రమునుండి యతిశీతలోదకమును సంపూర్ణముగ గైకొని పెద్దదగు గాలి సాయముతో ఆకాశమునందేకీభవించి యుత్తరక్షణమున మహా వర్షము కురియబోవుచున్నదనుటకు సూచకముగా పెద్ద పెద్ద మెఱపుతీగవలను గల్గినదై పిదప బాగుగ వర్షించి గ్రీష్మకాలముచే గల్గిన మహాతాపముచే శుష్కమై నశించిపోయిన పైరులను, భూమిని చల్లార్చి పునః సస్యాంకురముల నుద్భవింప జేసి ప్రపంచమునకెట్లు పరమక్షేమమును గలుగజేయునో, అట్లే శ్రీనివాసుని యొక్క భవిష్యత్కల్క్యవతారములో హస్తోద్ధృతమైన కృపాణమగు మేఘము గూడ లోకక్షేమమును గలుగజేయబోవుచున్నది. ఈ కృపాణమునకు భగ వద్దయలో తడుపుటయే నూనెతో పూయంబడు సంస్కారమగుచున్నది. అంతియ

గాక అయ్యెది, మేఘము సముద్రములోనుండి జలాదానము గావించుటవలెగూడ నగుచున్నది. నూనెపూసి సంస్కరింపనిచో కృపాణము చక్కగ పనిచేయదు. మేఘము జలస్వీకరణము గావింపనిచే వర్షింపజాలదు. ఈ కృపాణమను మేఘము భగవంతునియొక్క అతిప్రబలమైన భుజాటోపములచే గల్గిన గాలిచే ఆందోళిత మగుచున్నది. తళతళయని తీగవలె ప్రకాశించుటచే మెఱపుతీగతో కూడినదగు చున్నది. దయయందు తడిచి దానినే స్వీకరించియుండుటవలన యీ కృపాణ మేఘము దయావర్షమునే వర్షించును. అనగా, ఆ కత్తిచే సంహృతులగు వారందరును పరమపురుషుని దయచే సద్గతినొందుదురు. వారిని, పైపై దుష్కృత్యములు చేయనీయక సంహరించి సద్గతినొందజేయుట పూర్ణదయా కార్యముగదా! కాగా, ఈ కృపాణము దయావర్షమును వర్షించుచున్నదనుటలో నెట్టి యాక్షేపమును లేదు. ఇట్లు దయావర్షమేర్పడిన పిదప కలిక్రౌర్యముచే నేర్పడిన పాపములు తొలగి మఱల మిక్కిలి ధర్మయుగమైన కృతయుగము యొక్క మొలకయుద్భవింపనున్నవి. ఇంతయు దయాదేవిచే నేర్పడబోవు ఉప కారమే. ఈ యవతారములో దయాదేవి భగవంతుని కృపాణములో ప్రవేశించి పై జెప్పినకార్యములను గావింపబోవుచున్నది.

ఇట్లీ దశకములో ఆదిత ఆరభ్య క్రమేణ జలమాత్రచరమైన మత్స్యమును, జలస్థలోభయచరమైన కూర్మమును, స్థలమాత్రచరమైన వరాహమును, మృగ మనుష్య సంకలనారూపమైన నృసింహమును, అతిహ్రస్వమైన శుద్ధమానవరూపు డగు వామనుడును, అతిదీర్ఘరూపుడగు త్రివిక్రముడును, రజోగుణప్రచురుడైన పరశురాముడును, పూర్ణసత్త్వగుణోపేతుడై ప్రకటితమానుషమాత్ర భావుడైన దాశరథియును, మానుషభావము, పరత్వము ఉభయాకారములను ప్రపంచ మునకు వెల్లడించి పరిపూర్ణ బ్రహ్మస్వరూపిగా, సకలకల్యాణగుణాకరుడుగా, క్షీరమునకు శర్కరాసంపర్కమువోలె తనతో సహకరించిన బలరామునితో గూడినవాడునగు వాసుదేవుడును, కేవల పరరూపముతోనే ప్రకాశింపబోవు కల్కియును, (ఈ దశావతారములును) ఈ యవతారములలో నేర్పడిన సర్వ కృత్యములును భగవద్దయాకార్యములేయని నిరూపించి గతనవదశకములచే దయాదేవిచే ప్రపంచమున కేర్పడిన ఉపకారపరంపరల నాచార్యులు బహుధా విశదీకరించిరి.

దయాప్రవాహము తనయందు చేయవలసిన కార్యము నుత్తరదశకములో ప్రార్థింపబోవుచున్నారు.

శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః

నవమదశకము సమాప్తము.

---

## దశమ దశకము

శ్లో॥ విశ్వోపకారమితినామ సదా దుహానా
మద్యాఽపిదేవి ! భవతీ మవధీరయంతమ్ ।
నాథే నివేశయ వృషాద్రిపతేర్దయే ! త్వం
న్యస్తస్వరక్షణ భరం త్వయి మాం త్వయైవ ॥ 91

అర్థ :— హే వృషాద్రిపతేః దేవిదయే ! = ఓ వేంకటాద్రీశుని దయాదేవీ !, ఇతినామ = ఇట్లు ( గతనవదశకములలో నిరూపించినట్లు ), విశ్వోపకారం = ప్రపంచమునకు సకలవిధోపకారములను, సదా = ఎల్లప్పుడును, దుహానాం = పిండుచున్న (ఇచ్చుచున్న), భవతీమపి = నిన్నుగూడ, అద్యాఽపి = ఇప్పుడుగూడ, అవధీరయంతం = తిరస్కరించువాడును, త్వయైవ = నీ చేతనే, త్వయ్యేవ = నీయందే, న్యస్తస్వరక్షణభరం = అప్పగించబడిన నిజరక్షణభరమును గలిగినవాడునునగు, మాం = నన్ను, త్వమేవ = నీవే, నాథే = వేంకటనాధుడును లోకనాథుడునగు నీ నాథునియందు, నివేశయ = విడవడకుండ సంయుక్తునిజేయుము.

అవతా॥ గత నవదశకములలో దయాదేవిచే ప్రపంచమునకు సర్వకాలము నందేర్పడు సకలోపకారములను నిరూపించి ప్రపంచస్థులకును, స్వశిష్యపరంపరకును దయాదేవీమాహాత్మ్యము నుపదేశించుటకై యామెను స్తుతించిరి. అంతిమమైన ఈ దశకములో తన స్వరూపమునకు తగిన కొన్ని కోరికలను పూర్తిచేయునట్లు ప్రార్థించుచున్నారు. క్రింద నుపదేశించిన విషయములను స్వానుష్ఠానముఖేన ప్రకటీకరించుచున్నారని భావము. గతదశకమున

గతదశకమున విభవావతారవైభవములను, తదపేక్షయా ఉత్కృష్టములగు నర్చావతార వైభవములను విశదీకరించిరి. అట్టి యర్చలలో నుత్కృష్టతమమగు శ్రీనివాసార్చాద్వారా తాను కోరినఫలముల నిప్పించులాగు దయాదేవి నీ దశకములో ప్రార్థించుచున్నారు. క్రింది శ్లోకములో సర్వపాపులను సంహరించు కల్క్యవతారము ప్రస్తావింపబడినది. అట్లు సర్వపాపక్షపణసమర్థుడైన కల్కిరూపియగు శ్రీనివాసుడు నా పాపములనుగూడ దొలగజేయవలయును, ఇది దయాదేవియగు నీచేతనే కలుగవలయునని యీ శ్లోకములో వేడుకొనుచున్నారు.

తా॥ శ్రీనివాసుని యొక కామధేనువుగా నొనరించి దయాదేవి ప్రపంచమునకు కావలసిన సర్వోపకారములను క్షీరము నాయనయొద్దనుండి పిండి తల్లి బిడ్డలకు నొసంగునట్లు మనకర్పించుచున్నది. సృష్టిస్థితి ప్రళయకాలములలోను, ప్రపన్నుల విషయమునందును, తదితరవిషయమునందును, యోగులవిషయమునందును పరవ్యూహవిభవార్చాద్యవతారద్వారాను, మఱియు ననేకరీతులలోను బహువిధోపకారములను దయాదేవి యొసంగుచున్నదనియే యీ స్తోత్రములో నింతవరకు తొమ్మిది దశకములచేత విశదముగ నిరూపింపబడియున్నది.

ఇట్లు ప్రపంచవిషయమునందును, విశేషించి నాయందును బహూపకారముల నొసంగుచున్న తల్లివంటి నిన్ను దుష్టతనయునివలె నేను ఇప్పుడును తిరస్కరించుచున్నాడను. ఆహా! ఎంత క్రౌర్యము, అని యాచార్యులు తనను నికర్షించుకొనుచున్నారు. దయాదేవిని తిరస్కరించుటయనగా ;— శాస్త్రోక్తమైన విధినిషేధాదుల నతిలంఘించి తద్ద్వారా దయాదేవియొక్క యనుగ్రహము మనపై ప్రసరించుటకవకాశము నొసంగకుండుటయే. నాయొక్క ఆత్మరక్షణభరమును నీవే నీయందే యారోపించుకొని నన్ను రక్షించుటకై యుద్యుక్తవయి యున్నావు. అనగా ;— నేను నీయందు ప్రపత్తిచేసియున్నాను. ఆ ప్రపత్తిలో స్వతంత్ర కర్తృత్వముగూడ నీకేగలదని భావము. ఇట్టి స్థితిలోనున్నప్పటికిని యింత యుపకారముచేయు నిన్నుగూడ యిప్పుడును నేనవమతించుచున్నానని యాచార్యులనుచున్నారు. ప్రపత్తి చేసినపిమ్మటగూడ ప్రకృతిసంబంధవశమున పాపములు సంభవించనగును. అది దయను తిరస్కరించుటయే యను రహస్యార్థమిట వివక్షితము. అట్టి యపరాధములను చేయు నన్ను క్షమించి ముందు

నీవు నారక్షణభారమును స్వీకరించినదాని కనుగుణముగా శ్రీనివాసుని పాదారవింద ములలో విడివడని దృఢసంయుక్తస్థితిని తనకు కలుగజేయుమని ప్రార్థించు చున్నారు.

"వృషాద్రిపతౌ" అను పాఠము గలదు. అప్పుడు "నాథే" అనుట కద్ది విశేషణమగును.

శ్లో॥ నైసర్గికేణ తరసా కరుణే! నియుక్తా
నిమ్నేతరేఽపి మయి తే వితతిర్యది స్యాత్।
విస్మాపయేద్వృషగిరీశ్వరమప్యవార్యా
వేలాతిలంఘనదశేవ మహాంబురాశేః॥ 92

అర్థ:— హే కరుణే! = ఓ దయాదేవీ!, నైసర్గికేణ = (నీకు) స్వాభావికమైన, తరసా = వేగముచే, నియుక్తా = ప్రేరేపింపబడినదియు, (అతఏవ = కనుకనే), మహాంబురాశేః = సముద్రముయొక్క, వేలాతిలంఘనదశేవ = గట్టు నతిక్రమించుస్థితివలె, అవార్యా = ఎవరిచేనైనను అడ్డగించుటకు వీలుకానిదియు నగు, తే వితతిః = నీ ప్రవాహము, నిమ్నేతరే = మిట్ట మడవయైన (గర్వముచే చాలయు నుత్కర్షము నభిమానించు), మయ్యపి = నాయందు సయితము, యదిస్యాత్ = ప్రసహించెనేని, తదా = అప్పుడు, వృషగిరీశ్వరమపి = వేంకటాద్రీశునిగూడ, విస్మాపయేత్ = ఆశ్చర్యపరచును.

అవతా॥ క్రింది శ్లోకములో అత్యధికాపరాధములనుజేయు తననుగూడ శ్రీనివాసపాదారవిందమున జేర్పింపవలయునని వేడుకొనిరి. ఇట్టి యపరాధులు గూడ ప్రార్థించుటకు వీలగునట్లామె స్వభావమమరియున్నదని దయాదేవియొక్క గొప్పతనము నీ శ్లోకములో వర్ణించుచున్నారు.

తా॥ ప్రవాహము గట్టుబ్రద్దెంచుకొని యతివేగముగా ప్రవహించునపుడు మిట్ట మడవనుగూడ లక్ష్యముజేయక అచ్చటను ప్రసరించును. అట్లే నీ ప్రవాహము స్వభావముతోనే చాలయు వడిగలదిగనుక మిక్కిలి మిట్ట మడవయైన, అనగా:— దయాదేవి యనుగ్రహమేర్పడుట కనుగుణముగా నేవిధమైన సద్గుణము లేకుండుటమాత్రమేగాక దురభిమానాది దుర్గుణములు నిండియున్న నాయందు

గూడ-నిరాటంకముగా ప్రవహించును. నన్నును రక్షించెదవని భావము. ఇట్లు నీ ప్రవాహము నాపై ప్రసరించునపుడు సముద్రము మెరమీరి పొంగి ప్రవహించినచో దాని నెట్టివరైన నడ్డగించుటకు సాధ్యముగాదో, అటులనే నిన్నుగూడ ఎవరును (శ్రీనివాసుడును) అడ్డగించుటకు సాధ్యముగాదు గనుక ఆ శ్రీనివాసుడే నీ ప్రవాహమునుజూచి " ఆహా ! దయాదేవియొక్క దీనజనసంరక్షణ సంభ్రమమెట్టి " దని యాశ్చర్యపడుచున్నాడు. ఇట్లు తనయందు నిశ్చయముగ దయాదేవి యనుగ్రహమేర్పడునని యాచార్యులు తనను సమాశ్వాసపఱచుకొనుచున్నారు. ఇట్లాశ్వసించుటకు దయాదేవి కమరియుండు సత్స్వభావమే కారణము.

శ్లో॥ విజ్ఞాతశాసనగతిర్విపరీతవృత్త్యా
వృత్రాదిభిః పరిచితాం పదవీం భజామి ।
ఏవంవిధే వృషగిరీశదయే ! మయి త్వం
దీనే విభోశ్శమయ దండధరత్వలీలామ్ ॥ 93

అర్థ :— హే వృషగిరీశదయే = ఓ వేంకటాద్రీశుని దయాదేవీ!, విజ్ఞాతశాసనగతిః = ఎఱుంగబడిన శాస్త్రగతిని (దండనగతులను) గల, (అహం = నేను), విపరీతవృత్త్యా = విరుద్ధాచారముచేత, వృత్రాదిభిః = వృత్రాసురుడు, రావణుండు మొదలగువారిచేత, పరిచితాం = స్వీకరింపబడిన, పదవీం = మార్గమును, భజామి = పొందియున్నాను, ఏవంవిధే = ఇట్టి (చాలయు క్రూరుడైన) దీనే = అనాథుడును (నీ పాదములబడిన), మయి = నాయందు, విభోః = ప్రభువగు శ్రీనివాసునియొక్క, దండధరత్వలీలాం = దండించుట యను లీలను, త్వం = నీవు, శమయ = శమింపజేయుము.

అవతా॥ క్రింది శ్లోకములో దయాదేవియొక్క స్వాభావికమైన గుణమును వర్ణించిరి. ఈ శ్లోకము మొదలు తన స్వభావమును గుర్తించుచున్నారు.

తా॥ నేను సర్వశాస్త్రముల నెఱుంగుదును. ఏ యే యపరాధములను చేసినయెడల నెట్టి దండనములు లభించునని చక్కగ నెఱుంగుదును. అట్లయ్యు శాస్త్రప్రదర్శితమార్గమున నడచుటమాత్రములేదు. భగవదాజ్ఞ నుల్లంఘించుటనే ముఖ్యోద్దేశ్యముగాగల వృత్రాసురుడు, రావణుడు, శిశుపాలుడు మొదలగు లోక కంటకులైన భగవద్ద్రోహు లవలంబించిన త్రోవను నేను నవలంబించియున్నాను.

దానియందే నాకు స్వాభావికమైన రుచిగల్గియున్నవి. ఇది నా స్వభావము. ఇట్టి మహాఽపరాధియగు నన్ను; నేను దీనుడను, అనగా ననాథుడను; వేఱెవరి చేతనైనను కాపాడబడుటకు సాధ్యముగానివాడను, నీ పాదారవిందములలో బడినవాడనను నాకారములనుబట్టి తల్లీ! దయాదేవీ! నీవు నీ నాథుడు నాపై చాల కోపముతో విధింపబోవు దండనలను నిరోధింతువు గాతమని యిట్లు తనను నికర్షించి చెప్పుటద్వారా, ఎట్టి యార్ద్రాపరాధులకైనను దయాదేవిచే సద్గతిగల్గు నను శాస్త్రార్థము నాచార్యులు ప్రకటీకరించుచున్నారు. ప్రపత్తి చేసినపిదప బుద్ధి పూర్వకములైన పాపములు సంభవించినయెడల వానినిగూడ పునశ్శరణాగతి యను ప్రాయశ్చిత్తముచే పోగొట్టవచ్చునను రహస్యమిచ్చట నెఱుంగదగినది. తెలిసి పాపములు చేసినయెడల వానికి, తెలియక చేసిన వానికంటె దండన మధిక మని శాస్త్రములు చెప్పుచున్నవి. కనుక ఎక్కువదండనకు పాత్రముగావలసి యున్న నన్ను దీనుడను కారణమును బట్టి నీ స్వభావముచేతనే నీ నాథుని కోపింపనీయకుమని ప్రార్థించుచున్నారు.

శ్లో॥ మాసాహసోక్తిఘనకంచుకవంచితాన్యః
పశ్యత్సు తేషు విదధామ్యతిసాహసాని।
పద్మాసహాయకరుణే! న రుణత్సి కిం త్వం
ఘోరం కులిఙ్గశకునేరివ చేష్టితం మే॥ 94

అర్థ :— హే పద్మసహాయకరుణే!=ఓ శ్రీనివాసుని దయాదేవీ, (అహం= నేను), మాసాహసోక్తిఘనకంచుకవంచితాన్యః=సాహసము చేయకుమని యుప దేశమనెడు గట్టిదైన కవచమును (ఆచార్యవేషమును) ధరించి దానిచే పరులను వంచించువాడనై, తేషు=ఆ వంచితజనులు, పశ్యత్సునత్సు=చూచుచుండగనే, అతిసాహసాని=మిక్కిలి సాహసకార్యములను (అకృత్యములను), విదధామి= చేయుచున్నాను, కలిఙ్గశకునేరివ=కులింగ పక్షియొక్కవలె, ఘోరం=దారుణ మైన, మె=నాయొక్క, చేష్టితం=కృత్యమును, త్వం=నీవు, కిం న రుణత్సి= ఎలయడ్డగించకున్నావు.

అవతా॥ ఈశ్లోకమునందును తన స్వభావమును చెప్పుచున్నారు. బుద్ధి పూర్వకముగా నేనపరాధములను చేయుటమాత్రమేగాదు. ఇతరులకు సన్మార్గము

నుపదేశించుచు తత్సమక్షమునందే నే నతిక్రూరపాపముల నొనరించుచున్నా ననుచున్నారు. మఱియు గతశ్లోకములో నేను చేయు బుద్ధిపూర్వాపరాధములకు క్రూరదండనమేర్పడజేయక కాపాడవలయునని ప్రార్థించిరి. ఈ శ్లోకములో ఆ యపరాధములకు కారణీభూతమైన క్రూరపాపమునందే నాకు ప్రవృత్తి కలిగింపక రక్షింపనగునని వేడుకొనుచున్నారు.

తా॥ కులింగశకుని యను నొక పక్షిగలదు. అది యెప్పుడును " మా సాహసం కురు " = " సాహసమును చేయకము " అని యరచుచునే యుండును. సింహము నిద్రించునపుడయ్యది యావళించినచో తత్క్షణములో హఠాత్తుగ దాని నోట దూరి తద్దంతమధ్యగతమైన మాంసఖండములను ముక్కుతో పొడిచి తీసికొనివచ్చుట తత్స్వభావమట. ఈ కృత్య మెంతసాహసము? ఒక నిమేషము విలంబించినను సింహము నోఱుమూసికొనిన నే మగును? ఇట్టి మహాసాహసముచేయు నీ పక్షి యితరులకు సాహసము చేయకుమని యెప్పుడును ఉపదేశించుచున్నదట. ఈ పక్షి నడతవలె నా నడతయునున్నదని యాచార్యులు తన స్వభావము నిచట వర్ణించుచున్నారు. శాస్త్రముల నుల్లంఘింపరాదని పరులకు సర్వదా ఉపదేశించుచునే యుండు నేను, భయము, లజ్జయేమియులేక యతిసాహసమైన క్రూరకార్యములను నొనరించుచున్నాడ. ఆహా! నా సాహసమెట్టిది! ఓ దయాదేవీ! ఇట్టి నా సాహసకృత్యములను, పూర్వోక్త ప్రకారమున మాతృప్రేమగల నీవు ఏల యడ్డగింపవు? అని ప్రశ్నించుచున్నాడు. అనగా, భగవద్దయచేతనే అకృత్యములైన పాపకృత్యములలో రుచియు, ప్రవృత్తియు కలుగకుండవలయు ననుశాస్త్రార్థమిచట విశదీకృతమగుచున్నది. జ్ఞానము విశేషముగా కలుగవచ్చును. సమీచనానుష్ఠానమేర్పడుట చాలయు నరుదు. అయ్యది భగవదనుగ్రహైకలభ్యము. రాజసూయయాగములో భీష్మాచార్యులను నిందించిన శిశుపాలు డీ కులింగ శకుని నుపమానముగా చెప్పియున్నాడు. కులింగ శకుని స్వభావమును ; —

" కులింగశకునిర్నామ హరేర్దారితదంతినః
ముఖాదామిషమాదత్తే వదన్ మాసాహసం కురు "

అని పెద్దలు చెప్పియున్నారు.

శ్లో॥ విక్షేపమర్హసి దయే విఫలాయితేఽపి
వ్యాజం విభావ్య వృషశైలపతేర్విహారమ్ ।
స్వాధీన సత్త్వసరణిః స్వయమత్ర జన్తౌ
ద్రాఘీయసీ దృఢతరా గుణవాగురా త్వమ్ ॥ 95

అర్థ :— హే దయే ! = ఓ దయాదేవీ !, స్వాధీనసత్త్వసరణిః = తనకధీనమైన సత్త్వగుణమార్గమును గల్గినదియు (తనకధీనమైన జింకమొదలగు జంతువులయొక్క త్రోవను గల్గినదియు), ద్రాఘీయసీ = మిగుల పొడవైనదియు (బహుదూరము వ్యాపింపందగినదియు), దృఢతరా = చాలయు గట్టిదియునగు, గుణవాగురా = భగవంతుని కల్యాణగుణరూపమైన వల వలెనున్న (దారములచే చేయంబడిన వలవలెనున్న), త్వం = నీవు, విఫలాయితేఽపి = (నీవు వద్దని) చాలదూరము పరుగెత్తి పోయినను, అత్రజంతౌ = ఈ జంతువునందు (నాయందు), వృషశైలపతేః = వేంకటాద్రీశునియొక్క, విహారం = లీలను (వేటను), వ్యాజం = వ్యాజముగా, విభావ్య = కల్పించుకొని, స్వయం = స్వయముగనే, విక్షేపం = విక్షేపమునకు (వ్యాపింపుటకు ఎగిరి పట్టుకొనుటకు), అర్హసి = తగినదాని వగుచున్నావు.

అవతా॥ క్రింది శ్లోకమునందు కులింగపక్షివలెనున్న నన్ను సాహస కార్యములనుండి నిరోధించుమని ప్రార్థించిరి. ఈ శ్లోకములో అట్లు నిరోధించుటకు తగు నొక యుపాయమును విన్నవించుచున్నారు.

తా॥ అడవిలో స్వేచ్ఛగా పరుగిడి దాగుకొనుచున్న జంతువులను పట్టుకొనివచ్చి తన రాజభవనములోనుంచి వానికి హితమైన సర్వకార్యములను చేసి తన నాయకునితోగూడ ఆ ప్రాణులచే గలుగు నానందము ననుభవింపగోరిన యొక రాజమహిషి, తన నాయకుని, వేటవ్యాజముతో జంతువ్యాప్తమైన యొక మహారణ్యమునకు పిలిచికొనిపోయి గట్టిదగు నొక పెద్దవలను వైచి మృగములను పట్టి యెట్లు తన యభీష్టమును నెరవేర్చుకొనునో; అట్లే, ఓ దయాదేవీ ! నీవును చేయవలయునని ప్రార్థించుచున్నారు.

శ్రీనివాసుడగు నీ నాథుడడవిరాజు. ఆతని మహిషివగు నీకు నడవిలో మృగము లెక్కడెక్కడ సంచరించునో చక్కగ తెలియును. అనగా; విషయమనెడి యరణ్యములో సంచరించు నాబోటివారిగతి బాగుగ నీ వెఱుగుదువని

భావము. అట్టి విషయకాంతారమున సంతత సంచారి జంతువగు నన్ను పట్ట వలయును. ఓ దయాదేవీ ! అందుకునీవే దృఢమైనదియు, దీర్ఘమైనదియు నగు నొక వలగా నమరవలయును. వల దారములచే (గుణములచే) చేయంబడి యుండును, నీవును గుణరూపవే. అనగా, భగవంతుని ప్రధానగుణరూపవని భావము. నేనట్టి వలలో చిక్కుకొనక చాలదూరము పరుగిడి దాగుకొనజూచెదను. నే నెంతదూరము పరుగిడినను, దానికంటె పొడవుగా నీ వమరవలయును. అట్టులొక వేళ వలలోచిక్కినను నఖదంతాదులచే నా వలను ఛేదించి మృగములు పారిపోవునట్లు నేనును పారిపోవలచెదను. అట్టి సందర్భమున కవకాశము నొసంగక నీవు చాల గట్టిగనుండవలెను. నీవిట్టి వలగానుండి నాయందు ప్రసరించి నన్నుబట్టి యేతద్దశకారంభ శ్లోకములో ప్రార్థించినట్లు నీ నాథుని యొద్ద సమర్పింపుమని ప్రార్థించుచున్నారు. భగవంతునిదయ మనపై ప్రసరించుటకు వీలులేనట్లు ఉపర్యుపరి పాపములను గావించి భగవద్దయకు చాలయు దూరమున పారిపోవుచున్నాము. అట్లు పరుగెత్తినను పూర్వకృతమగు నేదోయొక్క సుకృతమును వ్యాజముగ గావించి మనలను విషయకరింప వచ్చునపుడు సైతము సాధ్యమైనంతవరకకృత్యములనే చేసి ఆ దయను వదలించుకొన జూతుము. అట్లుండినను దయాదేవి చాల గట్టిదైన వలవంటిదిగాన మనయొక్క తిరుగు బాటును లక్ష్యముచేయక గట్టిగ పట్టి తనకు స్వాధీనముచేసికొని తన నాథుని యొద్ద సమర్పించుచున్నదని తాత్పర్యము.

ఈ సందర్భములోనుండు శ్లోకములను ప్రపత్త్యుత్తరకాలమున సంభవించు బుద్ధిపూర్వోత్తరాఘములను శమింపజేయు విషయముగా వ్యాఖ్యానింప వచ్చునని గతశ్లోకములలో నిరూపించితిమి గావున నీ శ్లోకమునుగూడ తదనుగుణముగనే యన్వయించుకొనుట యుచితము.

ఒకసారి ప్రపత్తి చేసినపిదప ప్రారబ్ధకర్మవశమున బుద్ధిపూర్వమైన క్రూర పాపములేర్పడినను మనము చేయు నత్యల్పమైన పునశ్శరణాగతియను వ్యాజమునుబట్టి యా పాపములను క్షమించి దయాదేవి మనముకోరిన మోక్షఫలమును నిరాటంకముగ నిచ్చునను శాస్త్రార్థ మీ ప్రకరణమునకు సారార్థము.

కాగా, ఇట్లు నేను పరుగిడినను నీవేనన్ను పట్టుకొని స్వాధీనము చేసికొనినయెడల నాకు మఱల నట్టిపాపకార్యములు చేయుటకు త్రోవలేకపోవును.

అనగా, భగవద్దయాదేవియొక్క యనుగ్రహము పూర్ణముగ నేర్పడినపిదప పాపములో రుచియుండదు. ఇదియే నన్ను పాపములనుండి నివర్తింపజేయుట కుపాయమని భావము. లోకములో రాజులుచేయు వేటలో ప్రాణులకు నాశము కద్దు. ఈ వేటలో దయాదేవి సంబంధపడియుండుటచే పట్టుకొనబడిన యే ప్రాణులకును చావులేదనుట మాత్రమేగాక విశేషభోగములును గలవు. ఇదియే యిచట విశేషము.

" స్వాధీనసత్త్వసరణిః " అను శ్లిష్టపదముచే భగవద్దయాదేవి యనుగ్రహముచేతనే సత్త్వగుణమును, తాత్పర్యములగు సమీచీనజ్ఞానము మొదలగునవియు కలుగవలయునను తత్త్వార్థము బోధింపబడుచున్నది.

శ్లో॥ సంతన్యమానమపరాధగణం విచింత్య
త్రస్యామి హంత ! భవతీం చ విభావయామి ।
అహ్నాయ మే వృషగిరీశదయే ! జహీమా
మాశీవిషగ్రహణకేళినిభామవస్థామ్ ॥ 96

అర్థ:— హే వృషగిరీశదయే ! = ఓ వేంకటాద్రీశుని దయాదేవీ !, సంతన్యమానం = (నాచే) అవిచ్ఛిన్నముగా చేయంబడుచున్న, అపరాధగణం = అపరాధ సమూహమును, విచింత్య = తలచి, త్రస్యామి = భయపడుచున్నాను, భవతీంచ = నిన్నును, విభావయామి = స్మరించుచున్నాను, హంత = ఆశ్చర్యము !, ఆశీవిషగ్రహణకేళివిభాం = దుష్ట సర్పమునుబట్టి యాటాడుటతో సమమైన, మే = నాదగు, ఇమాం = ఈ, అవస్థాం = దశను, అహ్నాయ = త్వరగా, జహి = నశింపజేయుము.

అవతా॥ గతశ్లోకమునందు పాపములనుండి తన్ను విడిపించుటకొక యుపాయమును చెప్పిరి. ఇదిమొదలు దశకాంతమువరకట్టి పాపములనుండి స్వయముగనే విడివడుట వీలుపడదు, నీవే నీ మాతృత్వమున కనుగుణముగా నన్ననుగ్రహించి యీ పాపములనుండి నిరోధించవలెను, నీ స్వభావమునట్టిదే యని ప్రార్థించి దయకుండు పరమోదారత్వమును స్వపాపాపనోదనమను ప్రకృత విషయమున కనుగుణముగ కీర్తించుచున్నారు. (సశేషము)

తా॥ అడుగడుగున నేనాచరించెడు నపరాధములను. దానికి రాబోవు ఫలములను దలంచి మిక్కిలి భయపడుచున్నాను. వడవడవడకుచున్నాను. అయినను ఉత్తరక్షణములో నిన్నును, నీ స్వభావమును దలంచుచున్నాను. అప్పుడు కించిత్తుగ తేరుకొనుచున్నాను. ఎట్లైనను పుత్రవాత్సల్యోపేతవగు నీవు నన్ను కాపాడుదువని తలంచుచున్నాను. మఱియు నపరాధములు చేయుచున్నాను. భీతిలుచున్నాను. ఇట్లు ప్రకారవిషసర్పమును బట్టుకొని యాటలాడుటతో సమమైన నా స్థితిని శీఘ్రముగా తొలగింపుము. అనగా ; అడుగడుగున నపరాధములజేయు నీ సంకటపరిస్థితిని పోగొట్టి ఇకపై నే నపరాధములు గావింపనట్లు లక్ష్మిపడి నన్ను ముక్తతుల్యునిగాజేయుమని ప్రార్థించుచున్నారు. పాము నన్నుకఱచి చంపుటకు మునుపే యీ పాముతో నాటలాడవలెనను నా యాశను నీవు చంపెదవనుటచే, సంసారరుచి కించిత్తుగూడ నాకులేకుండునట్లనుగ్రహింపవగునని భావము.

ఇచట ఈ ప్రకరణముననుసరించి "భవతీం చ విభావయామి" యనుటచే ప్రపత్త్యుత్తర కాలమునందు గూడ పాపారంభక పాపములకు నివర్తకముగ మఱొక ప్రపత్తిచేయవచ్చునను శాస్త్రార్థమును బోధించి తాను గూడ ననుష్ఠించిరని పూర్వులు వ్యాఖ్యానించిరి.

శ్లో॥ ఔత్సుక్యపూర్వముపహృత్య మహాపరాధా-
మాతః ! ప్రసాదయితుమిచ్ఛతి మే మనస్త్వామ్ ।
ఆలిహ్య తా న్నిరవశేషమలబ్ధతృప్తిః
తామ్యస్యహో ! వృషగిరీశధృతా దయే త్వమ్ ॥ 97

అర్థ :-- హే మాతః ! = ఓ తల్లీ : దయాదేవీ !, మే = నా యొక్క, మనః = మనస్సు. మహాపరాధాన్=గొప్పయపరాధములను. ఔత్సుక్యపూర్వం= చాలయునాశతో. ఉపహృత్య=కానుకగానిడి. త్వాం = నిన్ను. ప్రసాదయితుం = సంతోషపరచుటకు, ఇచ్ఛతి=ఇచ్ఛగించుచున్నది. దయే!=ఓ దయాదేవీ !, వృషగిరీశధృతా = వేంకటాద్రీశుడగు శ్రీనివాసునిచే ధరింపబడిన, త్వం = నీవు, తాన్ = ఆయపరాధములను, నిరవశేషం = నిశ్శేషముగా, ఆలిహ్య=ఆస్వాదించి (భుజించి), అలబ్ధతృప్తిః = తృప్తినొందనిదానివై, తామ్యసి = తహతహపడుచున్నావు. అహో : = ఆశ్చర్యము !.

అవతా :— క్రిందిశ్లోకములో తనకికపై నపరాధము సంభవింపకుండు టకై పాపారంభక పాపనివర్తక ప్రపత్తి ననుష్ఠించిరి. కాగా, ఇంతవరకు పలు విధముల ప్రపత్తిచేసియున్నారు. ఇచట ప్రపత్తిచేయుట యనగా, తాను చేసిన యపరాధములకు ఫలమియ్యక నడ్డగింపుమని ప్రార్థించుటయే. ఇట్లు ఎన్ని సారు లెన్ని విధముల ప్రార్థించినప్పటికిని అనూయపరాధముల నాయారీతిగో యామె క్షమించును. ఆమె స్వభావమట్టిదను విషయము నిచట చిత్రముగ కీర్తించు చున్నారు.

తా॥ దయకాకలి గల్గినయెడల నామె యభిలషించి స్వీకరించునాహారము మన యపరాధములే. అనగా అపరాధులయొక్క యపరాధములను క్షమించి వారి ననుగ్రహించుట దయాస్వభావమని భావము. అట్లు ఆమె కోరెడు నాహారమైన యపరాధములను చాలయు నాదరముతో మూటలుమూటలుగా పలుసారులు పలు విధములుగా నేను సమర్పించి యామెను తృప్తిపెట్టగోరుచున్నాను. అనగా ; మోక్షార్థశరణాగతి, పునశ్శరణాగతి, పాపారంభకపాపనివర్తక శరణాగతి యను నట్టి శరణాగతులను చేయుచున్నానని భావము. కాని, ఆ దయాదేవి నాచే సమ ర్పింపబడిన సమస్తపాపములను నిరవశేషముగ మ్రింగివైచి తన యాకలి తీర నందుచే తృప్తిలేకుండ తపించుచున్నది. ఆమె యొక్క కడుపుగలిగినతన మెంతదో ఆశ్చర్యముగానున్నది గదా : అనునిట్టి చిత్రోక్తిచే దయాదేవికి గల పరమోదార స్వభావమును ప్రకటీకరించుచున్నారు. ఒకడెంత క్రూరపాపముల నాచరించినను శ్రీనివాసుని పాదారవిందములలోబడి తన్ను కాపాడవలయునని హృదయపూర్వకముగ ప్రార్థించినయెడల (ప్రపత్తిచేసినచో) ఆయన అంతటిని పరమదయతో క్షమించి యితనికి సద్గతినొసంగును. అట్టి పరమోదార స్వభావ ముగలవాడతడని భావము.

శ్లో॥ జహ్యాద్వృషాచలపతిః ప్రతిఘేఽపి న త్వాం
ఘర్మోపతప్త ఇవ శీతలతాముదన్వాన్ ।
సా మామయంతుదభరన్యసనాఽనువృత్తిః
తద్వీక్షణైః స్పృశ దయే ! తవ కేళిపద్మైః ॥ 98

అర్థ :— హేదయే ! = ఓ దయాదేవీ !. వృషాచలపతిః = వేంకటాద్రీశుడగు శ్రీనివాసుడు, ప్రతిఘే (సత్యపి) = కోప మేర్పడియుండినను. ఘర్మోపతప్తః = గ్రీష్మాతపముచే నుపతప్తమైన. ఉదన్వాన్ = సముద్రము. శీతలతాం ఇవ = తనకు స్వాభావికమైన చల్లదనమునువలె. త్వాం = నిన్ను. నజహ్యాత్ = వీడడు. సా = అట్టి. అరుంతుదభరన్యాసానువృత్తిః=మనసుకు వేదనగల్గించు పునఃపునః శరణాగతియను భరన్యాసముయొక్క యనువృత్తిని గల్గియున్న. త్వం = నీవు. మాం = నన్ను. తవ = నీ యొక్క. కేళిపద్మైః = విలాసవించు రూపములైన. తద్వీక్షణైః = ఆ శ్రీనివాసుని కటాక్షములచే. స్పృశ = తాకుము.

అవతా :— గతశ్లోకములో దయాదేవి మనబోటివారుచేయు ప్రకారాపరాధములను క్షమించుచున్నదని వర్ణించిరి. ఆ దయాదేవి ఎప్పుడును భగవానుని తోడనే యుండిననే గదా భగవంతుని మన యపరాధములను క్షమించునటుల చేయవచ్చును. కొన్నిసమయములలో (మన మపరాధము చేయునపుడు) భగవంతునికి కోపమేర్పడును గదా ! అప్పుడు దయాదేవీసంబంధములేనందుచే మన యపరాధములను క్షమింపజేయు వారెవరును లేనందున ఆ పాపములకు ఫలము లంభించియే తీరునుగదా ! అను సంశయమును పోగొట్టుటకై దయాదేవియొక క్షణముగూడ భగవానుని వదలియుండుటలేదు. కావున మన యపరాధములకు ఫలము సంభవింపదని యీ శ్లోకములో నిరూపించుచున్నారు.

తా॥ సముద్రము వేసవికాలములో సూర్యాతపముచే ఎంత వేడిగల్గినను క్రిందిభాగములోనైనను తనకు స్వాభావికమైన శైత్యగుణమును గల్గియే యుండును. ఆ గుణమునయ్యది యెప్పుడును వదలదు. అటులనే భగవంతునికి మనముచేయు నపరాధములచే కొన్ని సమయములలో కోపమేర్పడినను, ఆసమయమునందుగూడ, ఓ దయాదేవీ ! నీవు లోపలదాగియున్నావు. కోపముచే నొకవేళదండన మేర్పడినను దానిని హితపర్యవసాయిగావించి యాజీవుని కాపాడుచున్నావు. ఇట్లు ఒక క్షణముగూడ భగవానుని వీడక అతనికి పరమప్రీతిపాత్రవగు నీవు, ఒక ఫలమునుద్దేశించి రెండవసారి ప్రపత్తిచేసిన యెడల దానిని సహించుటలేదు. ప్రథమ పర్యాయము శరణాగతిచేసి నప్పుడే మనకు ద్రవించి కోరినఫలమునిచ్చుటకు సిద్ధముగానున్నపుడు మఱల నింకొకసారి దానినే యడుగుట గోరుచుట్టుపై రోకటిపోటువలె నీ మనస్సుకు చాలయు వేదనగలుగజేయుచున్నది. అపరాధములనడుగడుగునకునెన్ని పర్యాయములు చేసినను క్షమింతువు

గాని శరణాగతిని మాత్రము ద్వితీయ పర్యాయముచేసినను క్షమింపవు. నీ వంత మృదుస్వభావముగల దానివి. ఇట్టి నీవు నీ లీలార్థమై చేతబట్టుకొన్న తామర సమువలెనున్న నీ నాథుని శీతలకటాక్షములచే నన్ను స్పృశింతువు. అనగా, నీ నాథునికటాక్షము నాపై ప్రసరించునట్లనుగ్రహించుమని భావము. లీలారవింద మెట్లు స్వాధీనముగాను, స్వేచ్ఛానుసారముగా వినియోగార్హముగాను నుండునో, అట్లె భగవానుని కటాక్షముగూడ దయాదేవి కధీనముగాను, తదిష్టవినియోగార్హముగాను నుండుననుభావ మీదృష్టాంతముచే నెఱుంగదగినది. భగవంతుడు దయాపరాధీనుడని పండితార్థము. మఱియు, తామరసమునకున్న శైత్యమనోరమత్వాదిగుణములు భగవత్కటాక్షమునకునుగల వనుటయు నిచట వివక్షితము.

ఒకే ఫలముసుద్దేశించి రెండవసారి శరణాగతిని చేయుట శాస్త్రసమ్మతము గాదు. అది భగవంతునికి మనోవేదనను గలిగించుచున్నదను రహస్యార్థమిట "అరుంతుదభరన్యసనాఽను వృత్తేః" అను పదముచే బోధింపబడుచున్నది.

శ్లో॥ దృష్టేఽపి దుర్బలధియం దమనేఽపి దృప్తం
స్నాత్వాఽపి ధూళిరసికం భజనేఽపి భీమమ్ ।
బద్ధ్వా గృహాణ వృషశైలపతేర్దయే ! మాం
త్వద్వారణం స్వయమనుగ్రహశృంఖలాభిః ॥ 99

అర్థ :— హే వృషశైలపతేః దయే = ఓ వేంకటాద్రీశుని దయాదేవీ !, దృష్టేఽపి = కంటితో చూడబడియుండినప్పటికిని, దుర్బలధియం = కలతజెందిన బుద్ధినిగల్గినదియు (కల్గినవాడును), దమనేఽపి = శిక్షించినప్పటికిని, దృప్తం = దర్పముగల్గినదియు (కల్గినవాడును), స్నాత్వాఽపి = స్నానముచేసినను, ధూళిరసికం = దుమ్మునందాశగల్గినదియు (కల్గినవాడును), భజనేఽపి = (ఆశతో) సేవచేసినను, భీమం=భయంకరము(రుడు)గానుండు, త్వద్వారణం=నీయేనుగైన, (నిన్నువద్దని యడ్డగించుచున్న), మాం = నన్ను. స్వయం = నీవుగనే, అనుగ్రహశృంఖలాభిః = అనుగ్రహమను సంకెళ్లచే (వెనుకనుండివచ్చి పట్టుకొనుట కనుకూలమైన సంకెళ్లచే), బద్ధ్వా = కట్టి. గృహాణ = పట్టుకొనుము.

అవతా :— క్రింది శ్లోకమునందు భగవత్కటాక్షములచే నన్ను స్పృశింపు మనిప్రార్థించిరి. భగవంతుడు నన్ను కటాక్షించునట్లు చేయుమని భావము.

ఈ శ్లోకములో అట్లు భగవంతుడు నన్ను చూచినను నాకనాదికాలముగానుండు విషయవాసనచే మఱల నేను విషయభోగములయందా సక్తుడను గాగలను. నా స్వభావమంత నీచమైనది. కాన నన్ను నీవే కట్టిపెట్టుకొని కాపాడవలయునని ప్రార్థించు వ్యాజమున, జీవునికి భగవద్దయా కటాక్షమేర్పడినను ప్రకృతియందలి మోహము త్వరలో వదలదు. అయ్యది కేవల మీశ్వరానుగ్రహైక సాధ్యమను శాస్త్రార్థమును మదించిన గజమును దృష్టాంతీకరించి నిరూపించి. కడపట తన యపరాధములను మొఱపెట్టి నిర్వేదపడుచున్నారు.

తా॥ ఏనుగును మావటీడు తనకంటి చూపులచేతనే శమింపజేయుటకద్దు. ఐనను దానికి మదముపట్టినచో దానిబుద్ధి విపరీతమైయది యడకువతోనుండదు. అట్లే అంకుశముమొదలగువానిచే శిక్షించినను తద్దర్పమణగదు. దానిని బాగుగ మంచిజలముచే కడిగినను తత్క్షణమే అది దుమ్మును సర్వాంగములలో స్వయము గనే పూసికొనును. దానికెంత ప్రీతితో పరిచర్యచేసినను మదముచే భయంకర ముగానుండును. అట్టి గజమును దానికి స్వామియగువాడు మిగుల గట్టిదగునినుప సంకెళ్లచే వెనుకనేవెళ్ళి పట్టుకొని కట్టివేసి యెట్లు స్వవశముచేసికొనునో, అట్లె మత్తగజమునకు సముడనగు నన్ను నా స్వామినివగు నీవుకట్టిపెట్టుకొని కాపాడు మని వేడుకొనుచున్నారు.

భగవంతునిచే కటాక్షింపబడినప్పటికిని సన్మార్గమునందు దృఢచిత్తతలేక దుర్మార్గములోనే యేగదలంతును. పాపములకు తగిన శిక్షలనుపొందుచుండినను నాదర్పము శమించుటలేదు. మఱల నా పాపములనే చేసెదను. ఓ దేవీ! నీ ప్రవాహమనెడు గంగానదిలో స్నానముచేసిన పిదపయు (ప్రపత్తిచేసిన పిదపయు) దుమ్ముతో సమానమైన ప్రాపంచిక విషయముల నాసక్తుడనగుదును. బురద నెత్తిపూసికొందును. తల్లి బిడ్డకుసేవచేయునట్లతిప్రీతితో నీవు నాకునను గ్రహము చేసినను, నేనతిభయంకరుడుగనే యుందును. ఏనుగును రాజభవనములోనుంచి యెంత లాలనముచేసినను మదముపట్టినపుడు అరణ్యమునుదలంచి పారిపోవు నట్లు, నేనును విషయారణ్యములదలంచి నీపట్టునుండి వదలిపోవుదును. మఱియు నీవు వద్దని నిన్నడ్డగింతును. అట్టి నన్ను "నేను నిన్ను చేరినవాడను, నీయందు ప్రపత్తిచేసినవాడను" అను నాకారముచే నీ యనుగ్రహమను సంకెళ్లచే కట్టిపెట్టి రక్షింపుము. సన్మార్గములో స్థిరపరచుమని భావము. విషయవాసన అంతక్రూర

మైనది. దానిని దూరీకరించుట చాలయు కష్టమను విషయము నీ చిత్రముచే నాచార్యులిచట విశదీకరించియున్నారు.

అనంతర శ్లోకముతో నంతిమమగు నీ దశకము, స్తోత్రముగూడ నొక విధముగా సమాప్తిపొందుచున్నది. తత్పూర్వమైన యీ శ్లోకములో ప్రధానమగు నీ విషయమును (విషయవైరాగ్యమును తనకు గలుగజేయునట్లు) ప్రార్థించు చున్నారు.

"త్వద్వారణం" అనుపదమునకు "నీయొక్క ఏనుగును. నిన్ను నిరో ధించువానిని" యనియు, "అనుగ్రహ" అను పదమునకు "అనుగ్రహము, వెనుకనేగి పట్టుకొనుట" యనియు నర్థము.

శ్లో॥ నాతఃపరం కిమపి మే త్వయి నాథనీయం
మాతర్దయే! మయి కురుష్వ తథా ప్రసాదమ్।
బద్ధాదరో వృషగిరిప్రణయీ యథాఽసౌ
ముక్తానుభూతిమిహ దాస్యతి మే ముకుందః॥ 100

అర్థ :— హే మాతఃదయే := ఓ తల్లీ. దయాదేవీ!, వృషగిరిప్రణయీ= వేంకటాద్రివాసమునందత్యంతాసక్తుడైన, అసౌముకుందః = మోక్షప్రదాన సమర్థుడగు నీ శ్రీనివాసుడు, బద్ధాదరః = (నాయందు) ఆదరముగలవాడై, ఇహ = ఇచటనే, ముక్తాఽనుభూతిం = ముక్తులయొక్క అనుభవమును, యథాదాస్యతి = ఎట్లిచ్చునో, తథా = అట్లు, మయి = నాయందు, ప్రసాదం = అనుగ్రహమును. కురుష్వ = చేయుము. అతఃపరం = దీనికంటె. మే = నాకు, త్వయి=నీయందు, నాథనీయం = యాచింపదగినది, కిమపి న = ఏమియులేదు.

అవతా :— క్రింది శ్లోకమునందు "పరమాత్మని యో రక్తో విరక్తోఽపర మాత్మని" అనురీతిగ విషయవైరాగ్యముగల్గిన పిమ్మట మాత్రమే పరమపురుషుని యందు ప్రకంప్యమైన భక్తి గల్గును గాన మొదట తనకు విషయవైరాగ్యమును గల్గింపుమని ప్రార్థించిరి. అంతిమమగు నీ శ్లోకములో అతిప్రధానఫలమైన ముక్తులకేర్పడునట్టి పరమాత్మాఽనుభవము తనకీ తిరుమలలోనే లభింపవలయు నని ప్రార్థించుచున్నారు.

తా॥ తల్లీ ! దయాదేవీ ! కడపట నాకిదొక్కటియే నీ యొద్ద యాచింప దగినవస్తువు. ఇదితప్ప వేఱెద్దియులేదు. మహాలక్ష్మితోగూడిన శ్రీనివాసుడు పరమాపదముతో దుఃఖసంబంధములేక ముక్తులనుభవించు బహ్మానందానుభవమును ఈ కొండయందే నాకొసంగునట్లు నీవు నాయందు ప్రసాదము జేయుము. నావంటివారికి మఱొక ఫలమున నాశగలుగనేరదు. ఎప్పుడును అవిచ్ఛిన్నముగా భగవత్స్మరణానుభవాదులే అభిలషణీయములు. వైకుంఠలోకములో నేర్పడు ననుభవము సాక్షాన్ముక్తానుభవము. దానివలె నేనున్నంతవరకు నీ వేంకటాద్రియందే ఆ అనుభవమును నాకియ్యవలయునని పరమతాత్పర్యము. పరమవిరక్తాగ్రేసరులైన ఆచార్యులకీముక్తానుభవ మింతకుముందు లేదనుట లేదు. ఐనను, ఆ వస్తువులోనుండెడి యాదరాతిశయముచేతను, అయ్యది స్థిరముగా నుండవలయునను నభిప్రాయముచేతను అపూర్వముగా దానిని కోరునట్లు కోరుచున్నారు.

" బద్ధాదరః " అను పదమునకు " బద్ధేషు ఆదరోయస్యసః " అను వ్యుత్పత్తిచే బద్ధజీవులయందధికమగు నాదరమును జూపించి వారి కోరికలను పూర్తిచేసి " కలౌ వేంకటనాయకః " అనురీతిగ సర్వదేవతాసార్వభౌముడుగా నిలుచుస్థితి మన వేంకటేశ్వరస్వామికిగలదని యాచార్యులిట సూచించుచున్నారని పెద్దలు వ్యాఖ్యానింతురు.

దశమదశకము సమాప్తము.

శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః

## ఉపసంహారాష్టకము

శ్లో॥ నిస్సీమవైభవజుషాం మిషతాం గుణానాం
స్తోతుర్దయే ! వృషగిరీశగుణేశ్వరీం త్వామ్ ।
త్రైరేవ నూనమవశైరభినందితం మే
సత్యాపితం తవ బలాదకుతోభయత్వమ్ ॥ 101

అర్థ :— హే దయే ! = ఓ దయాదేవీ !, నిస్సీమపై భవజుషాం =ఎల్లలేని మహత్త్వముగల, గుణానాం = భగవంతుని జ్ఞానబలైశ్వర్యాదిగుణములు, మిష తాం (సతాం) = మేలుకొనుచుండునప్పుడే, వృషగిరీశగుణేశ్వరీం = వేంకటాద్రీ శుని గుణముల కీశ్వరివగు, త్వాం = నిన్ను, స్తోతుః = స్తోత్రముచేయుచున్న, మే = నాయొక్క విషయమున, అవశైః = పరవశములైన, తైః ఏవ = ఆగుణ ములచేతనే, అభినందితం = అభినందింపబడినది. (కాన) తవ = నీయొక్క, బలాత్ = బలముచే కలిగిన, (నిన్నాశ్రయించియుండుటచే) అకుతోభయిత్వం = ఎవరివద్దనుండియు భయములేని తనమనుట, (తైరేవ = ఆ గుణములచేతనే) సత్యాపితం = సత్యమని నిరూపింపబడినది. నూనం = నిశ్చయము.

అవతా :— గతదశదశకములలో తొమ్మిదిదశకములచే దయాదేవిని పలు రీతుల స్తోత్రముజేసి దశమదశకములో తన కభీష్టములైన ఫలములను ప్రార్థించి వంద శ్లోకములచే స్తోత్రమును పూర్తి చేసిరి. ఇకపై నుండు నెనిమిది శ్లోక ములలో, భగవద్గుణములయందు తాను స్తోత్రముచేయుటకు దయనే పరిగ్రహిం చుటలోగల యౌచిత్యమును, అపరాధక్షమణమును, సాత్త్వికత్యాగమును, ఏతత్స్తోత్రము ననుసంధించు వారికి గల్గుఫలసిద్ధి మొదలగు విషయములను పసం హారరూపముగ ప్రకటీకరించుచున్నారు.

క్రింది శ్లోకములో "ముక్తానుభూతిమిహ దాస్యతి" అనుటచే ముక్తు లనుభవించుననుభవము తన కిచ్చుటనే లభింపవలెనని ప్రార్థించిరి. ఈ శ్లోక ములో, అట్టి యనుభవము తనకొక విధముగా లభించినదనియే చెప్పుచున్నారు. ముక్తానుభవమనగా "న బిభేతి కుతశ్చనేతి" అని యుపనిషత్తులుచెప్పిన చొప్పున ఏ వస్తువునుండియు భీతినొందకయుండుటయే. అయ్యది తనకు సంభ వించినదను విషయము నొక యుత్ప్రేక్షామూలముగా ప్రకటీకరించి భగవద్గుణ ములలోదయను స్తోత్రముచేయుటకు పరిగ్రహించుటలోగల యౌచిత్యమును గూడస్పష్టీకరించుచున్నారు.

తా॥ తల్లీ ! దయాదేవీ !, నేను, భగవద్గుణములన్నింటికిని యీశ్వరివగు నిన్ను స్తోత్రముచేయు నపుడు జ్ఞానబలైశ్వర్యాదులును, మహాప్రభావశాలురునగు మిగిలిన భగవద్గుణములును తెప్పలార్పకుండ చూచుచునే యున్నవి.

" వృషగిరి గృహమేధిగుణాబోధబలైశ్వర్యవీర్యశక్తిముఖాః ।
దోషా భవేయురేతే యది నామ దయే! త్వయా వినాభూతాః ॥ "

యనియు. " గుణేషు సార్వభౌమీ " అనియు క్రింద చెప్పిన ప్రకారము సర్వ గుణములకును నీ చేతనే మహత్త్వము గల్గుచున్నది. నీవే వాని యన్నింటికిని స్వామినివని తలంచి ఆట్టి గుణముల ననాదరించి నిన్ను స్తోత్రముచేసితిని. ఈ స్తోత్రమును వినుచుండిన యా గుణములు పరవశములై శిరః కంపముచేసి నిన్నామోదించినవి. చెట్టుకు వేళ్లున నీరుపోసినయెడల చివుళ్లు, పుష్పములు, ఫలములు మొదలగువానికి పుష్టి యేర్పడునట్లు సర్వభగవద్గుణములకును; "గుణము" అను తత్త్వమును గల్గించు దయను స్తుతించినయెడల తద్ద్వారా మిగత గుణముల ప్రభావము కూడ స్థిరీకరింపబడినట్లే. ఇదియే శాస్త్రరహస్యముగావున నీ విషయము నెఱింగిన యా గుణములు ఈ స్తోత్రము నామోదించుచున్నవని భావము. కావుననే నే నా గుణములకు భీతిలక నిన్నే స్తుతించితిని. నీ యొక్క బలము నాకేర్పడినందున ఎవరి యొద్దనుండియు నిర్భయత్వదశ నాకేర్పడినది. ఇది నిజమేయను విషయము నా గుణములే నిరూపించినవి. అతిప్రబలమైన యా గుణముల యొద్దగూడ నేను భయపడలేదుగదా! దీని నయ్యవియు నామోదించుచున్నవిగదా! ఇంతకును, హే దయే! నీ బలమే కారణమను నీ చమత్కారోక్తిచే, భగవద్దయానుగ్రహము గల్గినచో అకుతోభయత్వమను ముక్తానుభవమిచటనే కలుగవచ్చునను శాస్త్రార్థమును తననే యుదాహరించి యాచార్యులు నిరూపించిరి.

శ్లో॥ అద్యాఽపి తద్వృషగిరీశదయే! భవత్యా —
మారంభ మాత్రమనిదం ప్రథమస్తుతీనామ్ ।
సందర్శిత స్వపరనిర్వహణా సహేథాః
మందస్య సాహసమిదం త్వయి వందినో మే ॥ 102

అర్థ:— హే వృషగిరీశదయే! = ఓ శ్రీనివాసుని దయాదేవీ!, భవత్యాం = నీయందు, అనిదంప్రథమస్తుతీనాం = " ఇది " యని గుర్తింపవగిన యొకకాలము నుత్పత్తికాలము గాగలది యనుట లేకుండ సర్వకాలములతోను నిత్యమునుండు వేదమనెడు స్తోత్రములకు, అద్యాఽపి = నేటివరకు, ఆరంభమాత్రం = ఆరంభ

మాత్రమే కలదు, తత్ = అందుచే. త్వయి = నీ విషయములో, మందస్య = మందుడగు, వందినః = స్తుతి పాఠకుడైన, మే = నా యొక్క, ఇదం = ఈ, సాహసం = సాహసమును, సందృశ్యిత స్వపరనిర్వహణా = చూపఁబడిన స్వపర నిర్వాహకత్వముగల నీవు, సహేథాః = సహింతువు గాక!

అవతా॥ గత శ్లోకములో భగవద్గుణములయందు దయకుగల యుత్కర్ష మును జూపి తదవలంబముచేతనే తనకు నకుతోభయత్వమేర్పడినదని చెప్పి దయాదేవియొక్క తనకృతజ్ఞత నావిష్కరించిరి. ఈ శ్లోకమునందును, ఉత్తర శ్లోకమునందును, అట్టి మహాప్రభావముగల దయాదేవిని మందబుద్ధినగు నేను స్తుతించుట చాలయు సాహసమైన కార్యము. దీనింజేసిన నన్నామె క్షమింప నగునని వేడుకొనుచున్నారు. మరియు నీ శ్లోకములో దయాదేవికి వేదప్రతి పాద్యత్వమును, ఉత్తర శ్లోకములో ప్రధాన వేదోప బృంహణమైన యితిహాస రత్న రామాయణ ప్రభృతి ప్రతిపాద్యత్వమును వర్ణించుచున్నారు.

తా॥ పురుషనిర్మితముకానందున నెట్టి దోషములకును నవకాశములేక ఎప్పుడును నిత్యముగా వెలుగుచున్న వేదము భగవత్ప్రభావమును వర్ణింప వచ్చిన యనాది స్తోత్రములే. అట్టి వేదరూపమైన స్తోత్రములుగూడ భగవద్గుణ ములను వర్ణింప నారంభించి యీదినమువరకు నారంభదశలోనే యున్నవి. ఒక గుణమునందు కోటిలో ఒక భాగమునుగూడ వర్ణింపంజాలక యారంభదశలోనే యున్నవని భావము. అట్టి మహాప్రభావముంగాంచిన గుణసార్వభౌమివగు నీ విషయమును నతిమందబుద్ధినగు నేను స్తుతించుట యనునది చాలయు సాహసమే. అపరిచ్ఛిన్న ప్రభావముగల నిన్నొక పరిచ్ఛేదములో నిలిపి నీ ప్రభావమును తగ్గిం చుటగా నీ కార్యమున్నదని చెప్పవచ్చును. అట్టి కార్యమునుచేయు స్తుతిపాఠకు డనగు నా కృత్యమును స్వపరనిర్వహణ స్వభావముగల నీవు క్షమింపవలయునని ప్రార్థించుచున్నారు. స్వపరనిర్వహణమనగా:— ఇతర పదార్థములను తాను నిర్వహించునట్లు తననుగూడ తానే నిర్వహించుకొనుట. చీకటిలోనుండు వస్తు వులను (వెలిగింపబడిన) దీపము తెలియపరచును. ఆ దీపమును తెలియపరచు టకు మరొక దీపమును వెలిగింపవలసిన యావశ్యకత లేదు. దీపము తనను తానే ప్రకాశపరచుకొని యితరవస్తువులను ప్రకాశపరచుటచే దానిని స్వపరనిర్వా హకమని చెప్పవచ్చును. ఇట్లే, "సంబంధము" అను ధర్మమునందీ స్వపర

నిర్వాహకత్వమును శాస్త్రజ్ఞులుపపాదింతురు. దయయు నిట్టిదే. దయ ఇతరుల మనస్సులో ప్రవేశించి అపరాధులయొక్క యపరాధమును క్షమించునట్లు చేయును. స్వవిషయములో చేయు నపరాధములను క్షమించుటకు మరొక దయనాశ్రయింపదు. స్వవిషయములో నేర్పడు అపరాధముల నితర పురుష కారములేకయే స్వయమే క్షమించి యితరుల విషయములో నేర్పడెడి యపరాధములను క్షమించవలసిన సమయములో వారి మనస్సులో ప్రవేశించి వారికి పురుష కారముగానుండి వారినిగూడ క్షమింపజేయునట్లు చేయుచున్నదని భావము. ఇట్టి స్వభావముగలదానివి గనుక నిన్ను స్తోత్రముచేయుట యను నీ యపరాధమును నీవే క్షమింపవలయునని ప్రార్థించుచున్నారు.

శ్లో॥ ప్రాయో దయే! త్వదనుభావమహాంబురాశౌ
ప్రాచేతసప్రభృతయోఽపి పరం తటస్థాః।
తత్రావతీర్ణమతలస్పృశమాప్లుతం మాం
పద్మాపతేః ప్రహసనోచితమాద్రియేథాః॥ 103

అర్థ :— హే దయే = ఓ దయాదేవీ!. త్వదనుభావమహాంబురాశౌ = నీ మహిమ యనెడు పెద్ద సముద్రమునందు, ప్రాచేతసప్రభృతయోఽపి = వాల్మీక్యాది మహర్షులుకూడ, ప్రాయః = తఱచుగా. తటస్థాః పరం = గట్టుననే నిలిచినవారైరి, తత్ర = ఆ సముద్రమునందు. అవతీర్ణం = దిగినట్టియు, అతలస్పృశం = అడుగునేలను పొందనట్టియు. ఆప్లుతం = తేలుచున్నట్టియు (అడుగడుగున మునుగుచున్నట్టియు). అతఏవ = కావుననే. పద్మాపతేః = శ్రీనివాసుని యొక్క, ప్రహసనోచితం = హాస్యాస్పదుడనగు. మాం = నన్ను. ఆద్రియేథాః = ఆదరింతువుగాక!

అవతా॥ క్రింది శ్లోకములో స్తోత్రముచేయుటయను సాహసకృత్యము చేసిన తనను క్షమింపవలయునని ప్రార్థించిరి. ఈ శ్లోకములో అట్లు క్షమించుటయే గాక నన్నాదరింపవలయును గూడనని ప్రార్థించుచున్నారు. ఎందులకాదరింపవలయుననగా: నీ నాథుఁడగు శ్రీనివాసునకును, తద్దివ్యమహిషియగు పద్మావతికిని నొకవిధమగు హాస్యమును గలిగించుటచేతనే యను నొక కారణమును చూపు

వ్యాజమున మతెవ్వరిచేతను చేయబడని యొక విలక్షణమైన దయాస్తోత్రమును తాము చేసి భగవద్దయకున్న ప్రభావమును వెల్లడించిన ప్రక్రియను సూచించుచున్నారు.

తా॥ భగవద్గుణములును, తచ్చరిత్రమును విశిష్య వర్ణించుటకు ప్రవర్తించిన యాదికవియగు వాల్మీకియు, తదనుసారులైన తదితర మహర్షులును భగవద్గుణములలో ప్రధానమైన దయయొక్క మాహాత్మ్యమును విశదీకరింపకయే "అదొక పెద్దసంద్రము. దానియందు దిగుట సాధ్యముకానిపని" యని తలంచి గట్టుననే నిలిచిపోయిరి. అనగా ;— ఆ దయకు గట్టువలెనున్న భగవానుని యందే నిలిచిపోయిరని భావము. ఆదికవి మొదలగు మహర్షులే యట్లుండ నితర కవులంగూర్చి చెప్పందగిన దేమున్నది ? ఇట్లు వారిచేతనే అసాధ్యమని తలంచి వదలబడిన యీ దయాప్రభావ సముద్రములో దిగుటయను సాహసకృత్యము అనగా ; దయాప్రభావమును వర్ణించుట యను కార్యమునుచేయదలచి నేను దానియందు దిగివైచితిని. కాని యా సముద్రములోని యడుగుభాగమును కనిపెట్టి, అంతవరకు నరిగి యందున్న సమస్త విశేషముల నెఱుంగజాలక వ్యధనొందుచుంటిని. దానిలోతు అంత గా నున్నది. దయాప్రభావమపరిచ్ఛేద్యమని భావము. అడుగునేల కనిపింపకపోవుటచే అడుగడుగునకు మునుగ యత్నించి వను తేలిపోవుచున్నాను. ఈ స్థితిలోనుండువన్ను గాంచి దివ్యదంపతులు నవ్వుచున్నారు. ఇట్లు వారికొక వినోదరసమును గల్గించుటచే ఈ కారణమునుబట్టియైనను నన్ను నీ వాదరింపవలయునని ప్రార్థించుచున్నాను.

చాలయు పెద్దలుగూడ చేయకవదలిన విషయములో సాహసముతోదిగి పూర్ణముగ నా విషయమును వివరింపజాలక యగచాట్లపాలగు నన్నాదరింపవలయునని ప్రార్థించు వ్యాజముచే తన నైచ్యమును, దయకున్న విపులప్రభావమును బోధించుచున్నారు.

ఎవతిచేతను చేయబడనిదియు, చేయుటకు వీలుగానిదియునగు నీ దయాప్రభావ వర్ణనమనియెడు ఉత్తమ కైంకర్యము నాచరించిన స్వవిషయములో దివ్యదంపతులు చాలయు సంతసిల్లి మందహాసము చేయుచున్నారు. కావున తద్ధర్ష దయాహ్లాదకమగు నీ కైంకర్యము నాచరించిన నన్ను ఓ దయాదేవీ ! నీవవశ్యమాదరింపవలయునని ప్రార్థించుచున్నారనుట యుచితి యాంతర తాత్పర్యమని కొందరు వర్ణింతురు.

శ్లో॥ "వేదాంతదేశిక" పదే వినివేశ్య బాలం
దేవో "దయాశతక" మేతదవాదయన్మామ్।
వైహారికేణ విధినా సమయే గృహీతం
వీణావిశేషమివ వేంకటశైలనాథః॥ 104

అర్థ :— వేంకటశైలనాథః = వేంకటాద్రీశుడగు. దేవః = దేవతాసార్వభౌముండగు శ్రీనివాసుడు. బాలం = బాలుడగు నన్ను. వేదాంతదేశికపదే = వేదాంతాచార్యపదములో, వినివేశ్య=ఉంచి. వైహారికేణవిధినా=విహారార్థరామగు నొక రీతిచే, సమయే = ఒక సందర్భమునందు, గృహీతం = పరిగ్రహింపబడిన. వీణావిశేషమివ = ఒకవిధమైన వీణను వలె. మాం = నన్ను (నామూలముగా). ఏతత్ = ఈ. దయాశతకం = దయాశతకమను స్తోత్రమును. అవాదయత్ = వినదింపంజేసెను.

అవతా॥ అథ స్తనపద్యద్వయముచే ఈ సాహసము నాచరించిన తన్ను క్షమించి యాదరింపవలయునని ప్రార్థించిరి. ఈ పద్యమునందీ స్తోత్రమును నేను రచింపలేదు. సాక్షాత్పరమపురుషుడగు శ్రీనివాసుడే నన్నొక యుపకరణముగా చేసికొని రచించెనని యనుసంధించి సాత్త్వికత్యాగము ననుష్ఠించుచున్నారు. దీనిచే ఈ గ్రంథముయొక్క ప్రభావముగూడ వెల్లడించినట్లగుచున్నది. పండ్రెండవ శ్లోకము మొదలు గతశ్లోకమువరకు దయాదేవిని నేరుగా సంబోధించి విన్నవించిరి. ఇది మొదలైదుపద్యములు తనకంతరంగులగు వారినిగూర్చి యీ స్తోత్రప్రభావము. దీనినభ్యసించువారికి గలుగు ఫలము మొదలగు విషయముల నుపదేశించునవిగా యమరియున్నవి.

ఒకప్రభువు విహారసమయములో ఒకవీణను చక్కగమీటి దానియందు తనకిష్టమైన యుత్తమ పద్యములను పాడించి స్వయముగ సంతసించి స్వకీయులనుగూడ ఎట్లు సంతసింపజేయునో, అట్లే జగద్వ్యాపారలీలారసికుడైన శ్రీనివాసుడు ఎట్టిజ్ఞానములేవి యచేతనమైన వీణతో సముడనగునన్ను "వేదాంతాచార్యుడ" ను స్థానమునందుంచి "దయాశతక" మను నీ స్తోత్ర పద్యములను

నాద్వారా పాడించెను. వీణతోపాడునపుడు గౌరవమంతయు నెట్లు వాయకునకే చేరునో, అట్లే యిచ్చటగూడ నేతద్గ్రంథ గౌరవమంతయు శ్రీనివాసునికే చెందుచున్నది. తనకు దీని యందెట్టి భాగమునులేదని తన తత్కర్తృత్వమును, భగవదుక్తమనుటచే ఈ స్తోత్రమునకు గలయుత్కర్షమును బోధించి సాత్త్వికత్యాగము ననుష్ఠించుచున్నారు. "వేదాంతాచార్య" పదవిలోనుంచి నాద్వారా ఈ స్తోత్రమును రచింపజేసెనని చెప్పుటచే ఈ స్తోత్రములో సర్వ వేదాంతరహస్యార్థములు నిమిడియున్నవని సూచితమగుచున్నది. అట్టి యున్నతపదవి నధిష్ఠించినవారు గాక మఱొకరిచే చేయుటకు సాధ్యముగాని కార్యమిదియని మనము తెలిసికొనవలయును. ఇట్లే "బాలం" అను పదము నిచట ప్రయోగించుటట్లు చేసిన పరమపురుషుని యాశయమేమనగా ;— "పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్" అను నుపనిషదుక్త ప్రక్రియ ననుసరించి విశేషప్రభావము గాంచిన మన యాచార్యులే (వేదాంతదేశికులే) ఈ "వేదాంతదేశిక" పదమున కర్థులని సూచించుటయే.

మఱియు "వేంకటశైలనాథోఽవాదయత్" అని చెప్పుటచే ఆచార్యులకును "వేంకటనాథు" డనే పితృకృత నామము గావునను. సాక్షాచ్ఛ్రీనివాసావతారమే ఆచార్యులను విషయమును "వేంకటేశావతారోఽయమ్" ఇత్యాదులచే ఆచార్యుల కుమారుడు మొదలగు మహనీయులు కీర్తించియున్నారు. కావునను ఈ స్తోత్రములో ప్రయోజకకర్తృత్వము, ప్రయోజ్యకర్తృత్వము రెండును (శ్రీనివాసవేదాంతదేశికరూపమున) శ్రీనివాసునికే గలవని చెప్పుటలో ఆటంకమేమియు లేదనియు నెఱుంగవలయును. ఆచార్య చరిత్రములో శ్రీరంగనాథుడు "వేదాంతాచార్య" బిరుదము నాచార్యులకొసంగినట్లైతిహ్యము కలదు. ఇచట శ్రీనివాసుడు తనకాపదమునిచ్చినట్లున్నది. శ్రీనివాసుడు రంగనాథుడను నిరువురు నొకరే కావున రంగనాథుడొసంగిన బిరుదమును శ్రీనివాసుడొసంగినట్లనుసంధించుటలో విరోధములేదు. ఇంతియగాక ఇప్పుడు సర్వులయొక్కయు ననుసంధానములో నుండు "వేంకటేశాష్టోత్తరశతనామ" ములలో "కృష్ణాఖ్య విప్రవేదాంత దేశికత్వప్రదాయ చ" అని యొక నామము గలదు. దీనిచే "కృష్ణు" డను నొక బ్రాహ్మణోత్తమునకు "వేదాంతదేశిక" డను బిరుదమును

శ్రీనివాసుడిచ్చి నట్లేర్పడుచున్నది. గాన మన ఆచార్యులే పూర్వజన్మములో "కృష్ణుడ" ను బ్రాహ్మణుడని చెప్పుటలో నెట్టి యాక్షేపణలకవకాశము లేదు. గనుక ప్రథమమున శ్రీనివాసుడిచ్చిన బిరుదునే ఆచార్యావతారదశలో రంగ నాథుడుస్థిరపరచినాడని చెప్పవచ్చును. ప్రథమతః ఆ బిరుదమును తనకు శ్రీనివాసుడే యొసంగె గాన ఇచట "వేంకటశైలనాథః వేదాంతదేశికపదేవిని వేశ్యబాలం" అని శ్రీనివాసుని విషయము ననుసంధించియున్నారనుటయు నిచట సమాధానముగా భావింపవచ్చును.

శ్రీనివాసుడు తనను తానే స్తుతింపుకొనెనను దోషమునకవకాశము లేకుండ దయను స్తుతించియుండుటచే ఏమాత్రమును సంకోచములేక ఆమె ప్రభావమును పూర్ణముగా. చక్కగా ఈ స్తోత్రములో వెల్లడించియున్నాడు. ఇది "దయా శతకమే" గాని శ్రీనివాసశతకముగాదుగదా! ఇదియే "దయాశతక" పదముచే గలుగు రహస్యార్థము.

శ్లో॥ అనవధిమధికృత్య శ్రీనివాసానుకంపా —
మవితథవిషయత్వాద్విశ్వమవ్రీడయంతీ ।
వివిధకుశలనీవీ వేంకటేశప్రసూతా
స్తుతిరియమనవద్యా శోభతే సత్త్వభాజామ్ ॥ 105

అర్థ :— అనవధిం = ఎల్లలేని, శ్రీనివాసానుకంపాం = శ్రీనివాసుని దయను. అధికృత్య = విషయీకరించి. వేంకటేశప్రసూతా = వేంకటేశునిచే నిర్మింపబడినదియు. అవితథవిషయత్వాత్ = అసత్యముగాక సత్యమైన విషయమునే గల్గియుండుటచే, విశ్వం = అందరిని. (ఏ ఒక్కరినైనను). అవ్రీడయంతీ = సిగ్గుపడునట్లు చేయనిదియు. వివిధకుశలనీవీ = సకలవిధక్షేమములకును మూలధనమైనదియు. అనవద్యా = ఎట్టి దోషములేనిదియునగు, ఇయంస్తుతిః = ఈ స్తోత్రము, సత్త్వభాజాం = సత్త్వగుణోపేతులకు. శోభతే = సమీచీనమని స్ఫురించును.

అవతా॥ క్రింది శ్లోకములో సాత్త్వికత్యాగము నాచరించిరి. ఇచ్చట ఈ స్తోత్రమునకుగల మహత్త్వమును ప్రకటించుచున్నారు. ఇంతియగాక గత

శ్లోకములో వక్తృవైలక్షణ్యముచే గ్రంథమునకుగల యుత్కర్షమునుజూపి యిచట విషయవైలక్షణ్యముచే గలుగు నుత్కర్షమును నిరూపించుచున్నారనియు సంగతి చెప్పనగును. మఱియు సర్వఫలముల నీ స్తోత్రమొసంగుననని చెప్పుటచే ఫలశ్రుతి పరముగాను చెప్పవచ్చును.

తా॥ శ్రీనివాసునిదయకు నెల్లయిలేవు. తత్ప్రభావమపారమని భావము. అట్టి దయావిషయమైన ఈ స్తోత్రమెవ్వరికిని సిగ్గును గల్గించుటలేదు. అనగా: — లోకమున నొకరిని స్తుతించునప్పుడు వారియొద్ద లేని గుణములను గణించినచో నయ్యది మిథ్యాస్తుతి గావున నాస్తోత్రమును చెప్పువానికిని. స్తుతింపంబడు వానికిని ప్రక్కనుండి వినువారికిని నొక విధమైన లజ్జగల్గించుట లోకసిద్ధము. అయ్యది పరిహాసముచేయునట్లు దలంచుటకవకాశము గూడకద్దు. ఈ స్తోత్రములో దయా విషయముగా చెప్పిన మాటలన్నియు సత్యములుగాను. మిథ్యాసంబంధ లేశము లేనివిగాను నుండుటచే స్తోత్రము నాచరించిన నాకును, స్తుతి విషయీభూతయైన దయాదేవికిని. లేక ప్రక్కనుండి విను మందు శ్రీనివాసునికైనను. ప్రాపంచికులకును — ఎవ్వరికిని సిగ్గుగల్గుట కవకాశము లేదని భావము. మఱియు వక్తృవిషయవైలక్షణ్యములు పూర్ణముగానుండుటచే నీ స్తోత్రము సకలవిధక్షేమముల నొసంగును. త్రివర్గము. అపవర్గము ననబడు చతుర్విధ పురుషార్థములనిచ్చునని భావము. ఇయ్యది వేంకటేశునిచే చేయబడినది. వేంకటేశుడని శ్రీనివాసునకును. ఆచార్యులకును పేరు. కాగా. క్రింద చెప్పిన చొప్పున నొకే వేంకటేశుడు ఒకరూపమున ప్రయోజకకర్తగాను ఒకరూపమున ప్రయోజకర్తగాను నున్నాడు. ఇది "ప్రసూతా" అను పదముచే సూచితమగుచున్నది. ఇట్లు పరమపురుషుడే చేసినదిగనుకనే తదుత్కర్ష మతివిలక్షణమని భావము. శబ్దార్థాలంకారాది సర్వవిషయములలోను కావ్యదోషాదులగు నెట్టి దోషములకును అవకాశమిచట లేదు. అట్టి యీ స్తోత్రము సత్త్వోద్రిక్తులగు సాత్త్వికులకు శోభించును. అనగా: — వారే అసూయారహితులై దీని రసమును పూర్తిగ గ్రోలి సంతోషింతురు. భగవంతునియందసూయ లేనివారే తద్గుణకీర్తనమును క్షమతో విని సంతసించి సద్గతిని పొందుదురనియు భావము. ఇట్లు సకలవిధముల నుత్కర్షము చెందినదీస్తోత్రమని తనకంతరంగులను గూర్చి యాచార్యు లుపదేశించిరి.

శ్లో॥ శతకమిదముదారం సమ్యగభ్యస్యమానా౯
వృషగిరిమధిరుహ్యావ్యక్తమాలోకయంతీ ।
అనితర శరణానామాధిరాజ్యేఽభిషించేత్
శమితవిమతపక్షా శార్ఙ్గధన్వాఽనుకంపా ॥ 106

అర్థ :— ఉదారం = సర్వఫలప్రదమగుటచే నత్యుదారమైన, ఇదం శతకం = ఈ దయాశతకమును, సమ్యక్ అభ్యస్యమానా౯ = చక్కగపునః పునః = అభ్యసించువారిని, వృషగిరిం = వేంకటాద్రిని, అధిరుహ్య = ఎక్కి, వ్యక్తం = స్పష్టముగా, ఆలోకయంతీ = చూచుచున్న, శార్ఙ్గధన్వాఽనుకంపా = శార్ఙ్గధరుడగు శ్రీనివాసునిదయ, శమిత విమత పక్షాసతీ = శమింపజేయంబడిన విరోధిపక్షములను గల్గినదై, అనితరశరణానాం=గత్యంతరములేని అకించనుల యొక్క (శరణాగతులయొక్క), ఆధిరాజ్యే = ఉన్నతరాజపదవియందు (మోక్ష సామ్రాజ్యమునందు), అభ్యషించేత్ = అభిషేకించును.

అవతా॥ గతశ్లోకమునందు విషయ వైలక్షణ్యప్రయుక్తోత్కర్షమును జూపిరి. ఇచట నీ స్తోత్రాభ్యాసకులకు గల్గు ఫలము నుపదేశించుచున్నారు. లేక క్రింది శ్లోకములో ఈ స్తోత్రము త్రివర్గమనబడు ధర్మార్థ కామములనిచ్చునని చెప్పి ఈ శ్లోకములో మోక్షమునాబడు నుత్తమ పురుషార్థము నిచ్చునని బోధించు చున్నారనుటయు సంగతి యగును.

తా॥ ఈ దయాశతకము చాలయు నుదారమైనది. ఎవరు దేనినడిగినను దయాదేవి యెట్లు ఫలముల నొసంగునో, అట్లే తద్విషయమైన ఈ స్తోత్రమును పరమోదారమైనది. ఈ స్తుతిని శబ్దార్థములలో మారుపాటులేక చక్కగ నభ్య సించువారిని వేంకటాద్రిశిఖరమునందెక్కి నిలుచుచున్న శ్రీనివాసుని దయాదేవి చక్కగ కటాక్షించుచున్నది. ఎత్తగు చోటుననుండు వారికే క్రింద నుండు వారిని పూర్ణముగ చూచుట కవకాశమేర్పడును. ఇట్లామె పూర్ణముగ కటాక్షించి భగవంతు నొకనినే శరణముగాబట్టి గత్యంతరములేకయుండు ప్రపన్నులు, భక్తులని చెప్పబడు ముముక్షువులను వారికేర్పడిన సామ్రాజ్యములో, అనగా; మోక్షమనెడు కైంకర్య సామ్రాజ్యములో పట్టాభిషిక్తులను చేయును. ఇట్లామె మోక్షము నొసంగునపుడు ఆమెకును (దయకును), తదితరజ్ఞానాది భగవద్గుణ

ములకును వివాదమేర్పడి జ్ఞానాదిగుణము లపరాధియగు జీవునవశ్యము దండింప వలయునని వాదించునపుడు దయాదేవి యా వాదములను తగురీతిని చెదరగొట్టి స్వపక్షమును స్థాపించి జీవులకు మోక్షము నొసంగుచున్నదని క్రింద జెప్పిన విషయమును "శమిత విమతపక్షా" అను పదముచే ఆచార్యులు బోధించు చున్నారు.

ఈ స్తోత్రము నభ్యసించువారికే మోక్షముగల్గునన్నచో. భక్తి ప్రపత్తులు చేసినవారికే మోక్షముగల్గునని చెప్పుశాస్త్రముతో విరోధము గల్గదాయని శంకింప రాదు. ఈ స్తోత్రము నభ్యసించినచో. ఏతద్వ్యత్యబలముచే మోక్షోపాయవిరోధు లైన పాపములు తొలగి శీఘ్రముగ మోక్షోపాయ సంబంధమేర్పడి పిదప మోక్షము గల్గునను నిభావమే ఇచట వివక్షితము గనుక పూర్వోక్తశంకకవ కాశములేదు. ఈ శాస్త్రార్థముగూడ "శమిత విమతపక్షా" అను పదముచే వివక్షితము.

శ్లో॥ విశ్వానుగ్రహిమాతరం వ్యతిషజత్స్వర్గాపవర్గాం సుధా
సధ్రీచీమితి వేంకటేశ్వరకవిర్భక్త్యా దయామస్తుత ।
పద్యానామిహ యద్విధేయ భగవత్సంకల్పకల్పద్రుమాత్
ఝుంఝూమారుతధూత చూతనయతః సాంపాతికోఽయం క్రమః॥ 107

అర్థ :—విశ్వానుగ్రహమాతరం=ఎల్లరకుని ననుగ్రహముచేయు తల్లియు (సర్వానుగ్రహప్రదాత్రియగు తల్లియు), వ్యతిషజత్స్వర్గాపవర్గాం=స్వర్గము. అప వర్గమునను ఫలము నొసంగునదియు. సుధాసధ్రీచీం = అమృతోపమయునగు, దయాం = దయను. వేంకటేశ్వరకవిః = వేంకటేశుడను కవి, భక్త్యా = భక్తిచే, ఇతి = ఇట్లు, అస్తుత = స్తుతించెను. ఇహ = ఈ స్తోత్రమునందు. యద్విధేయ భగవత్సంకల్ప కల్పద్రుమాత్ = ఏదయకు వశుడైన భగవంతుని సంకల్పమను కల్పవృక్షమునుండి, ఝుంఝూమారుతధూత చూతనయతః = మహావాత్యచే నూపివేయబడిన మామిడిచెట్టునుండి యుగపత్తుగ రాలిపోయిన వందలకొలది మామిడిపండ్లవలె, పద్యానాం = పద్యములయొక్క, అయం = ఈ. క్రమః = క్రమము (ప్రక్రియ). సాంపాతికః = (కవియొక్క ఇచ్ఛలేకయే) స్వయముగనే ఆపతితమైనదిగా, (అస్తి = ఉన్నది).

అవతా॥ క్రింది శ్లోకములలో వక్తృవిషయ వైలక్షణ్యాదులను జెప్పిరి. ఈ శ్లోకమునందు ప్రబంధ వైలక్షణ్యమును గుర్తించుచున్నారు. మఱియు సర్వ ఫలములనొసంగు దయాదేవి తనకై యొసంగిన ఒక అద్వితీయమైన ఫలమును గూడ నిచ్చట కీర్తించుచున్నారు.

తా॥ సర్వులకును సర్వవిధానుగ్రహములనుజేయు స్వభావము దయాదేవికి గలదు. కావుననే ఆమె ననేకాపత్యములను గల్గిన తల్లితోసమానముగా పోల్ప వచ్చును. ఏబిడ్డ యేవస్తువు నపేక్షించునో, ఆబిడ్డ కవ్వుడావస్తువు నిచ్చుటకుగా నాయా వస్తువులను తల్లి సిద్ధముగా పెట్టుకొనియుండులాగున దయాదేవియు స్వాపత్యభూతములగు ప్రాణులు స్వర్గమనబడు చతుర్ముఖబ్రహ్మపద పర్యంతమైన యైశ్వర్యమునో, అపవర్గమనబడు మోక్షమునో అపేక్షించినచో వాని నొసంగుటకు సిద్ధముగా ఆ వస్తువులను తనకధీనముగ జేసికొనియున్నది. మఱియు నీ దయ స్వస్వరూపముచేతను. ఫలముచేతను అమృతమునకు సమానమైనది. అట్టి యీ దయను వేంకటేశ్వరుడను కవి పరమభక్తితో స్తుతించెను. ఈ స్తోత్రము భక్తి హృదయములో నిముడక పరీవాహరూపమై వెలుపలకు వచ్చి శ్లోకరూపత్వమునందు కొన్నట్లున్నదని భావము. మఱియు నీ స్తోత్రములో నుండు పద్యక్రమము కవి బుద్ధిచే నాలోచితమై నివేశితముగాదు. దశదశకములుగాను. ఒక్కొక్క దశకములో నొక్కొక్క వృత్తము గలదిగాను, క్రమేణ శృంఖలాబద్ధముపలె ననేక శాస్త్రార్థములను ప్రకటీకరించునదిగాను నమరియుండుట కవి ప్రయత్నముచేగాక, భగవత్సంకల్పముచేతనే యని భావము. ఒక పెద్దగాలి గొట్టినచో మామిడిచెట్టునందలి చక్కగ మాగిన వందలకొలది పండ్లాకే సమయమున నెట్లు రాలిపోవునో, అట్లే దయనే యనుసరించి కలుగు భగవత్సంకల్పమగు కల్పవృక్షమునుండి అవయయను మహాపాత్యచే పూర్వోక్త ప్రకారమున క్రమవిశిష్టములైన ఈ వంద శ్లోకములనెడు పండ్లు రాలినవి. భగవత్సంకల్పము ప్రార్థితమైన సర్వవస్తువుల నొసంగు స్వభావము గల్గియుండుటచే కల్పవృక్షముగా రూపింపబడినది. అట్టి భగవత్సంకల్పము నిచట దయాధీన మనుచున్నారు. దయచేతనే ఈశ్వరుడు సంకల్పించుచున్నాడని భావము. ఈశ్వరసంకల్పమంతయు దయాధీనమని పరమార్థము. అట్టి దయ నాచార్యులు స్తుతించిరి.

ఇట్లు తనభక్తికి పరీవాహరూపముగా భగవత్సంకల్పవశమున నీ స్తోత్ర మేర్పడినదిగాన ఈ ప్రబంధమునకొక విలక్షణమైన యుత్కర్షము గలదను ప్రబంధవైలక్షణ్యమును, ఇట్టి యుత్తమ పద్యములను స్వబుద్ధియందు దోచునట్లు చేయుట యను నుత్తమఫలమును దయాదేవి తనకొసంగెనను విషయమును బోధింపుటలో ఆచార్యులకిచట తాత్పర్యమని చెప్పవచ్చును. పద్యములను మాగిన మామిడిపండ్లతో సమానముగా గుర్తించుటచే ఈ పద్యములయందలి రసము చాలయు నుత్కృష్టమని భావమెఱుంగదగియున్నది.

శ్లో॥ కామం సన్తు మిథః కరమ్బితగుణావద్యాని పద్యానినః
కస్యాస్మిఞ్ శతకే సదమ్బుకతకే దోషశ్రుతిం క్షామ్యతి।
నిష్ప్రత్యూహవృషాద్రినిర్ఝరఝురత్కారచ్ఛలే నోచ్ఛలఞ్
దీనాలమ్బనదివ్యదమ్పతి దయాకల్లోల కోలాహలః ॥ 108

అర్థ :— నః = మాయొక్క, పద్యాని = పద్యములు. మిథః కరమ్బిత గుణావద్యాని = పరస్పరము కలిసిన గుణదోషములను గలిగినవిగా. కామం సన్తు = ఉంచే ఉండనీ, నిష్ప్రత్యూహ వృషాద్రినిర్ఝరఝురత్కారచ్ఛలేన = నిరాటంకముగా వేంకటాద్రియందు పారెడు జలప్రపాతములయొక్క ఝురఝుర మను ఝురత్కారశబ్దమనెడు వ్యాజముచే, ఉచ్ఛలఞ్ = వెలుపలకుబుకుచున్న. దీనాలమ్బనదివ్యదమ్పతి దయాకల్లోలకోలాహలః = అకించనులకవలం బభూతులైన దివ్యదంపతులయొక్క (మహాలక్ష్మీ శ్రీనివాసులయొక్క) దయయొక్క అలలసంబంధమైన కోలాహలశబ్దము సదంబుకతకే = సత్తులయొక్క మన స్సను శుద్ధజలమునకు చిల్లగింజవలె నున్న (మంచినీటికి చిల్లగింజవలెనున్న), అస్మిఞ్ శతకే = ఈ శతకమునందు, కస్య = ఎవని యొక్క. దోషశ్రుతిం = దోషోద్ఘాటనశబ్దధ్వనిని, క్షామ్యతి = ఓర్చును ? (ఎవరియొక్క దోషోద్ఘాటనమును గూడ క్షమింపదని భావము).

అవ॥ గతశ్లోకమునందు దయాదేవి యీ పద్యములను తనబుద్ధిలో దోపజేసిన స్వోపకారము ననుసంధించిరి. ఈ శ్లోకములో ఆ దయాదేవియే ఈ

స్తోత్రముద్వారా ప్రపంచస్థులుజ్జీవించులాగు వారికి జేయు నొక యసమానమైన యుపకారము ననుసంధించి తద్ద్వారా దయాదేవీప్రభావమును పొగడి స్తోత్రమును ముగించుచున్నారు.

తా॥ ఈ మా పద్యములు పలయునంతవరకు గుణదోషమిశ్రితములుగానే యుండుగాక ! ఐనను ఆ దోషములు మహాజనము లీస్తోత్రమును పరిగ్రహించుటకు ప్రతిబంధములుగా నిలువజాలవు. ఏలయన : అన్ని యపరాధములను క్షమించు దయాదేవి స్వవిషయముగా భగవత్సంకల్పముచే నావిర్భవించిన యీ స్తోత్రములో దోషము నుద్ఘాటించుట యను నపరాధమును మాత్రము క్షమింపదు. ఆమె యజ్ఞాతనిగ్రహ గనుక దోషోద్ఘాటకులను దండింపదు. కాని వారి దోషోద్ఘాటనశబ్దమును ఇతరుల చెవిలో పడనట్లు గావించి వారి ప్రయత్నమును వ్యర్థీకరించి ఈ స్తోత్రమునకు మహాజనపరిగ్రహము నందెట్టి ప్రతిబంధమును ఏర్పడనట్లు రక్షించి ప్రాపంచికుల కీస్తోత్రము నొసంగుచున్నది. ఇదియే ప్రాపంచికుల కీమెచేయు మహోపకారము. "స్తుతిరియ మనవద్యా" అని క్రింద చెప్పినట్లీ స్తోత్రమునందెట్టి దోషమును లేదు. ఐనను కొందరు స్వస్వభావమునను సరించి దోషములను చెప్పినను నవ్వి పొడజూపవు. దయానుగ్రహచే నుత్తమరీతి యందమరిన యీ స్తోత్రమును మహాజనులు నిశ్చయముగ పరిగ్రహింతురని భావము. ఈ విషయము నొక విచిత్ర చిత్రముచే నాచార్యులు విశదీకరించుచున్నారు.

దోషములను జెప్పువారి యభిమతము ననుసరించి ఈ స్తోత్రము దోషయుక్తముగా నుండినచో నుండుగాక ! అయినను సత్తులను తీర్థమున కీ శతకము చిల్లగింజవలెనున్నది. సత్పురుషులు, తీర్థములవలె తమనాశ్రయించు వారిని శుద్ధిచేయుటచే వారిచట తీర్థముగా రూపింపబడియున్నారు. అట్టి సత్పురుషుల నీ స్తోత్రము నిర్మలీకరించుచున్నదని భావము. సత్పురుషులు స్వయముగనే నిర్మలులుగదా యని శంకింపరాదు. ఎట్టి పెద్దలకైనను (ఆస్తికులకైనను) సూక్ష్మములగు కొన్ని శాస్త్రార్థములలో నిశ్చయమేర్పడక సందేహములు గల్గుట కద్దు. మన ఆచార్యులయొక్క (వేదాంతదేశికులయొక్క) పలుగ్రంథములు పలువురు పెద్దలయొక్క ప్రార్థననుసరించి వారి సంశయమును పోగొట్టుటకై

యావిర్భవించినవను విషయము సుప్రసిద్ధమైనదే. ఈ స్తోత్రమునందు ప్రపత్తి విషయములో పలుపురు పెద్దలకు సంభవించు నానా సంశయములను పోగొట్టు నట్లు చాల సూక్ష్మములగు ననేక శాస్త్రార్థములు నిండియుండుటచే దీనిని సదం బుశతకమని చెప్పుట కడ్డులేదు. ఇట "అసదంబు శతకే" అనియు పదచ్ఛే దము జేయుదురు. అప్పుడు, అసత్తులనెడు కలత జెందిన నీటికి చిల్లగింజవలె నున్నదని యర్థము. అసత్తులనుగూడ సద్గతిస్థులను జేయునదిదియని భావము.

పెద్ద కోలాహలముతోను, బ్రహ్మాండమైన యలలతోను గిరిశిఖరము నుండి క్రిందికి దుముకు గొప్ప జలపాతము ప్రక్కన ఒకడు మాటలాడినచో. వానిధ్వని ఆ మహాశబ్దము నందెవరి చెవిలోను పడదు. అట్లే వేంకటాద్రియందు పెద్ద శబ్దముతో ప్రవహించు అనేక మహాజలప్రపాతములయొక్క మహాధ్వని. దోషములు చెప్పువారి ధ్వనిని యెవరి చెవియందును పడకుండ నిరోధించు చున్నవట. ఈ కొండలోనుండు సెలయేళ్లన్నియు శ్రీనివాసుని దయయేయని ఈ స్తోత్రములో ననేకపర్యాయములు బహుసాదృశ్యములను బట్టి రూపింపబడి యున్నది. కాగా, దయాదేవియే ఈ నిర్ఝరరూపమునెత్తి యమ్మహాధ్వనిచే దోషోద్ఘాటకులధ్వని నణచివేయుచున్నది. దోషశబ్దము లెవ్వరి చెవియందును పడనప్పు డందరును నీ స్తోత్రము నాదరింతురు. ఇది దయాదేవి ప్రాపంచి కులకుచేయు నుపకారములలో ప్రధానమైనది. పెద్ద జలప్రవాహ మెట్టి ప్రతి బంధమును లక్ష్యముబెట్ట కెట్లు నిరాటంకముగా ప్రవహించునో. అట్లే దయా ప్రవాహముగూడ ప్రవహింప నారంభించినప్పుడెవ్వరును దానినడ్డగించుటకు వీలుగాదు. మఱియు గత్యంతరహీనులైన దీనులకు నవలంబముగా దయాదేవి యున్నది. ఇట్లు కూలంకషమైన దయ భగవంతునికి కలుగవలయునన్నచో మహాలక్ష్మి సాన్నిధ్యముండి తీరవలయునను విషయమును "దివ్య దమ్పతి దయా" అను పదముచే నాచార్యులిచట సూచించుచున్నారు.

దశమదశకము సమాప్తము.

తన్త్ర వేదాంతతర్కాది శాస్త్రోద్యానేషు సర్వదా ।
విహారీ శఠకోపాఖ్యో వ్యాఖ్యాదిత్థం దయాస్తవమ్ ।

సీ॥ వినుత భారద్వాజ విమలగోత్రోద్భవుం
డమల వ్యంగ్యాన్వయ సముదితుండు
రంగలక్ష్మణయతి ప్రసదనాసాదిత
ప్రథిత శాస్త్రజ్ఞాన భవ్యగుణుడు
తంత్ర వేదాంత సత్తర్క శాస్త్రోద్యాన
లీలా విహారైక శీలచణుడు
"శాస్త్రరత్నాకర" శఠకోపనాముడు
మహి భగవద్దయామహిమ నిట్లు ;

గీ॥ దేశికవరప్రణీత "దయాశతకము"
ద్రావిడంబున జేసిన యావిధమున
తెనుగు వ్యాఖ్యానయుతముగా దనర జేసి
శ్రీనివాసునకర్పించె చిత్తమలర ॥

ఇది జగద్విఖ్యాత పరమ హంసపరివ్రాజకాచార్య శ్రీమద్రంగరామానుజ యోగివర్య పాదారవింద సేవాసమాసాదిత సకలశాస్త్రరహస్యార్థుండగు భారద్వాజ శఠకోపాచార్యశిరోమణిచే ప్రణీతంబైన దయాశతకాంధ్రవ్యాఖ్యానము సమాప్తము.

కవితార్కిక సింహాయ కల్యాణగుణశాలినే ।
శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః ॥



శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః
శ్రీపద్మావతీసమేత శ్రీనివాసపరబ్రహ్మణే నమః

శుభమస్తు

